క్రొత్త సంవత్సరం
సరిక్రొత్త నవల !
'డ్యాన్స్ గ్యాంగ్' చిత్ర
కథా రచయిత కలం నుండి
వెలువడిన డైరెక్ట్ నవల !

* * *

తెలుగులో 'ఎక్స్‌పెడిషన్స్' బ్యాక్ డ్రాప్‌తో వచ్చి[illegible]లలు తక్కువ. ఇది మీకు నచ్చే మీరు మెచ్చే నవల !

* * *

మట్టిలో మాణిక్యాలు వుంటాయి. వెతికి వెలికి తీయడమే కష్టం! అలా కాకుండా వాటంతట అవే వెలుగునపడి-దేదీప్యమానంగా ప్రకాశించేవి కొన్ని వుంటాయి. ఈ కోవకు చెందినవాడు దామినేని ఫణీంద్ర. ఈ నవల చదివితే అతి త్వరలో వచ్చే మరో నవల 'ఫార్చునా' కోసం తప్పక ఎదురు చూస్తారు.

# దామినేని ఫణీంద్ర

---

# స్వ సింహాసనం

భస్మ సింహాసనం

(డైరెక్ట్ నవల)

---

**By**
రామినేని ఫణీంద్ర

ప్రథమ ముద్రణ।
జనవరి - 1993

కవర్ డిజైన్ :
ఎస్. వి. రమణ

ప్రచురణ :
గోపీచంద్ పబ్లికేషన్స్
వెంకటేశ్వరరావు స్ట్రీట్,
గవర్నర్‌పేట
విజయవాడ - 520 002.

ప్రింటింగ్ :
"వంశీ కృష్ణా"
విజయవాడ - 2

ప్రతులకు :

---

గోపీచంద్ పబ్లికేషన్స్
వెంకటేశ్వరరావు వీధి : గవర్నరుపేట
విజయవాడ - 520 002.

---

# కృతజ్ఞతా సుమాంజలి !

ఎందరో మహానుభావుల్లో కొందరే నిజంగా మహానుభావులు. వారందరికీ నా వందనాలు. ఇప్పుడు మీ చేతుల్లో "భస్మ సింహాసనం" నవల ఉంది. రెండు పేజీలు తిప్పితే సరాసరి నవల్లోకి ప్రయాణం చేస్తారు. కాని ఈ నవల ఈ రూపం ధరించటానికి వెనక ఎన్నోకారణాలున్నాయి. కొంత మంది మహానుభావుల ప్రోత్సాహం, సహాయం ఉన్నాయి.

ముఖ్యంగా నన్ను ప్రోత్సహించి నా నవలలో ఉన్న తప్పొప్పులు నిర్మొహమాటంగా చర్చించి, ఈనాడు వస్తున్న క్రైమ్, వయొలెన్స్ నవల లకు భిన్నంగా నా చేత నవల వ్రాయించిన ఖ్యాతి 'గోపిచంద్ పబ్లికేషన్స్' అధినేత శ్రీ జగదీశ్వరరావుకు చెందుతుంది. ఈనాడు పబ్లికేషన్స్ నడపటం అంటే యజ్ఞం చేయటంలాంటిది. ఎందరో పేరున్న రచయితల నవలలే ఆర్ధి కంగా దెబ్బతింటున్న దశలో ఓ కొత్త రచయితను పాఠకులకు పరిచయం చేయటం వ్యాపారపరంగా సాహసమే అవుతుంది. కానీ నా విషయంలో ఎంతోనమ్మకంతో అలాంటి సాహసం చేసిన వ్యక్తి శ్రీ జగదీశ్వరరావుగారే! ఆయనశైలి, ఆయన ఒరవడి భిన్నమైనవి. ఈనాడు వస్తున్న సాహిత్యానికి భిన్నంగా క్రైమ్, సెక్స్, వయులెన్స్ లేకుండా పాఠకులకు, గ్రంథాలయాలకు ఆయన ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తున్నారు. అందుకు నిస్సందేహంగా ఆయన అభినందనీయులు.

నవల ఏ విధంగా వ్రాయాలో, ఉత్తమరచన ఎలా ఉండాలో చక్కని గైడ్‌లైన్స్ యిచ్చి నా చేత ఈనవల వ్రాయించిన ఖ్యాతి ఆయనకే దక్కు తుంది. ఆయన అందించిన స్ఫూర్తితోనే ఈ "భస్మసింహాసనం" నవల వ్రాయటం జరిగింది.

జగదీశ్వరరావుగార్కి నన్ను పరిచయంచేసి నా నవల బయటకు రావటానికి తనవంతు కృషి చేసిన వ్యక్తి ప్రఖ్యాతరచయిత్రి కుమారి వింజమూరి విజయశాంభవిగారు. ఆమె గురించి ఎంత చెప్పినా అది తక్కువే అవుతుంది.

ఓ వ్యక్తి రచయిత కావచ్చు, ప్రధానమంత్రి కావచ్చు, ఐక్యరాజ్య సమితి అధ్యక్షుడు కావచ్చు....కాని మౌలికంగా ఆ మనిషి మంచివాడు కావాలి. ప్రపంచంలో అపురూపంగా దొరికి, ఈ మధ్య పూర్తిగా అదృశ్యమవుతున్న వస్తువుల్లో ఈ మంచితనం కూడా ఒకటి.... అలాంటి మంచితనాన్ని ఆస్తిగా సంపాదించుకున్న వ్యక్తి వింజమూరి విజయశాంభవిగారు. ఈ నవల వెలుగు చూడటంలో ఆమె చేసిన సహాయం మరవలేనిది.

ఇక మూడోవ్యక్తి నా మిత్రుడు రాష్ట్రి **N.S.U.I.** సెక్రెటరీ అయిన డేరింగ్ డాషింగ్ మంచి మనిషి శ్రీ వెంకట్రావ్‌గారు. ఆయన గురించి చెప్పాలంటే ఓ రాబిన్‌హుడ్‌ను + ఓ గాంధీని + ఓ చలాన్ని + ఓ సలీమ్‌ను కలిపితే వచ్చే వ్యక్తిత్వంఉన్న మనిషి.... తను క్రమశిక్షణతో ఉంటూ చూపులతో ఎదుటివాళ్ళను క్రమశిక్షణలో ఉంచే వ్యక్తి.... నాకు చక్కని సలహాలు యిచ్చి, ప్రోత్సహించి నాలోని టాలెంట్‌ని గుర్తించిన వ్యక్తి....ఆయన ఎక్కడ ఉంటే అక్కడ చైతన్యం ఉంటుంది. క్రమశిక్షణ ఉంటుంది. మరువలేని మంచి స్నేహితుడు శ్రీ వెంకట్రావ్....

మీరు చదవబోతూ వుండగా యిక ఈ నవలను గురించి నేనేమీ చెప్పదలచుకోలేదు.

ఈ నవలా రచయితగా నేనెంతవరకు విజేతనయ్యానో చెప్పవలసినవారు మీరే ! అలాగే మీ అభిప్రాయాలను, మనోభావాలను అక్షర విహంగాల రూపంలో ఆహ్వానిస్తున్నాను. వాటి ప్రభావం రానున్న నా నవలలో తప్పక ప్రస్ఫుటిస్తుంది.

నూతన సంవత్సర శుభాకాంక్షలతో

—మీ ఫణీంద్ర

# భస్మ సింహాసనం

## ప్రోలోగ్

మిట్టమధ్యాహ్నం!

నడిమింటి సూర్యుడు తన చురుకయిన కిరణాలతో ప్రపంచాన్ని మాడ్చేస్తున్నాడు.

ప్రొఫెసర్ జయరాం తలపైకెత్తి ఆకాశంలోకి చూసాడు. ఆయన కళ్ళల్లో సూర్యకిరణాలు వేడిగా తగిలాయి. ఆకాశంలో తెల్లటి సూర్యబింబం ఎర్రగా కన్పించింది. ప్రచండ మార్తాండుడి వేడిసెగల్ని భరించలేక తల క్రిందికి దించాడు....కూలీలు తవ్వుతున్నారు...,కుండపెంకులు, మట్టిపెళ్ళలుతో కలసి బయటికి వస్తున్నాయి. వాళ్ళ నల్లటి శరీరాలమీద చెమట దిగజారిపోతుంది. ప్రొఫెసర్ జయరాం హాండ్‌ఖర్చీఫ్ తీసి ముఖంతుడుచుకున్నాడు.

ఇన్‌క్రెడిబుల్!

ఈ ఎర్రటి ఎండలో 'ఎక్సకవేషన్స్'(త్రవ్వకాలు) చేయటం మహా కష్టం....తూర్పుదిక్కునుంచి ఓ సుడిగాలి గింగిరాలు తిరుగుతూ రావటం కన్పించింది. ఓ కాకి దూరంగా చెట్టుమీదనుంచి దాహంతో అరుస్తోంది. ప్రొఫెసర్ జయరాం చేయి అడ్డుపెట్టుకొని చూసాడు. చుట్టుప్రక్కల పొలా

లన్నీ బీడుపట్టి ఉన్నాయి. ఎండవేడిమికి నీటిధారలకోసం ఆవురావురు మంటూ భూమి నెర్రెలునెర్రెలుగా విచ్చింది....

అసిస్టెంటు చంద్రహాస్ వందగజాల దూరంలో ఎక్సకవేషన్స్ పరిశీలిస్తున్నాడు. మరో అసిస్టెంటు యశ్వంత్ ఓచోట దొరికిన పాత కుండ పెంకుల్ని....మట్టిలోని లేయర్సుకు అనుగుణంగా పోలిథిన్ ప్యాకెట్లలో ప్యాక్ చేస్తున్నాడు.

"సార్" ఎవరిదో పిలుపు—

తలతిప్పాడు ప్రొఫెసర్ జయరాం.... క్యురేటర్ సుబ్బారావు తాబేటికాయ పట్టుకొని వున్నాడు.

"మంచినీళ్ళు తాగండి సార్" ఆప్యాయంగా అంటూ తాబేటికాయ అందించాడు. దాన్ని ఓపెన్‌చేసి నోటిదగ్గర పెట్టుకొని రెండుగుక్కలు తాగాడు....తాబేటికాయ సుబ్బారావుకి యిచ్చాడు.

"ఎనీ ప్రోగ్రెస్?"

"లేదుసార్....ఇంపార్టెంట్ యుటెన్సిల్స్ ఏమీ దొరకలేదు."

"ఓ.కే. క్యారీఆన్" అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

మెల్లగా నడుచుకుంటూ ముందుకు వెళ్ళాడు. వడగాలికి ముఖం ఎండగట్టుకుపోతోంది. పెదాలు పగులుతున్నాయి. గత నాలుగు రోజుల నుంచి ఎక్సకవేషన్స్ సూపర్‌వైజ్ చేస్తున్నాడు ప్రొఫెసర్ జయరాం.... ఆ ఎర్రటి ఎండలో....

ఆ ప్రాంతంలో బౌద్ధశకలాలు ఏమైనా దొరుకుతాయేమోనని ఎక్సకవేషన్స్ ప్రారంభించారు. అనుకోకుండా ఓ పదిరోజులక్రితం ఓ రైతు పొలం దున్నుతుంటే నాగలికి ఏదో అడ్డొచ్చింది....లంకెలబిందెలు ఉంటాయేమోనని ఆశతో తవ్విచూస్తే చెయ్యివిరిగిన బుద్ధుడి విగ్రహం, కొన్ని కూజాలు, కుండపెంకులు బయటపడ్డాయి. ఇంకా ఏమైనా బౌద్ధశకలాలు దొరుకుతాయేమోనని మ్యూజియం ఆధ్వర్యంలో ఎక్సకవేషన్స్ ప్రారం

ఖించారు. రెండు, మూడు యక్షిణి విగ్రహాలు దొరికాయి తప్ప మరేం ప్రోగ్రెస్ లేదు.

ఆ ప్రాంతంలో పూర్వం ఏదో గ్రామం ఉండి ఉంటుంది. అందు కనే పాత్రలు, కూజాలు, కుండముక్కలు దొరుకుతున్నాయి.

జయరాం మెల్లగా అక్కడినుండి కదిలాడు.

మూడుచోట్ల ఎక్సకవేషన్స్ జరుగుతున్నాయి.

ఓ దానికి చంద్రహాస!

రెండోదానికి యశ్వంత్!

మూడోదానికి జయరాం సూపర్ వైజ్ చేస్తున్నారు.

అన్నింటికి పర్యవేక్షణకూడా ప్రొఫెసర్ జయరామే చూస్తుం టాడు.

చంద్రహాస్‌కు ఏదో దొరికినట్లు ఉంది....అతను హుషారుగా ఉన్నాడు. అతను గొయ్యిలోనుంచి పైకివచ్చి అరుస్తున్నాడు.

"ప్రొఫెసర్‌జీ కమాన్....వెరీ ఇంట్రస్టింగ్"

"వాటీజ్ దట్ మైబాయ్" అంటూ గబగబ అక్కడికి వెళ్ళాడు జయరాం. చంద్రహాస్ ముఖం ఎగ్జయిటింగా ఉంది. ఏదో ఓ ముఖ్య విషయం కనుగొన్నట్లు వుంది అతని ముఖం.

యశ్వంత్ ఈర్ష్యగా చూశాడు చంద్రహాస్‌వైపు....

చేతిలోని పోలీథిన్ సంచులు ప్రక్కనే పెట్టి....ఆ యింపార్టెంట్ విషయం ఏమిటో తెలుసుకుందామని చంద్రహాస్ గొయ్యిదగ్గరకి పరిగెత్తు కొచ్చాడు.

"ఏమిటి....ఏమిటి?" అడిగాడు జయరాం.

"అదిగో....అటు చూడండి" వేలు పైకి చూపించాడు చంద్రహాస్.

అటు చూడగానే ఒక్కసారి ఆయన గుండె భయంతో జలదరిం చింది.

గొయ్యిమధ్యలో ఓ అస్థిపంజరం....

దానిప్రక్కనే ఓ చిన్న పెట్టె....

ఆ అస్థిపంజరం ఏ కాలానిదో కొన్నిచోట్ల చిట్లిపోయి పొడిపొడి అయిపోతుంది పట్టుకుంటే.

గబగబా ముగ్గురూ గొయ్యిలోకి దిగారు. వాళ్ళు దిగటం చూసి ఇద్దరు కూలీలు తప్పుకున్నారు. ఆ గొయ్యి 12 అడుగుల వెడల్పు 20 అడుగుల పొడవుంది. అప్పటికి ఐదు అడుగుల లోతు తవ్వారు. ఆ లోతులో కన్పించాయి ఆ అస్థిపంజరం, ఆ పెట్టె.

జయరాం సర్వీసులో ఎన్నోసార్లు అస్థిపంజరాల్ని చూసాడు. కాని వాటిని చూసినప్పుడల్లా ఆయనకు ఎందుకో గుండె జల్లుమంటుంది. దానికి ప్రత్యేక కారణం అంటూ లేదు.

చిన్నప్పుడు చూసిన మ్యూజియంలో ఓ చీకటిగదిలో భయంకరమైన మ్యూజిక్ మధ్య అస్థిపంజరం వచ్చి మీదపడే సన్నివేశం వుంది. ఆ ప్రోగ్రామ్‌కి వెళ్ళాడు. అప్పటినుంచి ఆయనకు అది అబ్సెషన్. అందుకే ఎంత భయంకరమైనదాన్నైనా భరించగలడు గాని అస్థిపంజరం చూస్తేమాత్రం మొదటి రెండునిమిషాలు అవ్యక్తమైన భయానికి లోనవుతాడు.

ముందు చంద్రహాస్ గొయ్యిలోకి దిగి అస్థిపంజరం దగ్గరకెళ్ళాడు. ఆయనవెనకే జయరాం నిలబడ్డాడు.

"ఈ పేటిక చూశారా....ఈ అస్థిపంజరం ప్రక్కనే పడివుంది" క్రిందవున్న ఆ చిన్న పేటికను తీసి జయరాం కిచ్చాడు.

అది చాలా అందమైన పెట్టె....లతలు, పువ్వులు అందంగా చెక్కబడివున్నాయి. ఆ పెట్టెను తయారు చేసిన వడ్రంగి ఎవరోగాని పెట్టెమీద అద్భుతమైన నగిషి పని చెక్కాడు.

పెట్టెకు ప్రక్కల పాకుతున్న పువ్వులతో ఉన్న లతలు....

పెట్టె మూతమీద సూర్యకాంత పుష్పం బొమ్మ చిత్రించాడు ఆ వడ్రంగి.

దాని చుట్టూ లతలు....

దాన్ని చూడగానే ఆ పనితనం పదిహేనో, పదహారో శతాబ్దందీ అని అన్పించింది.

జయరాం మెల్లగా ఆ పెట్టె మూత తెరిచాడు.

చంద్రహాస్ ఊపిరి బిగపట్టి చూస్తున్నాడు.

యశ్వంత్ ముఖంలో అంతులేని టెన్షన్.

ఏ కాలానికో చెందిన అమూల్యరత్నాలుగాని, వజ్రాలుగాని దాన్లో ఉంటాయేమోనన్నట్లు ఇద్దరూ చూస్తున్నారు.

జయరాం మూతతెరిచి....లోపలనుంచి మరొక పెట్టె బయటికి తీశాడు. యశ్వంత్ నిరాశగా చూసాడు.

ఆ పెట్టెమీదకూడా నగిషీ పనితనం వుంది....కాని ఈ పెట్టెమీద ఏవో అక్షరాలు గీయబడివున్నాయి.

దాని మూతకు వున్న చిన్న గొళ్లెం చుట్టూ ఏదో తీగతో గట్టిగా బిగించివుంది. ఆ పెట్టె ఆరంగుళాల పొడవు, ఆరంగుళాల వెడల్పు వుంది.

జయరాం చంద్రహాస్‌వైపు చూశాడు.

"గుడారంలోకి వెళ్ళి దీనిసంగతి చూద్దాం...." అని యశ్వంత్ వంక తిరిగి-

"ఈ అస్థిపంజరాన్ని ప్రిజర్వ్ చేసి ఆంత్రోపాలజి సెంటర్‌కు పంపించు....ఏ కాలానిదో తేలుస్తారు" అని బయటికి నడిచాడు.

"బ్లడీ షిట్" అని యశ్వంత్ విసురుగా కాలితో నేలను తన్నాడు.

చంద్రహాస్, ప్రొఫెసర్ జయరాం గుడారంలోకి వెళ్ళారు.

"యశ్వంత్‌ను మీతో 'ఎలౌవ్' చెయ్యలేదెందుకు సార్?" అడిగాడు చంద్రహాస్.

"ఎ సీక్రెట్ బిట్వీన్ టూ ఈజ్ ఎ సీక్రెట్....ఏ సీక్రెట్ ఆఫ్ త్రీ ఈజ్ ఎ సీక్రెట్ ఆఫ్ ఆల్...." చిన్నగా నవ్వి అన్నాడు జయరాం.

ప్రక్కనే వున్న ఎక్విప్‌మెంట్ కిట్‌లోనుండి కటింగ్‌ప్లేయరు తీసి యిచ్చాడు చంద్రహాస్....దాంతో ఆ పెట్టెకు ఉన్న తీగను కట్ చేసి పైమూతను ఓపెన్ చేసాడు.

లోపల రాగిరేకుల కట్ట ఒకటి కన్పించింది. దాన్ని బయటికి తీసాడు....లోపల యింక ఏమీ లేవు. సుమారు నాలుగు రాగిరేకులు ఓ కట్టగా తీగెతో చుట్టబడి వున్నాయి. చంద్రహాస్‌కూడా ఆతృతగా చూడ సాగాడు. సరిగ్గా అదే సమయంలో గుడారంలో ఓమూల కత్తితో చిన్న కంత చేసి యశ్వంత్ చూడసాగాడు.

ఆ రాగిరేకులకున్న తీగను తీసి ఆ నాలుగు రాగిరేకుల్ని పరిశీల నగా చూశాడు. తెలుగు, కన్నడం గాని ఓ విచిత్రమైన లిపితో అక్షరాలు వరుసగా వ్రాయబడి వున్నాయి. ఓ రేకుమీద యంత్రంలా సర్కిల్స్, అనేకమైన సర్కిల్స్....మధ్య ఓ డాట్....ఆ డాట్ గోల్డ్‌కలర్‌లో ప్రత్యేకంగా వుంది. ఓ రేకుమీద ఏదో ప్లానింగ్....చెట్లు, కొండల ఆకారంలో చెక్కబడి వుంది. మూడో రేకుమీద, నాలుగో రేకుమీద అక్షరాలు....వాటిని సీరియస్‌గా చూస్తున్నాడు జయరాం.

"ఈ అక్షరాలు ఏ కాలంనాటివి సార్...."

"అదే నాకు తెలియటం లేదు" అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

"ఈ ప్లానింగ్ ఉన్న రేకులేమిటి సార్?"

"నాకు అర్థంకావటంలేదు చంద్రహాస్....ఈ కాపర్ ప్లేట్సును డీకోడ్ చేస్తేగాని దాన్లో ఉందేమిటో తెలియదు" అన్నాడు.

"ఆ అక్షరాలు తెలుగులానే ఉన్నాయి. కాని తెలుగు కాదు...." చంద్రహాస్ అన్నాడు.

"ఇన్‌క్రెడిబుల్! ఈ కాపర్‌ప్లేట్సులో ఏదో రహస్యం వుంది. ఈ కాపర్‌ప్లేట్సుకి ఆ అస్థిపంజరానికి ఏదో లింక్ వుంది." అని ఏదో గుర్తొచ్చినవాడిలాగ బయటికి కదిలాడు. కాపర్‌షీట్సును కోటుజేబులో దాచుకుంటూ బయటికి వచ్చాడు. ఆయన బయటికి రావడం చూసి యశ్వంత్ వర్కింగ్‌స్పాట్‌లోకి పరుగెత్తాడు.

"ఇంకా ఆ అస్థిపంజరాన్ని ప్రిజర్వ్ చేయలేదా?"

"లేదుసార్...." చేతులు నలుపుకుంటూ అన్నాడు యశ్వంత్.

"తొందరగా దాన్ని ప్యాక్ చేసి ఆంత్రోపాలజి సెంటర్‌లోని లాబ్‌కి పంపి వెంటనే రిజల్ట్స్ పంపమని చెప్పు...." అన్నాడు జయరాం.

"అలాగే సార్" అన్నాడు యశ్వంత్.

దూరంగా వున్న మారుతివైపు కదిలాడు ప్రొఫెసర్ జయరాం.

"సార్! మీరెక్కడికి?"

"ఇంటికి...."

"ఎందుకు సార్....యింకా ఎక్సకవేషన్స్ పూర్తికాలేదు కదా?" అన్నాడు చంద్రహాస్.

"జస్ట్....ఈ కాపర్‌షీట్సును డీకోడ్ చెయ్యటానికి.... నువ్వు కూడా రా" అన్నాడు. చంద్రహాస్ ఆయన వెనకే నడిచాడు. ఇద్దరూ మారుతీకారు ఎక్కారు.

కారు స్టార్టయి ముందుకు దూకింది.

యశ్వంత్ ఎక్సకవేషన్స్ స్పాట్‌నుంచి మౌనంగా ఈ దృశ్యాన్ని చూశాడు.

అతని మేధస్సులో ఒక్కటే ప్రశ్న!

ఆ కాపర్‌షీట్స్‌లోని రహస్యం ఏమిటి?

# 1

ప్రొఫెసర్ జయరాం తన ఎదురుగావున్న కంప్యూటర్ షీట్స్‌ను సీరియస్‌గా చూస్తున్నాడు. ఆయన కూతురు అక్షత ఆయన ఎదురుగా సోఫామీద కూర్చుంది. చంద్రహాస్ ఆయనవంక చూస్తున్నాడు.

"ఇవేనా....ఇంకా డీకోడింగ్ పేపర్సు ఉన్నాయా?"

"అవే డాడీ....కాపర్‌ప్లేట్స్‌ను ఫొటోగ్రాఫ్ చేసి కంప్యూటర్‌కి ఫీడ్ చేసాను....లాంగ్వేజ్ స్కానింగ్‌ద్వారా ఆ కాపర్‌ప్లేట్స్‌మీదున్న లాంగ్వేజీని మోడరన్ లాంగ్వేజ్‌లో కన్‌వర్ట్ చేశాను...."

అక్షత చెపుతుంది. ఆయన ఆ మాటలు విని గంభీరంగా తల ఆడించాడు. అక్షత ఆయన ప్రియ పుత్రికే కాదు—కంప్యూటర్‌లో సిస్టమ్స్ ఎనలిస్ట్....ఏ జీనియస్ ఇన్ కంప్యూటర్ సిస్టమ్స్....ఆమె దగ్గర వున్న ఫోర్త్ జనరేషన్ కంప్యూటర్‌ను ప్రత్యేకంగా అమెరికానుంచి తెప్పించాడు ప్రొఫెసర్ జయరాం. ఇన్‌ఫర్మేషన్‌ను టైపింగ్‌ద్వారా కాకుండా ఫోటో గ్రాఫిక్ ప్రాసెస్‌ద్వారా ఆ కంప్యూటర్‌కు ఫీడ్ చేయడం దాని ప్రత్యేకత. దాన్ని కేవలం ఆర్కియాలజికోసం స్పెషల్‌గా డిజైన్ చేసుకున్నాడు ప్రొఫెసర్ జయరాం. ఆయన దగ్గరవున్న ఫ్లాపీలలో ఐదవ శతాబ్దం నుంచి వున్న తెలుగులిపుల మోడల్ వుంది. 12 శతాబ్దంవరకు తెలుగు కన్నడలిపులు ఒక్కటే. 12 శతాబ్దంనుండి ఈ రెండింటిలో "డివియేషన్" కన్పిస్తుంది. అప్పటినుంచి రెండు లిపులు వేర్వేరుగా పరిణామం చెందాయి. దానికి సంబంధించిన ఇన్‌ఫర్మేషన్ అంతా కంప్యూటర్‌కి ఫీడ్ చేసాడు ప్రొఫెసర్ జయరాం. ఏ శిలాఫలకమైనా, ఏ శాసనమైనా ఆయనకు దొరికితే దాన్ని ఫోటో తీసి ఆ కంప్యూటర్‌కి యిస్తే, దాన్లోని విషయాన్ని చక్కగా డీకోడ్ చేసి, తెలుగు, ఇంగ్లీషు భాషల్లో ప్రింట్ చేసి యిస్తుంది ఆ కంప్యూటర్.

"వెల్ మై బాయ్! ఈ పేపర్సులో చాలా ఎస్టానిషింగ్ న్యూస్ వుంది" గంభీరంగా అన్నాడు జయరాం.

"ఏమిటి సార్ అది?" తనుకూడా ఉత్సాహంగా ఆ కాగితాలవంక చూస్తూ అన్నాడు.

"గొప్ప నిధి....ఎ గ్రేట్ ట్రెజర్....రహస్యం దాన్లో ఉంది."

"ఏ గొప్ప నిధి...."అర్ధోక్తిలో ఆగిపోయాడు.

"శ్రీకృష్ణదేవరాయలు కాలంనాటి నిధి....ఏ గ్రేట్ ట్రెజర్ అఫ్ విజయనగర డైనాస్టీ" ఆ మాటకు దిగ్భ్రాంతి చెందాడు చంద్రహాస్.

"ఏమిటది?"

"ఇటీజ్ వెరీ యింట్రస్టింగ్...." ఆయన ఏదో చెప్పబోయాడు. ఇంతలో ఆ గదితలుపు తెరుచుకుంది. ఒక్కసారిగా ఉప్పొంగిన ఆకాశం మీద నీళ్ళు జల్లినట్లు కృంగిపోయాడు చంద్రహాస్. తలుపు తెరుచుకుని లోపలికొచ్చాడు యశ్వంత్.

"సార్! దాన్ని ఆంత్రోపాలజీ సెంటర్‌వాళ్ళకిచ్చాను. వాళ్ళు టెస్ట్ చేసి ఈ రిపోర్ట్ యిచ్చారు...." అని కవరు ఆయనముందు పెట్టాడు యశ్వంత్. అక్కడి వాతావరణం ఎందుకో విచిత్రంగా వుంది. అందరూ టెన్షన్‌గా ఉండటం....ప్రొఫెసర్ జయరాం చేతిలో కంప్యూటర్ షీట్స్ ఉండటం చూసి ఏదో గూడుపుఠాణి జరుగుతుంది అన్నట్లు కుతూహలంగా చూసాడు యశ్వంత్.

"ఓ.కె. మై బాయ్....నౌ యుకెన్ గో" కవరు తీసుకుంటూ అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

ఒక్కసారి యశ్వంత్ ముఖం నల్లగా మారిపోయింది.

ఆ మార్పు వెంటనే పసిగట్టింది అక్షత.

"డాడీ! ఏమిటది మంచి మర్యాద లేకుండా....యశ్వంత్‌ను వెంటనే వెళ్ళిపొమ్మని ఎందుకు చెప్తారు?" ఆవేదనగా అంది.

"లుక్ మై బేబీ! యశ్వంత్ ఈజ్ ఎ డ్యూటీమైండెడ్ పర్సన్. అందుకనే ఈ పాచుకోలు కబుర్లలో ఎందుకు వెళ్ళమని చెప్తున్నాను" అన్నాడు జయరాం కూతురువంక లాలనగా చూస్తూ.

"చంద్రహాస్ ఉన్నాడుగా....అతన్ని వెళ్ళమనండి.... యశ్వంత్ ఇక్కడే ఉంటాడు" మొండిగా అంది అక్షత.

"ఎవరు వుండాలో, ఎవరు వెళ్ళాలో చెప్పేది నేను. నువ్వు కాదు మై డియర్ బేబీ...." అని కూతురువంక చూసాడు.

కూతురు ముఖంలో ఓ నిరాశవీచిక.

హఠాత్తుగా అక్కడ టెన్షన్ అలుముకోవడం గమనించి యశ్వంత్ జయరాంవంక తిరిగి-

"నేను వెళుతున్నాను సార్....మీలో గొడవలెందుకు" అని అక్కడినుండి మెల్లగా బయటికి కదిలాడు. అతని కళ్ళల్లో అక్షతపట్ల ఓ మెరుపురేఖ మెరిసి మాయమవడం అక్కడున్న ఎవ్వరూ గమనించ లేదు.

"ఏం డాడీ! మీరెప్పుడు చంద్రహాస్‌తోనే 'ఏకంపనీ' అవుతారు యశ్వంత్‌ను దూరంగా ఉంచుతారెందుకు?" అడిగింది అక్షత.

"డోంట్ అస్క్ సచ్ సిల్లీ క్వశ్చన్స్.... చంద్రహాస్, యశ్వంత్ నా రిసెర్చ్ స్టూడెంట్స్....స్టూడెంట్స్ విషయంలో వాళ్ళనెలా ట్రీట్ చెయ్యాలో నాకు బాగా తెల్సు.ఇటీజ్ నన్‌ఆఫ్ యువర్ బిజినెస్ మై బేబీ!" ఆ మాటతో టక్కున నోరు మూసుకుంది అక్షత. వెంటనే చంద్రహాస్ వంక తిరిగి-

"ఆఁ....మిస్టర్ చంద్రహాస్ మనం ఎక్కడున్నాం?"

"ఆ పేపర్సులో శ్రీకృష్ణదేవరాయల కాలంనాటి నిధి వుందని చెప్పారు."

"అవును నిధే కాదు—అంతకన్నా విలువైనదే ఉంది" ఆయన ముఖంలో గంభీరత్వం అలుముకుంది.

"ఏమిటది సార్" ఉత్సాహంగా అడిగాడు చంద్రహాస్.

"రత్నఖచిత బంగారు సింహాసనం—ఎ గోల్డెన్ థ్రోన్ విత్ డైమండ్స్"

చంద్రహాస్ ఆశ్చర్యంగా చూశాడు.

"బంగారు సింహాసనం....నిజంగా ఉందా? విక్రమాదిత్యుగి సింహాసనంలాగా, మయూర సింహాసనంలాగా బంగారు సింహాసనమా?" ఆశ్చర్యంగా అడిగాడు చంద్రహాస్.

"అవును బంగారు సింహాసనమే"

"ఎక్కడుంది సార్?" అడిగాడు చంద్రహాస్.

"హంపీ దగ్గరఉన్న కొండల్లో....ఓ కొండలో వుంది"

అక్కడ హఠాత్తుగా నిశ్శబ్దం అలుముకుంది.

అది తెచ్చిపెట్టుకున్న నిశ్శబ్దం....బంగారు సింహాసనం గురించి అది నిజమా, అబద్ధమా! అన్న ఆలోచనలో ఉన్నారు అక్కడి వాళ్ళంతా.

"ఇది కాక్ అండ్ బుల్ స్టోరీ కాదుగదా?" హఠాత్తుగా అంది అక్షత.

"అవునో కాదో తెలుసుకోవాలంటే....అస్థిపంజరం రిపోర్ట్ చాలా ముఖ్యమైంది" అని యశ్వంత్ తెచ్చిన కవరు ఓపెన్ చేసాడు. దాంట్లో నుంచి రెండు కాగితాలు బయటికి తీసాడు. ఆంత్రోపాలజి టెస్ట్ రిపోర్టు అది....

"దిజ్ స్కెలిటన్ ఈజ్ బిలాంగ్స్ టు ఫిఫ్టీన్త్ సెంచరీ ఆర్ సిక్స్టీత్. రేస్ మంగోలాయడ్....హోమోసెపియన్...."

అంటే భారతదేశానికి చెందిన స్కెలిటన్....16వ శతాబ్దానికి సంబంధించిన అస్థిపంజరం.... అంతే. దాంట్లో యింకేం ప్రత్యేకత లేదు.

రెండో పేపరు చేసాడు. డెత్‌రిపోర్టు అది-

దాంట్లో ఒకే వాక్యం ఉంది. "నార్మల్ డెత్....విత్ ఓల్డ్‌ఏజ్....ఏజ్....సెవెంటీ యియర్స్ అని వేసివుంది.

"ఈ స్కెలిటన్ ఎవరిది సార్?" అడిగాడు చంద్రహాస్.

"ఈ స్కెలిటన్- ఓ శిల్పిది."

"ఎవరా శిల్పి?"

"బంగారు సింహాసనం తయారు చేసిన శిల్పి మనవడిది ఆ స్కెలిటన్."

ఒక్కసారిగా విభ్రాంతిగా చూసాడు చంద్రహాస్. ఓ ప్రక్క తలుపు కదిలిన శబ్దం....జయరాం అటువైపు చూసాడు. తలుపుదగ్గర ఎవ్వరూ లేరు. కర్టెన్ ఊగుతుంది.

* * *

ఆ గదంతా నిశ్శబ్దంగా వుంది.

ఆ గదిలో స్వామి పరమహంస అర్ధనిమీలిత నేత్రాలతో కూర్చొని ఉన్నాడు. ఆయన క్రింద మఖమల్ తివాచీ....ఆ తివాచీ వెనకాల ఎత్తయిన సింహాసనం....నిశ్శబ్దంగా వున్న ఆ గదిలో గంభీరమైన వాతావరణాన్ని కలుగచేస్తున్నాయి.

ఆ తివాచీ పర్షియానుంచి ప్రత్యేకంగా అల్లించి తెప్పించాడు. స్వామీజీకి దేశవిదేశాల్లో అనేకమంది భక్తులు ఉన్నారు. ఆయన కూర్చునే సింహాసనాన్ని మైఖల్‌సాక్సన్ అనే భక్తుడు ప్రెజెంట్ చేశాడు.

ఆయన యోగమందిరంలో అతి ఖరీదయిన వ్యక్తులు వుంటారు. అధికారులు, మంత్రులు, ప్రభుత్వంలోని అనేక కీలకమైన పదవుల్లో వున్నవారు, గొప్ప ధనికులు ఆయన భక్తులు. ఆ భవనం విలువ ఐదారు కోట్లరూపాయల ఖరీదు వుంటుంది. ఆ యోగభవనం చుట్టూ సాయుధులయిన సెక్యూరిటీగార్డ్సు నిరంతరం పహారా కాస్తుంటారు.

కళ్ళు మూసుకొని ధ్యానంలో ఉన్న ఆయన ముందు పాతికమంది దేశ, విదేశ భక్తులు ఆయన అనుగ్రహం కోసం ఎదురు చూస్తున్నారు.

వాళ్ళంతా మల్టీ మిలియనర్స్.

స్వామివారు కళ్ళు తెరిచి ఎవరివైపు చూస్తారో వాళ్ళ జీవితాలు ధన్యం....వాళ్ళకు ఆరోజు రెండుగంటలపాటు ఇంటర్వ్యూ యిచ్చి హరి అనుగ్రహాన్ని ప్రసరింపచేస్తారు.

దాదాపు రెండు గంటలనుంచి ఆయన అనుగ్రహం కోసం ఎదురు చూస్తున్నారు ఆ భక్తసమూహం.

రకరకాల వ్యక్తులు....

రకరకాల సమస్యలు....

కొందరివి మానసిక సమస్యలు!

కొందరివి వైవాహిక సమస్యలు!

అందరిదీ ఒకే సమస్య!

అదే మానసికశాంతి లేకపోవటం.

కొన్ని కోట్లుఉన్నా మానసికశాంతి లేని మల్టీ మిలియనర్స్ పరమ హంస అనుగ్రహం కోసం ఎదురు చూస్తున్నారు ...

ఆధ్యాత్మికతలో ఓ విచిత్రం వుంది.

సైకాలజీ, సైక్రియాట్రీ ద్వారా సాల్వ్ చేసే సమస్యను భగవం తుడు, దైవం, ఆధ్యాత్మికత అనేవాటితో నయం చేస్తే ఆ వ్యక్తి సాక్షాత్తు భగవత్స్వరూపుడు అవుతాడు....అదే డాక్టరు చేస్తే ట్రీట్‌మెంట్ అవు తుంది.

భారతదేశంలో ఆధ్యాత్మిక కేంద్రాలు, నిజానికి మానసికరోగు లను స్వస్థపరిచే వైద్యశాలలు, మానసిక వైద్యశాలలు.

సైన్స్‌పరంగా, శాస్త్రపరంగా భారతీయుడికి ఏదయినా విషయం చెబితే బుర్రకెక్కదు. దానికి దైవం, ఆధ్యాత్మికత అనే కోటింగ్ యిస్తే ఆ చేదుమాత్రను చక్కెరమాత్రలా చప్పరించేస్తాడు.

ఇంటి గుమ్మాలకు పసుపురాస్తే ఇంట్లోకి బాక్టీరియా రాకుండా నిషే ధిస్తుంది అని అంటే అర్థం చేసుకోరు. అదే యింటికి పసుపు రాస్తే శుభం....యింటికి లక్ష్మీకళ వస్తుంది. లక్ష్మి వస్తుంది అంటే....గుడ్డిగా రాసేస్తారు.

ఇక్కడ వివేచనకన్నా నమ్మకం గొప్పది-

ఆ అస్త్రాన్నే ప్రజలమీద ప్రయోగించాడు పరమహంస-

పరమహంస....పూర్వాశ్రమంలో గురుస్వామి....

ఎమ్మేవరకు చదివాడు. ఎమ్మేలో గోల్డ్ మెడలిస్టుకూడా. అతనికి మామూలుగా ఉద్యోగం రాలేదు.

అతనికన్నా తక్కువ మార్కులు సాధించినవాళ్ళు ఉద్యోగస్తులయ్యారు.

కానీ అతనికి ఉద్యోగం రాలేదు.

అప్పుడే అతను ప్రపంచాన్ని చదవటం నేర్చుకున్నాడు.

ఈ మనుషులకు డబ్బు తప్ప ఎదుటివాడిలో ఏ విలువ అక్కర్లేదు. పదిమంది అతన్ని గొప్పవాడంటే.... మిగతావాళ్ళుకూడా గొప్పవాడంటారు....అతనికి ఉద్యోగాలకన్నా వ్యాపారం అన్నిట్లోకి మంచిది అని అన్పించింది.

ఆ వ్యాపారంలో అతనికి మూడు వ్యాపారాలు అతిగొప్పగా అనిపించాయి.

ఒకటి నటన....అది సినిమాల్లో.

రెండు నటన....అది రాజకీయాల్లో.

మూడు నటన ...అది ఆధ్యాత్మికతలో.

నటనలో పరమార్థం ఉందని ప్రపంచమంతా ఉందని తెల్సిన అతను ఓరోజు....అర్జంటుగా యోగైపోయాడు.

హిమాలయాల్లో వందేళ్ల సాధన చేసివచ్చానని అతను చెప్పలేదు. అతని అనుచరగణంచేత చెప్పించాడు.

ఆయన భూతభవిష్యత్ వర్తమానాలు అతిఖచ్చితంగా చెప్పగల సమర్థులు, గ్రహగతుల్నే మార్చివేయగల దివ్యజ్ఞానసంపన్నులు అని గొప్పగా ప్రచారం జరిగింది.

ఆ ప్రచారాన్ని నిజం చేయడంకోసం ఆయన రక్తపాతం లేని ఓ అద్భుతమయిన పద్ధతి కనుగొన్నాడు.

తనదగ్గరకు వచ్చిన మొదటి భక్తుడ్ని—

"నాయనా! రేపు సాయంకాలం ఆరుగంటలకు నీకు మరణం రాసి వుంది" అని చల్లగా చెప్పాడు. ఆ వచ్చిన వ్యక్తి ఆ మాటలు విని అదిరిపోయాడు.

"స్వామీ! నన్ను మీరే రక్షించాలి—నాకు ముగ్గురు పిల్లలు, భార్య ఉన్నారు. నేను పోతే వాళ్ళు అన్యాయం అయిపోతారు స్వామి" అని గోలుగోలున ఏడ్చాడు.

"అయితే చూస్తాను నాయనా! నిన్ను ఆ ప్రమాదంలోనుంచి రక్షిస్తాను. అంతా అమ్మ అనుగ్రహం—అమ్మకో నమస్కారం చేసి వెళ్ళు నాయనా" అని అన్నాడు. ఆయన కూర్చున్న మర్రిచెట్టు మొదట్లో అమ్మ వారి విగ్రహం వుంది. దానికి నమస్కరించి వెళ్ళిపోయాడు ఆ వచ్చిన వ్యక్తి.

ఆ తర్వాత విషయాలు మామూలుగా జరిగాయి.

అతను అనుచరులు కాళి, ధన్‌రాజ్ ఆ వ్యక్తి ఆఫీసుముందు కాపు వేశారు.

ఐదున్నరకు అతను ఆఫీసునుంచి ఇంటికొస్తుంటే అతని వెనకే ఫాలో అయ్యారు—అతనో చీకటి సందులో తిరగగానే ఇద్దరు వెళ్ళి అతన్ని బెదిరించారు.

"రేయ్—నీ దగ్గరున్న డబ్బు తీయరా."

"నాదగ్గర డబ్బు లేదు" అన్నాడు ఆ వ్యక్తి భయంభయంగా.

"రేయ్—డబ్బు లేకుండా ఎందుకు వచ్చావురా? డబ్బు లేనందుకు నిన్ను పొడవాలి—రేయ్ ధన్‌రాజ్ యీడ్ని పొడిచేయ్" అని అన్నాడు కాళి.

ఇద్దరూ కత్తులు ఎత్తి అతన్ని పొడవబోయారు.

అప్పుడో విచిత్రం జరిగింది.

ఎత్తిన చేతులు అలాగే ఆగిపోయాయి.

"రేయ్ ధన్‌రాజ్! నా చెయ్యి ఆగిపోయిందిరా" కాళి అరిచాడు.

"రేయ్ కాశీ! నా చెయ్యికూడా ఆగిపోయిందిరా—" అన్నాడు ధన్‌రాజ్.

ఆ వ్యక్తి ఇదే సమయం కదాని అక్కడనుంచి పారిపోయాడు.

ఆ తర్వాత కాశీ, ధన్‌రాజ్‌లు ఇద్దరూ పారిపోయారు.

అంతే!

ఆ రెండోరోజు ఆ వ్యక్తి వచ్చి గురుస్వామి కాళ్ళమీద పడిపోయాడు.

"స్వామి! మీరు మహాతపస్సంపన్నులు—నా ప్రాణం కాపాడారు" అని అన్నాడు ఆ వ్యక్తి మహాభక్తిగా.

ఆ తర్వాత అలాంటివే రెండు మూడు సంఘటనలు జరిగాయి.

"నాయనా—రేపు నీకు యాక్సిడెంట్ కాబోతుంది" అని మరో వ్యక్తికి చెప్పాడు.

"స్వామి—రక్షించండి" ప్రాధేయపడ్డాడు ఆ భక్తుడు.

"అయితే నీ దేహం బదులు, నీ కారు నాశనమైపోతుంది" అన్నాడు.

అర్ధరాత్రి ఆ వ్యక్తి ఇంటికెళ్ళి కాశీ, ధన్‌రాజ్‌లు కారుమీద పెట్రోల్ చల్లి కారును కాల్చేశారు.

అదంతా ప్రజలు స్వామి మహత్యమే అనుకునేవాళ్ళు.

స్వామి ముందు తిరునాళ్ళలాగ ప్రజలు రావడం ప్రారంభించారు.

అనతికాలంలో స్వామికి ఒక పెద్ద ప్యాలెస్ ఏర్పడింది.

దేశవిదేశాలనుంచి ఆయనకు భక్తులు ఏర్పడ్డారు.

స్వామి చదువుకున్నవాడు కావడంతో హింసను ప్రేరేపించకుండా తన పనులు తాను చేసుకుపోతున్నాడు.

అందుకే—ఆయన దేశంలో గొప్ప మహాత్ముడిగా గుర్తించబడ్డాడు.

ఆయన అనుగ్రహమైనా, ఆగ్రహమైనా అపారంగా కురిపిస్తారని ప్రజలకు పిచ్చినమ్మకం.

ఆయన నోట్లోంచి ఓమాట వచ్చిందంటే అది ఖచ్చితంగా జరిగి తీరాల్సిందే!

"నువ్వు ఫలానారోజు కేంద్రమంత్రివి అవుతావంటే ఆ వ్యక్తి కేంద్రమంత్రి అవ్వాల్సిందే."

అలాంటి చండప్రచండుడు పరమహంస— హిమాలయాల్లో వందేళ్ళు తపస్సుచేసినా మహాత్ముడు అని చిన్నా, చితకా, పెద్దలు దేశమంతా నమ్ముతుంది. నమ్మారు.

స్వామిజీ కళ్ళు తెరిచారు.

ఆయన ప్రశాంతమైన దృష్టి చిట్టచివర కూర్చున్న జాన్సన్‌మీద పడింది.

"జాన్సన్....ఫ్రమ్ న్యూయార్క్....ప్లీజ్ ఫాలో మి"

ఆయన కంఠం మృదువుగా పల్కింది.

అక్కడ వున్న అందరూ ఆశ్చర్యపోయారు.... ముక్కు-ముఖం తెలీని అపరిచితుడ్ని అలా పేరుపెట్టి పిలవటం ఆయన మహిమావిశేషం అనుకున్నారు అంతా.

జాన్సన్ లేచి లోపలకు వెళ్లాడు.

స్వామిజీ సింహాసనం ప్రక్కన ఆయన పర్సనల్ రూమ్‌లోకి ప్రవేశం వుంది. ఆ రూమ్ లోపలకి వెళ్ళారు స్వామిజీ....ఆయన వెనకే జాన్సన్ పర్సనల్ రూమ్‌లోకి వచ్చాడు.

ఆ రూమ్ నీలిరంగు లైట్లతో వెలుగుతుంది.

స్వామిజీ మఖమల్ పరుపుమీద కూర్చున్నారు.

ఆయన దండం, కమండలం ఆయన చేతిలో ఉన్నాయి.

జాన్సన్ అనబడే వ్యక్తి అతనిముందు కూర్చున్నాడు.

"భగవంతుడు అన్నికాలాల్లో అన్ని దేశాల్లో జన్మించాడు...."

అన్నాడు పరమహంస....అదీ కోడ్‌వర్డ్....ఎదురుగా వచ్చిన వ్యక్తి స్వామిజీ అమెరికన్ ఏజంట్ అయితే దానికి తగ్గ సమాధానం చెప్పాలి. ఆ సమాధానం స్వామిజీకి తెలుసు.

"హిందువులకు రాముడు, మహమ్మదీయులకు అల్లా, క్రిస్టియన్లకు క్రీస్తు....సమస్త మానవాళికి మీరే దేవాదిదేవులు"

అది కోడ్‌వర్డ్—

జాన్సన్ ఆ కోడ్‌వర్డ్ చెప్పాడు.

పరమహంస ముఖం అతిప్రసన్నంగా మారింది.

"స్వామిజీ....అర్జంటుగా పది నటరాజ విగ్రహాలు పంచలోకాలతో తయారు చేసినవి....శ్రీ కృష్ణారాధల విగ్రహాలు ఓ వంద.... అర్జంటుగా కావాలి" అన్నాడు.

"పాతకాలంనాటి పంచలోహ విగ్రహాలు పది పంపుతాను. ఈ మధ్యనే బౌద్ధయుగంనాటి బుద్ధప్రతిమ దొరికింది. ఏడు అడుగుల ఎత్తు—అది కావాలంటే పంపుతాను."

"అమెరికన్ మ్యూజియంను కాంటాక్ట్‌చేసి మీకు యిన్ఫర్మేషన్ పంపుతాను. మరి రాధాకృష్ణల విగ్రహాల సంగతి"

"పురాతన విగ్రహాలు లేవు....మీకోసం తయారు చేసి యివ్వాలి."

"అవి తయారు చేయించండి పంచలోహాలతో."

"మరి క్యాష్—"

"మొత్తం మూడుకోట్లు....డైమండ్స్‌లో ట్రాన్స్‌శాక్షన్...."

"ఓ.కే."

"ఓ.కే." ఇద్దరు మాట్లాడుకున్నారు. జాన్సన్ బయటికి వచ్చేశాడు. ఇంతలో అతనిదగ్గర ఉన్న ఎలక్ట్రానిక్ యంత్రం-

"బీప్....బీప్...."మని శబ్దం చేసింది.

దాన్ని తీసి ఆన్ చేసాడు.

"యస్—దిసీజ్....గురుస్వామి" అన్నాడు.

"నేను....ఏజంట్ వైను—ఈవేళ ప్రొఫెసర్ జయరాంగారు కొన్ని ముఖ్యమైన త్రవ్వకాలు జరిపారు."

"ఎనీథింగ్ ఇంపార్టెంట్" కుతూహలంగా అడిగాడు.

"ఆ త్రవ్వకాల్లో రాయలు కాలంనాటి రాగిరేకులు కన్పించాయి."

"షిట్....ఆ రాగిరేకులు మనకెందుకు?" అన్నాడు గురుస్వామి.

"ఆ రాగిరేకుల్లో ఏదో స్వర్ణసింహాసనం....రత్నాలు.... వజ్రాలు గురించి వుంది" అన్నాడు ఏజంట్ వై.

"వ్వాట్?" అతనిలో ఉద్వేగం పెరిగింది.

"అదేమిటో జాగ్రత్తగా పరిశీలించి ఆ కాపర్‌షీట్స్.... పత్రా" ఉద్వేగంగా అన్నాడు గురుస్వామి.

"అలాగే సార్....ఈవేళ రాత్రి ఆ కాపర్‌షీట్స్‌కోసం ట్రై చేస్తాను."

"అలాగే" వైర్‌లెస్ ఆగింది.

స్వామి పరమహంస అనుచరులు ఆర్కియాలజీ డిపార్ట్‌మెంట్లో స్టూడెంట్స్‌గా జొరబడతారు. మ్యూజియంలో గుమాస్తాలుగా, క్యురేటర్లుగా ఉంటారు. అంతేకాదు....రకరకాల వేషాల్లో అనేక గుళ్లు సర్వే చేసి విగ్రహాలను దొంగతనం చేస్తూ ఉంటారు.

దేవుడిమీద అద్భుతమైన బిజినెస్ చేస్తున్న ఏకైకవ్యక్తి స్వామి పరమహంస ఒక్కడే!

## 2

అర్థరాత్రి!

ఆకాశంలో నక్షత్రాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.

ఓ స్వర్ణశిల్పి అపురూపంగా చెక్కిన స్వర్ణగోపురంలా ఆకాశం లోని నక్షత్రాలు మెరుస్తున్నాయి. చంద్రుడి పంచమినాటి వెన్నెల మందంగా భూమిని స్పర్శిస్తుంది. ప్రశాంతమైన చల్లని గాలి పడమరనుండి మెల్లగా వీస్తుంది.

సరిగ్గా ఆ సమయంలో....

ప్రొఫెసర్ జయరాం అలసిపోయి ఆయన కాట్‌మీద నిద్రిస్తున్నాడు. ఆయన ప్రక్కనే టేబిల్‌మీద డీకోడ్ చెయ్యబడ్డ కంప్యూటర్ షీట్స్....బాగా అలసిపోయినట్లు ఆయన పెడుతున్న గుర్రే తెలియ చేస్తుంది.

సరిగ్గా అదే సమయంలో....

ఓ ఆకారం ఆయన ఇంటితోటలోకి వచ్చింది. అటుయిటూ చూసి మెల్లగా వాటర్‌పైప్ దగ్గరకు వచ్చి వాటర్‌పైప్ పట్టుకొని పైకి ఎక్కుతుంది.

అలా పైకెక్కి ప్రొఫెసర్ జయరాం బాల్కనీలోకి ఎగిరి దూకింది.

బాల్కనీ బయటవైపుకు గ్లాస్‌డోర్సు బిగించివున్నాయి.

బాల్కనీలోకి దూకినవ్యక్తి జేబులోనుంచి గ్లాస్‌కట్టర్ తీసి గ్లాసును మెల్లగా కట్ చేశాడు. మెల్లగా చేత్తో తట్టాడు. కటింగ్ చేసిన మేర గ్లాసుముక్క అతని చేతిలో పడింది. ఆ ఖాళీలోనుంచి వేళ్ళు పోనించి తలుపు తీశాడు.

"టక్"మనే శబ్దంతో తలుపు తెరుచుకుంది.

చటుక్కున లోపలికి నడిచాడు ఆ వ్యక్తి— పెన్‌టార్చి వెలిగించాడు. ఆ ఇంట్లోని ప్రతిది పరిచయం ఉన్నట్లుగా ఆ వ్యక్తి సరాసరి కంప్యూటర్ రూమ్‌లోకి వెళ్లాడు. ఫ్లాపీబాక్స్ దగ్గరకు వెళ్ళి దాంట్లోని ఫ్లాపీలన్నీ బయటికి తీసి కావలసినదానికోసం వెతకసాగాడు. సరిగ్గా ఐదు నిమిషాలపాటు పెన్‌టార్చి వెలుగులో కావలసిన ఫ్లాపీ కోసం వెదికాడు. అతనికి కావలసినది దొరకలేదు. విసుగ్గా వాటిని అక్కడే వదిలేసి కంప్యూటర్ దగ్గరకు వెళ్లాడు.

అక్కడకూడా కాసేపు వెతికాడు....కావలసినది కన్పించలేదు.

అక్కడనుండి మరో గదిలోకి నడిచాడు. ఆ గదీ లైబ్రరీ....ఆ గదిలో టేబుల్స్, లైబ్రరీరాక్స్ అన్నీ దేనికోసమో వెతికాడు. అతనికి

కావలసినదీ కాబోలు మెల్లగా ప్రొఫెసర్ జయరాం రూమ్‌లోకి వచ్చాడు.

ప్రొఫెసర్ జయరాం గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. ఆగంతకుడు నెమ్మదిగా పెన్‌టార్చి వెలుగులో టేబుల్ సొరుగులు వెతికాడు. అక్కడ నుండి బీరువాదగ్గరకు వచ్చి మెల్లగా బీరువా ఓపెన్ చేశాడు.

కిర్రుమని మోగింది బీరువాశబ్దం....ఆ శబ్దానికి ప్రొఫెసర్ జయరాం కదులుతాడేమోనని ఆయనవంక చూశాడు. ఏనుగులు వచ్చితొక్కినా మేల్కొనేటట్లు కన్పించలేదు.

బీరువా తెరిచి లోపల అంతా చూసాడు.

ఏవో పుస్తకాలు తప్ప ఆ బీరువాలో మరేం లేవు.

విసుగ్గా బీరువా తలుపువేసి ఆయన మంచం దగ్గరకు వచ్చాడు. ఆ గదిలోని జీరోవాట్ బల్బు వెలుగులో ఆయన మంచం ప్రక్క టేబుల్ మీద కాగితాలు ఆ అగంతకుడి దృష్టిని ఆకర్షించాయి. చటుక్కున టేబిల్ దగ్గరకువచ్చి పెన్‌టార్చి వేసి వాటివంక చూశాడు.

ఒక్కసారి అతని గుండె ఉద్వేగంగా కొట్టుకుంది.

ఓ కాగితం తర్వాత మరో కాగితం చూస్తున్నకొద్దీ అతని ముఖంలో భావాలు చకచకా మారిపోయాయి.

ఒక్కసారిగా "హుర్రే" అని అరవాలనిపించింది.

చటుక్కున ఆ కాగితాలు మడిచి జేబులో పెట్టుకొని ముందుకు కదిలాడు. సరిగ్గా అదేసమయంలో మంచమ్మీద వున్న ప్రొఫెసర్ జయరాం కదిలాడు.

కావలసినది దొరికిన ఆనందంలో గబగబా వెళుతున్న ఆ వ్యక్తి కాళ్ళకు ఇత్తడి ఫ్లవర్‌వాజ్ తగిలింది.

మరుక్షణం "ఖళ్"మనే శబ్దం.

ఇత్తడి ఫ్లవర్‌వాజ్ క్రింద పడిపోయింది.

ఆ శబ్దానికి ప్రొఫెసర్ జయరాం ఉలిక్కిపడి లేచాడు.

"ఎవరది?" అని అన్నాడు.

ఆ ప్రక్కగదిలో వున్న అతని అసిస్టెంట్ చంద్రహాస్ ప్రొఫెసర్ అరుపు విని మరుక్షణం లైటు వేశాడు.

లైట్ వేసేసరికి మరుక్షణం బాల్కనీ దగ్గరకు పరుగెత్తి,బాల్కనీ నుండి క్రిందకు జారాడు ఆంతకుడు.

సరిగ్గా అదే సమయంలో ప్రొఫెసర్ జయరాం ప్రక్కనే వున్న బెడ్‌లైట్ స్విచ్ నొక్కాడు. తెల్లని కాంతి రూమంతా పరుచుకుంది.

చంద్రహాస్ ప్రక్క గదిలోనుండి బయటికి పరుగెత్తుకొచ్చాడు.

"ఏమిటి సార్?"

"ఎవరో గదిలోకి వచ్చాడు."

"ఎవరు సార్?" అడిగాడు ఆతృతగా చంద్రహాస్.

చటుక్కున ఆయన మంచమ్మీదనుంచి బాల్కనీ దగ్గరకు పరుగెత్తాడు.

చంద్రహాస్ ఆయనవెంట పరుగెత్తుకువచ్చాడు.

అప్పటికే ఆ ఆగంతకుడు తోటలోకిదూకి అదృశ్యమయ్యాడు.

"కిందకు పరుగెత్తుకు వెళ్ళు చంద్రహాస్" ఆయిన కంగారుగా అన్నాడు.

చంద్రహాస్ ఆయన అనకముందే క్రిందకు పరుగెత్తాడు.

"రామయ్యా....ఏం చేస్తున్నావు?" పైనుంచి అరిచాడు ప్రొఫెసర్ జయరాం. నిద్రకు జోగుతున్న రామయ్య ఆ కేకకు ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు. రామయ్య ఆ ఇంటి వాచ్‌మెన్.

"ఏమిటి సార్?" అని అరిచాడు.

"ఎవరో వచ్చారు చూడు."

అప్పటికే చంద్రహాస్ క్రిందకు దిగివచ్చి వరండాలోని లైట్లు వేశాడు. అక్కడ ఎవ్వరూ లేరు. రామయ్య అతను కలిసి తోటలో చూశారు.

"ఎవ్వరూ కనిపించలేదు సార్" అన్నాడు చంద్రహాస్.

"పైకి రా" అన్నాడు ప్రొఫెసర్ జయరాం. లైట్లు ఆర్పి. చంద్ర హాస్ పైకి వెళ్ళాడు.

"ఏమిటి సార్?" అన్నాడు.

ప్రొఫెసర్ జయరాం చంద్రహాస్‌వంక దీర్ఘంగా చూశాడు.

"కంప్యూటర్ కాగితాలు మిస్ అయ్యాయి"

ఒక్కసారి బిత్తరపోయి చూశాడు చంద్రహాస్.

"ఎవరో కేవలం ఆ కాగితాలకోసమే వచ్చారు....ఎవరు వాళ్ళు?" చంద్రహాస్‌కు అయోమయంగా వుంది. కాగితాలు మాయం కావడం ఏమిటి? ఎవరు చేశారు ఈ పని?

తనకు, ప్రొఫెసర్ జయరాంకు తెల్సిన నిధిరహస్యం కాగితాలు ఎవరు దొంగిలించారు?

ఎవరికీ విషయం లీక్ అయ్యింది?

"కేవలం ఆ కాపర్‌షీట్సుకోసమే ఎవరో వచ్చారు. ఎవరువాళ్ళు?" సీరియస్‌గా చంద్రహాస్‌వంక చూస్తూ అన్నాడు.

"నేను ఎవ్వరికి చెప్పలేదు సార్" భయంభయంగా అన్నాడు చంద్రహాస్.

"నువ్వు ఎవరికీ చెప్పవన్న విషయం నాకు తెలుసు— మనిద్దరికీ తెలియకుండా ఈ విషయం యింకొకరికి ఎలా లీక్ అయ్యింది?"

ఈ విషయం అక్షతకు తెల్సుసార్" అన్నాడు చంద్రహాస్.

"అక్షత కేవలం డీకోడ్ చేసింది అంతే—దాంట్లో మేటరు పూర్తిగా ఆమెకు తెలియదు."

ఆయన ముఖంలో మారుతున్న భావాల్ని చూసి చిన్నగా నిట్టూర్చాడు చంద్రహాస్ అలాంటి ముఖ్య విషయాల్లో ప్రొఫెసర్ జయరాం చాలా కేర్‌ఫుల్‌గా ఉంటాడు.

అందుకనే కాపర్ షీట్సును, దానికి సంబంధించిన ఫ్లాపీని తనదగ్గర వున్న ఐరన్ సేఫ్‌లో భద్రపరిచాడు.

అయినా కాగితాలు మిస్సయ్యాయి?"

"పోయిన కాగితాలవల్ల—మనకేమైరా నష్టమా సార్?" అడిగాడు చంద్రహాస్.

"నష్టం ఏమీలేదు.... కేవలం నిధిగురించిన డీకోడ్ కాగితాలే పోయాయి. నిధికి సంబంధించిన ప్లానింగ్ కాగితాలు పోలేదు" చంద్రహాస్ ఆశ్చర్యంగా ఆయనవంక చూశాడు.

"యస్ మై బాయ్.... ప్లానింగ్ కాగితాలు డ్రాయరులో పెట్టి డిస్క్రిప్షన్ కాగితాలు చదువుతూ నిద్రపోయాను. ఆ కాగితాలే అసలైన కాగితాలనుకొని ఆ దొంగ తీసుకెళ్ళాడు" టేబుల్ మీదనుంచి స్పెన్సర్ చుట్ట తీసుకొని దాని రేపరు తీస్తూ అన్నాడు.

"వీ ఆర్ లక్కీ సార్" అన్నాడు చంద్రహాస్.

"ఈ జాగ్రత్తలు తీసుకుంటాను కాబట్టే ఆర్కియాలజీలో నేనెప్పుడు ఫస్ట్‌లో ఉంటాను" చుట్టను నోట్లో పెట్టుకొని లైటరుతో వెలిగిస్తూ అన్నాడు.

"ఏం చేద్దామని సార్ వాటితో?"

"ఏం చెయ్యాలో నేనింకా నిర్ణయించలేదు. అన్నీ స్టడీ చేసికొని ఓ కంక్లోజన్‌కు రాను. బై దిబై.... యశ్వంత్ ఏడీ .... యింత గొడవ జరిగినా!"

"క్రింద ఆయన రూమ్‌లో నిద్రపోతున్నాడు."

"సుఖజీవి—భూకంపం వచ్చినా నిద్రలేవడు...." అని మంచం దగ్గరకు వెళ్ళాడు.

"మరి నేను వెళ్తాను సార్" అన్నాడు చంద్రహాస్.

"ఓ.కె. మై బాయ్! లెట్స్ గో టు ప్లెజంట్ స్లీప్"

చంద్రహాస్ గదిలోకి వెళ్ళాడు.

ఆయన ఓ ఐదునిముషాలు చుట్ట కాలుస్తూ దీర్ఘంగా ఆలోచించ సాగాడు. ఆయన మేధస్సులో ఓ అద్భుతమైన ప్లాన్ రూపు దిద్దు కుంటుంది.

ఆయన ఆలోచనల్లో ఒక అద్భుత సింహాసనం....

32 మెట్లు కలిగి....

ప్రతి మెట్టుకు అటుయిటు రెండు సాలభంజికలు.... స్వర్ణసాల భంజికలు! అలా ప్రతి మెట్టుకు ప్రక్క ప్రక్కనే. ఏ థ్రోన్.... ఎగోల్డెన్ థ్రోన్ డెక్‌డ్ విత్ డైమండ్స్....

# 3

"ఏజంట్ పై కాలింగ్....పై కాలింగ్...."

గురుస్వామి వైర్లెస్‌సెట్ తీసుకున్నాడు.

"ఏమిటి....ఏమిటి విశేషం....యింత రాత్రివేళ మెస్సేజ్ ఏమిటి?"

"ప్రొఫెసర్ జయరాం కొందరు వ్యక్తుల్ని స్వర్ణ సింహాసనం యిష్యులో పిలుస్తున్నాడు.... రేపు ఉదయం కలవబోతున్నాడు పది గంటలకు."

"ఎవరా వ్యక్తులు?" అడిగాడు గురుస్వామి.

"ప్రియంవద, కపర్థి, సులోచన" అన్నాడు ఏజంట్ పై.

"కపర్థి....అతనెవరు?" అడిగాడు అనుమానంగా.

"గొప్ప కోటీశ్వరుడు. ఆర్కియాలజీ అన్నా, ఎక్సకవేషన్స అన్నా, ఎక్స్‌పెడిషన్స్ అన్నా చాలా గొప్ప ఇష్టం. పైగా మార్షల్ ఆర్ట్సులో ప్రావీణ్యం ఉంది.

"వాళ్ళు ఎక్స్‌పెడిషన్స్‌కు వస్తే మనకొచ్చిన నష్టం ఏమిటి?" అడిగాడు స్వామి.

"ఆ కపర్థి డేంజరస్ ఫెలో—మన ప్లాన్ ముందుగా గెస్ చేస్తే మనకే నష్టం" అవతలి వ్యక్తి కంఠంలో ఆందోళన.

ఒక్క క్షణం గురుస్వామి ఆలోచించాడు. అవతల ఏజంటు వై చెప్పింది అతనికి అక్షరాల సత్యంగా కన్పించింది.

కపర్థిలాంటి సమర్థుడు అయిన వ్యక్తి వ్యక్తుల్ని చదవగలడు. కపర్థి వ్యక్తుల్ని చదవగలిగితే ఏజంటు వై ఎవరో తెలుస్తుంది.

"సరే....ఆ కపర్థిని లేపించే ఏర్పాట్లు చేస్తాను...." అన్నాడు గురుస్వామి.

"థాంక్యూ" వైర్లెస్ ఆఫ్ అయ్యింది.

గురుస్వామి మరో స్విచ్ నొక్కాడు.

లోపలకు ధనరాజ్ వచ్చాడు.

"ధనరాజ్! రేపుఉదయం కపర్థి అనే వ్యక్తి ప్రొఫెసర్ జయరాం అనే వ్యక్తిని కలువబోతున్నాడు. కపర్థి జయరాంను కలువకూడదు."

"కపర్థి వివరాలు—"

"ఏజంటు వైని కాంటాక్ట్ చెయ్యి ఇస్తాడు" అని అన్నాడు.

ధనరాజ్ వెళ్ళిపోయాడు.

గురుస్వామి లేచి పర్సనల్ రూమ్ వెనకాలఉన్న మరో రూమ్‌లోకి వెళ్ళాడు.

అక్కడికి వెళ్ళి గడ్డం, మీసాలు, విగ్గు తీసేశాడు.

ప్యాంట్, షర్టు వేసుకొని కోటు వేసుకొన్నాడు.

ఇప్పుడు అతను ఓ పెద్దమనిషిలా, ఓ రెస్పెక్టబుల్ సిటిజన్‌లా ఉన్నాడు.

బీరువా దగ్గరకు వెళ్ళి బీరువా ఓపెన్ చేశాడు.

బీరువాలో కూర్చొని ఒక బటన్ ప్రెస్ చేసాడు. బీరువా తలుపులు మూసుకుపోయాయి.

బీరువా మెల్లగా తిరిగింది గోడ అవతలవైపుకు.

బీరువా తలుపులు తెరుచుకుని బయటికి వచ్చాడు.

ఆ రూమ్ తలుపులు వేసివున్నాయి.

ఆ రూమ్ తలుపులు తెరిచి బయటికి వచ్చాడు.

అదో పెద్ద గోడౌన్.

ఆ గోడౌన్‌లో ఓవైపు వరసగా పెట్టెలమీద పంచలోహ విగ్రహాలు ఉన్నాయి. అవి దేశంలో వివిధ దేవాలయాలలో దొంగిలించినవి. ఓప్రక్క పాతకాలంనాటి శిలావిగ్రహాలు ఉన్నాయి.

వాటికి పాలిష్ పడుతున్నారు. చాలామందీ పని చేస్తున్నారు.

ఆ గదిలోకి గురుస్వామి రాగానే అందరూ లేచి నిలబడి నమస్కారం చేసారు.

అందర్నీ కూచోమన్నట్లు సైగచేసి—

అక్కడ మూసల్లో లోహాల్ని కరిగించి పోస్తున్నారు.

రకరకాల లోహాలు కరుగుతున్నాయి.

బంగారం, సీసం, కంచు, ఇత్తడి, రాగి—

అక్కడ నటరాజవిగ్రహాలు, రాధాకృష్ణుల విగ్రహాలు యింకా రకరకాలైన విగ్రహాలు ఉన్నాయి.

వాటన్నింటిని చూసుకుంటూ ముందుకు వెళ్లాడు.

ముందు ఒక ఎ.సి. గది....ఆ గదిలోకి వెళ్ళాడు.

ఆ గదిలో అతనికోసం ఎవరో వెయిట్ చేస్తున్నారు.

"ఐయామ్ గురుస్వామి! మేనేజింగ్ డైరక్టర్ ఆఫ్ ఇండియన్ కల్చరల్ క్రియేటివ్ ఎంటర్‌ప్రైజెస్" తన్ను తాను పరిచయం చేసుకుంటూ కుర్చీలో కూర్చున్నాడు.

## 4

కపర్ది ఆకాశంవంక చూశాడు.

ఆకాశంలో సూర్యుడు అతితీక్షణంగా ఉన్నాడు.

ఈజిప్ట్ ఎడారుల్లోని దుమ్ము సుడిగాలికి తెరలుతెరలుగా లేస్తుంది.

కపర్థి ఎదురుగా అనేక పిరమిడ్‌లు. ఈజిప్ట్‌లోని పిరమిడ్ల కు నిలయమైన వేలీ ఆఫ్ కింగ్స్‌లో అతను నిలబడివున్నాడు.

అపార ధనరాసుల్ని తన గర్భంలో దాచుకున్న అనేక పిరమిడ్‌లు!

కపర్థి రామ్సేస్ సిక్స్‌త్ పిరమిడ్‌దగ్గరకు వచ్చాడు.

ఆ పిరమిడ్‌కు ఓవైపున మెట్లు....మెల్లగా మెట్లు దిగుతున్నాడు.

ఆ మెట్లు దిగి ఓ రూమ్‌లోకి ప్రవేశించాడు.

ఆ రూమ్ 26 అడుగుల పొడవు 12 అడుగుల వెడల్పు ఉంది.

దాంట్లో రకరకాల వస్తువులు కన్పించాయి.

బంగారు ఆభరణాలు!

బంగారు రథాలు!

బంగారు కుర్చీలు!

రెండు మానవదేహాలు....కాదుకాదు బంగారు శిలావిగ్రహాలు అవి-టుటంఖాన్ విగ్రహాలు.

తలపై కోబ్రా షేపులో కిరీటం....

ఓ బంగారు సింహాసనం....బంగారు అద్దకం అల్లిన పడకలు—

బంగారు నగిషీలు చెక్కిన కూజాలు.

టుటంఖాన్!

పద్దెనిమిదేళ్ళకే మరణించిన ఈజిప్ట్ ఫారో....

కపర్థికి ఎంతో సంతోషంగా ఉంది.

టుటంఖాన్ సమాధిని జీవితంలో చూస్తాడని అనుకోలేదు. కాని చూశాడు.

ఇంతలో హఠాత్తుగా టుటంఖాన్ సమాధి తెరుచుకుంది. అందులో నుంచి టుటంఖాన్ మమ్మీ లేచి నిలబడింది. దాన్ని చూడగానే కపర్థికి వెర్రిభయం కలిగింది.

ఒళ్ళంతా తెల్లనిగుడ్డతో చుట్టబడ్డ శవం.

"నా సమాధి తెరిచినవాళ్ళు సర్వనాశనం అవుతారు"

టుటంఖాన్ శాపం అది!

కపర్థి అక్కడినుంచి పరిగెత్తాడు.

వెనకాల శవం వస్తుంది....టుటంఖాన్ శవం!

భయం....భయం....భయం!

పరిగెత్తుతున్నాడు కపర్థి....ఈజిప్ట్ ఎడారి....

సుడిగాలి లేచి చుట్టలు చుట్టుకుంటూ వస్తుంది.

"జుయ్"మని.

ఎడారిలో పరిగెత్తుతున్నాడు.

పిరమిడ్‌లు....ఎదురుగా, ప్రక్కగా....వెనగ్గా పిరమిడ్‌లు.

కపర్థి పరుగెత్తుతున్నాడు.

సుడిగాలి కపర్థిని చుట్టేసింది.

"రయ్"మని ఆకాశంలోకి లేచింది కపర్థితోసహా.

కళ్ల తిరిగిపోతున్నాయి. చెవుల్లో హోరు.

కళ్ళల్లో, ముక్కుల్లో యిసుక—

ఏదో వచ్చి అతని శరీరానికి తగిలింది. కళ్ళిప్పి చూశాడు-

ఆకాశంలో సుడిగాలి మధ్య మమ్మీ....టుటంఖాన్ మమ్మీ.... ఒళ్ళంతా జలదరించింది.

"ఛీ....ఛీ" అని అసహ్యంతో మమ్మీని తోసాడు.

అంతే—సుడిగాలి ఆగిపోయింది!

గిర్రున తిరుగుతూ భూమిమీదకు జారిపోయాడు.

జారిపోతుండగా క్రిందకు చూసాడు కపర్థి-

క్రింద పిరమిడ్....

పిరమిడ్ కోన్‌షేడ్.... కత్తిలాగా ఆకాశంలోకి చొచ్చుకొని వచ్చింది.

"అమ్మో...." తాను వెళ్ళి కరెక్టుగా కోన్‌మీద పడతాడు.... పడ

గానే మొదట శరీరం ఛిద్రమవుతుంది. ఆ తర్వాత ముక్కలు ముక్కలైన శరీరం.

కోన్ దగ్గరవుతుండగా అతను కళ్ళు మూసుకున్నాడు.

'ధన్' చెవులు గింగిరాలు ఎత్తే శబ్దం.

# 5

'ధన్'

కపర్థి చెయ్యితగిలి పేపరువెయిట్ క్రింద పడింది.

చటుక్కున మెలుకువ వచ్చింది కపర్థికి.

ఒళ్ళంతా చెమట-

ఫాన్ హైస్పీడులో తిరుగుతుంది. అయినా-

విచిత్రమయిన కల....

పిరమిడ్ గుచ్చుకుందనే అనుకున్నాడు.

మరో లోకంలో మెలుకువ.... స్వప్నానికి, వాస్తవానికి ఎంత తేడా?

అనుభవించేటప్పుడు రెండూ వాస్తవంగానే ఉంటాయి.

ఇంతలో 'ట్రింగ్ ట్రింగ్'మని ఫోన్ మ్రోగింది.

ఫోన్ ఎత్తాడు. ఫోన్ ఎత్తుతూ వాల్‌క్లాక్‌వంక చూశాడు కపర్థి.

మూడున్నర....

మధ్యాహ్నం మూడున్నర!

ఓ ఫ్రెండ్ యిచ్చిన డిన్నర్‌కి ఎటెండయి వచ్చి పడుకున్నాడు. ఇంతలో బాగా నిద్రపట్టేసింది.

"హలో....దీసీజ్ కపర్థి."

"సార్....ఫోర్ ఓక్లాక్‌కు మీకు అప్పాయింట్‌మెంట్ వుంది."

"యస్....ఎవరిది?"

"ప్రొఫెసర్ జయరాంది....లేపమని చెప్పి వెళ్ళి పడుకున్నారు" అవతలవైపునుంచి సెక్రటరీ సులోచన అంటుంది—

కపర్ధి పర్సనల్ సెక్రటరీ సులోచన.

"ఓ.కె....ఓ అరగంటలో బయల్దేరతాను. నువ్వుకూడా వస్తున్నావా?" గమ్మత్తుగా అడిగాడు కపర్ధి.

"ఓ....అసిస్టెంటుకి చెప్పి వచ్చేస్తాను" చిన్నగా నవ్వుతూ అంది సులోచన.

"నేను నరకానికి వెళ్ళినా నన్ను వదిలిపెట్టవనుకుంటాను."

"డోంట్ సే హెల్! నేను నీతో వుంటే అది హెవన్....అది స్వర్గంగా మారుతుంది డియర్...." సులోచన గొంతులో కొంత చొరవ.

"డోంట్ సే డియర్....సే బాస్" కొంచెం కోపంగా అన్నాడు కపర్ధి.

"అలాగే బాస్" అంది సులోచన.

బాత్‌రూమ్‌లోకి కదిలాడు కపర్ధి.

గోడలకు రకరకాల గ్రీకుదేవతల ముఖాలున్న పోస్టర్సు అతికించి ఉన్నాయి. అందులో అతని మంచం ఎదురుగా ఉంది టుటంఖాన్ పోస్టర్....

నల్లటి చారలు అడ్డంగా గీసిన లోహపుతొడుగు శిరస్త్రాణం ధరించి ఉన్న ముఖం....నుదుటిమీద కోబ్రా పడగ....అమాయకత్వం ఉట్టి పడుతున్న టుటంఖాన్ గోల్డెన్‌ఫేస్ మాస్క్ ఫోటో అది. దాని ప్రక్కనే టుటంఖాన్ సమాధి వెలికి తీసి ప్రపంచానికి పరిచయం చేసిన ఆర్కియాలజిస్టు హోవర్డ్ కార్టర్ ఫోటో ఉంది.

హోవర్డ్‌కార్టర్ అంటే కపర్ధికి అంతులేని అభిమానం.... ఎప్పటికయినా హోవర్డ్‌కార్టర్‌లాగా ప్రపంచానికి ఓ అద్భుత నిధి కనుగొని చూపించాలని తాపత్రయం.

బాగా డబ్బున్న వ్యక్తి....ఆర్కియాలజీ అతనికి హాబీ. అందుకనే ప్రపంచంలోని పురాతన నాగరికతకు సంబంధించిన ఫోటోలు,

మ్యూజియం గైడ్స్, రకరకాల వస్తువులకు సంబంధించిన ఫోటోలు కలెక్ట్ చేస్తుంటాడు.

అతని సెక్రటరీ సులోచన-

ఇద్దరూ కలిసి పరిశోధన చేస్తుంటారు.

కపర్థి ఇంతవరకు పరిశోధించింది అంటూ ఏమీలేదు.

అమరావతి, నాగార్జునకొండ, కర్నాటకలోని హంపి, విజయనగరం, మౌంట్ అబూలోని దిల్వారా ఆలయం, ఇలాంటి ప్రదేశాలు చూసి అక్కడేదైనా చరిత్రకందని నిధి ఏమైనా దొరుకుతుందేమోనని పరీక్షిస్తూ ఉంటాడు. ప్రొఫెసర్ జయరాంకు మంచి స్నేహితుడు.

ముప్పైరెండేళ్ళు వచ్చాయి. ఇంకా పెళ్ళి చేసుకోలేదు.

"ఏదైనా సాధించిగాని పెళ్ళి చేసుకోను" అనే మనస్థత్వం.

సులోచన అతన్ని మనసారా ప్రేమించింది.

అందుకనే అతన్ని అంటిపెట్టుకొని ఉంటుంది. అన్ని విషయాలలో బాగానే వుంటాడు కపర్థి. కాని సులోచన ప్రేమ కబుర్లు వినగానే సీరియస్ అయిపోతాడు.

బాత్‌రూమ్‌లోకి వెళ్ళి పదినిముషాల్లో డ్రస్సప్ అయిపోయి వచ్చాడు కపర్థి.

క్రాఫ్ బాగుందో లేదో చూసుకుని, జేప్‌రికార్డు తీసుకొని బయటికి నడిచాడు. క్రింద సులోచన రెడీ అయిపోయి కంటెస్సా కారు దగ్గర నిలబడి వుంది.

కపర్థి కారుదగ్గరకి నడిచాడు.

సులోచన డోర్ తెరిచింది-కారులోకి ఎక్కాడు.

సులోచన కారు ఎక్కింది.

మరుక్షణం కారు స్టార్టయి ముందుకు దూకింది.

సులోచన డ్రయివ్ చేస్తుంది. కపర్థి సీరియస్‌గా ఆలోచిస్తున్నాడు.

"సులోచన....ప్రొఫెసర్ జయరాంగారి విషయం ఏమిటో తెల్సా?"

"తెలీదు బాస్...." అంది సులోచన....

"ఇంతకీ ఆయనెవరో నీకు తెలుసా?...." ఉత్సాహంగా అడిగాడు.

"తెల్సు బాస్.... ఆయన అనేక బౌద్ధ స్థూపాలు తవ్వి బుద్ధుడి అస్థికలు కనుక్కున్నాడు.....అలాగే బుద్ధుడ్ని హుస్సేన్‌సాగర్‌లో ముంచి....మళ్ళీ అక్కడ తవ్వకాలు సాగించి....హుస్సేన్‌సాగర్ బుద్ధుడ్ని పాతరాతియుగం బుద్ధుడిగా ఓ కథ చెప్తాడు" ఆమె సెన్సాఫ్ హ్యూమర్‌కు నవ్వుకున్నాడు.

"ఆర్కియాలజిస్టు అని చెప్పటానికి యింత మెలిక ఎందుకు"

"మెలికలేకపోతే జీవితంలో మజాలేదు బాస్" అంది సులోచన.

సరిగ్గా అదే సమయంలో కారులో వున్న రియర్‌వ్యూ మిర్రర్‌చూసి ఆమె ఉలిక్కిపడింది. ఆమెకారును అనుసరిస్తూ ఓ జీప్.... కారు ఎటు వెళితే అటు వస్తుంది.

"మన కారును ఓ జీప్ ఫాలో చేస్తుంది బాస్...."

"మనం డిటెక్టివ్స్ కాదు కదా....మనల్ని ఎందుకు ఫాలో చేస్తారు"

"ఏమో బాస్ మనం బయల్దేరిన దగ్గరనుండి ఆ జీప్ మన వెనకాలే వస్తుంది...."

సులోచన మాటలు విని వెనక్కి తిరిగి చూసాడు. కారుకు ఫర్లాంగు దూరంలో ఓ జీప్ అనుసరిస్తుంది! ఆ జీప్‌లో యిద్దరు వ్యక్తులు ఉన్నారు.

"సులోచన మనకారు స్పీడ్ పెంచు" అన్నాడు....

మరుక్షణం కారు స్పీడందుకుంది. ఆ వెనుక వస్తున్న జీప్ కూడా స్పీడందుకుంది. అలా రెండు మూడు నిముషాలు స్పీడుగా పోనిచ్చింది కారును....అయినా జీప్ వాళ్ళను వదలటం లేదు.

"ఆ జీప్‌లో వాళ్ళ ఉద్దేశమేమిటి?" అడిగాడు కపర్ది.

"మనం ఎక్కడికి వెళుతున్నామో....తెల్సుకోవటం బాస్"

"మనల్ని ఫినిష్ చెయ్యటం కాదా?" అడిగాడు కపర్ది.

నవ్వుతూ అంది సులోచన "అయితే వీ ఆర్ వెరీ లక్కీ....నీతో స్వర్గంలో హాయిగా స్వర్గసౌఖ్యాలు అనుభవించేయవచ్చు."

"నేను ఛస్తే స్వర్గానికి రాను"

"నన్ను బాధించిన పాపానికి మీరు స్వర్గానికి రారు....నరకానికి వెళ్తారు"

హఠాత్తుగా సీరియస్ అయిపోయాడు కపర్ది.

"అలా మాట్లాడటం నాకు యిష్టం ఉండదని నీకు తెలీదా!"

"తెల్సుబాస్....మేధోచాపల్యం వదులుకోలేను."

"జిహ్వాచాపల్యంలా....మేధో చాపల్యం ఏమిటి"

"అదే....నీమీద....అది...." నవ్వుతూ.... అంది

"అది....యిది అని. ..నన్ను అనవసరంగా ట్రాక్‌లోనుంచి తప్పించేయకు....ముందు మనం వెనక జీప్ వాడికి మస్కా కొట్టాలి—"

"ఈ సులోచనకు అది వెన్నతో పెట్టిన విద్య....చూస్తుండండి బాస్...." అని ఒక్కసారిగా ఎక్సిలేటర్ నొక్కింది.

మరుక్షణం పిచ్చిపట్టిన రేసుగుర్రంలా ముందుకుదూకిందికంటెస్సా..

వెనకవున్న జీప్‌లో ఉన్నవాళ్ళకు అర్థమైంది కంటెస్సా తప్పించుకు పోతుందని, వాళ్ళు స్పీడ్ ఎక్కువ చేసారు....

కంటెస్సా అతివేగంగా ముందుకు దూసుకుపోతుంది....

"బాస్....ముందు సీట్లో మీరు నా ప్రక్కనే కూర్చునివుంటే.... యింకా స్పీడ్ పోనిచ్చేదాన్ని...."

"యింకానయం యాక్సిడెంట్ చేసేదానివి కాదు...."

కంటెస్సా, జీప్ పోటీ పడి వేగంగా పరిగెత్తుతున్నాయి....

ఇంతలో ఎదురుగా ఓ ట్విల్ బెన్ బెంజ్ వేగంగా వస్తుంది.

చటుక్కున కంటెస్సాను ఓ ప్రక్కకు కోస్తూ సడన్‌బ్రేక్ వేసింది.

కంటెస్సా రోడ్డు ప్రక్క మార్జిన్‌లోకి దిగటం, సడన్ బ్రేక్ వలన ఒక్కసారిగా వెనకసీట్లో ఉన్న కపర్ది అమాంతంగా ఆ వూపుకిలేచి వచ్చి ముందు సీట్లో పడ్డాడు.

అతని తల వెళ్ళి అద్దానికి తగిలేది....చటుక్కున అతన్ని పట్టుకొని ముఖమ్మీద గట్టిగా ముద్దుపెట్టుకుంది.

సరిగ్గా అదేసమయంలోరోడ్డుమీద "బ్లాం"అనే పెద్ద విస్ఫోటనం.... జీప్ అదే వేగంతో వెళ్ళి ట్వెల్ టెన్ బెంజ్ లారీని గుద్దేసింది.... చివరి నిమిషంలో జీప్‌లోని ఓ వ్యక్తి క్రిందకు ఎగిరి దూకాడు.... స్టీరింగ్ గుండెలకు గుచ్చుకొని బొళుక్కున రక్తం కక్కుకున్నాడు డ్రైవర్.... ట్వెల్ టెన్ బెంజ్ ఇంజన్ భాగంలోకి దూరిపోయి తుక్కు తుక్కు అయి పోయింది జీప్. క్రిందపడ్డ వ్యక్తి స్ప్రింగ్‌లా లేచి కంటెస్సా దగ్గరకు రాబోయాడు....

చటుక్కున కారును ముందుకు దూకించింది ఎక్స్‌లేటర్‌ను రిలీజ్ చేస్తూ.

మరుక్షణం కంటెస్సా రేసుగుర్రంలా ముందుకు దూకింది....

కపర్ది, సులోచన వెళ్ళేసరికి ప్రొఫెసర్ జయరాం వాళ్ళ కోసం ఎదురుచూస్తున్నాడు. కపర్ధి జయరాంను చూడగానే....

"సారీ ఫర్ ది లేట్" అన్నాడు....

"ఇట్సాల్ రైట్" అని అన్నాడు. ప్రొఫెసర్ జయరాంతోపాటు అతని కూతురు అక్షత, అసిస్టెంట్ చంద్రహాస్, యశ్వంత్, మరో స్త్రీ కూడా వుంది....

"హీ యిజ్ మై అసిస్టెంట్ చంద్రహాస్.... వెరీ బ్రైట్ బాయ్" పరిచయం చేసాడు. కపర్ధి షేక్‌హాండ్ యిచ్చాడు.

"వెరీ గ్లాడ్ టు మీట్ యు...."

"హీయిజ్ మిష్టర్ యశ్వంత్....డేర్ అండ్ డైనమిక్ బాయ్"

యశ్వంత్‌తో కరచాలనం చేసాడు కపర్ధి....

మూడో స్త్రీ వంక చూసాడు కపర్ధి....

"షీ యీజ్....మిస్ ప్రియంవద......ఆర్కియాలజిస్ట్........వెరీ ఎడ్వంచరస్ వుమెన్...." అన్నాడు....

ఆమె నమస్కారం చేసింది.

"వీరు కపర్ధిగారు....గొప్ప పరిశోధకులు....పైగా ఆర్కియాలజీ ఆయనకు హాబీ....ఏనాటకైనా ప్రపంచంలో గొప్ప పరిశోధనచేసి చరిత్ర పుటల్లోకి ఎక్కాలనే ఆశయం కలవారు"

అందరూ కపర్ధివంక చూసారు....కపర్ధి చిన్నగా నవ్వి సులోచన వంక చూసి....

"ఈమె నా సెక్రటరీ సులోచన...." అని పరిచయం చేసాడు....

సులోచన అందరికి నమస్కారం చేసింది....

ప్రొఫెసర్ జయరాం ఏదో ముఖ్యమైన విషయం వివరించటానికి అందర్ని అక్కడకు రప్పించాడని అందరికి అర్ధమైంది....

కపర్ధి సోఫాలో కూర్చున్నాడు. అతని ప్రక్కనే కూర్చుంది సులోచన....

లోపల నుంచి కుక్ వెంకటస్వామి స్నాక్స్ ఉన్న ప్లేట్లు తీసుకు వచ్చి వాళ్ళ ముందుంచాడు....అందరు ప్లేట్లు తీసుకున్నారు....

టీ సర్వ్ చేయబడింది....

"ఈ రోజు మమ్మల్ని పిలవటంలో ముఖ్య ఉద్దేశం ఏమిటి........ మిష్టర్ జయరాం" అడిగాడు కపర్ధి....

"చెప్తాను....టీ తీసుకోండి" అని ఆయన సోఫాలో రిలాక్స్ అయ్యాడు....

టీ తీసుకున్నారు. కపర్ధి టీ కప్ తీసుకొని ఓ సిప్ తాగాడు....

"మీరెప్పుడైనా విక్రమాదిత్యుడి సింహాసనం గురించి విన్నారా?" అడిగాడు ప్రొఫెసర్ జయరాం....

"యస్....విన్నాను....శాలభంజికలతో నిర్మితమైన విక్రమార్క సింహాసనం.... భోజరాజుకు ఎస్కవేషన్స్‌లో దొరికిన అద్భుత సింహాసనం...." అన్నాడు కపర్ధి....

"యస్ కరెక్ట్....అదే విక్రమార్క సింహాసనం.... దాన్ని భోజ రాజు స్వంతం చేసుకున్నాడు అనుకోండి.... దానికన్నా అద్భుతమైన సింహాసనం గురించి మీకు చెప్తాను"

హఠాత్తుగా అక్కడి వాతావరణం వేడెక్కింది....

అందరిలో ప్రొఫెసర్ జయరాం ఏం చెప్తాడోనని టెన్షన్ కలిగింది....

ప్రొఫెసర్ జయరాం గొంతు సవరించుకున్నాడు....

"ఆంధ్ర భోజుడని ఎవర్ని పిలిచేవాళ్ళు"

"శ్రీకృష్ణదేవరాయలు" చంద్రహాస్ టక్కున చెప్పాడు....

"యస్....శ్రీకృష్ణదేవరాయలు ఆంధ్రభోజుడే! భోజరాజులాగ కవి గాయక నటుల్ని సన్మానించి కళా పోషణ చేసిన రాజు శ్రీకృష్ణదేవ రాయలు....

అందరూ ఉత్కంఠగా ఆయన చెప్పేది వింటున్నారు. కపర్ధి తాగుతున్న టీని క్రింద పెట్టాడు.

"భువన విజయం ఆయన కళా పోషణకు తార్కాణం.... అష్ట దిగ్గజాలతో అద్భుతమైన కవి సభను అలరించిన ఈ ఆంధ్రభోజుడు.... ఆ భోజ మహారాజుకు ఏ రకంగా తీసిపోడు.... అందుకే ఆ రోజుల్లో శ్రీకృష్ణదేవరాయలకు చాలా చిత్రమైన కోరిక కలిగింది....వెరీ ఎగ్జైటింగ్ ఐడియా...."

"ఏమిటది" ఆత్రుతగాఅడిగాడు యశ్వంత్ జేబులోనుంచి స్పెన్సర్ చుట్టతీసి దానికున్న రేపర్ మెల్లగా ఊడతీశాడు.

గంభీరంగా ఎదురుగా ఉన్నవాళ్ళను చూసాడు ప్రొఫెసర్ జయరాం....

అందరూ ఆయన చెప్పే విషయం కోసం చకోర పక్షుల్లా చూడసాగారు....

"ఆయనకొచ్చిన ఐడియా ఏమిటో చెప్పగలరా?"

కవ్విస్తున్నట్లుగా అన్నాడు ప్రొఫెసర్ జయరాం....

"తెలియదు...." అన్నాడు యశ్వంత్.

కపర్థి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు....

"ఎన్నో దిగ్విజయ యాత్రలు చేసి అపారధనరాసుల్ని సంపాదించిన మహారాజుకు వచ్చిన అద్భుతమైన ఆలోచన ఏమిటి ?....

ఒకటి !

రెండు !

మూడు ! క్షణాలు గడిశాయి

అందరి ముఖాల్లో టెన్షన్....

"తాను భోజరాజుకు, విక్రమార్కుడికి ఏ మాత్రం తీసిపోని మహారాజు....అలాంటి తనకు విక్రమార్కుడి లాగా చరిత్ర ప్రసిద్ధమైన సింహాసనం కావాలనుకున్నాడు. అదే గోల్డెన్ థ్రోన్ విత్ డైమండ్స్ అండ్ పెరల్స్.... వజ్రాలు పొదిగిన రత్నఖచిత సింహాసనం కావాలనుకున్నాడు విక్రమార్కుడి సింహాసనంలాంటి సింహాసనమే చేయించాలనుకున్నాడు. అదే శ్రీకృష్ణదేవరాయలకు వచ్చిన ఎగ్జైటింగ్ అండ్ మోస్ట్ ఫాసినేటింగ్ ఐడియా...." ఆయన కంఠం గంభీరంగా పల్కింది.

ఒక్కసారి ఊపిరి పీల్చివదిలాడు కపర్థి....

ఆశ్చర్యంగా వింటున్నాడు యశ్వంత్

ప్రియంవద ముఖంలో మాటలకందని భావం.

"శ్రీకృష్ణదేవరాయలు ఆ సింహాసనం చేయించాడా?" ఠక్కున అడిగింది సులోచన....

కపర్థి సులోచన వంక కోపంగా చూసాడు. ఆమె అతని కోపాన్ని కొంచెంకూడా కేర్ చెయ్యలేదు.

"తనకు వచ్చిన ఆలోచనను వెంటనే మహామంత్రి తిమ్మరసుకు చెప్పాడు....

తిమ్మరసు ఆ విషయం గూర్చి దీర్ఘంగా ఆలోచించాడు....

"మీకొచ్చిన ఆలోచన చాలా గొప్పదే మహారాజా.... కాని ఆ సింహాసనం చేయగల స్వర్ణశిల్పి ఎవరు— అంతేకాకుండా రోజురోజుకు మీకు పెరిగిపోతున్న ప్రభావాన్ని చూసి ఈర్ష్యపడే బహమనీ సుల్తానులు, రోజు రోజుకు ఈ నేలమీద బలపడుతున్న పోర్చుగీసువాళ్ళు మీ దగ్గర స్వర్ణసింహాసనం ఉందంటే భరించగలరా!.... మీ శత్రువులందరు ఏకమైతే విజయనగర సామ్రాజ్య ఉనికి ఏమౌతుందో ఊహించగలరా? అని తిరిగి ప్రశ్నించాడు....దానికి శ్రీకృష్ణదేవరాయలు చిన్నగా నవ్వాడు.

"ఈ అల్పుల గురించి భయపడవలసిన పనిలేదు మహామంత్రి అంతగా అయితే ఆ స్వర్ణసింహాసనాన్ని రహస్యంగా తయారు చేయించండి....ఎంత ధనమైనా సరే దానికోసం వెచ్చించండి...." అన్నాడు.

"మీ పూర్వీకులైన కంపన గంగాబ మధుర విజయ దిగ్విజయ యాత్రలో అపార ధనరాసుల్ని సంపాదించారు. అంతేకాకుండా మీ కుల గురువైన విద్యారణ్యస్వాములవారు అనుగ్రహించిన ధన కనకరత్నాలు అన్నీ అపారంగా ఉన్నాయి...."

"ఎక్కడ ఉన్నాయి మహామంత్రి...."

"విజయనగర సామ్రాజ్యం కోసం తన తపఃశక్తి ధారపోసి సంపాదించిన ధనం అంతా ఆయన అనుజ్ఞ మేరకే ఓ పర్వత గుహలో భద్రంగా దాచిపెట్టబడివుంది. దాంతోపాటు కంపన దిగ్విజయ యాత్రలో సాధించిన

అపార ధనరాసులు కూడా ఆ పర్వతంలోనే ఉన్నాయి...." చెప్పాడు తిమ్మరసు.

"పర్వత బిలంలో అపార ధనరాసులా.... ఈ విషయం నాకు తెలియదే" అన్నాడు శ్రీకృష్ణదేవరాయలు....

"ఈ రహస్యం నాకు తెల్సు మహారాజా.... రాజ్యం నిర్వీర్యమై నప్పుడు మాత్రమే ఆ ధనరాసుల్ని వాడమని మీ పూర్వీకుల ఆజ్ఞ........ అన్నాడు మహామంత్రి....

"ఆ పర్వత బిలం ఎక్కడుంది మహామంత్రి...."

"చెప్తాను మహారాజా.... ఆ పర్వత బిలం కేవలం పర్వత బిలం కాదు....కొండను తొలిచి లోపల రాజప్రసాదాలు నిర్మించిన కొండ....పైకి చూడటానికి కొండలా వున్నా.... మన రాజప్రసాదం అంత ప్రదేశం ఆ కొండలోపల వుంది.... అనేక భవనాలతో ముందుచూపుగా విద్యారణ్య స్వాములవారిచేత నిర్మించబడింది...." చెప్పాడు తిమ్మరసు

"అద్భుతం....మహామంత్రి....అద్భుతం...."అన్నాడు రాయలు.

"నేను ఎన్నికచేసిన స్వర్ణశిల్పిని అక్కడికి తీసుకువెళ్ళి అక్కడే స్వర్ణసింహాసనాన్ని తయారుచేయిస్తాను మహాప్రభూ...."

అని వినయంగా అన్నాడు వృద్ధ మంత్రి....

"ఆవశ్యం....అలాగే చేయండి" అన్నాడు శ్రీకృష్ణదేవరాయలు....

ఒక్కసారిగా రిలాక్సయ్యాడు ప్రొఫెసర్ జయరాం.... గతంలో నుంచి....

"ఫెంటాస్టిక్....కొండలోపల రాజంతఃపురం....యిది ఎక్కడా వినలేదే....కనలేదే" అన్నాడు యశ్వంత్....

"వినకపోవటం ఏమిటి....ఈజిప్ట్‌లోని పిరమిడ్‌లు అన్ని ఆలాంటివే....లోపల కొన్ని వందల గదులతో ఉండి బైట కొండ శిఖరంలా పిరమిడ్ ఉంటుంది. దాన్లోకి ఎలా వెళ్ళాలో కూడా తెలియదు"అన్నాడుకపర్ది.

"ఈజిప్టియన్‌లు....ఆనాటికే అంత సంస్కృతిని సాధించారా...."

"అవును ఈజిప్టులోని వ్యాలీ ఆఫ్ కింగ్స్‌లో యిలాంటి అనేక రకాలైన పిరమిడ్లు ఉన్నాయి....క్రీ,పూ. 2780 నుండి 2250 మధ్యకాలంలో కొన్నివేల పిరమిడ్‌లు నిర్మించారు. మొట్టమొదట "జోసర్" అనే రాజు నిర్మించిన స్టెప్ పిరమిడ్ చరిత్ర ప్రసిద్ధి కెక్కినది. అది ఏడు రకాలైన చతురస్రాలతో ఒకదానిమీద ఒకటి నిర్మించారు. దీనిలో అనేకమైన గదులు, కారిడార్లు ఛాంబర్స్ ఉన్నాయి. అంతేకాకుండా ప్రపంచ ప్రఖ్యాతి చెందిన ఛియోప్స్ పిరమిడ్ కూడా వ్యాలీ ఆఫ్ కింగ్స్‌లో ఉంది."

"ఆ పిరమిడ్ ప్రత్యేకత ఏమిటి"

"ఇది అతి పెద్ద పిరమిడ్. వాషంగ్టన్ కాపిటల్ బిల్డింగ్ ఏకాఎకిన దీన్లో ఉంచేయవచ్చు అంత పెద్ద పిరమిడ్ ఈ "ఛియోప్స్...," కాబట్టి కొండలోపల రాజంతఃపురాల్ని నిర్మించటం ఏమీ విశేషం కాదు. బహుశా ఈజిప్టులోని ఆర్కిటెక్ట్స్ ఎవరో ఆ రోజుల్లో విద్యారణ్యస్వాముల వారికి గైడెన్స్ యిచ్చి ఉండవచ్చును" నవ్వుతూ అన్నాడు కపర్ది....

"నాగరికత అభివృద్ధిలో ఒకరికి వచ్చిన ఐడియా మరొకరికి కూడా వచ్చి ఉండవచ్చును." యశ్వంత్ అన్నాడు.

"అంతేకాకుండా ఏదన్నా యుద్ధం వచ్చినపుడు, సైన్యంతో సహా దాగి ఉంటానికి అలాంటి రహస్య ప్రదేశాలు ముందు చూపుతో తయారు చేసి వుండవచ్చును...." అన్నాడు చంద్రహాస్.

టాపిక్ ప్రక్కట్రాక్ పడుతున్నట్లు అనుమానించాడు ప్రొఫెసర్ జయరాం.... గొంతు సవరించుకున్నాడు.

"అలా.... మహామంత్రి తిమ్మరసుకు స్వర్ణ సింహాసనం చేసే బాధ్యతను అప్పచెప్పాడు శ్రీ కృష్ణదేవరాయలు. తిమ్మరసు స్వర్ణ సింహాసనం చేసే స్వర్ణశిల్పి కోసం విజయనగర సామ్రాజ్యం అంతా వేగులద్వారా

వెతికించాడు. చిట్టచివరకు బసవన్న అనే స్వర్ణ శిల్పి దొరికాడు. ఆయన అద్భుత శిల్పి. బంగారు పనితనంలోను, శిల్పాలు చెక్కడంలో కూడా మంచి ప్రజ్ఞ ఉన్న వ్యక్తి. ఆ వ్యక్తిని తీసుకువచ్చి తిమ్మరుసు ముందు పెట్టారు గూఢచారులు. స్వర్ణ శిల్పికి రాజు కోరిక తెలియపర్చాడు తిమ్మరసు. స్వర్ణ సింహాసనానికి సంబంధించిన ప్రతిమను తయారు చేసుకు రమ్మన్నాడు. బసవన్న పదిరోజుల్లో ఆ స్వర్ణ సింహాసనం మోడల్ చేసుకు వచ్చాడు. ముప్పై రెండు మెట్లతో....మెట్టు మెట్టుకు అటు చివర యిటు చివర స్వర్ణ శాల భంజికలతో ఆ సింహాసనం మోడల్ ఉంది.అద్భుతంగా ఉంది ఆ ప్రతిమ. దాన్ని శ్రీ కృష్ణదేవరాయలకు చూపించాడు తిమ్మరుసు. శ్రీ కృష్ణదేవరాయలు వెంటనే ఆ సింహాసనం తయారు చేయమన్నాడు. అప్పుడు ప్రారంభమైంది అసలు సమస్య...."

"ఏమిటది" అడిగాడు యశ్వంత్.

అందరి ముఖాల్లో టెన్షన్ అలుముకుంది. అందరూ శ్రీ కృష్ణదేవ రాయలు కాలానికి వెళ్ళిపోయారు ఆలోచనల్లో.

వాళ్ళందరి కళ్ళ ముందు బసవన్న తయారుచేసిన బంగారు సింహాసనం కదలాడుతుంది-

మళ్ళీ ప్రారంభించాడు ప్రొఫెసర్ జయరాం....

"బసవన్నతో పాటు యింకా కొందరు శిల్పులను పిలిస్తే, ఆ రహస్యం బైటకు పొక్కుతుంది. శ్రీ కృష్ణదేవరాయలు ప్రజలను పట్టించుకోకుండా అద్భుత సింహాసనం నిర్మించటంలో మునిగి ఉన్నాడంటే ప్రజల్లో అసంతృప్తి చెలరేగి ప్రజలు ఆయన పరిపాలన మీద తిరుగుబాటు చెయ్యటానికీ అవకాశం వుంది. బసవన్న ఒక్కడేగనక చేస్తే సింహాసనం నిర్మాణం ఆలశ్యమైపోతుంది. ఆ సమస్య గురించి తీవ్రంగా ఆలోచించారు ఆ ముగ్గురు...."

"జీవితంలో ఒక్కసారైనా ఆ సింహాసనం మీద కూర్చొని మరణించినా అదృష్టమే....కనీసం వృద్ధాప్యంలోనైనా ఆ సింహాసనం మీద

కూర్చుంటాను...కానివ్వండి నిర్మాణాన్ని" అన్నాడు శ్రీ కృష్ణదేవరాయలు. ఆయనకు భావితరాల్లో పేరు ప్రఖ్యాతులు రావాలనే కోరికేగాని ఆ సింహాసనమ్మీద కూర్చోవాలని కాదు.

తిమ్మరసు బసవన్నను ఆయన కొడుకును తీసుకొని రహస్య మార్గంద్వారా నగరానికి దూరంగా ఉన్న కొండలోకి తీసుకు వెళ్ళాడు. ఆ రహస్య మార్గం ద్వారా కొండ గర్భములోకి వెళ్ళిన బసవన్న ఆశ్చర్య పోయాడు. అనేకమైన గదులు. ఆ గదులన్నింటిని దాటి కొండమధ్య భాగం అనబడే చోట ఓ గుండ్రని భవనం వుంది. ఆ భవనం చుట్టు ఈ మిగతా గదులన్ని వ్యాపించి ఉన్నాయి.

ఆ గదిలో ఉన్నాయి విద్యారణ్య స్వామి ప్రసాదించిన అపారధన రాసులు.... కంపన దిగ్విజయ యాత్రలో సాధించిన ధనకనక వస్తు వాహనాలు...." ఆగాడు స్పెన్సర్ చుట్ట గట్టిగా గాఢంగా పీల్చి పొగ వదిలాడు ప్రొఫెసర్ జయరాం.

అందరి ముఖాల్లో ఉత్కంఠ, టెన్షన్....

శిఖరాగ్రాన్ని చేరుకుంటున్న అమోఘమైన ఉత్కంఠ....

చిన్నగా నవ్వుకున్నాడు.

"విద్యారణ్యస్వామికి ఆ అపారధనరాసులెలా వచ్చాయి...." యశ్వంత్ అడిగాడు.

"అబ్సర్డ్ క్వశ్చన్.... అయినా సమాధానం చెప్తాను" అన్నాడు ప్రొఫెసర్....

"చెప్పండి" అన్నాడు కపర్థి. రిలాక్స్ కావడం కోసం గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్ వెలిగించి గట్టిగా, గాఢంగా పీల్చి వదిలాడు.

"విద్యారణ్యస్వామి లక్ష్మిదేవి అనుగ్రహం కోసం తీవ్రంగా తపస్సు చేసాడట. ఆయనకు లక్ష్మిదేవి కరుణించలేదు. అలా నలభై సంవత్సరాలు లక్ష్మి అనుగ్రహం కోసం ప్రయత్నించి విసుగుచెంది యజ్ఞ

హోమంలో తన తలను కత్తిరించుకోబోగా లక్ష్మీదేవి ప్రత్యక్షమై- వత్సా! కేవలం ఓ వ్యక్తి కోసం నేను అనుగ్రహించాను. కానీ ఓ సమాజం కోసం పనిచెయ్యాలనుకున్నప్పుడు నా కృప ఉంటుంది. నీ వల్ల విజయనగర సామ్రాజ్యం స్థాపించబడుతుంది, నీ తపస్సు వల్ల సాధించిన ధనరాసులు ఆ సామ్రాజ్య నిర్మాణం కోసం ఉపయోగించు, ఆ ధనరాసుల్ని నీ స్వార్థం కోసం ఉపయోగిస్తే మాత్రం అవి ఏ మాత్రం నిలవవు. నువ్వేకాదు, ఏ వ్యక్తి అయినా అపార ధన సంపదనను కేవలం వ్యక్తిగతంగా ఉపయోగించుకోవాలనుకుంటే నేను అలాంటి వ్యక్తి వద్ద నుంచి వెళ్ళిపోతాను. నిల వను అని చెప్పి అతని ముందు రత్నరాసులు కురిపించి అదృశ్యమైందట."

"ఫెంటాస్టిక్ స్టోరీ...." ప్రియంవద అంది.

"ఏ కాక్ అండ్ బుల్ స్టోరీ" యశ్వంత్ అన్నాడు.

"అయితేనేం ధనానికి గమ్యం సమాజ ఉద్ధరణే అని ఈ కథ సందేశం —" అప్పటివరకు మౌనంగా వుంది అనుకున్న అక్షత అంది.

"ఎనీహౌ.... విద్యారణ్యస్వాముల వారివల్ల లభించిన ధనరాసులో లేకపోతే కంపన కొల్లగొట్టిన ధనరాసులో, మొత్తానికి ఆ పర్టిక్యులర్ రూమ్‌లో అపార ధనరాసులు ఉన్నాయి.

అక్కడే సింహాసనం నిర్మించమని బసవన్నను అతని కొడుకును అక్కడే వదిలేసివచ్చాడు........ బసవన్న అక్కడే ఉంటూ ఆ బంగారు సింహాసనం తయారు చేయసాగాడు.... నెలరోజుల కొకసారి వచ్చి భార్యా బిడ్డలను కలసి వెళ్ళేవాడు. అతనితోపాటు అతని కొడుకు ఈశ్వరా చార్యులు........ ఆ సింహాసనం నిర్మాణంలో పాల్గొన్నారు....అలా చాలా సంవత్సరాలుగడిచిపోయాయి....బసవన్నమరణించాడు.... అయినా సింహా సనం పూర్తి కాలేదు. ఈలోగా అనేక సంఘటనలు జరిగిపోయాయి.... సింహాసనాన్ని తయారు చెయ్యడంలోనే మునిగిపోయాడు ఈశ్వరాచార్యులు .... ఈలోగ నడివయస్సులో శ్రీకృష్ణదేవరాయలు

మరణించాడు.... ఆయన తరువాత ఆయన చిన్న కొడుకైన సదాశివ రాయలు అసమర్థుడు అవ్వటంవల్ల శ్రీకృష్ణదేవరాయలు అల్లుడు అళియ రామరాయలు సింహాసనం అధిష్టించాడు .... ఆయన కాలంలో ఆ అద్భుత సింహాసనం తయారైంది....ఆ సింహాసన నిర్మాణం శ్రీకృష్ణదేవరాయలు కూతురు మోహనాంగికి తప్పమరెవ్వరికి తెలీదు.... ఈలోగా పోర్చుగీసు వాళ్ళు బలవంతులైపోయారు.... రాక్షస - తంగిడి యుద్ధంవలన విజయ నగర సామ్రాజ్యం నాశనమైంది. అళియరామరాయలు శత్రువుల చేతికి చిక్కి మరణించాడు.

ముస్లిం సైన్యాలు విజయగర్వంతో రక్షణలేని విజయనగరంలో ప్రవేశించి దోచుకొని, ఆలయాలను, రాజప్రాసాదాలను కూల్చి ధ్వంసం చేశారు. మోహనాంగి ఆత్మహత్యచేసుకుంది.

**1576** లో సదాశివరాయలు మరణించాడు. బసవన్న ఈశ్వరా చార్యులు చేసిన బంగారు సింహాసనం గురించి .... బహమనీసుల్తానలకు ఎవ్వరో చెప్పారు.... స్వర్ణకారుల యిళ్ళమీద దాడులు జరిగాయి .... ఈశ్వరాచార్యులు భార్యాబిడ్డలతో పారిపోయి ఆంధ్రదేశంలో తలదాచు కున్నాడు. సింహాసనానికివెళ్లే కొండ ఎక్కడ వుందో కొడుకు వీరాచార్యు నకుచెప్పి మరణించాడు ఈశ్వరాచార్యులు. వీరాచార్యులు ఆ మార్గమంతా రాగిరేకులమీద చెక్కి జరిగిన విషయమంతా రాగిరేకుల్లో వ్రాసి మరణిం చాడు, మనకు దొరికింది వీరాచార్యులి అస్థిపంజరమే ...." పూర్తిచేసి గంభీరంగా సోఫావెనక్కి వాలాడు ప్రొఫెసర్ జయరాం.

"ఇన్‌క్రెడిబుల్ .... వండర్‌ఫుల్ .... శ్రీకృష్టదేవరాయలు స్వర్ణ సింహాసనం.... చరిత్ర కందని అద్భుత సింహాసనం .... ఆ సింహాస నాన్ని వెలికితీస్తే........ మీ పేరు చరిత్ర పుటల్లో చిరస్థాయిగా నిలిచి పోతుంది..." అన్నాడు కపర్ది...

"వెల్... ఈ విషయమంతా ఆ రాగిరేకులలో ఉంది.... ఆ పర్వ తాన్ని ఎలా చేరుకోవాలో అందులో గీయబడివుంది .... కానీ ఆ పర్వతం

ఎక్కడో మాత్రం ........ తెలియపర్చలేదు ...." అన్నాడు ప్రొఫెసర్ జయరాం!

"అంటే.... మరెవ్వరికయినా దొరికినా .... వాళ్ళకు ఉపయోగం లేకుండా చెయ్యడానికి ఉద్దేశించి ఆ రాగిరేకు తయారుచేసి ఉండవచ్చును."

"నేను ఆ రాగి రేకులో చెప్పిన ప్రాంతమంతా తిరిగాను.... అదీ బహుశా విజయనగరానికి దగ్గరగావున్న కొండ ప్రాంతాల్లో కావచ్చు."

"దానికి సంబంధించి ఏదయినా క్లూ యిచ్చాడా !"

"యిచ్చాడు.... ఆ క్లూ....గమ్మత్తుగా ఉంది.... మోస్టు ఇంట్రికేట్ లిటరేచర్‌లో వుంది." ఉన్నాడు ప్రొఫెసర్ జయరాం,"

"ఏమిటది" కపర్ది అడిగాడు.

జేబులోనుంచి కాగితం తీశాడు.

"నవగ్రహాలు తలక్రిందులైనచోట....

హరిహరులు కల్సినచోట....

పశ్చిమాన ఆకాశం స్వర్ణకాంతితో వెలుగొందేచోట....

పర్వత శిఖరంపై సూర్యుడు బంగారు కలశమై మెరిసేచోట....

ఆచోట ఆలయ ద్వారాలు ద్వారమయ్యేచోట....

విఘ్నేశ్వరుడి ఒంటికొమ్ము భ్రుకుటిని తాకేచోట....

ఆచోట ఉంది అద్భుత ద్వారం....

స్వర్ణ సింహాసనానికి అదే మూలద్వారం...."

"ఈ భావనతో ఈ లైను వ్రాయబడివున్నాయి....'' అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

"అవి చాలు.... ఆ కొండ ఎక్కడో కనుక్కోడానికి....''

"వీటి సాయంతో కనుక్కొంటారా?....

"నిస్సందేహంగా.... వాటి ద్వారా ఆ స్వర్ణశిఖరం ఎక్కడందో కనునుక్కొంటాను టుటంఖాన్ సమాధి రహస్యం కనుగున్న హోవర్డ్

కార్డర్‌లాగా.... "ఇన్కాస్ అపార ధనసంపదవున్న ఎసేసింజ్ అగ్ని పర్వతాన్ని కనుగున్న "డాక్టర్ రైటర్" లాగా నా పేరు చరిత్రలో చిర స్థాయిగా మిగిలిపోతుంది...." అన్నాడు తన్మయంగా కపర్థి ....

"ఓ. కె మైడియర్ ఫ్రెండ్. .. మన గ్రేట్ ఎడ్వంచర్ ఎప్పటి నుంచి ప్రారంభిద్దాం అంటావు...."

"రేపటి నుంచే.... ప్రారంభిద్దాం—" అన్నాడు ప్రొఫెసర్.

అ ప్రదేశం ఏదో తెలియకుండా ఎలాగా...."

"రేపే మనిద్దరం.... కర్నాటకలో విజయనగరం దగ్గరవున్న పర్వతాలను శోధిద్దాం...." కపర్థి అన్నాడు.

"ఈలోగా ఈ విచిత్రమైన పద్యపాదంలోని లైను డీకోడ్‌చేద్దాం." అన్నాడు.... ప్రొఫెసర్ జయరాం....

"ఓ-కే...."

"మీ అందరికి హోటల్లో రూమ్స్ బుక్ చేసాను...." అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

"నో....నో.... ప్రొఫెసర్.... మేము హోటల్లో ఉండం ...." ఈ రాత్రంతా ఆ లైను డీకోడ్ చెయ్యటానికి కూర్చుంటాం" అన్నాడు కపర్థి.

"అన్వేషణ ఇప్పుడే ప్రారంభమైంది." అన్నది సులోచన....

"హోవర్డ్ కార్డర్ రంగంలోకి దిగాడు" అందరూ ఫక్కున నవ్వారు.

కపర్థి, జయరాం గదిలో కూర్చుని ఉన్నారు. వాళ్ళ ముందు వెడల్పైన టీపాయ్, టీపాయ్ మీద కంప్యూటర్ పేపర్స్, ఓ ప్రక్క రాగి రేకులు, కపర్థి సీరియస్‌గా కాగితాల వంక చూస్తున్నాడు. ప్రియంవద ఎదురుగా సోఫాలో కూర్చొని "స్ఫింక్స్" నవల చదువుతుంది.

అప్పుడు రాత్రి పదిగంటలు....

ప్రొఫెసర్ జయరాం అత్యంత నమ్మకస్తులు కపర్ధి, ప్రియంవదలు ప్రియంవద తండ్రి కూడా ఆర్కియాలజిస్ట్... ఆయన మరణించి యిప్ప టికి ఐదేళ్ళవుతుంది. తండ్రిలాగే ప్రియంవద కూడా ఆర్కియాలజీ మంచి యింట్రస్టు. తండ్రితో పాటు అనేక ఎక్సకవేషన్స్‌లో పాల్గొని ఈ మధ్యనే రిసెర్చ్ పేపర్స్ సబ్మిట్ చేసింది. ఆమె ఆర్కియాలజిలో ఎన్నుకున్న రీసెర్చ్ సబ్జక్ట్....ప్రి హిస్టారికల్ కల్చర్ ఆఫ్ విజయనగర డైనస్టీ. శ్రీ కృష్ణదేవరాయలు కాలానికి సంబంధించిన అనేక విషయాలలో ఆమె నిష్ణా తురాలు.

కపర్ధి పేపర్‌లోని డీకోడ్ చేసిన పద్య పాదాలన్నింటిని ఓసారి చూసాడు.

'నవగ్రహాలు తలక్రిందులైన చోట....!
హరిహరులు కల్సినచోట...
పశ్చిమాన ఆకాశం స్వర్గకాంతిలో వెలుగొందే చోట!
పర్వత శిఖరంపై సూర్యుడు బంగారు కలశమై మెరిసే చోట
ఆ చోట ఆలయ ద్వారాలు ద్వారమయ్యేచోట
విఘ్నేశ్వరుడి ఒంటి కొమ్ము భృకుటిని తాకేచోట
ఆ చోట ఉంది అద్భుత ద్వారం...
స్వర్ణసింహాసనానికి అదే మూల ద్వారం....

కపర్ధి ఆ పద్యాన్ని ఒకటికి రెండుసార్లు చదివాడు.

అతనికి ఏదో అర్ధమైనట్లు అన్పించింది.

"ప్రియంవదగారు... శైవ, వైష్ణవ మతాల ప్రాబల్యం తగ్గించి సర్వ సమాన సౌభ్రాతృత్వాన్ని కల్పించటం కోసం నన్నయ్య హరిహర నాధుడ్ని సృష్టించాడు కదా! ఆయనకు ఆలయాలు కట్టిన దాఖలాలు ఎక్క డైనా ఉన్నాయా?"

కపర్ధి అడిగిన ప్రశ్నకు పుస్తకం ప్రక్కన పెట్టేసింది ప్రియంవద

"ఆంధ్రదేశంలో పదకొండవ శతాబ్దంలో హరిహరనాధుడు అనే దేవుడ్ని సృష్టించాడు నన్నయ్య. ఆయన ఆలయం రాజమహేంద్రవరంలో కట్టినట్లు ఋజువులున్నాయి. కానీ ఆ ఆలయం ఇప్పుడు ఎక్కడుందో ఎవ్వరూ చెప్పలేరు...."

"రాజమండ్రిలో కాదు. కర్నాటకలో ఎక్కడైనా వుందా....?"

కపర్ధి ప్రశ్నకు కొంచం ఆశ్చర్యపడింది ప్రియంవద....

"శ్రీ కృష్ణదేవరాయల కాలంలో ఈ శైవ, వైష్ణవ బేధాలు తలెత్తితే హరిహరనాధుడి ఆలయం కట్టించినట్లు జానపద గాధల్లో ఉంది దానికి చారిత్రిక ఆధారం లేదు."

"అప్పటికే జైన మతం, ముస్లిం మతం బాగా వ్యాప్తి చెంది ఉన్నాయి. హిందువులు కలిసి కట్టుగా ఉంటారుకాని మళ్ళీ శైవం, వైష్ణవం అని కత్తులు దూసుకోరు..." ప్రొఫెసర్ జయరాం అన్నాడు.

"కర్నాటకలోని జానపదుల్లో శైవ, వైష్ణవ భావాలు ఉండేవి.... చెన్న బసవడు, వీరశైవం కర్నాటకలోనే బాగా రూపు దిద్దుకున్నాయి. శ్రీ కృష్ణ దేవరాయల కాలంలో కొన్ని అటవిక జాతుల్లో ఈ భావం బాగా ఉండేది. వాళ్ళ కోసం ఆ రోజుల్లో శ్రీ కృష్ణదేవరాయలు హరిహర దేవాలయం కట్టి ఉండాలి....

ఇది కేవలం నా ఊహ....వాస్తవం కాకపోవచ్చు" అంది ప్రియంవద....

"ఈ కాగితాలు చూస్తుంటే కొండల మధ్యలో ఎక్కడో హరిహర దేవాలయం కనుగుంటే...స్వర్ణ సింహాసనం ఎక్కడుందో తెల్సుకోవచ్చు."

"అయితే మనం ఎక్కడి నుండి బయల్దేరదామంటావు" అడిగాడు ప్రొఫెసర్ జయరాం....

"హంపి దగ్గర నుంచి బయల్దేరదాం... అక్కడకు దగ్గరలో ఉన్న కొండలు, పర్వతాలు సర్వే చేద్దాం..."

అయితే ఈ ఎక్స్‌పెడిషన్‌కు ఎవరెవర్ని తీసుకువెళ్తాం...." అన్నాడు ప్రొఫెసర్...

"అందరం వెళ్తాం....మనం ముగ్గురం మాత్రం హరిహరదేవాలయం వెతుకుదాం....మిగతా వాళ్ళు హంపి శిథిలాలు చూస్తూ ఆనందిస్తారు" అన్నాడు కపర్థి....

"ముందుగా మనం ముగ్గురం వెళ్ళి చేసేదేముంది.... అందరం ఆ కొండల్లో గుట్టల్లో వెతుకుదాం....సాయంకాలానికి హంపీకి వచ్చి మన మన డెవలప్‌మెంట్స్ చర్చించుకుందాం."

"ఇది బాగానే వుంది....మరి గ్రూప్‌లుగా వెళ్ళి వెతికేకంటే ఇద్దరు ఇద్దరు ఒక గ్రూప్‌గా కలసి వర్క్ చేస్తే బాగుంటుంది.... మీరే టీమ్స్‌ను డిసైడ్ చేయండి...." అన్నాడు కపర్థి.

"నేను, చంద్రహాస్ ఒక టీమ్....యశ్వంత్, ప్రియంవద....

"నో....నో.... మీ టీమింగ్ బాగాలేదు. మీకు చంద్రహాస్ అక్కర్లేదు.... మీ ప్రక్కన సులోచన, యశ్వంత్‌తో అక్షత....నేను ప్రియంవద చంద్రహాస్ ఒక్కడే ఒక టీమ్...."

"హీ ఈజ్ ఒన్‌మాన్ ఆర్మీ...." గర్వంగా అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

"మన ప్రయాణానికి కావల్సిన ఏర్పాట్లు చేయండి....మనకో కుక్, అతనికి ఇద్దరు అసిస్టెంట్స్....ఓ వ్యాన్.... నా కంటెస్సా కారు.... మనతో వర్క్‌స్పాట్‌లో అసిస్ట్ చెయ్యటానికి మరో యిద్దరు...."

"పెళ్ళికి వెళ్ళినట్లు అంతమంది ఎందుకు....స్పాట్ కనుక్కోవడానికి తర్వాత ఎక్సకవేషన్స్ చేసేటప్పుడు కుక్స్, అసిస్టెంట్స్ కావాలి.... యిప్పుడు అవన్నీ అనవసరం...." అన్నాడు ప్రొఫెసర్....

"సరే...అయితే...యివన్నీ రెండ్రోజుల్లో సిద్ధం చేయించండి,.." బయల్దేరదాం..." అన్నాడు కపర్థి.

ప్రియంవదకు నిద్ర వచ్చినట్లుంది. ఆమె కూడా లేచింది....

"ఎలా వుంది మన ప్లానింగ్...." అన్నాడు.

"బాగానే వుందిగాని....ఈ ప్రయాణంలో నాలుగు రైఫిల్స్....ఓ పది రివాల్వర్లు తీసుకురండి...." నవ్వుతూ అంది ప్రియంవద.

"అవన్నీ ఎందుకండి.... మనం వెళుతున్నది క్రైమ్స్‌కు కాదు గదా....సెర్చింగ్‌కు అవన్నీ ఎందుకు"

"కర్నాటక అడవుల్లో మాన్ ఈటర్స్ ఉంటాయి. అంతేకాకుండా యింకా భయంకరమైన క్రూరమృగాలు వుంటాయి. మన రక్షణ కోసం వాటిని ఉపయోగిస్తే మంచిది...." అంది ఆమె.

"ఫారెస్ట్ యాక్ట్ ప్రకారం జంతువుల్ని చంపడం నేరంకదా"

"ఆ విషయం వాటికి తెలీదుకదండి... మన దగ్గర ఏ ఆయుధం లేకపోతే అవే మనల్ని భోంచేస్తాయి...."

కపర్థికి ఆమె చెప్పిన సలహా కూడా బాగా నచ్చింది. దుర్గమారణ్యాలలో సంచరించేప్పుడు చేతిలో ఆయుధం ఉంటే మంచిది...

"కర్నాటక అడవుల్లో ఏనుగులు ఎక్కువ.... అవి వ్యాన్‌ను జీపులను ఒక్కోసారి నజ్జు నజ్జు చేస్తాయి... వాటిని భయపెట్టడానికైనా పనికి వస్తాయి...."

"సరే.... ఆ ఆయుధాల సంగతి నే చూస్తాను. మీరు ప్రయాణపు ఏర్పాట్లు చూడండి" అని కపర్థి లేచి నిలబడ్డాడు....

ప్రొఫెసర్ జయరాం తల ఎత్తి పైకి చూసాడు....

"గుడ్‌నైట్ మిష్టర్ కపర్థి....ఈ రాత్రి హాయిగా నిద్రపోండి ఉదయాన్నే కలుస్తాను" అన్నాడు.

"గుడ్‌నైట్...." అని అక్కడి నుంచి కదిలాడు కపర్ధి...

ప్రియంవద వెళ్ళిపోవటానికి లేచి నిలబడింది....

"ఈ రాత్రి,.. ఈ కాపర్‌షీట్స్‌లో వున్న ప్లానింగ్‌ని డీకోడ్ చెయ్యాలని నిశ్చయించుకున్నాను...అందుకే ఈ రాత్రి నిద్రపోను...." అన్నాడు ప్రొఫెసర్ జయరాం....

"అంకుల్...మీ ఆరోగ్యం బాలేదు...ప్లీజ్ నిద్రపోండి...." అంది ప్రియంవద...

"సారీ మై బేబీ....ప్లీజ్...." అన్నాడు. కాపర్‌షీట్స్ఆయన చేతిలో నుంచి లాగి ఆయన్ని మంచం మీద కూలేసి లైటు ఆర్పింది ప్రియంవద. "గుడ్‌నైట్ అంకుల్" అని తుర్రున ఆ క్రింద గదిలోకి పరుగెత్తింది.

## 6

కపర్థి వ్యాన్ ముందు నిలబడి వున్నాడు.

ప్రొఫెసర్ జయరాం వ్యాన్ లోపలకు సామాను చేరవేసే పని పర్యవేక్షిస్తున్నాడు. కపర్థి ప్రొఫెసర్ జయరాం దగ్గరకు వచ్చాడు.

"ప్రియంవదగారు చెప్పినట్లు అమ్యూనేషన్ లోపల పెట్టారా?" అడిగాడు.

"మనిషికో వెల్డర్ మిషన్ పిష్టల్.... ఓ నాలుగు డార్ట్‌గన్స్... ఎ. కె 47 కలెష్నికోవ్ రైఫిల్స్ ఓ నాలుగు వ్యాన్‌లో సర్దాను...

"ఫ్లేర్‌గన్స్ కూడా అరేంజి చేస్తే మంచిది...." కపర్థి అన్నాడు.

"స్లోబర్నింగ్ మెగ్నిషియం ఫ్లేర్స్ తెప్పించాను. కొండబిలం చీకట్లో మనకు ముందు ఏముందో చూట్టానికి అవి ఉపయోగపడతాయి."

ప్రొఫెసర్ జయరాం ఎక్స్‌పెడిషన్ విషయంలో అన్ని రకాలుగా, అన్ని కోణాలనుంచి ఆలోచించి కావలసినవన్నీ అరేంజ్ చేస్తాడు....

చంద్రహాస్ అక్కడికి వచ్చాడు. అతనిచేతిలో ఆటోమేటిక్ పొలరాయడ్ కెమేరా వుంది. స్నాప్స్ తీసిన వెంటనే వెనకనుంచి ఫోటో ప్రింట్ చేతిలో పడుతుంది.

"మనం ఎప్పుడు బయల్దేరు తున్నాం సార్" అడిగాడు

"ఈ వేళ సాయంకాలం ఆరుగంటలకు...."

"యింకా మనకు కావల్సినవి ఏమిటో లిస్ట్ చేయించు" ప్రొఫెసర్ జయరాం చంద్రహాస్ వంక తిరిగి అన్నాడు.

"ముఖ్యమైనది దిక్సూచి.... మనం ఒక చేత్తో మరోబ్యాచ్ కాండాక్ట్ చేసి ప్రజంట్ పొజిషన్ తెలియ పర్చటానికి ఫిఫ్టీ కిలోమీటర్స్ రేంజ్ గల వైర్ లెస్ సెట్లు....కొన్ని మెడిసిన్స్ కిట్ బ్యాగ్....యింకా మెటల్ డిటెక్టర్...."

"చంద్రహాస్ లాంటి అసిస్టెంట్ ఉండటం....నిజంగా మీ అదృష్టం...." అన్నాడు కపర్ధి.

ఇంతలో సులోచన అక్కడికి వచ్చింది...

"బాస్ మన ప్రయాణం ఎప్పుడు"

"సాయంకాలం...."

"ఈలోగా మనిద్దరం అలా సరదాగా ఓ సినిమాకువెళ్ళి వస్తే ఎలా ఉంటుంది."

"చాలా అసహ్యంగా...." అన్నాడు కపర్ధి....

"లేదు చాలా అద్భుతంగా ఉంటుంది ....ఏమంటారు అంకుల్" అంది ప్రొఫెసర్ జయరాం వంకచూసి ....

"ఏంవోయ్ కపర్ధి .... మీ సెక్రటరీ చెప్పినట్లు హాయిగా ఈ రోజు యిద్దరు కలసి సినిమా చూడండి .... రేపటినుంచి మీకు ఆ అవకాశం కూడా ఉండదు కదా."

"సినిమాలు చూసే వయస్సు దాటిపోయింది జయరాంగారు...."

"అప్పుడే వృద్ధులై పోయారా ?"

"ముసలితనం కాదు.... సినిమాలు చూసేంత చిన్నతనంలేదు...." ఇంతలో ప్రియంవద అక్కడికి వచ్చింది....

"ప్రయాణానికి ఏర్పాట్లు బాగా జరిగిపోతున్నాయి...."

"మేడమ్ ఈ వేళ సాయంకాలమే మన ప్రయాణం...."

"థాంక్‌గాడ్ ........ ఒకటి రెండు రోజులువుండి వెళ్ళి పోదాం అనుకున్నాను.... ఇంతలో ఈ ఎక్సపెడిషనా.... నేను సెలవు కూడా పెట్ట లేదు...." అంది ఆమె. నేషనల్ మ్యూజియం ఆఫ్ ఆర్కియాలజీడిపార్టు మెంట్‌లో ఆమె అసిస్టెంట్ డైరెక్టర్‌గా చేస్తుంది.

"మీ డైరెక్టర్‌గారికి వెంటనే ఫోన్‌చేసి ఓ నెల రోజులపాటు సిక్ లీవ్ పెట్టండి...." కపర్ది అన్నాడు....

"ఈ మధ్యే లీవ్స్ ఎక్కువ పెట్టానని ఆయనమండిపడుతున్నాడు"

"ఫర్లేదు.... నేను ఫోన్‌చేసి చెప్తానమ్మ ...." అని ప్రొఫెసర్ జయరాం అన్నాడు. ప్రొఫెసర్ జయరాంకు గవర్నమెంట్ ఆఫీషీ యల్స్‌లో మంచి పలుకుబడివుంది .... ఆర్కియాలజీ ప్రొఫెసర్ అయి నప్పటికి మ్యూజియంలో క్యూరేటర్స్ ఆయన సలహా సంప్రదింపులు తీసుకోకుండా ఏ పనిచేయరు........ ఎన్నో ఎక్సకవేషన్స్ జరిపి భారత దేశపు మ్యూజియమ్‌లలో ఎన్నో విలువైన వస్తువులు సమర్పించిన వ్యక్తి ప్రొఫెసర్ జయరాం.... ఆయనచెప్తే కాదనే వ్యక్తులు ఎవ్వరులేరు.... యశ్వంత్, అక్షత మాట్లాడుకుంటూ వచ్చారు....

"డాడీ.... ఈవేళే బయల్దేరుతున్నారా?"

"అవునమ్మా .... ఈవేళ సాయంత్రమే...." అని ఆమె వంక తిరిగి.

"హారీబుల్ డాడీ....ఆ కొండల్లో, అడవుల్లో నేను నడవలేను."

"నడవటం అలవాటు చేసుకుంటే !.... జీవితంలోని కష్టాలగుండా కూడా సులభంగా నడవగలవు...."

"మీతో వచ్చినా....నేను సెర్చింగ్‌కు వెళ్ళను" అంది అక్షత....

"నీయిష్టం.... కానీ.... నువ్వు మాత్రం రావాలి" అన్నాడు....

"ఏం యశ్వంత్.... చాలా లేట్‌గా వచ్చావేం ....చూడు ఇప్పుడు టైమ్ టెన్ "ఓ" క్లాక్ అయ్యింది...."

"సారీసర్.... ఈవేళ కొంచెం పని ఉండి బైటికివెళ్ళి వచ్చాను." అన్నాడు.

నథింగ్ ఎక్స్‌ప్లేనేషన్స్....యు మస్ట్ బి స్మార్టుఇన్ యువర్‌వర్క్"

"ఓకేసార్" అన్నాడు యశ్వంత్....

ఉదయాన్నే యశ్వంత్ యింట్లోనుంచి బైటికి ఎందుకు వెళ్లాడు. ఒక్కక్షణం ఆలోచించాడు ప్రొఫెసర్ జయరాం....

అంత ఉదయాన్నే అతనికి పని ఏమిటి ? పైగా యశ్వంత్‌కు ఈ ఊళ్లో మిత్రులు ఎవ్వరూలేరు. ఎక్సకవేషన్స్‌కు వచ్చిన దగ్గరనుంచి చంద్రహాస్, యశ్వంత్ తన యింట్లోనే ఉంటున్నారు. తన యిల్లు తప్ప అతనికి మరేం పని ఉంటుంది.

"సమ్‌థింగ్ ఫిషీ ఈజ్ గోయింగ్ ఆన్" అని మనస్సులో అనుకున్నాడు...

ఇంతలో టెంట్‌క్లాత్ మడిచి తలమీద పెట్టుకొని కుక్ వెంకటస్వామి వచ్చాడు.... దాన్ని వ్యాన్ పై భాగంలో పెట్టారు.

"టెంట్ ఎరేంజ్‌మెంట్స్ కూడా వున్నాయా" కపర్థి అన్నాడు.

"అంటే అయ్యగారికి హోటల్ రూమ్స్.... లేవనే అర్థం" సులోచన అంది.

"అయితే... మనస్పాట్ మార్చారన్నమాట—"

"హంపీ శిథిలాల మధ్య కాకుండా... పర్వత శిలల మధ్య... మన అన్వేషణ" అన్నాడు ప్రొఫెసరు జయరాం.

"ఏదీ ఏమైనా....దక్షిణ ధృవానికి చేరుకొనే యాత్రికుల్లాగాఉన్నాం మనం"

"కాదు ....శ్రీకృష్ణదేవరాయలు స్వర్ణ సింహాసనంకోసం వెతికే అన్వేషులం మనం" అంది సులోచన ....ఇంతలో చంద్రహాస్ వచ్చాడు.

"సార్— కర్నాటక అడవులలో భయంకరమైన పాములు కూడా ఉంటాయి. మనం యాంటీస్నేక్ వానమ్ మనతో తీసుకువెళితే మంచిది"

"అయ్యబాబోయ్ పాములా" భయంగా అంది సులోచన....

"మనం వెళ్లేచోటు బృందావన్ గార్డెన్స్‌కాదు.... కింగ్ కోబ్రా అతో తలపడాలి.... నీలాంటి పిరికివాళ్ళు దానికి పనికిరారు" అన్నాడు కపర్ది....

"ఏంటోయ్ కపర్ది.. ఆ అమ్మాయి ... నువ్వు .... ఎప్పుడుతెగ పోట్లాడుకుంటారు.... ఏమిటి కథ" నవ్వుతూ అన్నాడు .... ప్రొఫెసరు జయరాం.

కథేం లేదండి... ఆ అమ్మాయి నా సెక్రటరీ.... నేను ఆ అమ్మాయికి బాస్‌ను"

నిజ జీవితంలో కూడా బాస్‌నండి అంకుల్" నవ్వుతూ అంది సులోచన కొంటెగా కపర్దిని చూస్తూ.

"అయ్య బాబోయ్ ....... ఈ డెవిల్‌ను నేను భరించలేనండి బాస్‌గా...."

"యిలాంటి అమ్మాయి నీకు కోటి జన్మలెత్తిన దొరకదు కపర్ది....

"నాకొద్దండి.... ఆవిడ్ని నా ప్రక్కన తలుసుకుంటేనే ఒంటిమీద తేళ్ళు జెర్రులు పాకినట్లుంటుంది...." భయంభయంగా అన్నాడు కపర్ధి .... సులోచన వంకచూస్తూ.

"అలా అని చెప్పి నన్ను డిస్‌మిస్ చెయ్యరెందుకు.,." అంది సులోచన...

"నీలాంటి సెక్రటరీ... నాకు మరెక్కడా దొరకదు... అందుకని." అన్నాడు.

"మరే... అయితే లైఫ్ సెక్రటరీగా చేసుకోండి ..." సులోచన అంది.

"నాలైఫ్ సెక్రటరీ నువ్వైతే నా లైఫ్ రిస్కులో పడుతుంది..." అని ప్రొఫెసరు జయరాం వంక తిరిగి...

"నాకు అర్జంట్ పని వుంది... వస్తాను" అని ఆ వాతావరణంలో నుంచి బైటపడ్డానికి అక్కడినుంచి వెళ్ళిపోయాడు కపర్ధి, ప్రొఫెసర్ జయరాం వెళుతున్న కపర్ధిని చూసి ముసి ముసిగా నవ్వుకున్నాడు.

* * *

స్వామి పరమహంస ఆయన స్పెషల్ రూమ్‌లో ఉన్నాడు.

ఎదురుగా అమెరికానుంచి వచ్చిన భక్తుడు విన్సెంట్ అతని ముందు ఉన్నాడు....

"బౌద్ధ విగ్రహం కావాలని జపాన్ ఏజంట్....అడిగాడు.... మీరు బౌద్ధ విగ్రహాన్ని జపాన్ పంపాలి...."

"యస్....పంపుతాను....కానీ బౌద్ధ విగ్రహం కాస్ట్....అంటే దాని ఖరీదు....ఎంతో నీకు తెలుసా...." అతని కంఠం గంభీరంగా పల్కింది.

"చెప్పండి....వాటీజ్ ద కాస్ట్ ఆఫ్ బుద్ధ స్టాచ్యు...."

"టెన్ మిలియన్ డాలర్స్...." అతని వంక చూస్తూ అన్నాడు స్వామి పరమహంస....

"ఓ.కే....స్వామిజీ.... టెన్ మిలియన్ డాలర్స్‌కు ఓ.కే...."

"మనీట్రాన్ సాంక్షన్....యిన్ డైమండ్స్...."

"ఓ.కే....„

"మరో ట్రాన్‌సాంక్షన్...."

"ఏమిటి...." అడిగాడు విన్సెంట్....

"గోల్డెన్ థ్రోన్.... 1500 ఏ. డి. లో తయారైన రేర్ గోల్డెన్ థ్రోన్...."

"గోల్డెన్ థ్రోన్...." ఆశ్చర్యంగా చూసాడు విన్సెంట్....

"యస్....విజయనగర డైనాస్టీ....కి చెందిన....గోల్డెన్‌థ్రోన్...."

"దాని స్పెసిమన్ ఫోటోగ్రాఫ్ ఉందా మీ దగ్గర" అడిగాడు విన్సెంట్.

"లేదు....కాని త్వరలో పంపుతాను. నౌ ఇటీజ్ అండర్ ఎక్స్‌పెడిషన్"

"ఐ విల్ కాంటాక్ట్....ద పార్టీ" అన్నాడు విన్సెంట్....

"నౌ యు కెన్ గో"

విన్సెంట్ లేచి భక్తిగా నమస్కరించి బైటికి వెళ్ళాడు....

మరుక్షణం అతని దగ్గర ఉన్న వైర్‌లెస్ మ్రోగింది.

చటుక్కున వైర్‌లెస్ తీసాడు.

"దిసీజ్....గురుస్వామి....స్పీకింగ్"

"నేను ఏజంట్ వైనుసార్...." అవతలివైపునుంచి పల్కింది కంఠం.

"కర్నాటక చేరుకున్నాం.... ఎక్స్‌పెడిషన్ స్టార్ట్ అయ్యింది" అన్నాడు ఆవతల వ్యక్తి....

"ఓ.కే....కర్నాటకలో మన కాళీచరణ్ ఉన్నాడు. ఏ వి..
అతన్ని కాంటాక్ట్ చెయ్యి" గంభీరంగా పల్కింది స్వామి పరమ..
కంఠం....

"అది కాదు....కపర్థి.... ఈ ఎక్స్పెడిషన్‌లో పాల్గొంటున్నాడు. మీరు అతన్ని రీమూవ్ చెయ్యలేదు...." అవతలి కంఠంలో ఆదుర్దా....

"అతన్ని రీ మూవ్ చేస్తాను. నువ్వేం భయపడకు. నువ్వు పంపిన జిరాక్స్ కాపీస్ అసంపూర్ణంగా ఉన్నాయి. దాన్లో ప్లానింగ్ కాగితంలేదు"

"సారీ బాస్....మిస్సయ్యాను...."

"ఇప్పుడు నాకు అర్జంటుగా ఆ కాపీస్ కావాలి.... ఫారిన్‌పార్టీస్‌కు స్పెస్‌మన్స్ కావాలి...."

"అవి....ప్రొఫెసర్ జయరాం దగ్గరగాని, అతని శిష్యుడిదగ్గిరగాని, కపర్థి దగ్గరగాని ఉంటాయి బాస్"

"ఓ. కే....నేను కాళీచరణ్ ద్వారా.... ఆ స్పెసిమన్స్ సంపాదిస్తాను....ఇంతకీ మీరు దిగిన లొకేషన్ ఎక్కడా ? " అడిగాడు స్వామి పరమహంస.

చెప్పాడు ఏజంట్ వై....

"ఓ.కే....వెంటనే కాళీచరణ్ రంగంలోకి దిగుతాడు.... ఎలాగైనా స్పెసిమన్స్ సంపాదిస్తాడు...."

"కపర్థిని రీ మూవ్ చెయ్యండి బాస్" అవతలివైపునుంచి ఏజంట్ వై అన్నాడు.

"ఓ....కే....ఇట్ విల్‌బి డన్...."

పరమహంస వైర్‌లెస్ ఆఫ్ చేసాడు.

చాలా జాగ్రత్తగా కొన్ని సంవత్సరాల ముందే ప్రొఫెసర్ జయరామ్ దగ్గర తన అనుచరుడ్ని ప్లాంట్ చేసాడు....అతనివల్ల ఎన్నో మ్యూజియంలలోని విగ్రహాల గురించి తెలిసింది. తాము వాటిని దొంగి

లించారు కూడా! చిన్నగా నవ్వుకున్నాడు స్వామిజీ....కానీ ఎవ్వరికీ ఏజంట్ వై ఎవ్వరో కూడా తెలియదు.

## 6

ఎదురుగా విస్తరించి ఉన్న అడవిని, అడవిని ఆనుకొని వున్న కొండల వరసను తదేక దీక్షగా చూసాడు ప్రొఫెసర్ జయరాం. అతని సిక్త్ సెన్స్ ఆ కొండల్లోనే స్వర్ణసింహాసనాన్ని తన గర్భంలో దాచుకున్న కొండ వుందని అన్పించింది....అడవి ప్రారంభమయ్యే ప్రదేశంలో ఓ చదునైన ప్రదేశంలో గుడారాలు వేసారు....మొత్తం మూడు గుడారాలు ఒకటి మగవాళ్ళకు, రెండోది ఆడవాళ్ళకు, మూడోది పనివాళ్ళకు.... హంపిలో విడిది చేద్దామని ముందు ప్రపోజల్ పెట్టినా ఎవ్వరు అందుకు ఒప్పుకోలేదు. అందరికి స్వర్ణ సింహాసనం అన్వేషణ ఓ ఉత్తేజాన్ని, ఓ స్ఫూర్తిని కలిగించింది.

కుక్ వెంకటస్వామి వంటచేస్తున్నాడు....

పొగ గాలికి గింగరాలు గింగరాలు తిరుగుతూ కొట్టుకుపోతుంది. కట్టెల పొయ్యిమీద పెట్టిన డేగిసాలో మాంసం పులుసు ఉడుకుతుంది.... అడవిలోకి రాగానే మూడు కుందేళ్ళను కొట్టుకొచ్చాడు కపర్ధి.... వేటలో అతనికి మంచి నైపుణ్యం ఉంది.

ఓ ప్రక్క జంపఖానా పరచి పేకాట ఆడుతున్నారు ప్రియంవద కపర్ధి, చంద్రహాస్, సులోచన....అక్షత దూరంగా చెట్టుదగ్గర నిలబడి యశ్వంత్‌తో మాట్లాడుతుంది.

ఆ దృశ్యం ఎందుకో అసహజంగా కన్పించింది ప్రొఫెసర్ జయ రాంకు....యశ్వంత్ ఏదో చెప్తున్నాడు. అక్షిత నవ్వుతుంది....

"డీల్ షో...." కపర్ధి పేకముక్కలు పరిచి విజయ గర్వంతో చూశాడు.

"నాది ఫుల్ కౌంట్.... నాకు ఆటచేత కాకపోయినా.... అన్నీడీల్సే పడతాయి" ఉక్రోషంగా అంది సులోచన....

"నీ కేసు ఎప్పుడు ఫుల్‌కౌంట్ అని నాకు తెలుసు."

"ఎప్పటికైనా నీ మీద డబల్ డీల్ షో కొడతాను ఛాలెంజ్"అంది సులోచన.

"రేపటికి రాజెవరో, రంగడెవరో ఎవ్వరికి తెలుసు" అంటున్నాడు కపర్ది...

"కపర్ధిగారితో కౌంట్ అయిన ఆనందంగానే ఉంటుంది...." ప్రియంవద నవ్వుతూ అంది...

"ఓటమిని కూడా అలా స్పోర్టివ్‌గా తీసుకోవాలి మైడియర్ సెక్రటరీ"

"నేను స్పోర్టివ్‌గానే తీసుకొన్నాను .."సులోచన కొంటెగా అంది.

"అసలు కావాలనే నేను కౌంట్ యిచ్చాను" నోట్లో హాండ్ ఖర్చీఫ్ కొసను పంటి మధ్య లాగుతూ కొంటెగా అంది.

"నాకు కావాలని ఏమీ నువ్వు యివ్వొద్దు మహాతల్లి........ నేనే తీసుకోగల్ను."

"నువ్వు తీసుకోవటంలేదనే నేను యిస్తున్నాను." ఆ మాటకు అందరూ ఫక్కున నవ్వారు.

ప్రొఫెసర్ జయరాం స్పెన్సర్స్ చుట్టతీసి పెదవుల మధ్యబిగించి లైటర్‌తో వెలిగించాడు. ఆ స్పెన్సర్స్ చుట్టనుంచి వచ్చే "యారోమా"ను తన్మయంగా పీల్చి ఎదురుగావున్న మౌంటేన్ రేంజ్ వంక చూసాడు. ఎక్కడనుండో ప్రారంభమై చాలాదూరం వ్యాపించివుంది మౌంటేన్ రేంజ్ .... శ్రీశైలం కొండల వరసకు తిరుపతి కొండల వరస వరకు వ్యాపించి వుంది అంటారు.... ఈ మౌంటిన్ రేంజ్ వింధ్య పర్వతాల వరకు వ్యాపించి ఉందా?...

అలా ఉంటే శ్రీకృష్ణదేవరాయలు స్వర్ణ సింహాసనం ఏ కొండ గర్భంలో తయారు చేయించాడు.

ఎండకు విచిత్రంగా కన్పించాయి కొండలు... గోధుమవన్నె రంగు మట్టితో... కొండలనిండా చిన్న చిన్న చెట్లతో కొన్ని కొండలు పచ్చగా వున్నాయి. మరికొన్ని కొండలు - కేవలం చెట్టు పుట్ట లేకుండా "బేర్"గా ఉన్నాయి. వాటిల్లో ఏ కొండ!

"ఈసారి కూడా నాది డీల్ షో...ఆనందంగా అరుస్తున్నాడు కపర్ది. తలతిప్పి వాళ్ళ వంక చూసాడు ప్రొఫెసర్ జయరాం... కపర్ధిలో చిలిపితనంవుంది. గంభీరత్వం ఉంది. చాలా విచిత్రమైన వ్యక్తి... సజ్జక్తులో అఖండుడు. ధైర్యసాహసాల్లో అతని కతనేసాటి... అందుకే అతన్ని ఈ ఎక్స్‌పెడిషన్ లో ఎన్నుకున్నాడు.

అంతే కాకుండా "ఈ ఎక్స్‌పెడిషన్" కావలసిన ఆర్థిక సహాయం కూడా చేయగల వ్యక్తి.

"ఏంసార్.... అలా ఒంటిపిల్లి రాకాసిలా ఎంతసేవు తిరుగుతారు మా దగ్గరకు రాకూడదు." కపర్ధి అన్నాడు...

"మీ ఆట మీరు ఆడుకోండి...." అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

"ఎంత ఆట ఆడుకున్న ఈ వేళే కదండి.,. రేపటి నుంచి ఈ బ్యాచ్‌లో అడవుల్లో కొండల్లోపడి వెతకాలి.. కనీసం యిప్పుడైనా సుఖపడనీయండి..." అన్నాడు కపర్ధి పేక ముక్కలు కలుపుతూ... ఇంతలో కుక్ వెంకటస్వామి వచ్చాడు.

"సార్ వంటైపోయింది సార్... వడ్డించమంటారా?" అన్నాడు కపర్ధి వంకచూసి.

"ఈ చివర ఆట ఆడేసి వస్తాము... ఈలోగా నువ్వు... అన్నీ అరేంజ్‌మెంట్స్ చెయ్యి."

యశ్వంత్... అక్షిత మెల్లగా నడచి వచ్చారు .... ఓ వ్యాన్... కంటెస్సాకారు గుడారాల వెనకఉన్నాయి. ప్రొఫెసర్ జయరాం ఘాట్స్‌లో తిరగటానికి జీప్ కూడా తెద్దామనుకున్నాడు. కాని ఆఖరి నిమిషంలో అది డ్రాప్ అయ్యింది.

"అమ్మ ఇప్పుడు వరకు మీరేం మాట్లాడుకున్నారు."

"సల్మాన్ ఖాన్ సినిమాల గురించి మాట్లాడుకున్నాం..."

"సల్మాన్ ఖాన్ తప్ప... మరెవ్వరు దొరకలేదా... మాట్లాడుకోటానికి."

కపర్ది వాళ్ళవంక చూసి అన్నాడు.

"మరింకెవ్వరు గురించి మాట్లాడ మంటారు" అక్షిత ఆయన వంకచూసి అంది.

"టుటంఖాన్ గురించి మాట్లాడుకుంటే బాగుండేది."

"ఆయనెవరు" అంది అక్షిత.

"క్రీ. పూ. 2000 సం॥ క్రితం ఈజిప్టునేలిన అందమైన రాజు పద్దెనిమిదేళ్ళకే చచ్చిపోయాడు. . మీ సల్మాన్ ఖాన్ కన్నా అందగాడు."

"చచ్చిపోయిన వాళ్ళను ప్రేమించమంటారేమిటి? బ్రతికున్నవాళ్ళను వదిలేసి" అంది సులోచన....

"నువ్వు ఎవర్నన్న బ్రతికున్నవాడ్ని ప్రేమిస్తే వాడు ఢాం మని చచ్చి ఊరుకుంటాడు" అన్నాడు సులోచనను చూస్తూ కపర్థి.

అందరు పకపకనవ్వారు. ప్రియంవద పడిపడినవ్వింది. కపర్థి మాటకు....

"ఇదిగో నా ఆట అయిపోయింది" కార్డ్స్ ముందు పెట్టింది సులోచన....

"నిల్ కౌంట్" యూస్పేట్ రెండు విసిరేస్తూ అన్నాడు కపర్థి....

"డిటో నేను" ప్రియంవద కార్డ్స్ క్రింద పడేస్తూ అంది.

"పది కౌంట్" అన్నాడు చంద్రహాస.

"గెల్చినా మా దగ్గర కౌంట్ సాధించలేకపోయావా....యువ్వార్ అన్‌ఫార్చునేట్ యంగ్ గర్ల్‌వి...."

కోపంతో ముక్కుపుటాలు ఎగరేసి కార్డ్స్ చిందరవందర చేసి లేచి నిలబడింది సులోచన.

"ఆడవా?" అడిగాడు కపర్ది.

"భోజనానికి వెళ్దాం పద" అని గబగబ అక్కడినుంచి కదిలింది.

కుక్ వెంకటస్వామి అప్పటికే చాపలు పరచి పింగాణీ ప్లేట్లలలో భోజనం సిద్ధం చేసాడు.

"అందరూ....భోజనానికి....రండి...." అని వెళ్ళి చాపమీద కూర్చున్నాడు కపర్ది....

అతనికి ఎదురుగా ఉన్న చాపమీద సులోచన కూర్చుంది ముఖం ముడుచుకొని. ఆమె ముఖంవైపు చూసి చిన్నగా నవ్వాడు కపర్ది....

"ఏమిటి సులోచనకు మూడ్ ఆఫ్ అయినట్లుంది" అని ప్రొఫెసర్ జయరాం వచ్చాడు....

"గంటలో ముప్పైసార్లు ఆమెకు మూడు మారుతుంది లెండి" అన్నాడు కపర్ది....

కుక్ వెంకటస్వామి....మటన్ సర్వ్ చేసాడు.

ఒక్క ప్రియంవద తప్ప మిగతావాళ్ళు మటన్ తిన్నారు.

"మీరు వెజిటేరియానా...." అన్నాడు చంద్రహాస్ ఆమె వంక చూసి....

"అవును...." అంది ప్రియంవద.

అందరూ మౌనంగా భోజనాలు చేసారు.

భోజనాలు కాగానే అందరూ విశ్రాంతి తీసుకున్నారు....

ప్రొఫెసర్ జయరాం తీవ్రంగా ఆలోచించటం ప్రారంభించాడు.

హరిహరుల దేవాలయం కనుక్కుంటే స్వర్ణ సింహాసనాన్ని కను క్కోటానికి మార్గం దొరికినట్లే!

ఏ పాత సమాధిలో దొరికిన రాగిరేకుల ఆధారంగా ఈ అన్వేషణకు పూనుకున్నాడు...

నిజంగా శ్రీ కృష్ణదేవరాయలు సింహాసనం ఉందా?

చరిత్రకే తెలియని సింహాసనం కోసం తాము అన్వేషిస్తున్నామంటే నలుగురు నవ్వరా!....ఇదంతా అర్ధంలేని వ్యర్ధ అన్వేషణగానే మిగిలి పోతుందా?....

ఆయన తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

కాని ప్రపంచ చరిత్రలోనే యిలాంటి చిన్నచిన్న ఆధారాల్తోనే గొప్ప సంపదను వెలికి తీసిన సాహసవంతులున్నారు.

తాము కూడా చరిత్ర స్పర్శించిన కోణాన్ని వెతకి యిప్పటివరకు ఓ ఊహగా ఉన్న శ్రీ కృష్ణదేవరాయలు సింహాసనాన్ని వెలికితీస్తారా"... ఏమో!

భవిష్యత్తు ఎలా వుందో!

తమ 'ఎక్స్‌పెడిషన్' విజయవంతమైతే....చరిత్రకు కొత్త పాఠాలు చెప్పిన వాళ్ళు అవుతారు....

లేకుంటే చరిత్ర చరిత్రలాగానే ఉండిపోతుంది!

తమ డబ్బు, శ్రమ, అన్వేషణ వృధా అవుతాయి....

కానీ అలా ఆలోచిస్తున్న ప్రొఫెసర్ జయరాంకు తెలియదు.... తమ అన్వేషణ విజయవంతమైన చరిత్ర అలాగే ఉంటుందని....

# 7

చంద్రహాస్, ప్రియంవద కొండల్లో నడిచి వెళుతున్నారు....

చంద్రహాస్ భుజానికో బ్యాగ్ వుంది... బ్యాగ్‌లో మినీవైర్‌లెస్ సెట్ ఓ కత్తి యింకా కొన్ని పరికరాలున్నాయి. అతని జేబులో వెల్డర్ మిషన్ పిస్టల్ ఉంది...

ప్రియంవదకు కొండల్లో ప్రయాణించటం బొత్తిగా అనుభవంలేదు. చంద్రహాస్ అంత వేగంగా నడవలేక పోతుంది.

ఆ రోజు ఉదయం- ప్రొఫెసర్ జయరాం అందర్నీ నాలుగు బ్యాచ్ లుగా విడదీసాడు.

చంద్రహాస్-అక్షత

కపర్థి-ప్రియంవద

యశ్వంత్-సులోచన

తానొక్కడే ఒక బ్యాచ్‌గా అడవుల్లో వెతుకుదామనుకున్నారు.

"నేను కపర్థితోనే వెళ్తాను....మరొకళ్ళతో రాను...." అంది సులోచన

"ఏం....నాతోనే రావాలని పట్టుదల ఏమిటి?"

"నేను మీ పర్సనల్ సెక్రటరీ....అన్ని వేళలా మీ ప్రక్కనే ఉండాలి" అంది సులోచన.

"అయితే నేను చంద్రహాస్ బయల్దేరతాము" అన్నది ప్రియంవద.

"నేను అక్షత యిద్దరం కలిసి బయలదేరుతాం" అన్నాడు యశ్వంత్

ప్రొఫెసర్ జయరాం అందుకు అభ్యంతరం చెప్పలేదు....

కొండల్లోకి రెండు బ్యాచ్‌లను పంపించాడు.

యశ్వంత్-అక్షత, చంద్రహాస్ ప్రియంవద

అడవిలో వెతకటానికి కపర్ధి- సులోచన....

మరో దిక్కుగా తాను బయల్దేరాడు...

సాయంత్రం ఠంచనుగా ఆరుగంటలకల్లా గుడారం దగ్గరకు రావాలని చెప్పాడు ప్రొఫెసర్ జయరాం....

ఎవరు ఏది కనుక్కున్నా....ముందుగా వైర్‌లెస్‌లో మిగతావాళ్ళకు తెలియ పర్చాలని....అలాగే....ప్రమాదంలో చిక్కుకున్నా తెలియపర్చాలని చెప్పాడు....

ఉదయం ఏడుగంటలకల్లా అందరూ సెర్చింగ్‌కు బయలుదేరారు. సెర్చింగ్ ముఖ్యోద్దేశం ఒకటే!

హరిహరదేవాలయం కనుక్కోవటం!

ఆ కొండల కోనల్లో సూది కోసం వెతకటం ఎంత కష్టమో ఆ ఆలయం కోసం వెతకడం అంతే కష్టమని ప్రొఫెసరు జయరాంకు తెలుసు.

సాహసికుడెప్పుడు ఛాలెంజ్ చేసే ఆశయాన్నే ఎప్పుడు ఎన్నుకుంటాడు....

నడుస్తున్న ప్రియంవద కాల్లో కసిక్కున ఓ ముల్లు గుచ్చుకుంది. "అమ్మా" అని అరిచింది.

"ఏం జరిగింది" అన్నాడు చంద్రహాస్....

"ముల్లు....గుచ్చుకుంది" అంది ప్రియంవద.

బ్యాగ్ క్రింద పడేసి ఆమె అరిపాదం అందుకున్నాడు చంద్రహాస్.

రోజా వర్ణంతో ఆమె అరిపాదం కందిపోయి వుంది...

చెప్పులో నుంచి దూసుకువచ్చినా తుమ్మ ముల్లు అరిపాదంలో విరిగింది. ప్రక్కనే ఉన్న మరో ముల్లును తీసి జాగ్రత్తగా ఆమె పాదంలో గుచ్చుకున్న ముల్లు తీసాడు....అంతవరకు సిగ్గుపడుతునే ఉంది ప్రియంవద. ముల్లు తీసేసి, చెప్పులో నుంచి ముల్లు లాగేసి చెప్పు ఆమె కాలికి తొడిగాడు.

"ఈ కొండల్లో చాలా జాగ్రత్తగా నడవాలి" అన్నాడు చంద్రహాస్.

"థాంక్స్" అంది ప్రియంవద.

ఇద్దరూ మళ్ళా నడక ప్రారంభించారు.

"ఇంత సున్నితంగా ఉండేవాళ్ళు ఈ 'ఎక్స్‌పెడిషన్'కు ఎందుకు ఒప్పుకున్నారు."

"నాకు యిలాంటి ఎడ్వెంచర్స్ ఎక్స్‌పెడిషన్స్ అంటే యిష్టం. అవకాశం వచ్చింది కాబట్టి దీన్లో పాల్గొన్నాను, చిన్నగా నవ్వుతూ అంది ప్రియంవద....

"ఇంతకు ముందు కూడా మీరు ఎన్నో పరిశోధనలు చేసారట" అన్నాడు చంద్రహాస్.

"అవన్నీ....ఎక్సకవేషన్స్....దాన్లో యిలాంటి అడ్వెంచరస్ స్పిరిట్ ఉండదుగదండి...." అంది....

"సాహసాల కోసం....కొండల్లోకి వచ్చి పడ్డారు...." నవ్వుతూ అన్నాడు.

సాహసాలు చెయ్యాలంటే కొండల్లోనో, సముద్రాల్లోనో, మంచు పర్వతాల్లోనో చెయ్యాలికదండి....నేను....యిలా సాహసం చేసాను." అంది ప్రియంవద.

ప్రియంవద అందమైన స్త్రీ.

ఐదు అడుగుల ఎత్తు ఉండే స్త్రీ....చక్కని కనుముక్కుతీరు, కోల ముఖం....నవ్వినప్పుడు గుంటలుపడే బుగ్గలు, చాలా అందంగా ఉంటుంది. అలాంటి అందమైన అమ్మాయి ఓ మ్యూజియానికి అసిస్టెంట్ డైరెక్టరుగా పనిచేస్తుంది అంటే నమ్మలేకపోయాడు చంద్రహాస్.

ప్రియంవద ఇప్పుడు హుషారుగా నడుస్తుంది ఆమె భుజానికి వాటర్ బాటిల్ బాస్కెట్‌లో యిద్దరికి కావాల్సిన ఆహార పదార్థాలు ఉన్నాయి....

"ప్రొఫెసర్‌గారు చాలా తెలివైనవారు"

"ఎందుకని" అన్నాడు చంద్రహాస్.

"ఇద్దరు మగవాళ్ళుగాని, యిద్దరు ఆడవాళ్ళుగాని కలిసి అన్వేషణకు వెళితే బోర్ కొడుతుంది అని చెప్పి....ఆడ, మగ, యిద్దర్ని కలిపి ఒకో బ్యాచ్‌గా చేసారు. అందుకని"

"మీరన్నదీ నిజమే.... జపాన్‌లో ఓ సర్వే ప్రకారం తేలింది ఏమిటంటే ఆఫీసుల్లో వర్క్‌షాపుల్లో పనిచేసే మగవాళ్ళు, వాళ్ళతోపాటు ఆడవాళ్ళు కూడా కలిసి పనిచెయ్యటం వల్ల పని తేలిగ్గా, ఉత్పత్తి అధికంగా ఉందని రిపోర్టు వచ్చిందట...."

చిన్నగా నవ్వుతూ అన్నాడు చంద్రహాస్....

కొండ అంతా చిన్న చెట్లతో నిండి వుంది....కొండను అనుకొని మరో కొండ....అంతా పచ్చగా ఉంది....

ముందుకు నడుస్తున్న ప్రియంవద ఒక్కసారిగా కెవ్వున కేక వేసి చటుక్కున చంద్రహాస్‌ను కౌగలించుకుంది.

చంద్రహాస్ ఒక్కసారిగా ఉక్కిరిబిక్కిరయ్యాడు.

ఆమె శరీరానికున్న యింటిమేట్ సెంట్ అతన్ని మత్తుగా ఆవరించుకుంది.

"ఏమిటి....ఏం జరిగింది" అన్నాడు....

తలతిప్పకుండా వేలుపెట్టి చూపిస్తూ....

"అక్కడ....అక్కడ...." అంది....

ఆమె వేలు పెట్టిన వైపు చూసాడు చంద్రహాస్....

ఒక్కసారిగా అతను వణికిపోయాడు....

ఎదురుగా ఓ గుంటలో నాలుగైదు పాములు ఒకదానిమీద ఒకటి మెలికలు వేసుకొని మత్తుగా కదులుతున్నాయి. తాను మరొక అడుగువేసి ఉంటే కాలు ఖచ్చితంగా ఆ పాముల మీద పడేది....

అవి మామూలు పాములు కాదు....కాటు వేస్తే వెంటనే కాటందే కింగ్‌కోబ్రాలు....

వాటి పచ్చని శరీరం చ్ఛాయ చూడగానే అతని ఒళ్ళు జలదరించింది. ఆమె భుజం మీద చేయి వేసి, మరో ప్రక్కకు నడిచారు ఇద్దరు, వాళ్ళు కదలగానే ఓ గులకరాయి కదిలి గుంటలో పడింది. ఓ పాము "బుస్"మని లేచింది....అప్పుడే ఏదో ఆహారం తిన్నట్లు ఉన్నాయి.... వాటిలో అంత చైతన్యం లేదు....అవి అటుయిటూ చూసే లోపల యిద్దరు దాని దృష్టి పథంలో నుంచి తప్పించుకున్నారు.

భయంగా ఒక్కసారి ఊపిరి పీల్చుకుంది ప్రియంవద. అప్పటి వరకు చంద్రహాస్‌ను భయంతో అల్లుకుపోయాననే సంగతి ఆమె మర్చిపోయింది. ప్రమాదంలో నుంచి బైటపడగానే ఒక్కసారి సిగ్గుపడింది....

"థాంక్స్" అంది....

ఆమె పరిమళం, ఆమె చేతుల మెత్తదనం మరోసారి జ్ఞాపకం తెచ్చుకుంటూ చిన్నగా నవ్వుకున్నాడు చంద్రహాస్....

"ఈ అడవి అంతా....అడుగడుగునా ప్రమాదాలమయం అని ప్రొఫెసర్‌గారు చెప్పారు....

"పాముల చూసిన భయంలో మీరు అడవికి కొండకు తేడా మర్చిపోయినట్లున్నారు. మనం ఉన్నదీ కొండ...." అంది ప్రియంవద.

"కొండైనా....ఈ కొండమీద అడవి పెరిగే ఉంది కదా...." అన్నాడు....

"యింకా మనం ఎంత దూరం నడవాలంటారు...."

"హరిహర ఆలయం కన్పించేవరకు నడవాలి...." అన్నాడు చంద్రహాస్....

"అమ్మో నేను నడవలేనండి....కూర్చుంటాను" అని ఓ రాయిమీద కూలబడింది ప్రియంవద....,

కొండలు ఎక్కటం అలవాటు లేకపోవటంవల్ల ఆమె శరీరమంతా చెమట పట్టింది.... చంద్రహాస్‌కు కూడా ఒళ్ళంతా చెమట....

సూర్యుడు తీక్షణంగా ప్రకాశిస్తున్నాడు.

చంద్రహాస్ టైమ్ చూసుకున్నాడు,పది గంటలవుతుంది.

ప్రియంవద వాటర్ క్యాన్‌లో నీళ్ళు తాగుతుంది....

తను తాగి చంద్రహాస్‌కు ఇచ్చింది.... చంద్రహాస్ నీళ్ళుతాగాడు, అతనికి కొంత ఊరటగా ఉంది....

సరిగ్గా అదే సమయంలో.

కపర్ది - సులోచన అడవిలో వెతుకుతున్నారు.

"ఈ అడవిలో మనకు హరిహరనాధుడి ఆలయం దొరుకుతుందంటారా ?" అడిగింది సులోచన.

"మనిషి తన కర్తవ్యం చెయ్యటం వరకే బాధ్యత,దాని బాగోగులు భగవంతుడు చూసుకుంటాడు."

"మీరు వేదాంతం చెప్తున్నారు...." అంది సులోచన.

"తెలియకపోతే అది వేదాంతం, తెలిస్తే సిద్ధాంతం అవుతుంది."

"అందరికి తెలిస్తే అది రాద్ధాంతం అవుతుంది."

"ఏమిటి ఈ రోజు నువ్వు నావెంటబడ్డావ్" అడిగాడు కపర్ధి.

"ప్రతిరోజు మీ వెంటే కదా.... నేను పడేది.... ఈవేళ ప్రత్యేకత ఏముంది...."

"అదే.... కనీసం ఈ రోజైన నీ బారినుంచి తప్పించుకుందామనుకున్నాను."

"ఈ జీవితంలోనే తప్పించుకోలేరు...." కొంటెగా అతని వంక చూసి అన్నది....

"అమ్మో.... నిన్ను ఈ జీవితమంతా సెక్రటరీగా ఉంచుకోవటం అంటే నాకు భయం."

ఇంతలో దూరంగా అడవిలో కట్టెలు విరుగుతున్న శబ్దాలు విని పించాయ్.

"ఏమిటిది...." అడిగింది సులోచన.

"ఈ కర్నాటక అరణ్యంలో ఏనుగులు ఎక్కువగా ఉంటాయి.... ఏనుగులు వస్తూ ఉంటే వాటి దారిలో ఉన్నయి సమస్తం ధ్వంసం." వాళ్ళ మాటలు పూర్తి కాలేదు.

ఫెళఫెళమని చెట్లు విరుగుతున్న చప్పుడు.

చటుక్కున సులోచన కపర్ది చెయ్యి పట్టుకుంది భయంతో....

ముందుగా ఏనుగులు ఘీంకారాలు వినిపించాయి.

గడ గడ వణకి పోయింది సులోచన....

"ఏనుగులు గుంపుగా బయలుదేరతాయి .... నా ఉద్దేశం కరెక్టు అయితే అవి ఏ సరోవరం దగ్గరకో వెళ్ళుతుండాలి.... అంటే ఈ అడవికి దగ్గరిలో ఏదో సరోవరం ఉండాలి" అన్నాడు కపర్ది .... వాళ్ళకు పది గజాల దూరంలో ఏనుగులు అడ్డంగా వెళుతున్నాయి. సుమారు పది పన్నెండు ఏనుగులు ఉన్నాయి, చిన్నా పెద్ద కలిపి, అవి కపర్ది సులోచనల వైపు రావటంలేదు మరో దిక్కుగా వెళుతున్నాయి. అవి వెళ్లేవరకు ఆగి ఇద్దరు బయలుదేరారు.

"అనుక్షణం ప్రమాదాలతో ఉండే అన్వేషణ నీకెలా ఉంటుంది." కపర్ది అడిగాడు.

"నువ్వు ప్రక్కన ఉంటే.... ప్రమాదాలన్ని నాకు ప్రమోదంగానే ఉంటాయి." అంది సులోచన....

"ఓవైపునుంచి భయంకరమైన గర్జన వినిపించింది....

"ఏమిటది...."

"ఈ అభయారణ్యంలో పులులు, ఏనుగులు, ఇంకా అనేక రకాల క్రూర మృగాలున్నాయి" అన్నాడు కపర్ది.

"ఇంకా ఈ కాలంలో కూడానా !"

"పులుల్ని, సింహాల్ని వేటగాళ్ళు చంపేస్తున్నారనిచెప్పి, భారత ప్రభుత్వం పులుల్ని, సింహాల్ని చంపటం నేరం అని చట్టం చేసింది.... పులులు, సింహాలు నశించి పోకుండా వాటిసంతతిని కాపాడుతూవుంది...." కాబట్టి ఈ అడవిలో పులులేకాదు సింహాలు కూడా ఉంటాయి." అన్నాడు కపర్ది.

"అమ్మో...." రెండు చేతులు గుండెలమీద వేసుకుంటూభయంగా అంది సులోచన.

"అవును మరి.... అడవంటే మజాకానా. మరేవన్నా" అన్నాడు. మళ్ళీ మరోసారి గర్జించింది పులి....

అంత దగ్గరగా ఆ గర్జన వినేసరికి చటుక్కున కపర్ధికి అతుక్కుపోయింది సులోచన. కపర్ది జేబులోనుంచి "మాగ్నం పెరాంబులం" బైటికి తీశాడు.

సరిగ్గా అదే సమయంలో

యశ్వంత్ అక్షత యిద్దరు కలసి నడుస్తున్నారు.

యశ్వంత్ మెల్లగా నడుస్తున్నాడు. అక్షత వేగంగా నడుస్తుంది...

"అక్షత.... అక్షత.... మెల్లగానడు" అన్నాడు యశ్వంత్....

"మగాడివైయుండి నువ్వు అంత మెల్లగా నడుస్తా వేమిటి యశ్వత్...." అంది....

"మెల్లగా నడిచినా, వేగంగా నడచినా ఫలితం ఒక్కటే.... మనకు ఆ గుడి కన్పించదు" అన్నాడు యశ్వంత్.

"అంత నిరాశగా మాట్లాడుతున్నావేం...." అంది అక్షిత....

"నేను కలలు కనను అక్షిత.... నాకు వాస్తవం ముఖ్యం ........ శ్రీకృష్ణదేవరాయలు స్వర్ణసింహాసనం కాక్ అండ్ బుల్ స్టోరీ" అతని వంక విభ్రాంతిగా చూసింది అక్షిత....

"మరెందుకు ఈఎక్స్‌పెడిషన్‌కు వచ్చావు"

"నీకోసం.... కేవలం నీకోసమే అక్షిత...." అనురాగంగా ఆమె వంక చూస్తూ అన్నాడు....

"నాకోసమైతే యింత దూరం రావల్సిన అవసరంలేదు యశ్వంత్ నువ్వు రాకపోతే నేను యింటి దగ్గరే ఉండే దాన్ని" అతని వంక ఆత్మీయంగా చూస్తూ అంది.

"ఈ సింహాసనం పుణ్యామా అని మనిద్దరికి లోన్లీ ఆట్మాస్ఫియర్ దొరుకుతుందని వచ్చాను...."

"ఎలా వచ్చినాగాని .... ఈ ఎక్స్‌పెడిషన్‌లో మనవంతు సాయం మనం చేయాల్సిందే"

ఆమెకు కొండలు ఎక్కడం బాగానే అలవాటు ........యశ్వంత్‌కే ఆ అలవాటులేదు ...

"ఇంతకీ.... ఆ కాపర్ ప్లేట్స్‌లో ప్లానింగ్ నువ్వు చూశావా?"

"చూశానుగాని.... నాకేం అర్థంకాలేదు.... అందుకే నాన్నకు ఇచ్చేసాను...."

"దాని కాపీలు నీదగ్గరలేవా ?" అడిగాడు యశ్వంత్.

"ఉండవు.... అన్నీ డాడీ కలెక్టు చేసుకొని దాచిపెట్టుకుంటాడు"

"మీ డాడీకి నామీద అనుమానమా" అడిగాడు యశ్వంత్ అతని వంక విచిత్రంగా చూసింది....

"మా డాడీకి నీ మీదెప్పుడు అనుమానం వుండదు. ఆయన తీరే అంత.... తన రీసెర్చిలో తాను జాగ్రత్తగా ఉంటాడు. ఏ విషయంలోను నెగ్లిజెన్స్ ఆయన సహించడు...."

"సింహాసనం ప్లానింగ్ గురించి నీ దగ్గర కూడా డిటైయిల్డ్‌గా డిస్కస్ చెయ్యడా?"

"చెయ్యడు.... అలా చెయ్యటం ఆయనకు యిష్టంలేదు .... ఈసబ్జక్టులో ఎంతో రీసెర్చ్ చేసిన వాళ్ళతో తప్ప మామూలువాళ్ళతో మాట్లాడడు...."నిరాశగా ఆమె వంక చూశాడు యశ్వంత్....

"అవును ఎప్పుడూ....డాడీ రీసెర్చ్ గురించేప్రశ్నలు అడుగుతావు గానీ.... మన గురించి మాట్లాడవేం...." అంది విసుగ్గా....

"ఏం మాట్లాడమంటావు...."

"నీతో ప్రియంవద వస్తానన్నా కాదని నేను నీతో వచ్చేటట్టు చేసుకున్నాను. కానీ నువ్వు.... నాతో అనుకూలంగా మాట్లాడటంలేదు .... ఏమైందీ యశ్వంత్." లాలనగా అంది.... ఆ లాలనకు ఆమె వంక అనురాగంగా చూసాడు యశ్వంత్....

యశ్వంత్ రీసెర్చ్ స్టూడెంట్‌గా వచ్చిన దగ్గరనుంచి అతని అందమైన రూపంచూసి అక్షత అదోలాంటి ఆరాధన పెంచుకుంది.

యశ్వంత్ కూడా ఆమెతో చనువుగా ఉంటూ ఆ అనురాగానికి బలం పోశాడు.... వాళ్ళిద్దరి మధ్య అది ప్రేమానుబంధంగా డెవలప్ అయింది....

ఈ మార్పును ప్రొఫెసర్ జయరాం గమనించాడు గానీ ఆయనకు కూతురు ప్రవర్తనమీద నమ్మకంవుంది.... స్త్రీ, పురుషులు అన్యోన్యంగా ఉండటం ఆయన దృష్టిలో తప్పుకాదు. అంత త్వరగా వాళ్ళను మంచాల వెనకకు తీసుకొచ్చి ఆలోచించే సంకుచితత్వం ఆయనలో లేదు....అందుకనే వాళ్ళిద్దరి ప్రేమను ఆయన అంత దూరం వెళుతుందని ఊహించలేదు....

అక్షత యశ్వంత్‌ను ప్రేమించినా, ఏనాడు కూడా హద్దులు దాటలేదు అది ఆమె సంస్కారం....

దూరంగా ఏదో డప్పులు చప్పుడు పినిపించింది.

అక్షత యశ్వంత్ ఒకరు ముఖం ఒకరు చూచుకున్నారు.

ఈ కొండల్లో ఆ డప్పుల చప్పుడు ఏమిటి....”

రాను....రాను ఆ డప్పుల చప్పుడు ఎక్కువవుతుంది....

ఇద్దరు గబ గబ ముందుకు వెళ్ళిచూచారు....

వాళ్ళు ముందుకు వెళ్ళినచోటకొండచరియ అబ్రప్ట్‌గా ఎండ్ అయ్యి ఉంది....

దాని క్రింద ఓ పెద్ద మైదానం, ఆ మైదానంలో నెగడుమండు తుంది....

ఆ నెగడు చుట్టూ వృత్తకారంలో అటవికులు నిలబడి వాళ్ళమెడల మీదనుంచి వేలాడదీయబడ్డ డోళ్ళమీద దరువేస్తూ గుండ్రంగా తిరుగు తున్నారు.

మొలకు.... తలకు పక్షి ఈకలతో అల్లిన దండ చుట్టుకొని ఉన్నారు.

నెగడు మధ్య ఓ దుప్పి శరీరం కాలుతుంది....

పెద్దయినుప చువ్వకు అడ్డంగా గుచ్చి .... ఆ చువ్వను నెగడుకు అటు యిటు రెండు కొయ్య దిమ్మల మీదపెట్టి చువ్వను మెల్లగా కదుపు తున్నారు. చువ్వకున్న దుప్పి శరీరం కాలుతుంది....

ఈ కొండ క్రింద ఎవరో కోయవాళ్ళు ఉన్నారు అక్షిత” అన్నాడు యశ్వంత్....

“వాళ్ళవలన మనకేం ప్రమాదంలేదు కదా” అంది అక్షిత.

“ఏమో.... ఇక్కడి అటవికులు ఎలాంటి వారో మనకు తెలి యదుకదా”

ఇద్దరు కొండచరియనుంచి ప్రక్కకువచ్చి కొండమీద నడవ సాగారు.... అక్కడ కొండల వరసగా ఉన్నాయి.... ఏ మాత్రం కాలు జారినా లోయలో పడిపోవటం ఖాయం....

"క్షణం కణం ప్రమాదాలతో నిండిన ఈ అడవి, కొండలు చూస్తుంటే నాకు భయం వేస్తుంది అన్నాడు యశ్వంత్. అక్షత పక పక మని నవ్వింది.

"ఆడపిల్లను నేనాల్సిన మాటలు నువ్వంటం బాగాలేదు...."

యశ్వత్ బూట్లు శబ్దానికి దగ్గర ఉన్న పాములు, పురుగులు దూరంగా వెళ్ళిపోతున్నాయి....

క్రమంగా డప్పుల శబ్దం దూరమైంది...

ఇద్దరు కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు.

హఠాత్తుగా యశ్వంత్ కాలిక్రిందనున్న కొండరాయి కదిలింది.

యశ్వంత్ కాలుజారింది... మరుక్షణం అతనిదేహం జారింది.

చటుక్కున అతని చేతిని అందుకోబోయింది అక్షత.

ఆమెచేతికి అందకుండా కొండచరియ వాలులోకి జారాడు.

యశ్వంత్ ఆ క్షణంలో అక్షితవేసిన కేకకు ఆ కొండలు మారు మ్రోగాయి.

సరిగ్గా అదే సమయంలో

చంద్రహాస్, ప్రియంవద రెండు కొండల మధ్య ఉన్న ఖాళీ ప్రదేశంలో నడుస్తున్నారు.

"ఈ కొండల వరస ఎక్కడ వరకు వెళ్తుంది" అంది ప్రియంవద.

"శ్రీశైలం కొండల వరసలో కలవవచ్చు....లేకపోతే పశ్చిమ కనుమల్లో కలవవచ్చు" అన్నాడు చంద్రహాస్....

"కొండలెక్కటం అలవాటైతే బాగానే ఉంటుంది...."

"మోస్ట్ థ్రిల్లింగ్ అడ్వంచర్ కొండలెక్కటమే....అందుకే ఎడ్మండ్ హిల్లరి టెన్సింగ్ ఎవరెస్ట్ శిఖరం ఎక్కారు"

"తోడుంటే ఏ అడ్వంచరైనా బాగుంటుంది" అన్నది ప్రియంవద..

ఇంతలో వాళ్ళ వెనకాల ఆకులు నలిగిన శబ్దం....

వెనక్కి తిరిగి చూసారు....అన్నీ చెట్లు....కొండలమీద చెట్లు అంత ఎత్తుండవు....అందువల్ల వెనుక ఎవరైనా వచ్చినా కనుక్కోవటం కష్టం....

"ఏమిటా చప్పుడు" అంది ప్రియంవద....

"ఏమో....ఏదైనా జంతువు నడిచి వెళ్ళి ఉంటుంది"

మళ్ళీ ఇద్దరూ నడక సాగించారు.

వాళ్ళ ముందు నుంచి ఓ దుప్పి ఎగురుకుంటూ వెళ్ళింది....

ఆ తరువాత నాలుగు కుందేళ్ళు ముద్దు ముద్దుగా కదలివెళ్ళిపోయాయి.

"ఈ కొండల్లో కూడా జంతువులున్నాయి. ."

"ఈ కొండలమీద ఉండే అడవుల్ని చిట్టడవులు అంటారు...."

"ఈ కొండల్లో....దేవాలయం ఎందుకుంటుందండి...."

"దేవాలయ శిధిలాలైనా దొరుకుతాయేమోనని...."

వాళ్ళు ముందు నడుస్తుండగా....ప్రియంవద ఓ వైపు చూపించి "అదిగో అటు చూడండి" అని ఓ వైపు చూపించింది.

చంద్రహాస్ అటువైపు చూసాడు. కొండకు అనుకొని ఓ పగిలిన విగ్రహం, విఘ్నేశ్వరుడిదీ. తొండం సగం వరకు విరిగిపోయింది....తల పైభాగం పెచ్చులూడి పోయి వుంది. "ఎవరో శిల్పి....యిక్కడే శిల్పం చేసి....పూర్తి చేయకుండా వెళ్ళిపోయాడు....ఆ తర్వాత అది శిధిలమైపోయి ఉంటుంది.

"మనకు ఏమన్నా పనికి వస్తుందేమోనని...."

ఇద్దరు ఆ విగ్రహం దగ్గరకు వెళ్ళి చూసారు. అడుగున్నర ఎత్తు ఉంది.... పీఠం సరిగా లేదు. శిల్పి అసంపూర్ణంగా వదిలేసిన విగ్రహం అది పైనుంచి రాళ్ళు పడి, మరేదో జరిగి తొండం పగిలిపోయింది....పైనపెచ్చు లూడిపోయాయి.

"దీనివల్ల మనకేం ఉపయోగం లేదు" అన్నాడు చంద్రహాస్....

ఇంతలో ఎవరో వేగంగా పరుగెత్తుతున్న అడుగుల చప్పుడు

ఆకులు టపటప నలుగుతున్నాయి.

అటువైపు చూసాడు చంద్రహాస్....

"ధన్" మని ఓ బుల్లెట్ అతన్ని రాచుకుంటూ వెళ్ళింది.

"గెట్ బాక్ ప్రియంవద...." అని చటుక్కున ఓ బండ చాటుకు నక్కాడు చంద్రహాస్....జేబులోనుంచి వెబ్లర్ మిషన్ పిస్టల్ బైటికితీసాడు. ప్రియంవద కూడా అతని ప్రక్కకు వచ్చి దాక్కుంది.

ఎవరు? ఈ అడవిలో ఈ కొండమీద తనమీద హత్యా ప్రయత్నం చేస్తుంది ఎవరు?

చంద్రహాస్ మెదడులో అనేక సందేహాలు

తల బైటికి పెట్టి చూసాడు....

మళ్ళీ...."ధన్" మనే శబ్దం.... బుల్లెట్ కొండరాయికి తగిలి రీ సౌండ్ యిచ్చింది. కొండరాయి పెచ్చులూడిపోయాయి.

తుపాకి ఎటు పేలిందో చూసి వెబ్లర్ మిషన్ పిస్టల్ పెట్టి అటు వైపు కాల్చాడు.

"ధన్" ఆ మధ్యాహ్నపు ఎండలో ప్రతిధ్వనిస్తూ పల్కింది ఆ శబ్దం....

శత్రువు జాగ్రత్తగా ఉన్నాడని ఎప్పుడు అవతల వ్యక్తికి అర్థ మైందో....మళ్ళీ రెండు సార్లు "ధన్ ధన్" మనే శబ్దం....

మరుక్షణం ఎవరో పరిగెత్తుతున్న ఆకుల శబ్దం.

చంద్రహాస్‌కు ఒక్క విషయం అర్థమైంది....

తన దగ్గర ఆయుధం ఉందని తెల్సుకొని శత్రువు తోకముడిచాడు. వచ్చిన వ్యక్తి మాత్రం నిస్సందేహంగా తనను చంపడానికి వచ్చాడు.

తనను చంవటం వలన అవతలి వ్యక్తికి వచ్చే లాభం ఏమిటి ?

ఆ వ్యక్తి దొంగా ! తన దగ్గర ఏవైనా విలువైన వస్తువులు దొరుకుతాయని వచ్చాడా ? లేక ఇక్కడ ఏదైనా చట్ట వ్యతిరేక పనులు జరుగుతుంటే అవి తన దృష్టిలో పడకుండా ఉండటంకోసం హెచ్చరించ టానికి వచ్చాడా ? ఎవరు ఆ వ్యక్తి !

ఎందుకు తనను చంపబోయాడు !

అర్థం కాలేదు చంద్రహాసకు.... ఓ పది నిమిషాలు గడిచినతర్వాత బండచాటునుండి బైటికి వచ్చాడు చంద్రహాస్....

"ఎవరు.... మీమీద కాల్పులు జరిపింది" అడిగింది ప్రియంవద,

"అది నాకు తెలియదు" అన్నాడు చంద్రహాస్....

"ఒక్కటి మాత్రం ఖచ్చితం .... ఆ వ్యక్తి మాత్రం మనల్ని చాల సేపటినుంచి అనుసరించివచ్చాడు...." అని అన్నాడు అక్కడ నుండి చంద్రహాస్ ముందుకువెళ్ళి చూశాడు.... ఆ అడవిలో ఎవ్వరూ అతనికి కన్పించలేదు. ఆ పరిసరాల్లో ఏ వ్యక్తి అతనికి కన్పించలేదని మరో సారి వెల్డర్‌మిషన్ పిష్టల్ పేల్చాడు.

"ధన్"మని కొండ మరోమారు ప్రతి ధ్వనించింది.... ఎవ్వరూ లేరు. అతని పిష్టల్ శబ్దానికి తిరిగి ఎదురు కాల్పులు జరగలేదు. వెనక్కి తిరిగి "వెళదాం పద" అని ముందుకు కదిలాడు చంద్రహాస్.

ప్రియంవద ఒక్కసారి భయంతో వెనక్కి తిరిగి చూసి ముందుకు నడిచింది. సరిగ్గా అదే సమయంలో.

కొండచరియలోకి జారిపోయిన యశ్వంత్.

లోయలోకి గింగరాలు తిరుగుతూ పోయి కొండచరియ వాలులో అడ్డంగా పెరిగిన ఓ చెట్టులో యిరుక్కున్నాడు.

అతని గుండె ఝల్లుమంది! తానెంత అదృష్టవంతుడు.

ఆ చెట్టే గనక లేకపోతే ఈ పాటికి తన ప్రాణాలు అనంతవాయువులలో ఉండేవి....

క్రిందకు జారిపోకుండా శరీరంలోని శక్తిని కూడ దీసుకొని పైకి చూసాడు. కొండచరియ దరిదాపు ఐదు మీటర్ల పైన వుంది .... పైన అక్షత షాక్ తో వణికిపోతుంది....

తన కళ్ళ ఎదురుగా యశ్వంత్ లోయలోకి జారిపోయాడు....తను రక్షించ లేకపోయింది....

ఆమెకు విపరీతమైన భయం నరనరంలో ప్రవేశించింది.

యశ్వంత్.... లోయలోకి జారి.... మరణించలేదుకదా !

తల.... శరీరం ఏబండ రాయికో తగిలి ఛిద్రమై........ భయంకరంగా, రక్తంతో.... యింక ఆ తరువాత ఆమె ఊహించలేకపోయింది. ఆ భావనతో ఆమెకు కళ్ళు తిరగటం ప్రారంభించాయి. సరిగ్గా అదే క్షణంలో....

"అక్షతా.... అక్షతా" అని దయనీయంగా పిలిచాడు యశ్వంత్. ఆ పిలుపు వినగానే ఆమె మనస్సులో అంతులేని ఆనందం ఒక్కసారిగా ఉప్పొంగింది. వెయ్యి ఏనుగుల బలం వచ్చింది.

తన యశ్వంత్.... చచ్చిపోలేదు .... బతికే ఉన్నాడు .... బతికే ఉన్నాడు"

ఆ ఆలోచన ఆమెకు ఎంతో ఊరటను ఉత్సాహాన్ని యిచ్చింది....

వంగి లోయలోకి చూసింది.... లోయలో కనిపించినదృశ్యంచూసి ఒక్కసారిగా ఊపిరిపీల్చుకుంది....

"అక్షతా.... బ్యాగ్ లో తాడు ఉంటుంది .... అది నాకు అందించు"

లోయలోనుంచి పీలగా, దయనీయంగా విన్పించింది యశ్వంత్ స్వరం. మరుక్షణంఆమె బ్యాగ్ ఓపెన్ చేసింది. బ్యాగ్‌లో మినీ వైర్‌లెస్ సెట్, ఫోటోగ్రఫిక్ కెమేరా, నైలాన్ రోప్ ఉన్నాయి. ఆ నైలాన్‌రోప్ దరిదాపు ఇరవై, ముప్పై మీటర్ల పొడవు వుంటుంది. ఆ నైలాన్‌రోప్‌ను అక్కడవున్న ఓచెట్టు బోదెకు గట్టిగాకట్టి లోయలోకి విసిరేసింది ....రోప్ ఖచ్చితంగా యశ్వంత్ చెట్టుమీదుగా క్రిందకు జారింది ........ ఆ రోప్‌కు అక్కడక్కడా పట్టుచిక్కటానికి రెండడుగుల తేడాతో ముడులువేసి ఉన్నాయి.... యశ్వంత్ ముందుకు ఊగి చటుక్కున ఆ రోప్ అందు కున్నాడు.... రోప్ టైట్‌గా మారటంతో యశ్వంత్ రోప్ పట్టుకున్నాడని అర్థమైంది అక్షతకు.

"యశ్వంత్ గట్టిగా పట్టుకో" అంది....

రోప్ పట్టుకొని పైకి లాగటానికి ప్రయత్నించింది. యశ్వంత్ బరువును ఆమె ఆపలేకపోయింది. చేతులు రోప్‌కు ఒరుసుకొని రక్తం రాసాగాయి.

"అక్షత— నువ్వు లాగొద్దు.... నేనే వస్తున్నాను"

అతి భయంకరమైన క్షణాలు అవి....

కొండను కాళ్ళతో తన్నిపెట్టి ఒక్కో ముడిమీద పట్టు గట్టిగా పట్టు కొని మెల్లగా పైకి ఎగబ్రాకాడు. చేతులు మంట పుడుతున్నాయి.

పైనుంచి అక్షిత చూసింది. ఆమెకు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

మెల్లమెల్లగా అక్షిత రోప్‌ను తను లాగటానికి ప్రయత్నించింది. ఆమెకు సాధ్యం కాలేదు. యశ్వంత్ ఒక్కో "నాట్"ను పట్టుకొని పైకి ఎక్కాడు. అతనికి ఎన్. సి. సి లో కొండలు ఎక్కటం, ఈదటంలో ట్రైనింగ్ యిచ్చారు. అది యిప్పుడు ఈ రకంగా పనికివచ్చింది. అక్షితకు ఓ పావుగంట కాలం అతిభయంకరంగా గడిచింది.

యశ్వంత్ అతి కష్టంమ్మీద పైకి చేరుకున్నాడు.

అక్షిత చేయి అందించింది. అతను కొండ చెరియ మీదకు వచ్చే సాడు.

ఒక్కసారిగా రిలీఫ్ ఫీలైంది అక్షిత....

యశ్వంత్ చేతులు ఒరుసుకుపోయి, రక్తం కారుతున్నాయి.

ఆ చేతులు చూసేసరికి అక్షితకు కళ్ళ వెంబడి కన్నీళ్ళు జలజల రాలాయి చటుక్కున అతన్ని గాఢంగా కౌగలించుకుంది....

"యశ్వంత్ ఐ లవ్ యు.... ఐ లవ్ యు" హిస్టారిక్‌గా అంది....

ఆమె కళ్ళ ముందు లోయలోకి జారిన యశ్వంత్ రూపం గుర్తు కొచ్చింది.

"థాంక్‌గాడ్.... ఈ రోజు లేచిన వేళా విశేషం మంచిది. తన యశ్వంత్ తనకు దక్కాడు" ఆ ఆనందం ఆమెలో ముప్పిరిగొంది.

సరిగ్గా అదే సమయంలో....

పొదల మాటు నుంచి ఎగిరి దూకింది పులి....

ఒక్కసారిగా పులి ముందుకు వచ్చేసరికి కపర్ది ఒక్కక్షణం ఆశ్చ ర్యపోయాడు. ఇలాంటి అనుభవాలు ఎదురవుతాయని అతనికి తెలుసు. అందుకే సిద్దంగా ఉన్నాడు.

అంత ఎదురుగా, అంత హఠాత్తుగా పులి ఎదురొచ్చేసరికి సులోచన గడగడ వణికిపోయింది....భయంతో ఆమెకు ముచ్చెమటలు పోసాయి.

ఎదురుగా ఉన్న పులి కపర్ది కళ్ళల్లోకి చూసింది

కపర్ది భయపడకుండా పులికళ్ళల్లోకి తదేక దీక్షతో చూసాడు.

అతని భుజమ్మీద తల ఆన్చి గడగడ వణికిపోయింది సులోచన.

ఆమెకు అలాంటి అనుభవం కొత్త....

పులి కదలటం లేదు....చిత్రంగా కపర్ది వంక చూసింది.

పులికాని పాముగాని ప్రాథమికంగా ఎదుటి వ్యక్తినిగాని, జంతువును గాని హిప్నొటైజ్ చేస్తాయి....అంటే బ్లాంక్‌నెస్....ఎదుటి జంతువులోకాని మనిషిలోకాని ఆలోచనా రాహిత్యాన్ని ప్రవేశపెట్తాయి....

పాము తన భయంకరమైన బుసద్వారా ఎదుటి వ్యక్తిని అచేత నుడ్ని చేసి ఆ భయంలో అతనుండగా అప్పుడు కాటేస్తుంది.

లయబద్ధంగా కదిలే పాము తల, దాని బుస మానవుడ్ని త్వరగా హిప్నటైజ్ చేస్తాయి. ఆలాగే పులి గాండ్రింపు, సింహగర్జన కూడా మనిషిని భయ కంపితుడ్ని చేసి అతని సర్వేంద్రియాల్ని స్థంభింపచేస్తాయి. సరిగ్గా అలా భయపడ్డ క్షణంలోనే పులి విపరీతమైన వేగంతో ఛార్జ్ చేసి ఎదుటి వ్యక్తిని చంపేస్తుంది.

ఫియర్ ఈజ్ ది కీ....

అదేస్థాయిలో మనిషి కూడా పులినిగాని సింహాన్నిగాని భయపెడితే అవి మన జోలికి రావు....పులి గర్జనకన్నా ఎక్కువ స్థాయిలో గర్జించి దాన్ని ఏదో చేస్తున్నాము అనే ఫీలింగ్ కలిగిస్తే పులి భయపడి పారిపోతుంది. ఈ సూత్రంతోనే ఓ యోగి రాయల్ బెంగాల్ టైగర్లను లొంగదీసుకుని వాటితో సర్కస్ చేయించాడు.

పులి ముందుగా ఎదుటి జంతువు యొక్క కళ్ళలోకి చూస్తుంది.... ఆ కళ్ళల్లో దానికి భయం తాలూకు ఛాయలు కనిపిస్తే అప్పుడు ఆ జంతువు మీద ఛార్జ్ చేస్తుంది. అప్పటిదాకా చేయవు.

కపర్థికి ఈ విషయం గురించి బాగా తెలుసు.

అందుకే దాని కళ్ళల్లోకి తీక్షణంగా చూసాడు. పులి అలాగే నిలబడింది. దాన్ని అలా ఒకటి రెండు నిమిషాల కంటే ఉంచలేనని తెలుసు...

ఈలోగా అది ఛార్జ్ చేస్తే ఏం చెయ్యాలో ప్లాన్ వేసుకున్నాడు....

మాగ్నంపెరాంబులమ్ మెల్లగాకదిలిస్తూ దానివైపుకుఎయిమ్‌చేసాడు స్ప్లిట్ సెకండ్....అతనిలో ఎప్పుడు కదలిక ఏర్పడిందో....పులి వెనక కాళ్ళమీద ఛార్జ్ చేసింది....

గంటకు నలభై మైళ్ళ వేగంతో తన ఎరమీదకు ఎగిరి దూకుతుంది

పులి దూకటం!

అతని చేతిలో మాగ్నం పెరాంబులం ఒక్కసారిగా గర్జించటం స్ప్లిట్ సెకండ్‌లో జరిగాయి.

మరుక్షణం అతను పులి ఎగురుతున్న దిశలో వ్యతిరేకంగా పరిగెత్తాడు. మరుక్షణం పులి అతని మీదుగా అవతలి వైపు దూకింది "దబ్" మన్న శబ్దం బుల్లెట్ దాని ముఖాన్ని రాచుకుంటూ వెళ్ళింది. కపర్ది చటుక్కున వెనక్కి తిరిగి పులి పడ్డ స్పాట్‌లోకి మరోసారి మాగ్నం పెరాంబులం పేల్చాడు....బుల్లెట్ వెళ్ళిదాని తోడలో యిరుక్కుంది

భోన భోనంతరాలు దద్దరిల్లేటట్లు భయంకరంగా గర్జించింది పులి....

మళ్ళీ మరోసారి పేల్చాడు.

శత్రువు చేతిలో తనను భయపెట్టే ఆయుధం ఉందని తెలిసిన మరుక్షణం అడివిలోకి పారిపోయింది పులి....

ఒక్కసారి రిలీఫ్‌గా ఫీలయ్యాడు కపర్ది....

మృత్యువు అంత దగ్గరగా వొచ్చి పలకరించి వెళ్ళటం అతని జీవితంలో మొదటిసారి. అంత భయానక పరిస్థితిలోనుంచి యింకా తేరుకోలేదు సులోచన, ఆమె నర నరం భయంతో వణికిపోతుంది.

పుస్తకాల్లో చదవటం, సినిమాల్లో చూట్టం తప్ప....ప్రమాదం ఇంత ఎదురుగా రావటం ఆమెకు మొదటిసారి....

"కూల్ డౌన్ బేబీ....కూల్ డౌన్...." అన్నాడు కపర్ది.

భయంతో అతని భుజమ్మీద చేయి వేసి యింకా వణికిపోతుంది సులోచన.

"పులి వెళ్ళిపోయింది సులోచన"

మెల్లగా ఆమె మామూలు స్థితిలోకి వచ్చింది....

"చాలా భయంకరమైన అనుభవం"

"అడవులంటే సిటీల్లాగ అతి భద్రంగా ఉంటాయనుకున్నావా?"

"ఎలా ఉన్నా నాకేం భయంలేదు....నువ్వు నాకు తోడున్నావుగా" అంది సులోచన....

"ఆ భయంలో....నీ గుండె ఆగిపోతే...."

"నీ చేతుల్లోనే చచ్చిపోతానుగా"చాలా క్యాజువల్‌గా అంది సులోచన.

ఆమె కళ్ళల్లో ఆరాధన....

సులోచన ఎంత టీజింగ్‌గా మాట్లాడినా ఆమెను పట్టించుకోడు కపర్థి....

ఆమెకు తనమీద ప్రేమ ఉన్నదన్న సంగతి తెల్సుగాని, యింతలా ఉందని అతనికి తెలియదు. తన చేతిలో మరణం కూడా చాలా క్యాజువల్‌గా ఆమె తీసుకుంటుందని తెల్సేసరికి అతని గుండె ఎంతో ఉద్వేగంగా కొట్టుకుంది....ఆమె భుజమ్మీద చేయి ప్రేమగా బిగుసుకుంది,

సరిగ్గా అదే సమయంలో....

ప్రొఫెసర్ జయరాం....అడవిలో తాపీగా నడుస్తున్నాడు. అతని నోట్లో స్పెన్సర్ చుట్ట గుప్పుగుప్పున పొగలువదులుతూ అడవిలో ఒంటరి సాహసికుడిలా అడుగు ముందుకు వేస్తున్నాడు. ఆయన దగ్గర రైఫిల్ ఉంది. ఆయన మంచి వేటగాడు,వీపునుంచి బ్యాగ్ వేలాడుతుంది. ఆ బ్యాగ్‌లో ఆయనకి కావాల్సిన సరంజామా అంతవుంది.చిల్డ్ ఫుడ్....టిన్ బీర్ ....రైఫిల్ కాట్రిడ్జ్‌స్....మినికెమేరా....రోప్....అడవిలో అవసరమయ్యే సరంజామా అంతా వుంది....

నడుస్తున్న ప్రొఫెసర్‌జయరామ్ హఠాత్తుగా ఆగాడు.

ఎవరిదో అడుగుల శబ్దం అతన్ని వెన్నంటి వస్తుంది.

చటుక్కున వెనక్కి తిరిగాడు!

ఎవ్వరు కనిపించలేదు....

మళ్ళీ నడక సాగించాడు....

"శప్....శప్" అడవిలో ఆకులు నలుగుతున్న శబ్దం....

నిస్సందేహంగా ఎవ్వరో తనను అనుసరించి వస్తున్నారు....

చటుక్కున వెనక్కి తిరిగి చూసాడు....ఎవ్వరూ లేరు.

తన భ్రాంతా! భ్రమ!

ఎవ్వరిదో అడుగుల చప్పుడు తను ఖచ్చితంగా విన్నాడు

వెనక్కి తిరిగి చూస్తే ఎవ్వరూ లేరు!....

శ్రీ కృష్ణదేవరాయలు సింహాసనం గురించి ఆ రోజు డిస్కస్ చేసి నప్పుడు ఆ రాత్రి ఎవరో వచ్చి కాగితాలు రహస్యంగా తీసుకువెళ్ళారు...

ఎవరు....?

ఈ ఎక్స్‌పెడిషన్‌లో తాము కాకుండా ఎవరికో యింట్రస్టు ఉంది. వాళ్ళెవరు?

అస్సలు తమ దగ్గర నుంచి సింహాసనం రహస్యం బైటికి ఎలా లీక్ అయ్యింది. తమలోనే శత్రువులకు సహాయంచేసే వ్యక్తి ఉన్నాడు.... ఆ వ్యక్తి ఎవరు?

తీవ్రంగా ఆలోచిస్తున్నాడు ప్రొఫెసర్ జయరాం....

వాళ్ళే తనను వెంబడిస్తున్నారా!

తనను వెంబడించడం వల్ల వాళ్ళకు వచ్చే లాభం?

హఠాత్తుగా ఆయనకు కాపర్ షీట్స్ గుర్తుకు వచ్చాయి.

అవి తన దగ్గరే ఉన్నాయి....

వాటికోసమా !....

ఇంతకీ తనను అనుసరిస్తున్న వాళ్ళు ఎవరు ?

మళ్లీ టప్, టప్ మంటూ వెనకాల శబ్దం .... వెనక్కి తిరిగాడు. ఎవ్వరూ కనిపించలేదు....

ఆలోచస్తూ అడుగు ముందుకు వేశాడు.

"బస్" మని నిద్రపోతున్న పాము ఒక్కసారిగా లేచింది.

చటుక్కున దానివంక చూసాడు. అప్పటి వరకు చుట్ట చుట్టుకొని వుంది....

ప్రొఫెసర్ జయరాం బూట్‌కాలు తగిలిలేచింది.

పెద్ద పడగ విప్పుకొని ఉక్రోషంగా ప్రొఫెసర్ జయరాం వంక చూసింది.

సన్నటి నాలుక నోట్లోనుంచి బయటికి వస్తుంది....

చటుక్కున ఆగాడు ప్రొఫెసర్ జయరాం....

పాము కాటేసిన దాని కోరలు ఫాంట్‌లో దిగబడతాయి....

అడవిలోకి బయల్దేరేటప్పుడే రక్షణగా హంటర్స్ షూ వేశాడు.

మోకాలు వరకు రెక్సిన్‌వున్న షూ అది....పాము కాటేసినకోరలు దానిలో యిరుక్కుంటాయి.

పాముకు తనకి మధ్య అడుగుదూరం....

పాము కాటందటానికి "బుస్ బుస్"మంటూ పడగతో ఛార్జ్ అవుతుంది.

చటుక్కున బలం అంతా కాల్లోకి తెచ్చుకొని విసురుగా తన్నాడు.

అతని బూటుకాలు విసురుకు దూరంగావెళ్ళిపడింది కింగ్‌కోబ్రా చటుక్కున ప్రొఫెసర్ జయరాం దిశగా తిరిగి మహోఉద్రేకంతో బుస కొడుతూ చూసింది....

కింగ్‌కోబ్రా పగ ఏమిటో అతనికి తెల్సు....

చటుక్కున రైఫిల్ దానివైపు చూసి కాల్చాడు....

"ధన్....ధన్...."

దాని పడగఛిద్రమైంది.... మరో బుల్లెట్ దాని మెడను రెండుగా చీలుస్తూ వెళ్ళింది. సగం తెగిన మెడను కిందకు వాల్చేసి గిలగిల కొట్టుకుంది కింగ్‌కోబ్రా.... దాని జీవితంలో ఆఖరి క్షణాలు అవి....

ముందుకు కదిలాడు ప్రొఫెసర్ జయరాం....

రైఫిల్ భుజానికి తగిలించుకొని....

అతనికి కొంచెం బాధగావుంది. అనవసరంగా ఓ జీవిని చంపానే అనే పశ్చాత్తాపం....

చంపక పోతే అది తన ప్రాణం తీస్తుంది....

అది ప్రకృతి ధర్మం.... బలవంతుడు బలహీనుడ్ని చంపుతాడు. పెద్ద చేప చిన్న చేపను మింగుతుంది.... ఎన్ని నాగరికతలు మారిన, ఎన్ని సంస్కృతులు మారిన.... రాతియుగ సిద్ధాంతం అయిన "మైట్ యీజ్ రైట్" ఇంతవరకు మారలేదు. "బలవంతులు దుర్బల జాతిని బానిసలు గావించారు.... నరహంతకులు ధరాధిపతులై చరిత్రన ప్రసిద్ధి కెక్కారి.... అని మహాకవి శ్రీశ్రీ ఎన్ని నాగరికతల్ని, ఎన్నిసామ్రాజ్యాల చరిత్రల్ని పరిశీలించి ఆ నిర్ణయానికి వచ్చారు .... అందుకే అంత ఆవేద నగా మానవజాతి చరిత్ర సమస్తం రక్తసిక్త పరివేష్టితం అని ధైర్యంగా చెప్పగలిగాడు.

మళ్ళీ అడుగుల చప్పుడు....

చటుక్కున వెనక్కి తిరిగాడు!

ఎవరో పరిగెడుతున్న శబ్దం....

ఎవ్వరు....ఎవ్వరు....!

చెట్లచాటున ఎవరో దాగివున్నారు....మెల్లగా అటువైపు అడుగులు వేసాడు ప్రొఫెసర్ జయరాం....

సరిగ్గా అదే సమయంలో కపర్ధి సులోచన భుజంమ్మీద చేయివేసి ఆప్యాయంగా ఆమెతో కలిసి నడవసాగాడు.

"ఆ పులికి ధన్యవాదాలు చెప్పాలి."

"ఎందుకు" అన్నాడు కపర్ధి....

"మన యిద్దరి మధ్య ప్రేమ కలిగించినందుకు"

"తప్పు .... మనిద్దరి మధ్యకాదు........ నీకు నామీద" అన్నాడు కపర్ది....

"తప్పు.... మీమీద నాకు ఎప్పటినుంచో మనస్సుంది .... కానీ.... నామీద మీ మనస్సుందని...."

"నోనో.... నీమీద నా మనస్సులేదు....నా మనస్సు నాదగ్గరేవుంది,

అయినా.... అడ్డమైన వాళ్ళమీద నా మనస్సు ఉండటానికి అదే మన్నా పక్షా!" కోపంగా నటిస్తూ అన్నాడు....

"కొయ్యికండి.... నేను మీకు అడ్డమైన దాన్ని ఎందుకవుతాను"

"మరేమవుతావు"

"అయినదాన్నవు తాను.... మీ పెళ్లాం అవుతాను" ఎకసెక్కెంగా అంది!

"అయ్యబాబోయ్ నిన్ను పెళ్ళాంగా భరించటం.... ఎవరెస్టు శిఖరం ఎక్కినంత కష్టం...." కొంటెగా అన్నాడు కపర్థి.

"కష్టమైనా....నిష్టూరమైన తప్పదుగా"

"ఏమిటి తప్పదు"

"నన్ను భరించటం....భరించువాడు అంటేనే భర్త....నువ్వు నన్ను భరించేవాడివి" అతని ముక్కు పట్టుకొని ఊపుతూ అంది....

"నేను శివుడ్ని కాదు....గంగాదేవిని నెత్తిన పెట్టుకొని భరించినట్లు నిన్ను భరించటానికి"

"కపర్ది అంటే ఏమిటో తెలుసా"

"ఏమిటి" అడిగాడు....

"విషాన్ని కంఠంలో దాచుకున్న ఈశ్వరుడి పేరు కపర్థి....

"అంటే విషం లాంటి నిన్ను........" అతని మాట పూర్తికాలేదు.

"నీ గుండెల్లో దాచుకో...." మాట పూర్తి చేసింది....

"అబ్బో....బాగానే మాటలు నేర్చావు...."

"మాటలు నేర్వకపోతే నీతో నెగ్గుకురావటం కష్టం కదా"

ఇద్దరు ఆనందంగా కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు.... ఆ ఆనందంలో వాళ్ళకు రాబోయే ప్రమాదం అర్థం కాలేదు....వాళ్ళ ఎదురుగా మూడు గజాల దూరంలో ఏనుగుల్ని పట్టుకొనే మాటు వుంది....పెద్ద గొయ్యితీసి దానిమీద పచ్చగా పచ్చిక పరిచి....నేల ఉన్నట్లు భ్రాంతి కలుగ చేస్తారు....అది పచ్చిక అనే భ్రాంతిలో ఏనుగు వచ్చి మాటులో పడుతుంది ....దాన్ని అలా బంధిస్తారు....

అది తెల్సుకోకుండా యిద్దరు ఆ పచ్చిక మీద కాలు పెట్టారు మరు క్షణం యిద్దరు తల్లక్రిందులుగా గోతిలోకి జారిపోయారు....

"అమ్మా అని అరిచింది సులోచన....అలా పడటంలో కూడా ఆమె కపర్ధి చేతులు వదలలేదు....గింగరాలు తిరుగుతూ పోయి గోయిలోపడింది. కపర్ధికి గోతిలో పడగానే....అది ఏనుగులును పట్టటానికి వేసే మాటు అని అర్థం అయ్యింది. గొయ్యిలోనుంచి పైకి రావటానికి వీలు లేకుండా చాలా ఎత్తులో ఉంది గోయి....

గోతిలో నుంచి పైన ఆకాశం గుండ్రంగా కన్పిస్తుంది....

కపర్ధికి మొదట తల దిమ్ముగా ఉంది. ఆ తర్వాత ఫ్రీగా అన్పించింది....

"మంగలంలో నుంచి పొయ్యిలో పడట్లుంది మన పరిస్థితి...." సులోచన అంది ఆమె చేతులు, కాళ్ళు దోక్కుపోయాయి....

బట్టలకు మట్టి అంటుకుంది. పెద్దగా దెబ్బలు తగలలేదు....

"ఇక్కడ నుంచి బైట పడటం కష్టం"

"హమ్ తుమ్ ఎక్ కమరేమే బంద్ హో" అంది సులోచన నవ్వుతూ....

"ఆ పాట కాదు నువ్వు పాడాల్సింది...."

"ఏ పాట పాడాలి...."

"పాంచ్ ఫుజ్ జమీన్‌కే నీచే...."

"అంటే ఐదు గజాల భూమి క్రింద....మనిద్దరం ఉన్నాం అనేగా" అంది సులోచన....

"అవును....యిప్పుడు మనం పాటలు కాదు పాడాల్సింది....ఈ గోతిలో నుంచి ఎలా....బయటపడాలో ఆలోచించాలి....?"

"మన దగ్గర రోప్ ఉందిగా....అది పైకి విసిరేస్తే సరిపోతుంది"

"లాభం లేదు....అదంత తేలిగ్గా బైట ఏదో చెట్టుకు పట్టుకుంటుంది అని అనుకోను...."

సులోచనకు విసుగ్గా వుంది....క్రిందంత నేల పొడిగానే వుంది.... కాని గులకరాళ్ళు....మట్టిబెడ్డలు ఆమెకు మా చెడ్డ చిరాకును కలిగిస్తున్నాయి....లోపల అటు పన్నెండు....యిటు పన్నెండు అడుగుల వెడల్పు ఉంది గొయ్యి....పడుకోటానికి వీలు కూడా వుంది.

"ఇద్దరం హాయిగా పడుకుందాం....ఈలోగా ఎవరో ఒకరు వచ్చి మనల్ని రక్షిస్తారు...." అన్నాడు కపర్ది

"ఏ అటవికులో వస్తే వాళ్ళు మనల్ని బంధిస్తారు" సులోచన భయం భయంగా అంది....

"ఎవరో ఒకరు వచ్చేవరకు వెయిట్ చేద్దాం...."

"మీ దగ్గర మినీ వైర్‌లెస్ సెట్ ఉందిగా....ప్రొఫెసర్ గార్ని కాంటాక్ట్ చేయండి...."

"బాగా గుర్తు చేసావ్...." ఎంతైనా నువ్వు నా సెక్రటరీగా ఉండ దగ్గదానివే" అని బ్యాగ్‌లో నుంచి వైర్‌లెస్ బైటికి తీసాడు....అక్కడ ఆ క్షణంలో ప్రొఫెసర్ జయరాం పరిస్థితి యిందుకు భిన్నంగా వుంది.

ఎవరో చెట్ల చాటున దాగి ఉన్నారు....

వాళ్ళు ఎవరో అర్థం కాలేదు....

"ఎవరది" గట్టిగా అరిచాడు ప్రొఫెసర్ జయరాం....

అతని అరుపుకు అరణ్యం ప్రతిధ్వనించింది....

రైఫిల్ భుజాన్నుంచి తీసి చేతుల్లోకి మార్చుకున్నాడు....

గబగబ అటువైపు పరుగెత్తాడు....

ఎవరో పరుగెత్తుతున్న సవ్వడి....

తాను గమనించాడు అని చెప్పి ఆ వ్యక్తి పారిపోతున్నాడు....

నల్లటి జీన్స్ పాంట్....షర్ట్....దానిమీద రెక్సిన్ కోటు వేసుకున్న వ్యక్తి పరుగెత్తుతున్నాడు—

ఎవరతను?

ఇంత వరకు తననెందుకు వెంటాడాడు....

ఆ వ్యక్తి దృష్టి పథంలో నుంచి తప్పుకోగానే ఓ క్షణం అతను వెళ్ళిన వైపు చూసి మళ్ళీ వెనక్కి తిరిగి యిది వరకు బాటలోనే నడవ సాగాడు....

"ధన్" అడవి దద్దరిల్లిపోయే శబ్దం....చటుక్కున ప్రొఫెసర్ జయరాం తప్పుకున్నాడు. గుండు అతని చెవి ప్రక్కనుంచి దూసుకు వెళ్ళింది.

ఒక్క క్షణం ఏమరిపాటుగా ఉంటే తన 'స్కల్' ఛిద్రమైపోయి ఉండేది....

రైఫిల్ని పొజిషన్లోకి తెచ్చుకొని....ట్రిగ్గర్ నొక్కాడు.

"ధన్....ధన్....ధన్...."

మూడు బుల్లెట్స్ దూసుకువెళ్ళాయి....

మరు క్షణం అటువైపు నుంచి

ధన్....ధన్....ధన్....ధన్"

ప్రత్యర్థి చెట్టు చాటు నుంచి పిస్తోల్ కాలుస్తున్నాడు....

బుల్లెట్లు ఒచ్చుకల్లాగ అతని ప్రక్కనుంచి 'ఝుమ్' మంటూ వెళు తున్నాయి.

ప్రొఫెసరు జయరాం చటుక్కున చెట్టు చాటుగా వెళ్ళాడు....

ప్రత్యర్ధి స్థానం తెల్సుకోటానికి చాలా చిన్న ట్రిక్ ఉపయోగించ దలుచుకున్నాడు. క్రింద నాలుగు రాళ్ళను తీసుకొని....వరుసగా నాలుగు స్థానాల్లోకి విసిరేసాడు....దానివల్ల ప్రత్యర్థి తప్పించుకుపోతున్న ఫీలింగ్ కలుగుతుంది....

ఎదుటివాడు బ్లైండ్‌గా పేలుస్తాడు...దాంతో అతని స్థానంతెలుస్తుంది

ప్రొఫెసర్ జయరాం ఊహించినట్లు....చెట్లచాటున ఉన్న అగంత కుడు జయరాం రాయి విసిరేసిన డైరక్షన్‌లో కాల్చాడు....

"ధన్.... ధన్" మంటూ

ప్రొఫెసరుకు అతను ఎక్కడున్నాడో అర్ధమైంది....

మరుక్షణం రైఫిల్ అటు డైరక్ట్ చేసి ట్రిగ్గర్ నొక్కాడు

ఒకే ఒక్క బుల్లెట్....

మరుక్షణం....

"అమ్మా" అనే ఆర్తనాదం....

బుల్లెట్ ఎక్కడ తగిలిందో .... చెట్లచాటున వ్యక్తి పరిగెత్తు తున్నాడు....

అతని భుజంమ్మీదనుంచి రక్తం ధారగా కారుతుంది....

ఒక్కక్షణం ఆగాడు.... ప్రొఫెసర్ జయరాం....

పారిపోతున్న శత్రువుమీద కాల్పులు జరిపే నీచుడుకాడు జయరాం....

దూరంగా అగంతకుడు పారిపోయాడు....

దూరంగా మోటార్ సైకిల్ కదలిన శబ్దం ....

అడవిలోకి వెహికల్ మీద వచ్చాడు....

తనను అంతం చెయ్యటానికా ?.... మరెందుకు....

అర్థం కాలేదు ప్రొఫెసర్ జయరాంకు....

తనను చంపటంవల్ల అతనికి వచ్చేలాభం....

మరుక్షణం అతని ప్రశ్నకు సమాధానం తట్టింది ........ కాపర్ షీట్స్....

బహుశా వాటి కోసం తన ప్రాణాలు తియ్యటానికి కూడా వెనకాడ లేదు....

బ్లడీ....రిచెస్....

రిచెస్ కోసం సాటి మనిషిని చంపే నీచత్వం మనిషిలో ఎందు కొస్తుంది....

స్వార్థం.... ఈ ప్రపంచం అంతా తన పాదాక్రాంతం కావాలనే మనిషి స్వార్థం....

తాను మొట్ట మొదటిసారిగా తప్పుచేసానేమో అన్న అనుమానం వచ్చింది ప్రొఫెసర్ జయరాంకు....

తాను ధనం కోసం కాదు ఈ "ఎక్స్పెడెషన్" స్టార్ట్ చేసింది....

కేవలం ఎడ్వంచరస్ ఇన్‌స్టింక్ తో....

ఆ సింహాసనం దొరికినా దాన్ని గవర్నమెంట్‌కు సరండర్ చేస్తాడు తాను కేవలం ఎడ్వంచర్ మీదున్న "ఫాసినేషన్" వల్ల ఈ "ఎక్స్పెడి షన్" ప్రారంభించాడు. అప్పుడే దీనిలోకి స్వార్థశక్తులు ప్రవేశించాయి. స్వార్థమా.... నువ్వు కలుషితం చేయ్యని ప్రదేశం అంటూ ఈ భూమ్మీద లేదా ? అతను ఆ ఆలోచనలో ఉండగానే అతని దగ్గరవున్న వైర్‌లెస్ సెట్,

"బీప్.... బీప్....బీప్" మని మ్రోగింది.

బ్యాగ్‌లో నుంచి వైర్‌లెస్ తీశాడు....

"కాలింగ్ కపర్ది.... కాలింగ్ కపర్ది .... టు జయరాం...."

కాలింగ్ ప్రొఫెసర్ జయరాం" జయరాం .... న్యూస్‌రిసీవ్ చేసు కొని అన్నాడు....

"హాల్లో జయరాం.... డు యు రీడ్ మీ...."

"యస్.... జయరాం స్పీకింగ్ ఏమిటి విషయం."

"నేను.... సులోచన.... ఎలిఫింట్ ట్రాప్‌లో పడ్డాం.... పైకిరావటానికి వీల్లేని పరిస్థితిల్లో ఉన్నాం" కపర్థి న్యూస్ చెప్పాడు....

"ఎక్కడపడ్డారు....లోకేషన్ చెప్పగలరా?" జయరాం అన్నాడు....

"లొకేషన్ చెప్పలేం.... మీరు త్వరగా రావాలి"

"ఎలారమ్మంటావు" అడిగాడు జయరాం....

"సిగ్నల్ లోకేటర్‌నుబట్టి డైరెక్షన్ ఫైండర్ ఉపయోగించి మీరు వెంటనే రండి"

"ఓ. కే.... నువ్వు సెట్ ఆఫ్ చేయకు."

వైర్‌లెస్‌కున్న డైరెక్షన్ ఫైండర్ బటన్ నొక్కాడు .... చటుక్కున దానిలోని ముల్లు యాక్టివేట్ అయ్యి డైరెక్షన్ చూపించింది.

"భయపడకండి" నేను వస్తున్నాను...." జయరాం అన్నాడు.

వైర్‌లెస్ ఆన్‌చేసి డైరెక్షన్ ఫైండర్‌లోని ముల్లు చూపించే దిశలో నడిచాడు జయరాం....

అక్కడ కపర్థి రిలాక్స్ ఫీలయ్యాడు....

"జయరాం.... మనల్ని లోకేట్‌చేసి....బైటికి తీస్తాడు" అన్నాడు.

"అలాగయితే.... మెసేజ్ ఓ గంట ఆగి యిచ్చే వాళ్ళం కదా!"

"అప్పటి వరకు ఎందుకు" అడిగాడు కపర్థి....

"ఆ గంటసేపు నీతో రోమాన్స్ చేసేదాన్ని...."

"హారీబుల్.... ఈసిట్యూయేషన్‌లో రోమాన్స్ కూడానా.... ఎవరొచ్చి .... మనల్ని బంధిస్తారో అని భయపడి ఛస్తుంటే"....

కిలకిల నవ్వింది సులోచన.

"జయరాం అంకుల్ వచ్చే లోపల" అని చటుక్కున కపర్థిని కౌగలించుకుంది సులోచన.

"అయ్యబాబోయ్" నన్నేం చేస్తావ్...." అన్నాడు.

"రేప్ చెయ్యన్లే...." కొస్త ముద్దు పెట్టుకుంటాను."

"వైర్‌లెస్ ఓపెన్ అయివుంది .... మన మాటలన్నీ జయరాం గారు వింటారు."

ఆ మాట వినగానే ఒక్కసారి నాలుక కరుచుకుంది....

"సారీ.... సారీ అంకుల్ ..." అని సిగ్గుపడి తలవాల్చుకుంది.... సులోచన.... తన మాటలు జయరాం వింటున్నాడని తెలిసి....

"ఫర్వాలేదు.... క్యారీఆన్" వైర్‌లెస్‌లోనుంచి జయరాం కంఠం. ఈసారి ఆశ్చర్యపోవటం కపర్ది వంతైంది....

డైరెక్షన్ ఫైండర్ ద్వారా వాళ్ళు ఉన్న దిశగా వస్తున్నజయరాం వైర్‌లెస్‌లోని వాళ్ళ మాటలు విని చిన్నగా నవ్వుకున్నాడు.

ఓ ఇరవై నిమిషాల తర్వాత ఎలిఫెంట్ ట్రాప్ దగ్గరకు వచ్చాడు....

"కపర్ది నేను వచ్చాను" అన్నాడు....

"హల్లోసార్.... నేను యిక్కడ ఉన్నాను" కపర్ది గోయిలోనుంచి అరిచాడు. గోయి పైనుంచి వాళ్ళిద్దర్ని చూసి చిన్నగా నవ్వాడు జయరాం.

"వర్షంవస్తే.... మునిగిపోయేవాళ్ళు" అన్నాడు ....

సమయానికి మీరోచ్చారుకదా .... యింక దేనిలో మునుగుతాం" అన్నాడు కపర్ది....

ప్రొఫెసర్ జయరాం తన దగ్గరున్న నైలాన్ రోప్‌తీసి ఓ చెట్టుకు కట్టి గోయిలో వేసాడు....

ఆ రోప్ పట్టుకొని కపర్థి పైకి వచ్చాడు. ఆ తర్వాత సులోచన వచ్చింది....

"అడవిలో తిరిగేవాళ్ళు.... జాగ్రత్తగా ఉండాలి .... వేసే అడుగు ఎక్కడ వేస్తున్నారో ఒళ్ళు తెలిసి వుండాలి" అన్నాడు మర్మగర్భితంగా నవ్వుతూ.... ఆయన నవ్వు అర్థమై....

"నేను జాగ్రత్తగానే ఉన్నాను.... కానీ .... అనుకోకుండా ఎలిఫెంట్ ట్రాప్‌లో పడ్డాం" అన్నాడు కపర్ధి.

"పదండి.... పదండి........ చాలాటైమ్ అయ్యింది" అన్నాడు జయరాం.

ముగ్గురు వెనక్కి తిరిగి గుడారాలవైపు సాగారు....

అప్పుడు సరిగ్గా ఐదుగంటలైంది....

సాయం సూర్యుడు పశ్చిమాన అస్తమించటానికి పరిగెత్తుతున్నాడు.

## 8

వాళ్ళు ముందుకు కదలగానే....

ఆ చెట్లు మాటునుంచి ఓ ఆకారం నిశ్శబ్దంగా కదిలింది. సులోచన కపర్ధి వంకచూసి నవ్వింది.... ప్రొఫెసర్ జయరాం వాళ్ళిద్దరి వెనకనడిచి వస్తున్నాడు....

"ఈ సాయంసంధ్యలో ఈ అడవిలో మనిద్దరం .... హీరోహీరోయన్లలా డ్యూయెట్ పాడితే ఎలా ఉంటుంది" అంది సులోచన.

"పెద్ద పులులు, సింహాలు, ఏనుగులు ప్లేబ్లాక్ మ్యూజిక్‌పాడతాయి" ఉడతలు, కుందేళ్ళు నీతోపాటు కోరస్ పాడ్తాయి....

నేను మాత్రం.... చెట్టెక్కి కూర్చుంటాను" అన్నాడు కపర్ధి....

"ఏం అంత భయమా నీకు...."

"సింహాలు పాడే డ్యూయట్ సాంగ్‌లో వన కన్యలా నువ్వుంటే చాలు........నేను కనపడితే అవి నన్ను భోంచేస్తాయి. అందుకని" అన్నాడు....

"అంటే నేను వనకన్యనా .... మానవ కన్యను కాదు...."

"అడివిలో డ్యూయట్ పాడాలనుకొనే కోర్కె వన కన్యలకే వస్తోంది.... మానవ కన్యలకురాదు డార్లింగ్" అన్నాడు కపర్ధి....

"చూడంకుల్ నేను వన కన్యను, జలకన్యను అట, ఆయనమాత్రం మానవుడట ....ఇదేం న్యాయమో మీరు చెప్పండి అంకుల్ అంది జయరాం వంకచూస్తూ....

"వన కన్యల్లో స్వార్థం ఉండదు........ వాళ్ళకు మంచి మనస్సు ఉంటుందమ్మాయ్....మనుష్యులే స్వార్థపరులు...."

జయరాం ఆ మాట అనగానే చిన్నపిల్లలా చప్పట్లు కొట్టింది .... సులోచన.

"మా బాగా చెప్పారు అంకుల్.... అంటే.... మిష్టర్ కపర్థి స్వార్థ పరుడు........ ఎంత బాగా చెప్పారు"

ఆమె ముఖం వెయ్యి కాండిల్స్ బల్బులా వెలిగింది. కపర్థి అసహ నంగా ఆమెవంక చూస్తూ ముఖం ముడుచుకున్నాడు సరిగ్గా అదే సమ యంలో వికృతంగా ఘీంకారంచేస్తూ వేగంగా పరుగెత్తుకొచ్చింది ఓ అడవి ఏనుగు....

అది పరుగు తీస్తుంటే.... క్రింద చిన్న చిన్న చెట్లు, పెద్ద చెట్ల కొమ్మలు ఫట్ ఫట్ మని విరిగిపోతున్నాయి. అది వేగంగా వచ్చి కపర్థి సులోచనల ముందు ఆగింది....

వెనకవున్న జయరాం ఆశ్చర్యంగా దానివంక చూసాడు....

అది మదపుటేనుగు.... ఆడ ఏనుగుకోసం వెర్రెక్కి అడవి అంతా కదం తొక్కే మగ ఏనుగు....

అదిచేసే బీభత్సం అంతా యింతా కాదు. తొండం ఎత్తి అడవి అంతా దద్దరిల్లేటట్లు ఘీంకారం చేసింది. ఆ ఘీంకారానికి చెట్లమీద వాలిన పక్షులు టప టప మంటూ రెక్కలార్చుకుంటూ ఎగిరిపోయాయి.....

దానికళ్ళు ఆడ ఏనుగు కనపడలేదని తీవ్రమైన కోపంతోవున్నాయి. అది సులోచన వంక కపర్థి వంక ఓ లిప్తపాటు చూసి ఒక్కసారిగా ముందుకు ఉరికింది....

సులోచన గుండెలు విపరీతమైన భయంతో దడదడలాడాయి. జరగబోయే దారుణం ఏమిటో అర్థమైంది....

కపర్ది చటుక్కున జేబులోకి చేయి పెట్టాడు రివాల్వర్ కోసం. మదపుటేనుగు ఒక్కసారి ముందుకు దూకి తొండంతో కపర్దిని చుట్టేసి ఒక్కసారిగా పైకిలేపింది....

ఆ దృశ్యం చూసి కెవ్వున కేకవేసింది సులోచన....

జయరాం చటుక్కున తప్పుకొని జేబులోనుంచి పిస్టల్ బైటికి తీశాడు.

ఒక్కసారి ముందుకు పరిగెత్తింది మదపుటేనుగు....

మదపుటేనుగు తొండం మధ్య కపర్ధి.... అతని చేయి జేబులో.... ఆ చేతి చుట్టు బలమైన తొండపు పట్టు, గింజుకున్నాగాని జేబులో నుంచి చేయిరావడంలేదు....

ఒక్కసారిగా ఏ కొండ చిలువో ఒళ్ళంతా చుట్టేసినట్లు చిత్రమైన ఫీలింగ్, సరిగ్గా అప్పుడే జయరాం ఫిస్టల్ పేల్చాడు.

ఏనుగును చంపాలని కాదు.

ఆ శబ్దానికి కపర్థిని క్రిందపడేస్తుందని....

కానీ అతని అంచనా దెబ్బతింది....

ఎప్పుడయితే పిస్టల్ పేలిందో అది ఒక్కసారిగా రెచ్చిపోయి....

చటుక్కున వెనక్కి తిరిగింది .... దాని కళ్ళల్లోవున్న పైశాచి కత్వాన్ని చూచేసరికి జయరాంకు వెన్నులో చలిపుట్టింది....

భీకరంగా ముందుకు పరిగెత్తింది.

జయరాం ప్రాణభయంతో పరిగెత్తాడు....

ఎదురయ్యే రాళ్ళు.... చీల్చేసే ముళ్ళ ........ జయరాం చొక్కా చినిగిపోయింది.

జయరాంను వదలటంలేదు. జయరాం వగరుస్తూ పరుగెత్తు తున్నాడు....

సులోచన కూడా ఏనుగువెంట పరిగెత్తుతుంది.కపర్థి దాని తొండంలో యిరుక్కుని ఉన్నాడు. ఏనుగు పరిగెత్తుతుంటే చెట్ల కొమ్మలు, పైన

ఉన్న కాండాలు అతనికి గీరుకొని పోతున్నాయి. అయినా అతనుతప్పించు కోటానికి గింజుకుంటున్నాడు.... జయరాం పరిగెత్తి పరిగెత్తి అలిసి పోయాడు. వెనకాల మృత్యుదూతలా పరిగెత్తుకొస్తోంది మదపుటేనుగు.... దాని చేతికి చిక్కితే జరిగేదేమిటో అతనికి తెలుసు.

ముందు కాళ్ళ క్రింద పడేసి పచ్చడి చేస్తుంది.

అందుకనే దానికి దొరక్కూడదని అతని అభిప్రాయం....

జయరాం కాలికి బలమైన రాయి తగిలింది, ఒక్కసారిగా క్రింద పడ్డాడు.... అతని తల కొసరాయికి తగిలి "ఫట్"మని పగిలింది. మరు క్షణం ఎర్రటి రక్తం అతని నుదురు మీదకు జారింది....

మదపుటేనుగు వికృతంగా ఘీంకరిస్తూ ముందు కొచ్చింది. వికృ తంగా కాలెత్తి క్రిందకు దింపబోయేంతలో వెనకవున్న సులోచన....క్రింద పడివున్న పదునైన కర్ర తీసుకొని వెనక తోక దగ్గర బలంగా పొడి చింది, ఆ బాధకు ఒక్కసారిగా ఆగి చటుక్కున వెనక్కి తిరిగింది. మదపుటేనుగు అలా వెనక్కి తిరగ్గానే....కపర్థి చేతులకు పైన ఉన్న చెట్ల కొమ్మలు చేతికి చిక్కాయి. చటుక్కున వాటిని పట్టుకున్నాడు. వికృత మైన రాక్షస బలంతో ముందుకు కదిలిన మదపుటేనుగు ఊపుకు....కపర్థి పట్టుకొన్న కొమ్మలు ఫట్ ఫట్ మంటూ విరిగిపోయాయి.

సులోచన గుండెలు అవిసిపోయాయి.

విపరీతమైన కసి....ద్వేషంతో వేగంగా వెనక్కి తిరిగిన మదపు టేనుగును చూసి సులోచన భయానికి మించిన స్థాయిలో పారలైజ్ అయ్యింది....

అది వికృతంగా శబ్దం చేసుకుంటూ ముందుకు కదలగానే రాబోయే ప్రమాదాన్ని గ్రహించి డెస్పరేట్‌గా అరిచాడు కపర్థి....

"గెట్‌బ్యాక్....గెట్‌బ్యాక్ సులోచన...."

అతని అరుపు వినగానే ఈ లోకానికి వచ్చి పెద్ద భూతంలా వస్తున్న ఏనుగును చూసి పరిస్థితి గ్రహించి ముందుకు పరిగెత్తింది సులో చన....

సులోచన వెర్రిగా ముందుకు పరిగెత్తింది. ఆమె చెప్పులు ఎప్పుడో పోయాయి. రాళ్ళకు చెట్టు మొదళ్ళకు తగిలి ఆమె పాదాలు రక్తం కారు తున్నాయి.

తను ఆగితే జరిగే దారుణం ఏమిటో ఆమెకు తెలుసు, విపరీతమైన వేగంతో పరుగెత్తుతుంది మదపుటేనుగు....

కపర్థికి ఓ ఆలోచన వచ్చింది. ఆ ఆలోచన వచ్చిన మరుక్షణం అమల్లో పెట్టాడు....

చెట్టు కొమ్మకున్న కొమ్మల్లో చిన్న కొమ్మను విరిచి....ఏనుగు కంట్లో బలంగా గుచ్చాడు....ఏనుగు కంట్లో కస్సున దిగింది కొమ్మ మొన,

ఘానఘానంతరాలు దద్దరిల్లేటట్లు కేకలేసి తొండం లూజ్ చేసింది.. మదపుటేనుగు....

ఛెంగున భూమి మీదకు ఎగిరి దూకాడు కపర్థి

విపరీతమైన వీరావేశంతో చిందులు తొక్కుతోంది మదపుటేనుగు.

దాని కంటి నుంచి రక్తం కారుతుంది....

దాని దృష్టి సులోచన మీదే ఉంది....వేగంగా సులోచన ముందుకు వెళ్ళి ఒక్కసారిగా తొండంతో చుట్టి పైకెత్తింది....

కెవ్వున కేకవేసింది సులోచన....

ఆ భయంకరమైన పరిస్థితిలో ఏనుగు ఏం చేస్తుందో అతనికి తెలుసు....

మరింకేమి ఆలోచించలేదు....

చటుక్కున రివాల్వర్ తీసి ఏనుగుకు గురి చూసి కాల్చాడు.

"ధన్....ధన్....ధన్....ధన్. ..ధన్....ధన్...."

ఆరు రౌండ్లు పూర్తిగా కాల్చాడు.

ఒక్కసారిగా అడవి దద్దరిల్లేటట్లు ఘీంకరించి సులోచనను తొండముతో విసిరికొట్టింది మదపు టేనుగు....

ఆరుగుండ్లు తగిలినా అది చచ్చిపోలేదు

విపరీతమైన బాధతో బీభత్సంగా కదం తొక్కుతోంది

దాని తాకిడికి చెట్టు చేమలు విరిగిపోతున్నాయి....

దాని అరుపుకు అడవిలో జంతువులు భయంకరంగా పరిగెత్తు తున్నాయి.

చివరి బుల్లెట్‌ను....దాని స్కల్‌కు గురిచేసి పేల్చాడు....

"ధన్"

చివరి బుల్లెట్....దాని కుంభస్థలాన్ని స్మాష్‌చేస్తూ దూసుకువెళ్ళింది.

బీభత్సంగా అరుస్తూ క్రింద కూలిపోయింది మదపు ఏనుగు....

అభయారణ్యంలో మదపు ఏనుగును చంపటం నేరమని తెల్సినా విధిలేని పరిస్థితుల్లో చంపాడు కపర్ధి....

సులోచన గడగడ వణుకుతూ వచ్చి అతన్ని బలంగా కౌగలించు కుంది....కపర్ధి భయం లేదన్నట్లు ఆమె భుజం తట్టాడు.

"ఎలా వుందీ సులోచనా అడవిలో డ్యూయెట్లు" అన్నాడు, అంత భయంలో కూడా చిన్నగా నవ్వింది సులోచన.

## 9

ప్రొఫెసర్ జయరాం మెల్లగా లేచాడు....

మదపు ఏనుగు చాలా దూరం పారిపోయింది. దాని వెనక సులో చన వెళ్ళింది. కపర్ధి ఏమయ్యాడో అర్థం కాలేదు....

కపర్ధిని కిందపడేసి చంపేసిందా ఆ మదపుఏనుగు....

ఆ భావనరాగానే వణికిపోయాడు ప్రొఫెసర్ జయరాం, చటుక్కున ముందుకు కదిలాడు....

సరిగ్గా అదే సమయంలో అతని వెనక ఎవరో కదలిన సవ్వడి వెనక్కి తిరగబోయాడు.

"డోంట్ మూవ్....మిష్టర్ జయరాం...." ఎవరిదో కంఠస్వరం వెన్నులో రివాల్వర్ గుచ్చిన అనుభూతి.

"ఎవరు నువ్వు" అడిగాడు జయరాం....

"నేనెవరో తెల్సినా....నీకేమి ప్రయోజనం లేదు....జయరాం....

నీ దగ్గర ఉన్న కాపర్ షీట్స్ నా కివ్వు"

"నా దగ్గర ఏ కాపర్ షీట్స్ లేవు...." అన్నాడు ప్రొఫెసర్ జయరాం....

"డోంట్ బి సిల్లీ జయరాం....నా సంగతి నీకు తెలియదు....నేను నరరూప రాక్షసుడ్ని...." అన్నాడు వెనుక నున్న వ్యక్తి.

"నువ్వు నరరూప రాక్షసుడివైనా, మృగానివైనా.... నా దగ్గరలేని కాపర్‌షీట్స్ నీకెలా యివ్వగలను...."

"నువ్వు పెద్దవాడివనే కనికరం కూడా చూపను....ప్లీజ్ టెల్ మి.. నీకు ఐదే....ఐదు నిముషాలు టైమ్ యిస్తున్నాను.... నువ్వు ఆ కాపర్ షీట్స్ గురించి చెప్పకపోతే నా చేతిలో ఉన్న రివాల్వర్ పేలుతుంది. నువ్వు ఛస్తావు"

ప్రొఫెసరు జయరాం ఏమీ మాట్లాడలేదు....

తనను బెదిరిస్తున్న వ్యక్తి ఎవరు?....

కాపర్‌షీట్స్‌తో అతనికి అవసరం ఏమిటి?....

అతను టైమ్ చూసుకున్నాడు

ఒకటి!

రెండు!

మూడు నిమిషాలు గడిచాయి.

"మిష్టర్ జయరాం....నీ ప్రాణాల మీదకు ఎందుకు తెచ్చుకుంటావ్....నిజం చెప్పు"

"మేము బయలాజికల్, జులాజికల్ ఎక్స్‌పెడిషన్‌కు వచ్చాం. కానీ నువ్వన్నట్టు మా దగ్గర ఏ రకమైన కాపర్‌షీట్స్ లేవు....మేం ఎవ్వరో అనుకొని పొరబడి వుంటావు"

"నథింగ్ డూయింగ్.... మీ పేర్లు కూడా నాకు తెల్సు జయరాం... నాటకాలాడవద్దు....మీరొచ్చింది గోల్డెన్ డ్రోన్ కోసం"

ప్రొఫెసరు జయరాం ముఖంలో రంగులు మారాయి.

ప్రత్యర్ధికి యింత త్వరగా యిన్ఫర్మేషన్ ఎలా అందుతుంది....

తను పేర్లతో పాటు తాము ఎందు కొచ్చామో కూడా చెప్తున్నారు.

ఆ అగంతకుడు టైమ్ చూసి

"ఐదు నిమిషాలైంది....నీ యిష్ట దైవాన్ని ప్రార్ధించుకో" అన్నాడు.

ప్రొఫెసర్ జయరాం కళ్ళు మూసుకున్నాడు....

సేఫ్టీపిన్ రిలీజైన శబ్దం....అవి తన జీవితంలో చివరి క్షణాలను కున్నాడు.

"క్లిక్" ఛాంబర్ ఖాళీ....

పకపకమని వికృతంగా నవ్వాడు అగంతకుడు....

"మళ్ళీ ట్రిగ్గరు నొక్కాడు

"క్లిక్"....

"క్లిక్....క్లిక్ ...."

రిలాక్సయ్యాడు....ప్రొఫెసర్ జయరాం....చటుక్కున వెనక్కి తిరిగాడు కళ్ళకు గంతలుకట్టి ఉన్నాయి. నల్లటి ఫ్యాంట్, నల్లటిచొక్కాతో ఉన్నాడు అగంతకుడు....ప్రొఫెసరు జయరాం జేబులో చేయి పెట్టాడు. అతని చేతిలో మెరిసింది రివాల్వరు.

"నువ్వు పిచ్చి పని చేస్తావని నాకు తెల్సు ప్రొఫెసరు జయరాం.. అందుకనే నా అనుచరుల్ని నీ వెనకే ఉంచాను...." అని ప్రొఫెసరు జయరాం వెనకవైపుకు ఆందోళనగా చూసి "డోంట్ షూట్ హిమ్" అని పెద్దగా అరిచాడు. చాలా పాత ట్రిక్ అది....ఆ చటుక్కున వెనక్కి తిరిగాడు ప్రొఫెసరు జయరాం.... ఆ అవకాశాన్ని చక్కగా సద్వినియోగం చేసుకున్నాడు ఆ అగంతకుడు.

అతని కాలు బలంగా లేచి....ప్రొఫెసర్ జయరాం చేతిని విసురుగా తాకింది. అతని చేతిలో ఉన్న రివాల్వరు గాల్లోకి లేచింది....

మరుక్షణం గాల్లోనుంచి క్రిందకు జారుతున్న రివాల్వరును గాల్లోనే అందుకున్నాడు ఆ అగంతకుడు....

క్షణంలో సన్నివేశం మళ్ళీ అతని చేతిలోకే వచ్చింది

"మిష్టరు జయరాం....నిన్నిలా చంపను....చిత్రవధ చేసి చంపు తాను....ప్లీజ్ మూవ్" అతని కంఠం కరుగ్గా పల్కింది.

ప్రొఫెసరు జయరాం మెల్లగా కదిలాడు....

ఆ అగంతకుడ్ని ఏం చెయ్యాలా అని తీవ్రంగా ఆలోచించసాగాడు

కొంతదూరం వెళ్ళిన తర్వాత ఓ చెట్టు దగ్గర ఆగాడు ఆ అగంత కుడు. ఆ చెట్టు పైనుంచి తేనె మొద్దుమీదకు కారుతోంది....

కాళినంతమేర తేనె చుట్టు మూగి అటుయిటూ తిరుగుతున్నాయి కొన్ని వందల కొండ చీమలు

వాటిని చూడగానే ప్రొఫెసరు జయరాం వళ్ళు జలదరించింది....

"జయరామ్‌జీ....నేను నీకు వెయ్యబోయే చిత్రవధ యిదే...."అని వికృతంగా నవ్వి....ప్రొఫెసరు జయరాం బట్టలు ఊడదీసి ప్రొఫెసరును డ్రాయరుమీద....చెట్టుకు కట్టేసాడు....అక్కడ దొరికిన నారతాడుతో....

చెట్టుకు కట్టేసి ప్రొఫెసరు జయరాం వంక చూసి చిన్నగానవ్వాడు, పైనుంచి కారుతున్న తేనె యిప్పుడు డైరక్టుగా ప్రొఫెసరు జయరాం భుజం మీద పడి మెల్లగా శరీరమ్మీదకు జారుతోంది. చెట్టుమీద ఉన్న కొండ చీమలు. గబగబ అతని శరీరం మీద కురికాయి. సూదులు పెట్టి గుచ్చు తున్నట్లు విపరీతమైన బాధ....

"మిష్టర్ జయరాం....ఇకనైనా నిజం చెప్పు....ఆ కాపరుషీట్స్ ఎక్కడున్నాయి...." చిద్విలాసంగా నవ్వుతూ అన్నాడు.

"నాకు తెలియదు" అన్నాడు ప్రొఫెసరు పళ్ళ బిగువన బాధను భరిస్తూ....

కపర్థి ఎక్కడ ఉన్నాడు, కపర్థి వచ్చి రక్షిస్తే....బాగుండును.... అన్న కోర్కె బలంగా పెరిగింది....

బాధను భరించలేక

"కపర్ధీ....ఐయామ్ ట్రాప్డ్ ....ప్లీజ్ సేవ్ మీ...." అని పెద్దగా అరిచాడు. ఆ అరుపుకు ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు ఆ అగంతకుడు. ప్రొఫెసరు జయరాం అరిస్తే జరిగేదేవిటో అతనికి తెలుసు....

"నీ ఫ్రెండ్స్‌ను ఆ ఏనుగు ఎప్పుడో చంపేసి ఉంటుంది" అన్నాడు

"నో....నో....కపర్థి యీజ్ ఏ గ్రేట్ హీరో....హి విల్ కమ్.... వస్తాడు అతను తప్పక వస్తాడు" అన్నాడు....

"అతనొస్తే ఈ రివాల్వర్‌తో కాల్చి చంపుతాను....నీకు ఖచ్చితంగా అరగంట టైమ్ యిస్తున్నాను....ఈ అరగంటలో నిజం చెప్తే చెప్తావ్ లేక పోతే నిన్ను యిక్కడే వదిలేసి నేను వెళ్ళిపోతాను...." అన్నాడు ఆ అగంతకుడు. ప్రొఫెసర్ జయరాం ముఖంలో చావు భయం ప్రవేశించింది.

తాపీగా ఆ చెట్టు వెనక ఉన్న చెట్టు దగ్గరకు వెళ్ళి కూర్చున్నాడు "నీ ఫ్రండ్ వస్తే యిక్కడ నుంచే ముందు షూట్ చేస్తాను....మైండిట్" అనీ ఎవ్వరైనా వస్తున్నారా అని జాగ్రత్తగా చూడసాగాడు....

"కపర్థి సులోచన....ఏనుగును చంపిన తర్వాత.... ప్రొఫెసరు జయరాంను కల్సుకోటానికి వెనక్కి తిరిగారు....అడవిలో వాళ్ళు చాలా దూరం వచ్చారని అర్ధమైంది.

"ప్రొఫెసరు జయరాం ఎక్కడున్నాడో....మనకు ఎలా తెలుస్తుంది అన్నాడు కపర్థి....

"ఈ చిట్టడవిలో మనకు దారి తెలియదు. మనం గుడారం దగ్గరకు వెళదాం....ప్రొఫెసర్ కూడా అక్కడికే వస్తాడు" అంది సులోచన

"డోంట్ బి ఫూలిష్ ....ఆయన స్పృహ తప్పి పడిపోతే ఎలా వస్తారు....వెతుకుదాం పద"

ఇద్దరు ముందుకు నడవసాగారు....

ఎంతదూరం నడిచినా వాళ్ళకు ప్రొఫెసర్ జాడ కన్పించలేదు. సరిగ్గా అప్పుడు ఓ పెనుకేక ఓ ఫర్లాంగు దూరంలోనుంచి విన్పించింది.

"కపర్థి....సేవ్‌మి...." అని ఆ కేకకు ఎలర్టు అయ్యాడు కపర్థి.

"సులోచనా.... ప్రొఫెసర్‌ను ఎవరో బంధించారు....వాళ్ళు ఎవరో గాని....ఆయన్ని చిత్రహింసలు పెడ్తున్నారు" అన్నాడు

అతని వంక విచిత్రంగా చూసింది సులోచన

"అలా అని ఎలా చెప్పగలవు" అంది....

"ప్రొఫెసర్ జయరాం పెద్దవాళ్ళు....ఎంత బాధైనా ఓర్చుకుంటారు గాని....అలా వికృతంగా కేక పెట్టరు....సమథింగ్ రాంగ్ విత్ హిమ్" ఇద్దరు ఆ శబ్దం వచ్చిన వైపు అతి నిశ్శబ్దంగా కదిలారు....ఖచ్చితంగా ఐదు నిమిషాల్లో జయరాంను కట్టేసిన స్పాట్ ఎక్కడో అర్ధమైంది.

అప్పుడే ఆ అగంతకుడు చెప్తున్న మాటలు అతని చెవిన పడ్డాయి. తను డైరెక్టుగా వెళితే నిర్ధాక్షిణ్యంగా కాల్చేస్తాడని గ్రహించి సులోచనకు చెవిలో ఏదో చెప్పాడు....

సులోచన అలాగే అని తల ఊపి ముందుకు వెళ్ళింది.

కపర్ధి చెట్లతోపు వెనక్కి వెళ్ళాడు....

ప్రత్యర్ధి చాలా ఎలర్టుగా ఉంటాడని తెలుసు....అందుకే ట్రాప్

సరిగ్గా అదే సమయంలో ముందుకు వచ్చిన సులోచనను చూసి కంగారు పడ్డాడు ప్రొఫెసర్ జయరాం....

వెనక చెట్టు దగ్గర ఉన్న అగంతకుడు రివాల్వర్‌తో కాల్చేస్తాడేమో నని అనుమానం కల్గింది....

"అమ్మా సులోచనా....ముందుకు రావద్దు....రావద్దు" గొంతుచించుకు అరిచాడు ప్రొఫెసర్ జయరాం....

ప్రొఫెసర్ గొంతు విని చటుక్కున లేచాడు ఆ అగంతకుడు....

సులోచనను చూసి రివాల్వర్ ఎయిమ్ చేసాడు.

సులోచన ప్రొఫెసరు జయరాం పరిస్థితి చూసి దిగ్భ్రాంతి చెందింది. చటుక్కున ముందుకు అడుగువేసింది.

ఆ అగంతకుడు ట్రిగ్గర్ నొక్కాడు....

"ధన్" మనే శబ్దం....

జయరాం కళ్ళు మూసుకున్నాడు.

ఆ అగంతకుడి చేతిలో రివాల్వర్ ఎగిరిపోయింది.

ఆశ్చర్యంతో వెనక్కి తిరిగి చూసాడు ఆ అగంతకుడు. వెనక నిలబడి ఉన్నాడు కపర్ధి....చిన్నగా చిరునవ్వు నవ్వుతూ.

మరుక్షణం ఆ అగంతకుడి ముఖం తెల్లగా పాలిపోయింది....

"ఊఁ....ఎవరు నువ్వు...." సీరియస్‌గా అడిగాడు కపర్ధి....

ఆ వ్యక్తి మాట్లాడలేదు....ఈలోగా సులోచన గబగబ వెళ్ళి ప్రొఫెసరు జయరాం కట్లు విప్పింది....అక్కడున్న ఆకులు పిండి....చీమలు కుట్టిన చోట రాసింది. జయరాం బట్టలు వేసుకున్నాడు....

ఈలోగ కపర్ధి ఆ అగంతుడ్ని చెట్టుకు కట్టేసాడు....డ్రాయర్‌తప్ప బట్టలు అన్నీ తీసేశాడు....

"ఊఁ....నీ పద్ధతి....నీ మీదనే ప్రయోగిస్తున్నాం....నువ్వెవరో చెప్పు....నిన్నెవరు పంపించారో చెప్పు" అన్నాడు....

"నేను చావనైన ఛస్తాను గానీ....వాళ్ళ పేర్లు చెప్పను" అని బింకంగా అన్నాడు....

అతనో ప్రొఫెషనల్ అని పూర్తిగా అర్ధమైంది....

ఎంత చిత్ర వధ చేసినా ప్రొఫెషనల్స్ ఏ రహస్యం లీక్ కానివ్వరు....

"సరే నీ కర్మ....నిన్నిక్కడే వదలి వెళతాము. రాత్రంతా చీమలకు విందువుకా...." అన్నాడు కపర్ధి.

"నన్ను ఏదలకపోతే....మీరు కష్టాల్లో పడ్తారు...." అన్నాడు

"డోంట్ బి సిల్లీ....ఇప్పుడు నువ్వు పెద్ద కష్టంలో ఉన్నావు, నిన్ను నువ్వే రక్షించుకో" అని జేబురుమాలు అతని నోట్లోకుక్కిచిన్నగా నవ్వాడు.

"ఇప్పుడు నువ్వు అరవాలన్నా అరవలేవు....గుడ్‌బై...." అని జయరాం వంక తిరిగి....

"రాత్రవుతుంది....బయలుదేరుదాం పదండి" అన్నాడు

ముగ్గురు బయలుదేరారు....

చెట్టుకు కట్టేసిన అతను విపరీతంగా గింజుకుంటున్నాడు. అప్పటికే చీమలు అతన్ని చుట్టుముట్టాయి....

అడవి అంతా పూర్తి చీకటి పడ్డట్లు గబ్బిలాలు "కీ" అని అరుస్తూ కపర్థి ముఖం మీదుగా వెళ్ళాయి. ముగ్గురు గుడారాలవైపు వేగంగా నడవ సాగారు.

## 10

సాయంకాలానికి అందరూ గుడారాలకు చేరుకున్నారు....

యశ్వంత్–అక్షత, ప్రియంవద చంద్రహాస్, కపర్థి సులోచన ప్రొఫెసరు జయరాం....వాళ్ళ వాళ్ళ అనుభవాలు ఒకళ్ళకొకళ్ళు చెప్పు కున్నారు. అంధరికి మొదటి రోజు అనుభవం భయంకరంగా ఉన్నప్పటికి ఎగ్జైటింగ్‌గా ఉంది....

సింహాసనం కోసం అన్వేషణ ప్రమాదభరితమైనది అయినప్పటికి ఎట్లాగైనా దాన్ని సాధించాలనే పట్టుదల వాళ్ళ అందరిలో పెరిగింది....ఆ రాత్రి గ్యాస్‌లైట్ల వెలుగులో అందరూ భోజనం చేసారు....కుక్ వెంకట స్వామి అద్భుతంగా, మటన్, చికెన్ చేసాడు.

అందరూ తృప్తిగా భోజనం చేసారు.

భోజనం అయిన తరువాత, కపర్థి, ప్రియంవద, ప్రొఫెసర్ జయ రాం ప్రత్యేకంగా సమావేశమయ్యారు....సింహాసనం అన్వేషణ గురించి విపులంగా చర్చించుకోవటానికి

ప్రొఫెసర్ జయరాంకు వాళ్ళిద్దరి మీద అపారమైన నమ్మకం వుంది. వాళ్ళకు ఏ విషయం చెప్పినా బైటికి లీక్ కాదని అతని నమ్మకం.

"ఈ రోజు ఎవరో నా మీద కాల్పులు సాగించారు" ఉపోద్ఘాతంగా అన్నాడు జయరాం....

"మామీద కూడా ఎవరో కాల్పులు సాగించారు...." ప్రియంవద అన్నది.

"మీమీద...." ఆశ్చర్యంగా అన్నాడు ప్రొఫెసరు....

"ఎవరు ....వాళ్ళు....?" అడిగాడు కపర్ది....

"తెలియదు...."

"ఎవరోగాని ఈ ఎక్స్‌పెడిషన్ ప్రారంభించిన దగ్గర నుంచి మనల్ని వెంటాడుతున్నారు...." అన్నాడు జయరాం....

అప్పుడు కపర్దికి గుర్తుకు వచ్చింది....తాను, సులోచన కలిసి ప్రొఫెసరు జయరాం దగ్గరకు వస్తుంటే కారులో ఫాలో అయిన వాళ్ళు.... అదే విషయం చెప్పాడు....

"అంటే....నువ్వు నన్ను కలవబోతున్నావు అనే విషయం మన ప్రత్యర్థులకు ముందే తెలుసన్నమాట" అన్నాడు ప్రొఫెసరు

"అవును"

"వాళ్ళెవరోగాని మీ యింట్లోనే ఉన్నారు." సులోచన అంది.

"ఐడోంట్ థింక్ సో...." సాలోచనగా అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

"అయితే వాళ్ళెవరు"

"అదే నాకు అర్థంకావటంలేదు....“నా యింట్లో నుంచి రహస్యాలు బైటికి వెళుతున్నాయంటే “ఎలా వెళుతున్నాయి....చంద్రహాస్, యశ్వంత్ నా అసిస్టెంట్స్ - అక్షత యీజ్ మైడాటర్.... వీళ్ళల్లో ఎవ్వరు రహస్యాలు లీక్ చేసేవాళ్ళులేరు" అన్నాడు ప్రొఫెసర్ జయరాం....

"ఈ విషయం తర్వాత ఆలోచిద్దాం .... రేపటి మన ప్రోగ్రాం ఏమిటి?" అడిగాడు కపర్ది....

"ఈ రోజు జరిగిన అనుభవాల్నిబట్టి రేపు మనం రెండుబ్యాచ్‌లుగా వెళదాం.... రెండు బ్యాచ్‌లు రెండు డైరక్షన్స్‌లో వెతికితే ఫలితం ఉంటుంది. ఎవరికయినా ప్రమాదం జరిగినా రెస్క్యూ చెయ్యొచ్చు" అన్నాడు ప్రొఫెసర్ జయరాం....

"మీ ఆలోచన బావుంది.... రెండు బ్యాచ్‌లు ఎలా డివైడ్ చేస్తారు"

"నేను మీరు, మీ సెక్రటరీ ఓబ్యాచ్ .... మనం రేపు కొండల్లోకి వెళదాం.... అక్షత యశ్వంత్ ప్రియంవద చంద్రహాస్ రెండో బ్యాచ్‌వాళ్ళు అడవిలో వెతుకుతారు....మన టార్గెట్ పాడుపడ్డ హరిహర ఆలయం...."

స్పెన్సర్ చుట్ట పెదాల మధ్య బిగించి వెలిగిస్తూ అన్నాడు ప్రొఫెసర్.

"ఇక్కడ ఉండే ట్రైబల్స్‌నుగాని.... ఫారెస్టురేంజర్స్‌నుగానిపాడు బడ్డ ఆలయం ఎక్కడన్నా ఈ ప్రాంతంలో ఉందేమోనని అడిగితే మనకు కావల్సిన ఇన్‌ఫర్మేషన్ దొరుకుతుంది కదా"

"పదహారో శతాబ్దంనాటి హరిహర ఆలయం, ఆలయంగా ఉండక పోవచ్చు.... ఎనిథింగ్ మిస్టీరియస్ ప్లేస్ కనపడినా దాని గురించి నాకు ఇన్ ఫామ్ చేయండి...." అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

"అంటే.... హరిహర ఆలయం లేకుండా మరే ఆలయంఉంటుంది"

"ఒకనాటి బౌద్ధారామాలు శంకరాచార్యులు వలన శివాలయాలుగా మారాయి.... వీరశైవం విజృంభణలో హరిహరాలయం శివాలయంగా మారవచ్చు.... వైష్ణవాలయంగా మారవచ్చు, శక్తి ఆలయంగా మారవచ్చు.... ఈ నాలుగు వందల సంవత్సరాల్లో ఆ ఆలయం ఏ విధంగా మారిందో ఎవరు చెప్పగలరు...."

ప్రొఫెసర్ జయరాం చెప్పిన దాంట్లో లాజిక్ కనపడింది....

కాలం దేవతల అస్తిత్వాన్నే మార్చివేస్తుంది....

"ఓ. కే. మీరు చెప్పింది బాగానే వుంది .... రేపు ఉదయం మళ్ళీ కలుద్దాం" అన్నాడు కపర్ది.... అప్పటికే సమయం రాత్రిపదకొండు గంట లౌతుంది.... జయరాం కూడా లేచాడు.

ప్రియంవద ఆడవాళ్ళ గుడారంలోకి వెళ్ళింది.

కపర్ది, జయరాం, వాళ్ళకు కేటాయించిన పడకలమీదపడుకున్నారు. రాత్రంతా దీర్ఘంగా ఆలోచిస్తూ ఎప్పటికో నిద్రపోయాడు ప్రొఫెసర్ జయరాం.

* * *

పక్షుల కిలకిలా రావాలతో తెల్లవారింది.

బాలభానుడి లేతకిరణాలు అడవిని చీల్చుకొని ప్రతి గడ్డిపోచమీద ప్రసరించి బంగారు కాంతులీనుతున్నాయి....

రాత్రంతా నెగడు వెలిగించి క్రూరమృగాలు రాకుండా మేల్కొన్న కుక్ అసిస్టెంట్ నిద్రకు జోగుతున్నాడు....

ప్రొపెసరు జయరాం ఆవులిస్తూ లేచి బయటికి వచ్చాడు....

అప్పటికే కపర్ధి లేచి వెంకటస్వామి ప్రక్కకు చేరి వేడి వేడి"టీ" తాగుతున్నాడు.

"ఇంత ఉదయాన్నే నీకు పాలు ఎక్కడ దొరికాయి" అడిగాడు కపర్ది....

"పాలు లేవండి ........ మిల్క్‌మెయిడ్ డబ్బాలు .... ఆ పాలే మీకిచ్చాను...."

"కండెన్స్‌డ్ మిల్క్....టేస్టీ.... వండర్ ఫుల్ ........" అన్నాడు కపర్ధి ప్రొఫెసరు జయరాం రావటంచూసి.

గుడ్ మార్నింగ్ ప్రొఫెసర్ జీ" అన్నాడు....

"గుడ్ మార్నింగ్" విష్ చేశాడు....

"రాత్రి మన గుడారాల దగ్గర పులి తచ్చాడింది అట"

"పులి" అప్పటి వరకు ఆయనకున్న మత్తు ఒక్కసారి దిగింది....

"అవును ప్రొఫెసర్ జీ.... మన వెంకటిస్వామి నెగడునుంచి రెండు మండుతున్న కట్టెలు దానిమీదకు విసిరేసాడట...."

"వెంకటస్వామి కథలు బాగా చెప్తాడు...." ప్రొఫెసర్ జయరాం అన్నాడు....

"కథలు కాదుసార్....నిజం రాత్రిపులొచ్చింది....నాకు చాల భయం వేసింది.... మీ గుడారాలలో జొరబడుతుందేమోనని కాలుతున్న కట్టెలు

విసిరేసాను....” అన్నాడు వెంకటస్వామి. అతని మాటలు నమ్మకం కలి గించేటట్లుగానే ఉన్నాయి.

“నాక్కూడా ఓ కప్పుచాయ్‌యివ్వు” అన్నాడు ప్రొఫెసర్....

ఆ కప్పులో వేడి వేడి టీపోసి యిచ్చాడు వెంకటస్వామి....

“నిన్న....నువ్వు కాల్చిన టైగర్....మాన్‌ఈటర్ అయ్యిందేమో” చిన్నగా నవ్వుతూ కపర్ది వంకచూసి అన్నాడు....

“అంత త్వరగా మాన్‌ఈటర్ అవ్వదులెండి.... అన్నాడుకపర్ది....

దూరంగా యశ్వంత్ వస్తున్నాడు....

అంత ఉదయాన్నేలేచి యశ్వంత్ ఎక్కడికి వెళ్ళాడు....

యశ్వంత్ దగ్గరికి వచ్చాక అడిగాడు....

“ఎక్కడినుండి.... యింత ఉదయాన్నే ఎలా లేచావు”

“జాగింగ్‌కువెళ్ళి వస్తున్నాను....” చెప్పాడు యశ్వంత్.

ఎందుకో ఆ మాట అబద్ధం అని అన్పించింది ప్రొఫెసర్‌కు....

“ఇది కర్నాటక అరణ్యం.... యిక్కడ జాగింగ్‌కువెళితే.... మిగి లేది....మన అస్థిపంజరమే.... జాగ్రత్త....” అన్నాడు కపర్ది....

యశ్వంత్ లోపలికి వెళ్ళాడు....

దగ్గర్లోనే ఓ చిన్న సరస్సు వుంది.... కాలకృత్యాలు తీర్చుకోటా నికి అటువైపు కదిలాడు కపర్ది....

ఖచ్చితంగా అరగంటలో అందరు రెడీ అయిపోయారు....

అప్పటికి వెంకటస్వామి వేడి వేడి పూరి, చపాతీలు చేశాడు - అందరూ టిఫిన్‌చేసి బ్యాగ్స్ తీసుకొని బయలుదేరారు....

“ఈ రోజు కేవలం రెండు బ్యాచెస్ ....” అని రెండు బ్యాచ్‌లు ఎవరెవరో చెప్పాడు ప్రొఫెసర్ జయరాం....

“నిన్న కొండవైపు వెళ్ళిన వాళ్ళు ఈ రోజు అరణ్యం....

నిన్న అరణ్యంలోకి వెళ్ళిన వాళ్ళు కొండల్లోకి బయలుదేరాలి ....

అని ఎనౌన్స్ చేసాడు కపర్ది ........ రెండు బ్యాచ్‌లు అన్వేషణకు బయలుదేరాయి....

## 11

గతరాత్రి.... పన్నెండు గంటలు వెనక్కి వెళితే....

భయంకరంగా కుడుతున్న చీమల్ని ఏమీ చెయ్యలేక గిలగిలా కొట్టుకోసాగాడు ఆ అగంతకుడు.

కపర్ది, జయరాంవెళ్ళి చాలాసేపు అయ్యింది....

రాత్రి భయంకరంగా పరుచుకుంటోంది.

ఆ అగంతకుడు గిలగిల లాడిపోతున్నాడు....

క్రూరమృగాలు వికృతంగా అరుస్తున్నాయి....

ఎవరైనావచ్చి హెల్ప్ చేస్తారేమోనని ఎదురుచూస్తున్నాడు.

శరీరం రక్తం ముద్దయిపోతోంది.

ఖచ్చితంగా అప్పుడు రాత్రి పదిగంటలైంది....

అప్పటివరకు మెస్సెజ్ రాకపోయేసరికి కొంతమంది అనుచరుల్ని అడవిలోకి పంపాడు కాశీచరణ్.

కాశీచరణ్ ఆ అడవికి మకుటంలేని మహారాజు.

అతని గురించి ముందు ముందు తెలుస్తుంది.

కొండ చీమల గాట్లకు స్పృహతప్పి పడిపోయాడు....

అప్పుడు వచ్చారు అనుచరవర్గం అక్కడికి....

గబగబ అతని దేహాన్ని చెట్టుమీదనుంచిలేపి క్రింద పెట్టారు....

అతనికి స్పృహతప్పింది. కానీ ప్రాణాపాయంలేదని అర్థమైంది.

అతన్ని భుజాలమీద మోసుకుంటూ అడవికి మరోవైపున వున్న వ్యాన్ దగ్గరకు వెళ్ళారు. వ్యాన్‌లో అతని శరీరాన్ని పడేసి అందరూవ్యాన్ ఎక్కారు.

మరుక్షణం వ్యాన్ స్టార్టయింది....

ఖచ్చితంగా ఓ అరగంట తర్వాత .... ఆ అడవిలో వున్న గెస్టు హౌస్ ముందున్నారు.

అతని శరీరాన్ని తీసుకొని లోపలికి వెళ్ళారు....

ఓ బెడ్‌మీద అతని శరీరాన్ని పడేసి ఓ గదిలోకి వెళ్ళారు ....

ఆ గదిలో ఓ స్త్రీని కౌగలించుకొని పడుకొని ఉన్నాడు కాళీచరణ్ .... మరో స్త్రీ అతనికి గ్లాసులో స్కాచ్‌పోసి యిస్తోంది.

"బాస్.... వాళ్ళు తప్పించుకున్నారు....

"కపర్ది.... తప్పించుకున్నాడా...."

"యస్.... బాస్ .... కపర్ది.... ప్రొఫెసరు జయరాం తప్పించుకున్నారు. మనవాడు దెబ్బతిన్నాడు"

ఒక్కసారి అతనికి మందు దిగిపోయింది.

"పరమ హంసకు తెలిస్తే మన పరువు పోతుంది"

"బాస్ రేపు మన పని పూర్తిచేస్తాం" అన్నారు.

"ప్లీజ్.... యు కెన్‌గో" అన్నాడు....

అందరూ అక్కడినుంచి వెళ్ళిపోయారు....

మరుక్షణం ఫోన్ మ్రోగింధి. ఫోన్ ఎత్తాడు

అవతలివైపునుంచి పరమ హంస.

"పని పూర్తయిందా కాళీచరణ్"

"సారీబాస్.... కపర్ది, జయరాం తప్పించుకున్నారట"

"కాపర్ షీట్స్"

"దొరకలేదు.... బాస్ ...."

"ఐతే.... రేపు సాయంకాలానికి కాపర్‌షీట్స్ ఎట్టి పరిస్థితులోనైన సంపాదించు.... లేకపోతే పరిణామాలు చాలా తీవ్రంగా ఉంటాయి"

"అలాగే" అతను ఫోన్‌పెట్టేసాడు....

కాళీచరణ్ ముఖమంతా జేవిరించి వుంది. సరిగ్గా అదే సమయంలో అతని కౌగిలిలోవున్న అమ్మాయి కదిలింది.

"యు బ్లడీబిచ్ గెట్‌వుట్" ఆవేశంగా అన్నాడు కాళీచరణ్

ఆ అమ్మాయి భయం భయంగా అక్కడినుండి పరిగెత్తింది.

సరిగ్గా అదే సమయంలో ఫోన్ పెట్టేసి తీవ్రంగా ఆలోచించాడు పరమహంస....

కాళీచరణ్ ప్రయత్నించినా కాపర్ షీట్స్ దొరకలేదంటే కపర్థిచాలా జాగ్రత్తగా ఉన్నాడన్న మాట.... కపర్థిని లేపేస్తేనే ప్రొఫెసర్ జయరాం దగ్గరనుండి కాపర్ షీట్స్ లభిస్తాయి. సరిగ్గా అప్పుడే వైర్‌లెస్ రూమ్‌లో ఏదో మెస్సేజ్ వచ్చినట్లు "బీప్....బీప్" మని మ్రోగింది. పరమహంస గదిలోకి వెళ్ళాడు.

"హలో....ఏజంట్ వైస్పీకింగ్....

"యస్.... గురుస్వామి స్పీకింగ్ ........" స్వామి పరమహంస అన్నాడు....

"ఈ రోజు మీరు అనవసరంగా మా వాళ్ళమీద కాల్పులు సాగించారు....

దానివలన ఉపయోగం ఏమీలేదు" అన్నాడు ఏజంట్ వై....

"కాళీచరణ్‌కు చెప్పవలసినది చెప్పాను.... మీమీద ఎటాక్ చేయించాడా.... ఆ డర్టీ బాస్టర్డ్" కోపంగా అన్నాడు స్వామి పరమహంస.... ప్లేటు మారుస్తూ.

"ఈ ఏస్సైన్‌మెంట్‌లో వాళ్ళు చచ్చిపోతే .... మీకు స్వర్ణసింహాసనం దక్కదు...." కంగారుగా అన్నాడు ఏజంట్‌వై ....

"మరీ నువ్వే .... ఆ కాపర్ షీట్స్ కోసం వాళ్ళమీద ఎటాక్ చెయ్యమంది"

"కాపర్‌షీట్స్.... దొంగిలించమన్నానుగానీ ...వాళ్ళందర్ని అంతం చెయ్యమనలేదు"

"ఓ. కే.... నేను వెంటనే కాళీచరణ్‌ను కాంటాక్ట్ చేస్తాను. యికనుంచి నువ్వుకూడా కాళీచరణ్‌ను కాంటాక్ట్ చెయ్యి .... కాళీచరణ్ కోడ్....

"టూథౌజండ్ మిరకల్స్"...."అలాగే...."

"అలాగే.... సార్.... ఎస్సైన్‌మెంట్ పూర్తి అయ్యేవరకు మా జోలికి రావొద్దని చెప్పండి...."

"మరి నువ్వే కపర్థిని లేపెయ్యమని అడిగావు...." చివరగా స్వామి పరమహంస అన్నాడు....

"ఇప్పుడు మా ఎక్స్‌పెడిషన్ ఫ్రూట్‌ఫుల్ అయ్యే దశలో ఉంది....

కపర్థి కూడా దాని మీదే ఏకాగ్రతగా ఉన్నాడు .... నన్ను ఏమీ అనుమానించటంలేదు.... అతను ఉంటేనే స్వర్ణ సింహాసనం దొరికేటట్లు ఉంది!"

"దెన్.... మరో రకంగా ఆ షీట్స్ తెప్పించే ప్రయత్నం చేయిస్తాను.....

"నో బ్లడ్ డ్రాప్ సార్"

"ఓ. కే.... డన్...." సెట్ ఆఫ్ చేశాడు....

స్వామి పరమహంస ముఖం యిప్పుడు ప్రశాంతంగా ఉంది....

గోల్డెన్ థ్రోన్ ఆపరేషన్ సక్సస్ అయితే కొన్ని వందల కోట్ల రూపాయలు తనవి అవుతాయి. ఈ దేశంలో తనను ఎదిరించే శక్తివుండదు ఏదో ఆలోచనవచ్చి.... మరో గదిలోకి వెళ్లాడు.

అక్కడ రకరకాలైన పరికరాలున్నాయి .... అది అతని మాస్టర్ కంప్యూటర్ యూనిట్....

ఓ పరికరం దగ్గిరకువెళ్ళి బటన్ నొక్కాడు.

కంప్యూటర్ డిస్‌ప్లే మీద.... గీతలు, గీతలుగావచ్చి క్లియరైంది.

దానిలో కాశీచరణ్ ముఖం....

స్వామి పరమహంస కుడి భుజం, ఎడమభుజం .... ధనరాజ్ .... కాశీ....

వాళ్ళవల్లనే గురుస్వామి.... స్వామి పరమహంస అయ్యింది....

ధనరాజ్ ఆధ్వర్యంలో విగ్రహాల స్మగ్లింగ్ జరుగుతుంది.

ధనరాజ్ ఆంధ్రాబెల్ట్‌కు, కాశీ కర్నాటక బెల్ట్‌కు మినీబాస్‌లు....

రక్తం చిందించకుండా చట్ట వ్యతిరేక పనులు చేయటం స్వామి పరమహంస ముఖ్యోద్దేశం....

కర్నాటకలోని.... అటవీ సంపద స్మగుల్డ్ చేయటానికి....

స్థానిక ప్రజల సహకారం కావల్సివచ్చింది....

అందుకనే కాశీచరణ్ హంజారా జాతితెగకు కావల్సిన సమస్తసదుపాయాలు చేశాడు....

అంతవరకు.... వాళ్ళ పుట్టతేనెను, చింతపండును.... యింకా రకరకాల వస్తువులను ఆటవీకుల దగ్గరనుంచి అతితక్కువ ధరకు కొనుగోలు చేసి దాన్ని మార్కెట్‌లో విపరీతమైన ధరకు అమ్మేవాళ్ళు దళారి వ్యాపారస్తులు....

కాశీచరణ్ ఆ విధానానికి స్వస్తి చెప్పించి....

వాళ్ళ దగ్గర సరుకుల్ని.... వాళ్ళు ఊహించలేనంత రేటు యిచ్చి కొని దాన్ని మార్కెట్‌కు పంపిస్తూ ఉండేవాడు. వాళ్ళకు కావాల్సినసమస్త సదుపాయాలు చేయించాడు.

దాంతో అతను వాళ్ళ దృష్టిలో దేవుడై పోయాడు....

అక్కడనుంచి మెల్లమెల్లగా వాళ్ళచేత గంధంచెట్లు కొట్టించి ఏనుగుల్ని చంపించి ఏనుగుదంతాలు సేకరించి.... భారతదేశంలో అతి అరుదుగా లభ్యమయ్యే కస్తూరి మృగాన్ని వాళ్ళచేత పట్టించి ........ కస్తూరి తీయించి....

కోట్ల కోట్ల లాభాలు సంపాదించాడు....

ఆ లాభాల్లో స్వామి పరమ హంసకు సగం వాటా, కాశీచరణ్‌కు సగంవాటా."

పరమహంస ద్వారా రాజకీయ అడ్డంకుల్ని, అధికారుల అడ్డంకుల్ని తొలగించుకుంటూ ఉండేవాడు.

ఓ విధంగా కాశి పరమహంసకు అనాథ్‌రైజ్డ్ ఏజంట్....

స్వామి పరమహంస.... కంప్యూటర్‌లో కనపడుతున్న కాశీచరణ్ వంక చూసాడు....

"ఏజంట్ వై.... కపర్ది, ప్రొఫెసర్ జయరాం మీద ఎటాకింగ్ వద్దంటున్నాడు

"వాళ్ళను నువ్వు హెరాస్ చేశావట దీనికి నీ సంజాయిషీ ఏమిటి ?

"మీరు ఎటాక్ చెయ్యమంటే....మా వాళ్ళు కొంచెం పైస్థాయిలో ఎటాక్ చేశారు.

"ఆ రకమైన ఎటాకింగ్ ద్వారా మన ఆపరేషన్ ఫెయిల్ అవుతుంది...."

"మరెలా చెయ్యమంటారు" అడిగాడు కాళీచరణ్.

"వాళ్ళకు తెలియకుండా.... నాచురల్ డిస్ట్రిబెన్స్ ద్వారా.... వాళ్ళ దగ్గరనుంచి ఆ రహస్యం.... లాగాలి.... వాళ్ళకు ఏ మాత్రం అనుమానం రాకూడదు...." గంభీరంగా అన్నాడు పరమహంస....

"అలాగేసార్...." అన్నాడు కాళీచరణ్.

"ఏజెంట్.... వై నిన్ను కంటాక్ట్ చెయ్యొచ్చు....కోడ్ థౌజండ్ మిరకల్స్, అతనికి కావాల్సిన సహాయ సహకారాలు అందించు...."

"అలాగే.... సార్...." కాళీచరణ్ ముఖం స్క్రీన్ మీద అదృశ్యమైంది....

పరమహంస దీర్ఘంగా నిట్టూర్చి....

తన గదిలోకి వచ్చాడు....

గదిలోకి విన్సెంట్ వచ్చి ఉన్నాడు....

"ఎనిథింగ్.... ఎబౌట్.... గోల్డెన్ థ్రోన్...." అడిగాడు.

"స్పెసిమన్స్.... యింకో రెండు రోజులలో వస్తాయి...."

"మొరాజో రాజుకు స్వర్ణసింహాసనం గూర్చి యిన్ఫర్మేషన్, దాని బ్రోచర్ స్పెసిమన్స్.... కావాలి" అన్నాడు విన్సెంట్....

"త్వరలో వస్తాయి.... దాని ఫోటోగ్రాఫ్‌తోసహా"

"ఓ. కే— మీకన్‌సైన్‌మెంట్ ఎప్పుడు బయలుదేరుతుంది."

"రేపు జపాన్‌షిప్‌లో ఆ కన్‌సైన్‌మెంట్ వస్తుంది. నీ బుద్ధ విగ్రహం షిప్ ఎక్కగానే డైమండ్స్ నాకు యివ్వాలి"

"అలాగే" అన్నాడు విన్సెంట్—

పరమహంస కళ్ళుమూసుకొన్నాడు. విన్సెంట్ వెళ్ళిపోయాడు.

కాళీచరణ్ జీప్‌లో హంజారా జాతినాయకుడు యింటికి వెళ్ళాడు....

"కాళీగారొచ్చారు....పెద్ద దొర వచ్చిండు" అని అందరికి తెలిసి పోయింది.

కాళి గూడెంలోకి ఎప్పుడో గాని రాడు. అతని అనుచరుల ద్వారా గూడేనికి కబురు పంపుతాడు....కాళి వచ్చాడు అనగానే నాయకుడు గబగబ యింట్లో నుంచి వచ్చాడు.

అమ్మోరి విగ్రహంముందు కుర్చీలోకూర్చుని ఉన్నాడు కాళీచరణ్.

"ఏం దొర. ..పొద్దునే వచ్చావు" నాయకుడు అడిగాడు....

"ఈ వేళ....అడవిలో కొత్తవాళ్ళు తిరుగుతున్నారు. వాళ్ళను బంధించి తీసుకురా" చెప్పాడు కాళీచరణ్.

"ఎవ్వరు దోరా ఆళ్ళు....,"....

"ఎవ్వరైనా మన శత్రువులు...."

"ఆళ్ళను....మామూలుగా తెమ్మంటారా....స్పృహ తప్పించమంటారా దొరా"

"వాళ్ళను స్పృహ తప్పించి....నా విడిదిలోకి తీసుకురండి"అన్నాడు కాళి....

మరుక్షణం ఓ ముప్పైమంది కోయవాళ్ళు విల్లంబులతో బయలుదేరారు. వారిలో ఓ వ్యక్తి దగ్గర ఓ బుట్ట వుంది.

ఆ బుట్టలో ఉన్నాయి....కుట్టగానే నొప్పి తెలియకుండా స్పృహ పోగొట్టే తేనెటీగలు....వాటిని ప్రత్యేకంగా ఆఫ్రికా నుంచి తెప్పించి అభివృద్ధి పరుస్తున్నాడు కాళీచరణ్....

అతని దగ్గర తేనెటీగల్లోనే అనేక రకాలున్నాయి.

కుట్టగానే అతి భయంకరంగా మరణించే తేనెటీగ దగ్గరనుంచి కేవలం నొప్పి తెలియకుండా స్పృహ తప్పించే తేనెటీగల వరకు చాలా రకాలున్నాయి.

నాయకుడితో పాటు, నాయకుడి తమ్ముడి కూతురు పుత్లీకూడా బైటికి వచ్చింది.

పుత్లీ కి కాళీచరణ్‌ను చూస్తే విపరీతమైన కోపం....

ఆ కోపానికి అర్ధం వుంది....

"ఆ కోపానికి కారణం వుంది....

ఆమె వంక చూసి తన విడిది గృహములోకి వెళ్ళాడు కాళి.

ఆ గూడెంలో ఓ ప్రక్కగా వుంది అతని విడిది గృహం....

## 12

ప్రియంవద చంద్రహాస్.

యశ్వంత్-అక్షత

అరణ్యంలో నడుస్తున్నారు ఉదయ శోభలో అరణ్యం మనోహరంగా వుంది. కుందేళ్ళు ముద్దుముద్దుగా ఎగురుతున్నాయి. దుప్పులు వాళ్ళ ముందు నుంచి వేగంగా కదుల్తున్నాయి.

నలుగురు మౌనంగా నడక సాగించారు....

నలుగురు ఒకరితో ఒకరు మాట్లాడుకోవటానికి యిబ్బందిగా ఫీలవ్వ సాగారు. ఏమన్నా మాట్లాడితే ప్రక్క వాళ్ళు ఏమనుకుంటారేమో అన్న ఫీలింగ్....యశ్వంత్‌కు అక్షతతో మాట్లాడాలని వుంది.

చంద్రహాస్‌కు ప్రియంవదతో మాట్లాడాలని వుంది.

ఓ గంట నలుగురు నడిచిన తరువాత చంద్రహాస్ అన్నాడు.

"మనం నలుగురం కలిసి వెళ్ళటం వలన ఉపయోగం లేదు....ఓ పంద గజాల దూరంలో యిద్దరం యిద్దరం వేరువేరుగా సెర్చ్ చేద్దాం ఏదన్నా జరిగినా గట్టిగా అరిస్తే రెండో వాళ్ళు రావచ్చు...." అనిఅన్నాడు.

ఈ ప్రపోజల్‌కు యశ్వంత్ వెంటనే ఒప్పుకున్నాడు.

"మాకు....మీకు బాగుంటుంది" అన్నాడు....వెంటనే నలుగురు రెండు బ్యాచ్‌లుగా విడిపోయారు....

యశ్వంత్ అక్షత వంద గజాల దూరంలో, ప్రియంవద చంద్రహాస్‌ల నుంచి విడిపోయి నడుస్తున్నారు.

"అక్షతా...." పిల్చాడు యశ్వంత్....

"ఏమిటి...." అంది అక్షత....

"మీ నాన్నగారికి నిన్న ఏమన్నా 'క్లూ'స్ దొరికాయా...."

"ఏమీ దొరకలేదు...." అంది అక్షత....

"ఆ కొండకన్నా ఈ అడవే నయంగా ఉంది" నిన్నటి అనుభవాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ అన్నాడు.

అతని దృష్టి పథం నుంచి చంద్రహాస్, ప్రియంవదలు అదృశ్యమయ్యారు....

"అడవిలో ఉండే బాధలు అడవిలో ఉంటాయి" చెప్పింది అక్షత.

"ఈ అడవుల్లో క్రూరమృగాల బాధ ఎక్కువ...." అన్నాడు యశ్వంత్.

"నువ్వు ప్రక్కన ఉంటే అడవిలోనైనా హాయిగానే ఉంటుంది" నవ్వుతూ అంది అక్షత....

"ఐ లవ్ యూ అక్షత" తన్మయంగా అన్నాడు యశ్వంత్....

"అంత ఆలస్యంగా నన్ను ప్రేమించారా?" చిరు నవ్వు నవ్వుతూ అంది.

ఆమె నవ్వు అమాయకంగా, అందంగా ఉంది....

"చేతిలో చెయ్యేసి చెప్పటానికి తగిన సమయం రావాలి కదా"

ఆమె అతని చేయి పట్టుకుంది.

యశ్వంత్ సమక్షంలో ఆమె మనస్సంతా ఉద్వేగంగా ఉంటుంది. ఆమెకు ముఖ్యంగా నచ్చేది అతని కళ్ళు.... ఆ కళ్ళల్లో ఓ విచిత్రమైన

ఆకర్షణ ఉంది. తేనె రంగులో ఉండి ఎదుటి వాళ్ళ గుండెల్లో గుబులు రేపుతూ ఉంటాయి. ఆ కళ్ళంటే ఆమెకు చాలా యిష్టం....

ఇద్దరు చాలా గుబురైన ప్రదేశంలోకి వచ్చారు....

చుట్టూ చెట్లు పుట్టలు పొదలు దట్టంగా ఉన్నాయి....

"ఝుయ్" మని మోత....

అక్షత తల పైకెత్తి చూసింది.

ఓ చెట్టుకు తేనె తుట్టె వేలాడుతుంది....చాలా పెద్ద తేనె తుట్టె అది, కొన్నివేల తేనెటీగలు "ఝుంకారం" చేస్తున్న శబ్దం అది. కాండానికి కొంచం పైన కొమ్మలు స్ప్రెడ్ అయ్యేచోట వుంది ఆ తేనె తుట్టె....

"యశ్వంత్ అటు చూడు....చాలా పెద్ద తేనె తుట్టె" వేలు పెట్టి చూపించింది.

యశ్వంత్ చూసాడు....

"దాన్లో చాలా తేనె ఉంటుంది...."దానివంక ఆశగా చూస్తూ అంది.

"ఉంటే మనకెందుకు" అన్నాడు యశ్వంత్....

"ఆ తేనె తుట్టెలోని తేనే నాక్కావాలి" అతని వంక చూసి కవ్వింపుగా అంది.

"తేనెటీగలు నిన్ను నన్ను కుట్టి పెడతాయి....వాటిని కదిలిస్తే...."

"మంటపెట్టి వాటిని అక్కడి నుంచి పోగొట్టు...." అంది"

"వద్దులే అక్షత....ఎందుకు రిస్కు...."

"ప్రేమించిన ప్రియురాలు అడిగిన చిన్న కోర్కె తీర్చకపోతే ఎలా" అంది.

ఆ మాటకు యశ్వంత్‌లో పట్టుదల రేగింది....

వెంటనే క్రిందపడ్డ ఎండుటాకుల్ని, కొమ్మల్ని....గడ్డిని పోగుచేసి లైటర్‌తో అంటించాడు....

భగ్గున అంటుకుంది మంట....,

ఆ మంట నుంచి ఘాటైన పొగ సుళ్ళు తిరుగుతూ ఆకాశంలోకి లేచింది. రెండే రెండు నిమిషాల్లో అక్కడ దట్టమైన పొగ ఏర్పడింది....

ఆ పొగకు తేనెటీగలు....తేనెతుట్టెను ఖాళీ చేసి పారిపోయాయి....

యశ్వంత్ మంటను ఆర్పి తేనె తుట్టె వంక చూసాడు....

అక్కడ దొరికే ఆకుల్ని దొన్నెగా చేసి....చెట్టు మీదకు ఎక్కి.... తేనెతుట్టెను గట్టిగా చేతుల్తో పిండాడు.... దొన్నెనిండా తేనె నిండుగా నిండింది. దాన్ని చెట్టు మీద నుంచి క్రింద ఉన్న అక్షతకు అందించాడు. అక్షత ఆ దొన్నె అందుకుంది.

తను అడిగిన వెంటనే చెట్టు ఎక్కి తేనెపట్టులో నుంచి తేనె తీసి నందుకు యశ్వంత్ మీద ఆమెకు అభిమానంగా ఉంది. మరుక్షణం చెట్టు దిగి వచ్చాడు.

అక్షత తేనె సగం తాగి మిగతా దొన్నె యశ్వంత్‌కు యిచ్చింది.

"తేనె ఎలా వుంది అక్షత...." అడిగాడు యశ్వంత్....

"ఒరిజనల్ తేనె యిదే నేను మొదటిసారి తాగటం....నిజంగా యిటీజ్ వెరీ టేస్ట్...."

దొన్నె తీసుకొని పెదవులకు ఆనించాడు....

సరిగ్గా అదే సమయంలో....

ఓ విచిత్రమైన అరుపు....గురకలాంటి అరుపు....

చేతిలో దొన్నెను అలానేపట్టుకొని ఆ అరుపు వచ్చిన వైపు తిరిగి చూసాడు మరుక్షణం.

అతని ఒళ్ళు జలదరించింది.

రెండు ఎలుగుబంట్లు...."ఊఁ...." అని అరుచుకుంటూ అతనివైపు రాసాగాయి....అక్షత భయంతో వెర్రికేక పెట్టింది....ఆ ఎలుగుబంటి దృష్టి కారుతున్న తేనెతుట్టె వంక పడ్డది. అందుకే అవి అంత త్వరగా అక్కడికి వచ్చాయి.

సరిగ్గా అదే సమయంలో

ప్రియంవద చంద్రహాస్ నడిచి వెళుతున్నారు.

ఉదయపు ఆహ్లాదకర వాతావరణంలో ఆమె ప్రక్కన నడవటం ఓ మరువలేని మధురానుభూతిగా ఉంది చంద్రహాస్‌కు, నిన్నటి అనుభవాలు ఆమెకు అతి దగ్గరగా చేర్చాయి. మనస్సులో యిది అని చెప్పలేని భావం. ఆ ఉదయం పూట మంచులో మెరుస్తున్న లేత గులాబీలా వుంది ప్రియం వద. ఆమె వంక చూస్తూ నడుస్తున్నాడు చంద్రహాస్....

"అడవిలో నడవటం బావుంది కదండి....నిన్నటి కొండల్లో ప్రయాణంకన్నా"

"కొండలకన్నా అరణ్యమే....అద్భుతంగా ఉంటుంది...." ఆమె అంది.

"నిజమే...."అన్నాడు సాలోచనగా చంద్రహాస్. ఆమెతో మాట్లా డటం యింట్రస్టింగ్‌గా ఉంది.

"అరణ్యం అన్ని జీవులకు తల్లిలాంటిది....అరణ్యంలో అన్ని రకాల జంతువులు తలదాచుకుంటాయి" అంది ఆమె.

"ఈ అరణ్యాలు లేకపోతే నగరాలు వాతావరణ కాలుష్యంతో నిండి పోతాయి....ఈ అరణ్యాల వల్లే పచ్చదనం యింకా దేశంలో బతికి ఉంది" అన్నాడు చంద్రహాస్.

"అరణ్యాలు అంతమైతే జంతు, మానవ ప్రపంచాలు రెండూ కూడా నాశనమౌతాయి" అంది ప్రియంవద....

"వెన్నెల రాత్రి అరణ్యం ఎంతో అద్భుతంగా ఉంటుంది....మీరె ప్పుడైనా చూసారా...." అడిగాడు.

"లేదు.... ఆ అవకాశం రాలేదు"

"అయితే....ఈ రాత్రి చూడండి....మేల్కొని గుడారం బయట ఆరు బయల్లో కూర్చోండి....వెన్నెల జారుతున్న అడవి గుండెల్లో ఆ నిశి నిశబ్దంలో అరణ్యం ఎంత అద్భుతంగా ఉంటుందో....అది అనుభవించాలే గాని చెప్తే కుదరదు" అన్నాడు చంద్రహాస్....

"మీరు భావకులా...." అతని వంక చూస్తూ అంది.

"అందాన్ని ఆస్వాదించటానికి భావకత్వమే అక్కర్లేదు. అందానికి స్పందించే హృదయం ఉంటే చాలు" అన్నాడు చంద్రహాస్.... ఆమెతో మాట్లాడటం ఉత్సాహంగా ఉంది చంద్రహాస్‌కు.

ఇంతలో వాళ్ళ ముందు నుంచి దుప్పులు వేగంగా పరిగెత్తాయి. వాటి తర్వాత కుందేళ్ళు....అడవంతా కలకలంగా ఉంది.

"ఏం జరిగింది" అన్నాడు....

"పులిగాని, సింహం గాని వస్తుంటే అడవిలో కలకలం చెలరేగుతుంది...."

పక్షులు చెట్లమీద నుంచి భయంతో ఎగిరాయి. సరిగ్గా అదే సమయంలో వాళ్ళ ముందు నుంచి అడ్డంగా ఓ బ్లాక్ క్యాట్ వేగంగా పరిగెత్తింది....

"బ్లాక్ టైగర్....పాంథర్" ఉత్సాహంగా అన్నాడు.

"మోస్ట్ రన్నింగ్ యానిమల్ అది....మనల్ని గమనించలేదు" బ్లాక్ పాంథర్ దృష్టి దుప్పుల మీద ఉంది. అందువల్ల చంద్రహాస్ మీద దృష్టి పడలేదు. వాళ్ళ ముందు నుంచి అతి వేగంగా వెళ్ళింది, మరుక్షణం భయంకరమైన జంతువు అరుపు. బ్రతికుండగానే చర్మం వలిచేస్తున్నపుడు బాధతో ఓ ప్రాణి అరిచే అరుపు అది.

దుప్పిని గొంతుదగ్గర ఎటాక్ చేసి ఉంటుంది బ్లాక్ పాంథర్....

"భారతదేశంలో బ్లాక్ పాంథర్స్ అతి తక్కువగా ఉన్నాయి"అంది ప్రియంవద.

"రేర్ స్పెసిమన్ అదృష్టవశాత్తు మన దృష్టిలో పడింది"అన్నాడు చంద్రహాస్.

క్రమంగా ఆ దుప్పి అరుపులు మెల్లమెల్ల గా అదృశ్యమైంది.

"అడవి అంటేనే అనుక్షణం ప్రాణాల్ని గుప్పెట్లో పెట్టుకోవాలి.."

"ఈ కర్నాటక అరణ్యాలు చాలా భయంకరమైనవి....జిమ్‌కార్బెట్ ఈ అరణ్యంలోనే ఎన్నో హంటింగ్ ఎపిసోడ్స్‌లో పాల్గున్నాడు....భారత

దేశంలో మోస్ట్ ఇంట్రికేటేడ్ అండ్ డేంజరస్ ఫారెస్టులు ఈ కర్నాటక అరణ్యాలు...."

ఇద్దర్....ఓ సరస్సు లాంటి దాని దగ్గర కొచ్చారు.

ఆ సరస్సులో నీరు నిర్మలంగా ఉంది. అందమైన కమలాలు తపస్సు చేస్తున్న తపస్వుల్లాగ కదలక ఆ నీటిలో నిశ్చలంగా విచ్చుకొని ఉన్నాయి....

వాటివంక చూసింది. ఎర్రటి....తెల్లటి కమలాలు.... ఎంతో అందంగా కన్పించాయి.

"ఆ కమలాలు చాలా బావున్నాయి" అంది....ప్రియంవద....

"మీకు కావాలా" అన్నాడు చంద్రహాస్....

"ఒకటి, రెండు చాలు ఎక్కువ అక్కర్లేదు"అంది ప్రియంవద....

మెల్లగా సరస్సు దగ్గరకు వెళ్లాడు .... బ్యాగ్ అతని భుజమ్మీదే ఉంది.

ఆమె అడిగిన కమలాలు తీసుకు రావాలని అతనికి అన్పించింది....

మరుక్షణం అతను సరస్సులోకి కాలు పెట్టాడు. పెద్దగా లోతు లేదు, రెండో కాలు వేసాడు....

ఆ కాలు జర్రున జారింది....

మరుక్షణం అతని కాలు బురద నేలలోకి జారిందీ....

ఒడ్డును పట్టుకోబోయి అతని మరోకాలు వేశాడు....రెండు కాళ్ళు మెల్లగా మెత్తగా లోపలకు వెళుతున్నాయి. ఊబి........ భయంకరమైన ఊబి అది....

"ప్రియంవదగారు" భయంగా కేక వేసాడు....

నీళ్ళల్లో గిలగిల కొట్టుకుంటున్నాడు. సరస్సు మధ్యలోవున్నాడతను అతని శరీరం బురదలో కూరుకుపోతుంది.

ప్రియంవదకు అప్పుడు అర్థమైంది. ఆ సరస్సులో ఏదో ప్రమాదం ఉందని....

"ఏం జరిగింది.... అన్నది.

"ఈ సరస్సు ఊబి.... ప్లీజ్ హెల్ప్‌మి" దీనంగా అన్నాడు ....

అతని బ్యాగ్ అప్పటికే అతని భుజమ్మీదనుంచి జారీ నీళ్ళల్లో తేలుతుంది....

అ బ్యాగ్‌లో రోప్ వుంది.... ప్రియంవదకు అతన్ని ఎలా రక్షించాలో అర్థం కాలేదు. ఆమె భయంతో గడగడ వణికిపోయింది. అన్ని వస్తువులు బ్యాగ్‌లో ఉన్నాయి.

"ప్రియంవద .... ప్లీజ్ హెల్ప్‌మి....

ఊబి మెల్లమెల్లగా అతని దేహాన్ని లోపలకి లాక్కుంటుంది.

చాలా విచిత్రమైన పరిస్థితి....

ఎదుట వ్యక్తి కొంచెం కొంచెం మృత్యువుకి దగ్గరౌతున్నాడు. నిస్సహాయంగా చూడాల్సిన పరిస్థితి....

ఆమె అడుగు ముందుకు వేసింది

"రావద్దు....మీరు రావద్దు" డెస్పరేట్‌గా అరిచాడు చంద్రహాస్. ఆ క్షణంలో ప్రియంవద మనస్సులో ఓ నిర్ణయం రూపుదిద్దుకుంది.

మరుక్షణం ఆమె తనచీరె విప్పి.... దాన్ని తాడులాగచేసి సరస్సులోకి విసిరేసింది.

ప్రియంవద చేసిన పనికి అప్రతిభుడయ్యాడు చంద్రహాస్....

లంగా, పెట్టి కోట్‌మీద నిలబడింది ఆమె. పచ్చని ఆమె శరీరం అర్ధనగ్నంగా ఆ ఎండలో మెరిసింది....

"చంద్రహాస్ పట్టుకో" అని అరిచింది చటుక్కున తన ముందుపడ్డ చీరెను అందుకున్నాడు చంద్రహాస్. గట్టిగా దాన్ని పట్టుకొని మెల్లమెల్లగా బురదలో అడుగువేస్తూ ముందుకు కదిలాడు.

శరీరంలోని శక్తినంతా చేతుల్లోకి తెచ్చుకొని చీరెను లాగింది...
ఆమె చేతులు వరుసుకొని పోతున్నాయి....
క్షణాలు అతి భయంకరంగా గడిచాయి....
ఆమె చేతులు చంద్రహాస్ బరువుకు తట్టుకోలేకపోతున్నాయి.
చంద్రహాస్ ఒడ్డు దగ్గరకు వచ్చేసాడు....
ఆమె చేతుల్లో బలం సన్నగిల్లింది....
కళ్ళంబెడి నీళ్ళురాసాగాయి....
శరీరమంతా చెమటతో నిండిపోయింది....
కాళ్ళమీద తన్నిపట్టి.... ఒక్కలాగులాగింది ప్రియంవద.
చంద్రహాస్ ఒడ్డును పట్టుకున్నాడు....
ఆమె ఆ ఊపుకు వెనక్కిపడింది....
చంద్రహాస్ పూర్తిగా సరస్సులోనుంచి బైటికి వచ్చాడు....
వెనక్కిపడ్డ ప్రియంవద తలకు గులకరాయి పొడుచుకుంది.
మరుక్షణం ఆమె దగ్గరకు పరిగెత్తుకు వచ్చాడు చంద్రహాస్
"ప్రియంవదగారు....ప్రియంవదగారు"

విపరీతమైన శక్తితో చీరెను లాగటంవల్ల తలకుదెబ్బ తగలటం వల్ల ఆమెకు స్పృహ తప్పింది.

ఆమె ముఖమ్మీద నీళ్ళు చిలకరించి ఆమె తలను తన తొడమీద పెట్టుకున్నాడు.

కొంచెం సేపటికి ఆమె మెల్లగా కళ్ళు తెరిచింది.

ఆమె వంక ఆత్రుతగా చూస్తున్న చంద్రహాస్ కన్పించాడు....

"మీకు....మీ....కు.... మీకేం కాలేదుకదా" ఆందోళనగా అంది ప్రియంవద....

మీరు సమయ స్ఫూర్తితో వ్యవహరించి నా ప్రాణం కాపాడారు....
"నిజంగా మీ సాహసం మరువలేనిది...."

ఆమెవంక ఆరాధనగా చూస్తూ అన్నాడు చంద్రహాస్....

"మీరు ఊబిలో యిరుక్కు పోతారేమోనని విపరీతమైన భయం వేసింది....ఆ ఆందోళనలో .... "చటుక్కున ఆమెకు తను చేసిన పని గుర్తుకు వచ్చినది.... మరుక్షణం తను కేవలం లంగా, పెటీకోట్‌తోవున్నాననే విషయం గుర్తుకు వచ్చింది....

వెంటనే కంగారుగాలేచి చేతులు అడ్డుపెట్టుకొని సిగ్గుపడింది ....

చంద్రహాస్‌కు ఆమె సిగ్గు ఎంతో అందంగా, మనోహరంగావుంది

అతనులేచి క్రిందవున్న చీరెతీసి యిచ్చాడు....

చీరె మురిగ్గావున్న ఆమె కట్టుకుంది....

ఆమె చీరె కట్టుకుంటున్నంత సేపు వెనక్కి తిరిగి నిలబడ్డాడు చంద్రహాస్ .... ఆమె చీర కట్టుకోవటం పూర్తిచేసి వెనక్కి తిరిగింది....

చంద్రహాస్ ఫ్యాంట్ షర్ట్ బురదతో నిండివుంది....

ఆమె చీరెనిండా బురద....

విచిత్రంగా ఉన్నాయి వాళ్ళిద్దరి ఆకారాలు....

ఆమెను చూస్తుంటే అతనిలో ఎన్నో భావాలు పెల్లుబికాయి. ఆమె ఆక్షణంలో ఎంతో అందంగా కన్పించింది....

తన ప్రాణం రక్షించటం కోసం ఆమెపడ్డ ఆర్తి, ఏస్త్రీ చెయ్యని సాహసంచేసి, తనను రక్షించింది....

ఆ భావన ఆమెపట్ల అతనిలో అనురాగాన్ని కలిగించింది ....

బ్యాగ్ తీసుకొని భుజాన వేసుకొని యిద్దరు మౌనంగా నడకసాగించారు....

ఆమె సిగ్గుపడుతుంది!

అతని వంక చూడటానికి ఆమెకు బెరుగ్గావుంది.

నడుస్తూ నడుస్తూ అతనివంక దొంగ చూపులు చూస్తుంది....

ఇద్దరు పది నిమిషాలు మౌనంగా నడిచారు....

దూరంగా యింకో చెరువు కన్పించింది.

"ఆ చెరువు దగ్గరకు వెళదాం పదండి" అన్నాడు....

అది కూడా ఊబి అయితే"

"ఊబి.... అవునో కాదో, కన్ఫర్మ్‌చేసుకొని దిగుదాం" అన్నాడు. ఇద్దరు చెరువుదగ్గిరకు నడిచారు.

ఆ చెరువు మంచినీటి చెరువే ! ఊబి కాదు.

చంద్రహాస్ తన బట్టల కంటిన బురదను కడిగేసుకున్నాడు.

ప్రియంవద తన చీరవిప్పి దానిలో పిండికొని శుభ్రంచేసి మళ్ళీ కట్టుకుంది.

ఇద్దరు కడుపునిండా నీళ్ళు తాగారు....

చెరువు ప్రక్కనే చెట్టువుంది. ఇద్దరువెళ్ళి చెట్టునీడన కూర్చున్నారు. చంద్రహాస్ బ్యాగ్ తెరిచాడు. ఆ బ్యాగ్ వాటర్ ప్రూఫ్ కావటంతో నీళ్ళు లోపలికి పోలేదు.

లోపల నుంచి రెండు బిస్కెట్ ప్యాకెట్లు తీసాడు....

ఒకటి ఆమెకిచ్చి, రెండోది తను తీసుకున్నాడు....

ఆమెవంక చూస్తూ బిస్కెట్ తినసాగాడు.

తడిసిన చీర వంటికి చుట్టుకొనివున్న ఆమె ఆ క్షణంలో అతనికి సాలార్‌జంగ్ మ్యూజియంలో తడిసిన చీరతోవున్న పాలరాతి విగ్రహంలా అన్పించింది....

ఆమె తలవంచుకొని అతనివంక చూస్తుంది....

ఆమె మనస్సులో సంచలనం!

అతని మనస్సులో సంచలనం !

మౌనం వాళ్ళిద్దరి మధ్య మూగభాషలో కదుల్తుంది

వాళ్ళ కళ్లు మాట్లాడుకుంటున్నాయి.

వాళ్ళ మనస్సులు మాట్లాడుకుంటున్నాయి....

పెదవులు అవ్యక్తమైన కంపనలో అదురుతున్నాయి.

మొదటి పరిచయంలో ఏరకమైన బెరుకు, భయం లేకుండా మనస్సు విప్పి మాట్లాడుకున్నారు కానీ యిప్పుడు వాళ్ళిద్దరి మధ్య ఏదో తెర....

మంచుతెర!

ప్రేమ భావనతో జరీ అల్లిన అనుభూతుల మంచుతెర

వాళ్ళిద్దరి మధ్య మౌన భాషతో గుసగుసలాడుతుంది

ఎన్నో మాట్లాడాలనివున్న ఏమీ మాట్లాడలేని పరిస్థితి

ఏదో చెయ్యాలనివున్న ఏమీ చెయ్యలేని పరిస్థితి

ప్రతి మనిషి జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు తారసపడే అతిక్లిష్ట పరిస్థితి అది....

సరిగ్గా అదే సమయంలో....

తేనెపట్టుకోసం రెండు ఎలుగుబంట్లు వచ్చాయి.

అక్షత వాటిని చూసి వెర్రికేక పెట్టింది....

అక్షత పెట్టిన కేకకు అదిరిపడి చూసాడు యశ్వంత్.

వాళ్ళిద్దర్ని చూసి గుర్రు గుర్రుమంటూ ముందుకు దూకుతూవాళ్ళ మీద పడ్డాయి.

చేతిలోవున్న దోన్నెను విసిరేసి అక్షత పరిగెత్తింది.

యశ్వంత్ విపరీతంగా భయపడి మరోవైపు పరిగెత్తాడు.

ఎలుగుబంటి అరుస్తూ వెంటబడింది.

యశ్వంత్ పరిగెత్తాడు.... తగిలేచెట్లు .... బూట్లకు ఎదురు తగిలే రాళ్ళు వెనకాల ఎలుగుబంటి పరిగెత్తుకొస్తుంది.

దానిచేతికి చిక్కితే ప్రాణాలతో మిగలనని యశ్వంత్‌కు తెలుసు. అక్షత ఈ హడావుడిలో ఎటు వెళ్ళిందో అర్థంకాలేదు.

అక్షత వెనక ఓ ఎలుగుబంటి పడిందని తెలుసు....

రివాల్వర్‌తో కాల్చటానికి చేతిలో రివాల్వర్ లేదు. చెట్టు ఎక్కటానికి ముందు బ్యాగ్ చెట్టు క్రింద వదిలాడు.

అది చేతిలో ఉంటే ఈ ఎలుగుబంటిని ఎదుర్కోవచ్చు.

యశ్వంత్‌కు ఆయాసం వచ్చింది.

పరుగెత్తలేకపోతున్నాడు.

వెనక మృత్యుదూతలా ముందుకు దూసుకు వస్తుంది ఎలుగుబంటి జిగ్‌జాగ్గా పరిగెత్తుతున్నాడు.

ఎలుగుబంటి గుర్రుపెడుతూ పిచ్చెక్కిన దానిలా అతనివెంటబడుతుంది.

అడవిలో ఎలుగుబంట్లు భయంకరమైన క్రూరజంతువులు....

మనిషినిచూస్తే చంపిగాని వదలవు....

అతని ఎదురుగా చిన్న రాళ్ళగుట్ట.... చటుక్కున రాళ్ళగుట్టఎక్కి చేతికి అందిన రాయిని తీసుకొని చటుక్కున వెనక్కి తిరిగాడు. పరిగెత్తు తున్న ఎలుగుబంటి ఒక్కసారి ఆగింది. ప్రత్యర్థి ఎదురుదాడికి పూను కున్నాడని దానికి అర్థమైంది....

గురిచేసి శక్తికొలది విసిరాడు చంద్రహాస్. గింగరాలుతిరుగుతూ పోయి దాని నుదుటికి తగిలింది. మరుక్షణం ఆ రాయి తగిలినచోట నుంచి రక్తం జివ్వున చిమ్మింది.

పిచ్చెక్కిపోయింది ఎలుగుబంటికి....

పెద్దగా గుర్రుపెట్టి ఎగిరి అతనిమీదకు దూకింది.... అది దూకటం గమనించి చటుక్కున రెండడుగులు వెనక్కివేసి, వెనక్కి తిరిగి ముందుకు పరుగెత్తాడు. ఎలుగుబంటివచ్చి రాళ్ళగుట్టమీద పడింది.

దానికి విపరీతంగా కోపం వచ్చిందేమో వెర్రి కేకలు పెడుతూ రెట్టించిన వేగంతో యశ్వంత్ వెనకపడింది.

యశ్వంత్ కాళ్ళల్లో శక్తి సన్నగిల్లింది.

పది నిమిషాల నుంచి ఆ ఎలుగుబంటి అతన్ని వదలటంలేదు....

కళ్ళు తూలిపోతున్నాయి.... కాళ్ళు తేలిపోతున్నాయి. కాలికి ఏదో తగిలింది.

ఒక్కసారి తూలి ముందుకు పడిపోయాడు.

ఎండిన ఆకులు, చెత్త....

ఎలుగుబంటి వస్తున్న అడుగుల సవ్వడి....

అవి తన జీవితంలో ఆఖరి క్షణాలనుకున్నాడు !

ఎలుగుబంటి దగ్గరకు వచ్చేస్తుంది....

అంతలోనే ఫ్లాష్‌లా అతని బుర్రలో అద్భుతమైన ఆలోచన....

తేనెపట్టుకోసం వెలిగించిన లైటర్ యింకా అతని జేబులోనేవుంది.

చటుక్కున జేబులోనుంచి లైటర్‌తీసి ....లైటర్ వెలిగించి ఎలుగు బంటి ముందుకు విసిరాడు.

బాగా ఎండిన ఆకులు కావటంతో

"భగ్"మని అంటుకుంది మంట.

ఒక్కసారి ఎదురుగా మంట కనపడేసరికి చటుక్కున అడుగు వెనక్కేసింది ఎలుగుబంటి .... ఎలుగుబంటికి మంట అంటే విపరీతమైన భయం.... శరీరంలోని శక్తినంతా చేతులలోకి తెచ్చుకొని మెల్లగా లేచాడు యశ్వంత్.

మంట భగభగమని మండుతుంది....

ప్రక్కనేవున్న ఎండు కట్టె నొకదానిని తీసికొని .... మంటలో ఆకుల్ని పెకలించి ముందుకు అన్నాడు. మండుతున్న ఆకులు ఎగిరివెళ్ళి ఎలుగుబంటిమీదపడ్డాయి. మరుక్షణం భయంకరంగా అరచి అడవిలోకి వాయువేగంతో పరిగెత్తింది ఎలుగుబంటి.

యశ్వంత్ ఒక్కక్షణం ఊపిరిపీల్చుకున్నాడు.

ఎలుగుబంటి పారిపోయేసరికి అటు యిటూ చూసాడు అక్షతకోసం.

అక్షత ఆ పరిసర ప్రాంతాలలో కనిపించలేదు.

"అక్షత ... అక్షతా" పెద్దగా అరిచాడు.

అతను అరుపు అడవిలో మారుమ్రోగింది.

అతని గుండెలు భయంతో గుబగుబ లాడాయి.

అక్షత వెనక ఓ ఎలుగుబంటి పడ్డది. ఆ వెలుగుబంటి కొంపదీసి అక్షతను చం...." ఆ ఊహ రాగానే అతని శరీరం భయంతో వణికింది.

"అక్షత ఎలా ఉంది· అసలు ప్రాణాలతో ఉందా ?

అతను అడవిలోకి పరిగెత్తాడు.

పరిగెత్తి పరిగెత్తి తేనెతుట్టె ఉన్నచెట్టు దగ్గర కొచ్చాడు....

ఆ చెట్టు క్రిందే అతని బ్యాగ్‌వుంది....

అక్షర ఆ పరిసర ప్రాంతాల్లో లేదు....

"అక్షత" మరోసారి కేకేశాడు....

ఎటువైపునుంచి సమాధానంలేదు....

బ్యాగ్ తీసుకొంటుండగా....

అడవిలోనుంచి భయంకరమైన కేక ....

విపరీతమైన భయంతో ఓ స్త్రీవేసిన వెర్రి కేక అది

ఆ గొంతు అక్షతది.... గుండెలవిసిపోయేలా అరుస్తుంది.

అక్షతకు ఏం జరిగింది....? అతని గుండెభయంతో కొట్టుకుంది.

మరుక్షణం అతను ఆ కేక వచ్చిన దిక్కుగా పరిగెత్తాడు ఏమీ ఆలోచించకుండా....

ఆమె అరుపు ఆగలేదు.... భయంగానే అరుస్తుంది....

సరిగ్గా అదే సమయంలో.

ప్రొఫెసర్ జయరాం కపర్ది సులోచన కొండమీదవున్న కాలిబాట మీద నడుస్తున్నారు.

ఆ కొండమీద లారీలు....కార్లు.... పోవటానికి ఘాట్ వుంది....

ఆ రోడ్డుప్రక్కనే నడుస్తున్నారు ముగ్గురు....

"ఈ ఘాట్ ఎక్కడికి పోతుంది....?

"ఈ ఘాట్ ఎక్కడికి పోదు .... యిక్కడే వుంటుంది........" అన్నాడు కపర్ది....

"ఈ ఘాట్ బ్రిటీష్ వాళ్ళ కాలంలో వేసింది .... రెండు అడవుల మధ్య ట్రాన్స్‌పోర్ట్ కోసం వేసారు .... ఈ ఘాట్‌లో అప్పుడప్పుడు తప్ప.... పెద్దగా ట్రాఫిక్ ఏమీ ఉండదు ........" అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

వాళ్ళు నడుస్తున్నవైపు రెండు కొండల మధ్యనుంచి దారి వెళుతుంది.

అటు యిటు ఎత్తయిన పర్వతశ్రేణులు....

ఆ పర్వతాలమీద పచ్చగా చెట్లు....

"ఈ ప్రకృతిలో యిలానే బాటసారుల్లాగ నడిచి వెళుతుంటే"ఎంతో అద్భుతంగా ఉంటుంది" కపర్ధి అన్నాడు.

"అలా నడుస్తుంటే.... తిండీ తిప్పలు గుర్తొస్తే మళ్ళీ వెనక్కి తిరిగి యింటి కొస్తారు" అంది సులోచన....

"మనం రెండు మోటార్ సైకిళ్ళు తెచ్చుకుంటే బాగుండేది. ఎంచక్కా ఈ ఘాట్‌లో నడిచే బాధ తప్పేది...." అన్నాడు కపర్ధి....

ఇంతలో వాళ్ళ ఎదురుగా ఓ మోటార్ సైకిల్ వేగంగావస్తుంది....

"సార్.... ఎవరిదో మోటార్ సైకిల్" సులోచన అంది.

ప్రొఫెసర్ జయరాం రోడ్డువంక చూసాడు.

ఓ ముప్పై యేళ్ళ వ్యక్తి మోటార్ సైకిల్‌మీద వస్తున్నాడు. ఫెల్ట్‌హాట్, కళ్ళకు గాగుల్స్ ఉన్నాయి. కాకీబట్టలు ధరించి ఉన్నాడు.

ప్రొఫెసర్ జయరాం బ్యాచ్‌నుచూసి చటుక్కున బైక్ఆపాడు....

"ఎవరు మీరు...." అతని కంఠం అధికారయుతంగా పల్కింది.

"ఇంతకీ మీరెవ్వరు" కపర్ధి అడిగాడు.

"ఈ ఫారెస్టులో నేను ఫారెస్ట్ రేంజర్‌ను" అన్నాడు ఆ వ్యక్తి.

"ఐ యామ్ కపర్ది.... నేషనల్ మ్యూజియం ఆఫ్ ఆర్కియాలజీ అసిస్టెంట్ క్యురేటర్ని...."అన్నాడు కపర్ది....

"వీరు" అని.... అన్నాడు ప్రొఫెసర్ జయరాం వంకచూపిస్తూ.

ఈలోగా ప్రొఫెసర్ జయరాం జేబులో నుంచి ఐడెంటిటీ కార్డు బైటికితీసి అతని కిచ్చాడు....

"నమస్కారం సార్" అతని కంఠంలో యిప్పుడు గౌరవం పలికింది....ఓ యూనివర్శిటీ ప్రొఫెసర్‌తో తను మాట్లాడుతున్నాను అనే స్పృహ అతనిలో ఉంది....

"మీరు.... యిక్కడకు ఏ పనిమీద వచ్చారు సార్....

"ప్రీహిస్టారిక్ ఏజ్ గురించి రిసెర్చ్‌చేస్తూ .... ఈ కొండల్ని స్టడీ చెయ్యటానికి వచ్చాం." అన్నాడు ప్రొఫెసర్ జయరాం.... నోటి కొచ్చిన అబద్ధం తెలివిగా ఆడి ఎదుటి వ్యక్తి ముఖంలోకి చూసాడు....

"నా పేరు ప్రభాకర్‌సార్ .... నేను చెయ్యదగ్గసహాయం ఏమైనా ఉందా?....

"ఇక్కడ హరిహర ఆలయం ఎక్కడైనా ఉందా?" అడిగాడు ప్రొఫెసర్ జయరాం....

"ఆ పేరే కొత్తగా ఉంది సార్.... ఇక్కడ ఆలయాలు ఏమీలేవు సార్" అన్నాడు.

"ఏ ఆలయాలు లేవా !.... కనీసం .... శిధిలాలు కూడా లేవా?" ఆదుర్దాగా అడిగాడు....

"లేవుసార్ ...."

ఒక్కసారి నిరాశ ఆవరించింది ప్రొఫెసర్ జయరాంకు....

"పోనీ.... ఈ అడవిలో ఏదైనా విచిత్రం చెప్పగలవా?"

"ఈ అడవిలో విచిత్రాలు ఏమీలేవు సార్ ....ఒక్క హంజారాజాతి కోయలు తప్ప" అన్నాడు.

"ఈ అడవిలో హంజారాజాతి కోయవాళ్ళా ........ ఆ పేరు భలే విచిత్రంగా ఉంది...." అన్నాడు కపర్ధి....

"హాజారాదేవి ఆరాధకులు వాళ్ళు.... కొండదేవత హజరాను పూజిస్తారు...."

"ఆవిడకు ఆలయం ఉందా?"

"లేదు.... ఓ పెద్ద విగ్రహం ఉంది....ఆ విగ్రహం క్రింద మూల విగ్రహం నాలుగు అడుగులది ఉందట .... అదేమన్నా హరిహరనాధుడిదేమో చూడండి" అన్నాడు ఫారెస్ట్‌రేంజర్ ప్రభాకర్.

"హజరా....హరిహర.... ఈ పదాలకు సామ్యం ఉంది....

హరిహర అనేపదం కాలంలో హజరాగామారవచ్చుకదా ....మనం వెళ్ళి ఆ ప్రకారం చూద్దాం" అన్నాడు కపర్థి....

"ఇంతకి వాళ్ళెక్కడ ఉన్నారు...."అడిగాడు ప్రొఫెసర్ జయరాం.

"ఇలా తూర్పుగా వెళితే ఐదు మైళ్ళ తర్వాత ఓ సరస్సు వస్తుంది. ఆ సరస్సుకు అక్కడనుండి ఉత్తరంగా నాలుగు మైళ్ళు వెళితే హంజారా జాతీ కోయగూడెం వస్తుంది" అన్నాడు ఫారెస్టు రేంజర్....

"అలా అయితే వెంటనే బయలుదేరదాం" అన్నాడు కపర్ధి....వాళ్ళ హడావుడిచూసి.

"ఆఁ....ఆగండి ఆగండి ........ ఆ హంజారిజాతి కోయలు చాలా దుర్మార్గులు.... వాళ్ళ చేతిలో పడితే ప్రాణాలు పోయినట్లే........"ఫారెస్టు రేంజర్ అన్నాడు.

ఓ ఫారెస్టు రేంజర్ అలా అనటం విచిత్రంగా అన్పించింది జయరాంకు....

"వాళ్ళు మనుష్యుల్ని చంపేంత బార్బరియస్ జాతా........అయితే మీ ఫారెస్టు డిపార్టుమెంట్....పోలీసు డిపార్ట్‌మెంట్ ఏం చేస్తుంది...." అన్నాడు కపర్థి....

"వాళ్ళధాటికి ఏ డిపార్టుమెంట్ ఏం చెయ్యలేదు .... వాళ్ళు అనాగ రికులే కాని నాగరికత చేతిలో కీలుబొమ్మలు"

"మీరు చెప్పేది మాకు అర్థంకావటంలేదు. నాగరికులు, అనాగ రికులు అంటారు.... ఏమిటి మీరు చెప్పేది...." ముక్కు సూటిగా, కుండ బద్దలుకొట్టినట్లు అడిగాడు....

"వాళ్ళు మనుష్యుల్ని చంపినా.... ఏ ఋజువు, సాక్ష్యం ఉండదు వాళ్ళంతా కాళీచరణ్ మనుష్యులు"

"కాళీచరణ్" అతనెవరు" విస్మయంగా అన్నాడు కపర్ది....

"ఈ అడవికి రాజు.... హంజారాజాతి వాళ్ళకు సాక్షాత్తు దేవుడు....

"మీ భాష మాకు బొత్తిగా అర్థంకావటంలేదు ........ విపులంగా చెప్పండి అన్నాడు కపర్ధి.

"ఈ కాళీచరణ్........ ఈ అభయారణ్యంలో భయంకరమైన స్మగ్లర్....

అతన్ని ఎవ్వరు పట్టుకోలేరు........ పట్టుకున్నా వెంటనే రిలీజై పోతాడు....

అధికార యంత్రాంగంలో, రాజకీయ నాయకుల్లో అతని మనుష లున్నారు....

ఈ హంజారీజాతి కోయలతో కాళీచరణ్ గంధపుచెట్లు నరికిస్తాడు. ఏనుగు దంతాలు సేకరిస్తాడు........ పుట్టతేనె, అడవి మూలికలు సంపా దిస్తాడు.... ప్రత్యక్షంగా స్మగ్లింగ్ చేసేది వాళ్ళు.... పరోక్షంగా వాళ్ళను రక్షించేది కాళీచరణ్.... వాళ్ళకు రోగం, రోష్టు వచ్చినా కాపాడేది కాళీ చరణ్.... వాళ్ల పిల్లలను హాస్టల్‌లో చేర్పించి, చదువు చెప్పించేది కాళీ చరణ్.... ఒక్క మాటలో చెప్పాలంటే వాళ్ళకు దేవుడు కాళీచరణ్...." ఫారెస్టురేంజర్ చెప్తున్నాడు. అతను చెప్తున్న విషయాలు వాళ్లకు విస్మ యాన్ని కలిగిస్తున్నాయి.

"ఏ సి. ఐ.డి ఆఫీసరు వచ్చినా.... ఏ సి. బి. ఐ. యిన్స్పెక్టర్ యిన్స్పెక్షన్ కొచ్చి వాళ్లగూడెంను తనిఖీచేసినా .... వాళ్ళు విచిత్రమైన పరిస్థితుల్లో మరణిస్తూ ఉంటారు...."

"ఎలా ?"

"పులి చంపటంవల్లో.... పాముకాటువల్లో .... తేనెటీగలు కుట్టో ఆ ఆఫీసరు చచ్చిపోతాడు.... వాళ్ళకు ఏ మాత్రం అనుమానం వచ్చినా అతనిశవం అడవి మధ్యలో ఉంటుంది...."

ఫారెస్టు రేంజర్ ప్రభాకరు చెప్తున్న మాటలు భయంకరంగా ఉన్నాయి.

"పొరపాటున ఏ హంజారా జాతివాడు అరెస్టు అయినా .... రెండో రోజు అతడు విడుదల చేయబడతాడు........ ఈ అడవిలో మకుటంలేని మహారాజు కాళీచరణ్.... అందుకే మేం అతని జోలికి వెళ్ళం...."

అతను చెపుతున్న ఒక్కో విషయం వాళ్ళకు వింతగా విచిత్రంగా ఉంది.... అటివీకుల్ని తనవైపు తిప్పుకొని అడివి సంపదను కొల్లగొడు తున్నాడు కాళీచరణ్.

ఈ సామ్రాజ్యానికి అతను రాజైతే....

అతని సైనికులు ఈ హంజారా జాతివాళ్ళు....

"వాళ్ళ దగ్గర.... అతి ప్రమాదకరమైన పాములున్నాయి ........ కందిరీగల్లా కుట్టే అతి భయంకరమైన తేనేటీగలున్నాయి .... వాళ్ళు ఏ ఆయుధాల్తోను చేతుల్తో మనుషుల్ని చంపరు....అతి తెలివిగా అడవిలో ఏ క్రూర జంతువు బారినపడి చనిపోయాడు, అన్నట్లు ఋజువులు చూపి స్తారు. కాబట్టి వాళ్ళతో జాగ్రత్త" అన్నాడు .... ఫారెస్టు రేంజర్ ప్రభా కరు....

"థాంక్యూ మీరు చాలా విలువైన సమాచారం అందించారు.థాంక్యూ అన్నారు.... ప్రొఫెసరు జయరాం....

"నోమెన్షన్" అని మోటారు సైకిల్ను స్టార్టుచేసి ముందుకు దూకిం చాడు అతను....

ఫారెస్టు రేంజర్ ప్రభాకర్ చెప్పిన మాటలు వాళ్లల్లో ఓ విచిత్ర మైన భయాన్ని కలిగించాయి .... కత్తులతో, పిస్తోళ్ళతోరాని విచిత్రమైన మరణం.... దారుణంగా హింసించి చంపేయటం హారీబుల్ !

కాళీచరణ్.... నువ్వెవరవో గాని....

నువ్వు చాలా గొప్ప తెలివిగలవాడవి....

ఓ మనిషినిగాని ఓ జాతినిగాని లొంగదీయాలంటే .... వాళ్ళకు సెక్యూరిటీ కలిగిస్తేచాలు....

వాళ్ళు నీ పక్షాన వుండపోతారని తెల్సిన నువ్వు.... ఈ దేశపురాజ కీయ నాయకుల కన్నా గొప్ప వాడివి .... ప్రపంచంలో తిండి, నిద్ర, మైధునాలకన్నా మనిషికి ముఖ్యంగా కావాల్సింది సెక్యూరిటీ....

ఆ సెక్యూరిటీనిచ్చి వాళ్ళను ఓ బానిసలుగా చేసుకున్నావు కాళీ చరణ్ యు ఆర్ గ్రేట్

ప్రొఫెసర్ జయరాం ఆలోచిస్తున్నాడు.

ముగ్గురు మౌనంగా నడక సాగించారు.

ప్రియంవద చంద్రహాస్ ఒకరి కళ్ళల్లో ఒకరుచూస్తే

మై మరచివున్న సమయంలో గుండెలవిసిపోయే కేకవిన్పించింది.

చటుక్కున వాళ్ళు ఈ లోకంలోకి వచ్చారు.

అతి దగ్గిరగా ఎవరో స్త్రీ ఆర్తనాదం చేస్తుంది.

చంద్రహాస్ వెల్డరు మిషన్ పిష్టల్ తీసుకుని అటువైపు కదిలాడు.

అతని వెనకే ప్రియంవద పరుగెత్తింది....

నాలుగు గజాల దూరంలో అక్షత భయంతో వెర్రికేక పెడు తుంది.

ఆమె వెనక ఎలుగుబంటి ఆమెను రెండు చేతులతో వెనకనుంచి చీల్చివేయటానికి ముందుకు దూసుకు వస్తుంది.

తానిక తప్పించుకోలేనని భయంతో అరుస్తుంది అక్షత....

చంద్రహాస్ వేగంగా పరుగెత్తి చటుక్కున ఎలుగుబంటి వైపు ఎయిమ్‌చేసి పిస్టల్ పేల్చాడు.

"ధన్" మని అరణ్యంలో పిస్టల్ మోత ప్రతి ధ్వనించింది ....

ఎర్రటి నిప్పుకణిక ప్రక్కనుంచి దూసుకు వెళ్ళటంతో వెర్రికేకవేసి వెనక్కి వెల్లికిలా పడింది ఎలుగుబంటి....

డోంట్ ఫియర్ అక్షత........కమాన్" బిగ్గరగా అరిచాడు చంద్ర హాస్—

చంద్రహాస్‌ను చూసి ఆమె భయం తగ్గింది....

పరిగెత్తుకుంటూవచ్చి ప్రియంవద దగ్గర ఆగింది....

శత్రువుల బలం పెరిగింది అని తెలుసుకొని చటుక్కునలేచి అడవి లోకి పారిపోయింది ఎలుగుబంటి

మరోసారి వెబ్లర్ మిషన్ పిస్టల్ పేలింది....

సరిగ్గా అదే సమయంలో

అరణ్యంలో ఓ కార్నర్ దగ్గరనుంచి పరుగెత్తుకు వచ్చాడు యశ్వంత్.

చంద్రహాస్, ప్రియంవద, అక్షతను చూడగానే అతని గుండెలు కుదుటపడ్డాయి.

రొప్పుకుంటూ వచ్చి ఆగాడు చంద్రహాస్ దగ్గర....

"థాంక్యూ బ్రదర్....సరయిన సమయంలో వచ్చి రక్షించావు థాంక్స్" అన్నాడు.

"మీరు ఎలర్టుగా ఎందుకు లేరు........ అక్షతకు ఏదైనా జరిగితే ప్రొఫెసర్ జయరాంకు ఏమని సమాధానం చెప్పేవాళ్ళం" చంద్రహాస్ కంఠం కరుగ్గా పల్కింది.

"నా రివాల్వర్ బ్యాగ్‌లో ఉండిపోయింది. ఓ ఎలుగుబంటి నా వెనక పడగానే నేను బ్యాగ్ క్యాచ్‌చేయలేకపోయాను" తలవంచుకొని అపాల జిటిక్‌గా అన్నాడు యశ్వంత్.

"యూ ప్లీజ్ కీప్ యిట్ విత్‌యు...." అన్నాడు చంద్రహాస్....

అందరు గుండెలనిండా ఊపిరి పీల్చుకున్నారు....

నలుగురు మౌనంగా నడవసాగారు....

"ఈ అరణ్యంలో ప్రమాదాలు ఉంటాయనే మన నలుగుర్ని ఓ బ్యాచ్‌గా ఉండమని ప్రొఫెసర్ జయరాం చెప్పింది.... అది మనం మర్చి పోయి విడివిడిగా వెళితే యిలాంటి పరిస్థితి తప్పకుండా ఎదురౌతుంది" చంద్రహాస్ కంఠంలో అక్షతకు ఏదన్నా జరిగితే ఏమై ఉండేది అన్న బాధ కలుగుతుంది....

తాము ఒంటరిగా ఉండాలి అని గ్రూప్‌లోనుంచి 'డీవీయెట్' అయి నందుకుజరిగిన ప్రమాదం యశ్వంత్ గుండెల్లో భయాన్ని కలిగించింది

ఇద్దరు మళ్ళీ దగ్గరయ్యారు....

అక్షత కళ్ళల్లో కనీ కన్పించని కన్నీటి తెర....

"సారీ....అక్షత....సమయానికి వచ్చి నిన్ను రక్షించలేకపోయాను" అతని కంఠంలో బాధ సుళ్ళు తిరుగుతుంది.

"నువ్వు మాత్రం ఏం చెయ్యగలవు.... ఆ ఎలుగుబంటి నిన్ను కూడా వెంటాడిందికదా.... టేకీట్ యీజీ" అంది అక్షత....

అయినా ఆమె మనస్సులో ఏవో అపశ్రుతి యశ్వంత్ పట్ల అదే మిటో ఆమెకు అర్థం కాలేదు.

సరిగ్గా అదే సమయంలో

చెట్లమీద నుంచి ఈటెలు పట్టుకొని కోయవాళ్ళు చకచకా క్రిందకు దిగారు....

వాళ్ళను చూసేసరికి ప్రియంవద, చంద్రహాస్, అక్షత, యశ్వంత్ ఒక్కసారి నిశ్చేష్టులయ్యారు.

ఓ ఇరవై మంది అటవీకులు అత్యంత వేగంగా ఊడలద్వారా చెట్టు మీద నుంచి నలుగురుచుట్టూ వృత్తాకారంలో నిలబడి ఈటెల్ని వాళ్ళ గుండెలకేసి గురిచేసి....

"జింబారా.... జిమ్.... జింబారా జిమ్" అంటూ గుండ్రంగా ఎగురుతూ నృత్యం చేయసాగారు....

చంద్రహాస్ వెల్డర్ మిషన్ పిష్టల్ బైటికి తీశాడు.

ట్రిగ్గర్ నొక్క బోతుండగా జరిగిందా సంఘటన....

ఓ కోయవాడు తన దగ్గిరున్న బుట్ట ఓపెన్‌చేసి, కాలితో తన్నాడు అంతే!

వందల, వేల తేనెటీగలు "జుఁయ్" మంటూ ఒక్కసారి ఆ ప్రదేశంలో ఆక్రమించుకున్నాయి....

విచిత్రమేమిటంటే....

అవి చంద్రహాస్ బ్యాచ్‌పైపు వేగంగా దూసుకు వచ్చాయి....

చంద్రహాస్‌ను, అతని వెల్డర్ మిషన్ చుట్టూ, అతని ముఖం చుట్టు ఒక్కసారిగా మూగాయి....

అక్షత వెర్రి కేక పెట్టింది!

ప్రియంవద ముఖం.... శరీరంనిండా ....తేనెటీగలు మూగాయి.

యశ్వంత్ చేతుల్తో వాటిని తోల్తున్నాడు....

"జింబారా..., జింబారా.... అని కీచుకీచుగా అరుస్తూ....

మిడుతల దండులా నలుగురుమీద వచ్చిపడ్డారు....

యశ్వంత్ వికృతంగా అసహ్యంగా అరచి వెనక్కిపరుగుతీసాడు, అప్పటికే ఆలస్యమై పోయింది.

చంద్రహాస్ తేరుకొనే లోపల అటవీకుల చేతిలోని నారతాళ్ళుఅతని శరీరంమీద పడ్డాయి....

చకచక శరీరాన్ని చుట్టేస్తున్నారు....

"మైగాడ్ .... వాటీజ్‌దిస్ హెల్" ప్రియంవద భయంకరంగా అరుస్తుంది....

"జింబారా జిమ్....జింబారా జిమ్...." అనే వాళ్ళ గోల కర్ణ కఠోరంగా వుంది.

విడిపించుకుందామని ఎంత ప్రయత్నించినా ప్రయోజనం లేక పోయింది....

నాలుగే నాలుగు నిమిషాలలో నలుగురు బందీ లయ్యారు....

అన్నిటిలోకి వింత గొలిపే విషయం ఏమిటంటే....

అన్ని తేనెటీగలు శరీరంమీద మూగినా.... ఒక్కటి కూడా కుట్ట లేదు....

అసహ్యం, భయంతప్ప....

అసహ్యంతో, భయంతో ప్రియంవద, అక్షత స్పృహతప్పారు....

వాళ్ళ శరీరాల్ని మూటలుగా ఎత్తి....

"జింబారా....జింబారా" అంటూ ఎంత వేగంగా వచ్చారో అంత వేగంగా అడవిలోకి అదృశ్యమయ్యారు ఆ ఆటవీకులు....

## 13

కపర్ది సులోచన ప్రొఫెసర్ జయరాం....

మెల్లగా ప్రకృతి దృశ్యాల్ని చూస్తూ కదులుతున్నారు.

తూర్పు దిక్కుగా ఐదు మైళ్ళు నడిస్తే సరస్సు కనిపిస్తుంది....

అప్పటికి నాలుగు మైళ్ళు నడిచారు....

సూర్యుడు నడమింటికి చేరుకొని చండప్రచండంగావెలుగుతున్నాడు

అలా నడవటంవల్ల బాగా కాళ్ళు నొప్పులు వచ్చాయి ....

దూరంగా కొండమీద, చెట్లమీదనుంచి పొగరింగులు రింగులు తిరుగుతూ గాల్లోకి లేస్తుంది....

దాన్ని చూడగానే ప్రొఫెసర్ జయరాం పెద్దగా అరిచాడు....

"వైల్డుఫైర్.... అడవి అంటుకుంది."

కొండలమీద అస్తవ్యస్తంగా పెరిగిన అడవి ఒక్కోసారి చాలా చిన్న పనికే అంటుకుంటుంది.... రాయి రాయి తగలటంవల్ల నిప్పుపుట్టి.... గడ్డి అంటుకొని చెట్లు తగలబడతాయి.

ఎవరో వెళుతూ.... సిగరెట్ పారేసినా.... ఎండినగడ్డి అంటుకుని నిప్పు రగులుతుండి....

"మనం దారి తప్పలేదుగా...."

"మనం దారి తప్పినా.... జంతువులు మనకిదారి చూపిస్తాయి"

"ఎలా...." అడిగాడు కపర్ది....

"అరణ్యంలోని వేడికి జంతువులు నీటి దగ్గరకు పరిగెత్తుతాయి....

మనం అలా సరస్సు దగ్గరకు వెళ్ళొచ్చు వాటినిఆధారంచేసుకొని....

మరుక్షణం కొండనుంచి వస్తున్న వాలుగాలిలో చెట్లు కాలుతున్న వాసన....

దూరానికి మంట మెల్లగా కన్పిస్తుంది....

పక్షులు భయంతో చెట్లమీదనుంచి లేచాయి....

కొండమీద కలకలం.... దుప్పులు....జింకలు.... కుందేళ్ళు....

గోలగోలగా పరుగెత్తుతున్నాయి....

అవి ఎటువైపు పరిగెత్తుతున్నాయో గమనించాడు.

ఇంతలో తూర్పు దిక్కుగా వెళ్ళే రోడ్డు టర్నింగ్ తీసుకొని దక్షిణంగా సాగిపోతుంది....

"ఫ్రెండ్స్ మనం ఇప్పుడు రోడ్డు వదలి.... అరణ్యంలో పడాలి...." అన్నాడు ప్రొఫెసర్....

"మంటలు యింకా యిటువైపు రాలేదు.... త్వరగా మనం సరస్సు దగ్గరకు వెళదాం...." అన్నాడు ప్రొఫెసర్ జయరాం....

ముగ్గురు రోడ్డుదాటి.... అడవిలోకి ప్రవేశించారు....

చకచకా వేగంగా నడవసాగారు....

సరిగ్గా అదే సమయంలో దక్షిణంవైపునుంచి గాలి ఉత్తర దిశలో మారింది....

మంటలు అతివేగంగా జయరాం బ్యాచ్ నడుస్తున్న వైపు రాసాగాయి, కుందేళ్ళు.... వాళ్ళ ముందునుంచి వేగంగా పరిగెత్తాయి....

"లుక్ దెమ్.... అవి వెళ్లే దిశలో మనం పరిగెత్తాలి...."

ఫటఫట మంటూ కాలిన కొమ్మలు రాలుతున్నాయి....

అగ్ని నాల్కలుసాచి విజృంభిస్తుంది....

ఒక్కసారిగా వాళ్ళవైపు వీస్తున్న గాలి వేడెక్కింది.

"హరీయప్.... మంటలు వచ్చేస్తున్నాయి...."

దుప్పులు అతివేగంగా వాళ్ళ ముందునుంచి పరిగెత్తుతున్నాయి.

అడవి అంతా గందరగోళం!

కన్ఫ్యూజయన్ .... మంటలు.... వేడి....

క్రింద పాములు....వేగంగా పాకుతున్నాయి....

కాళ్ళు అతివేగంగా నేలమీద అన్చితీసి అడుగువేస్తున్నారు....

గాలి ఉధృతమై గింగరాలు తిరుగుతూ వాళ్ళవైపు రాసాగింది.

"అయిపోయింది.... పరుగెత్తండి.... మంటలు వచ్చేస్తున్నాయి."

అతి వేగంగా పరిగెత్తసాగారు....

మంటలు చుట్టు అలుముకున్నాయ్....

డెస్పరేట్‌గా ముగ్గురు పరిగెత్తుతున్నారు....

దూరంగా సరస్సు కన్పించింది.

మంటలు విజృంభించి అరణ్యాన్ని భక్షిస్తున్నాయి....

వేడి మంటలు ముఖంమీద కొడుతున్నాయి.

కాళ్ళల్లోకి శక్తినంతాతెచ్చుకొని ముగ్గురు పరిగెత్తారు.బూట్లువున్నప్పటికీ కపర్ధి కాళ్ళల్లో ముళ్ళుగుచ్చుకున్నాయి.

కోసురాళ్ళు తగిలి రక్తం జివ్వున చిమ్మింది.

ప్రొఫెసర్ జయరాం వెనకపడ్డాడు .... సులోచన కపర్ధి వేగంగా పరిగెత్తి ఇద్దరు సరస్సు చేరుకున్నారు.

సరస్సు యింకా పది గజాలుంది అనగా ఓచెట్టు ఫెళఫెళమంటూ విరిగి అతని ముందు పడింది. కాండం, కొమ్మలు మంటలలో కాలి పోతున్నాయి.

సరస్సుకు.... అతనికి మధ్య అడ్డుగా మండుతున్న చెట్లు....రివ్వున వీచిన గాలికి ఓ మండుతున్నకట్టె అతని నుదుట మీదకువచ్చి బలంగా తగిలింది.

మరుక్షణం ప్రొఫెసరు జయరాంకు స్పృహతప్పింది....

మరుక్షణం అతనుకట్టె విరుచుకుపడ్డట్లు వెనక్కి పడ్డాడు....

అదే ముందుకుపడ్డట్లయితే అతని శరీరం ఆ మంటల్లోపడి దహించుకుపోయేది.

ప్రొఫెసర్ జయరాం అలా పడిపోగానే ఎలర్ట్ అయ్యాడు కపర్ధి....

"సులోచన....నువ్విక్కడే....ఉండు .... ప్రొఫెసర్‌ను తీసుకు వస్తాను" అని వేగంగా ముందుకు కదిలాడు....

మంటలు రివ్వున అతనిని తాకుతున్నాయి.

ఓ మిస్సైల్‌లా దూసుకు వెళ్ళాడు....

అప్పుడే ఓ చెట్టు విరిగి అతనిమీద పడబోతుంది.

చటుక్కున కాళ్ళు పట్టుకొని ముందుకు లాగాడు.

"ధడేల"మని ఆ చెట్టు కూలింది....

భగభగమంటూ అగ్ని నాల్కలు సాచి ఆ ప్రాంతాన్ని కబళించి వేయటం ప్రారంభించింది.

చటుక్కున ప్రొఫెసర్ జయరాంను ఎత్తి భుజాన వేసుకొని అతి వేగంగా సరస్సు దగ్గరకు వచ్చాడు.

అప్పటికే అతని శక్తి విపరీతంగా ఎగ్జాట్ అయ్యింది....

జయరాంను క్రింద పడుకోబెట్టి....

అలసటగా క్రింద వాలిపోయాడు....తీవ్రమైన నిస్సత్తువ, మరుక్షణం అతని నరనరంలో పాకింది. అలాగే మత్తుగా కళ్ళు మూసుకున్నాడు.

# 14

ఎత్తైన చెట్లక్రింద పచ్చగడ్డిలో శవాల్లా పడివున్నారు నలుగురు.

నలుగురికి స్పృహలేదు....

తేనెటీగలు కుట్టటం వల్ల నొప్పిలేదుగాని అవి స్రవించే ఓ రకం ద్రవం వల్ల వాళ్ళ నలుగురు గంటనుండి కదలక మెదలక పడి ఉన్నారు. వాళ్ళ కాళ్ళకు, చేతులకు నారతాళ్ళు వేసి గట్టిగా కట్టి ఉన్నారు....కొండ జాతి కోయవాడు ఒకడు బళ్ళెం పట్టుకొని నిలబడి ఉన్నాడు.

అది కోయగూడెం....

వాళ్ళు పడి ఉన్న ప్రదేశానికి పది గజాల దూరంలో పెద్ద గూడెం వుంది....అది కొండల మధ్య ఉన్న గూడెం....నాలుగైదు కొండలు దాటి అక్కడికి రావాలి....

గూడెం మధ్యలో హజారాదేవి విగ్రహం భయంకరంగా వుంది. నాలుక బైటకు చాపి, ఎర్రటి కనుగుడ్లతో వికృతంగా వుంది ఆ మూర్తి... విగ్రహం క్రింద భాగంలో ఎర్రటి కుంకుమ రాసులుగా పోసివుంది. ఆ కుంకుమలో నిమ్మకాయలు....ఆ కుంకుమలో రక్తం కలిసిందో, నీళ్ళు కలిపాయోగాని పీఠం అంతా ఎర్రటి రంగు పూసినట్లు వుంది.

విగ్రహం ముందు రకరకాల ఆయుధాలు....

పరమ భయంకరంగా ఉంది విగ్రహం....

వాళ్ళను తీసుకువచ్చి అప్పటికి రెండు గంటలు దాటింది....చంద్రహాస్‌కు మెల్లగా స్పృహ వచ్చింది....అతను అటు యిటూ చూసాడు.

స్పృహరాగానే విడిపించుకోటానికి అటు యిటూ కదిలాడు....

శరీరంలో ఏ భాగం కూడా కనీసం సెంటిమీటరు కదలటానికి వీల్లేకుండా బిగించి కట్టబడి ఉన్నాయి కట్లు.

ముఖమ్మీద ఏదో ద్రవం పూసినట్లు జిగటగా ఉంది....

ఇంతలో ప్రియంవద కదలింది....

ఆమెకు స్పృహ వచ్చింది....ఆమెకు మొదట అర్ధమైన విషయం తనను ఎవరో బంధించారని

మెల్లగా తల తిప్పి చూసింది.

చంద్రహాస్ ఆమె వంకే చూస్తున్నాడు....

ఆమెకు చంద్రహాస్‌ను చూడగానే భయం తగ్గి ధైర్యం వచ్చింది.

"ఎవరు వాళ్ళు" అంది....

"తెలియదు....ఎవరో కొండజాతి వాళ్ళు"

"మనల్ని ఏం చేస్తారు...."

"తెలియదు...."

అక్షతకు, యశ్వంత్‌కు ఆ తర్వాత మెలుకువ వచ్చింది....

సరిగ్గా ఓ రెండు గంటల తర్వాత ఓ కొండజాతి మనిషి వచ్చి వాళ్ళ నోళ్ళల్లో ఏదో ద్రవం పోసాడు....

అది తియ్యగా వుంది. వొంట్లో లేని శక్తి వచ్చింది.

అరగంట తర్వాత అందరి కట్లు విప్పదీసారు. నలుగుర్ని ఓ గది లోకి తీసుకువెళ్ళారు. వెదురు కర్రలతో, వెదురు చాపలతో తయారుచేసిన యిల్లు. లోపలంతా చల్లగా ఉంది....

నలుగురు కొయ్య కుర్చీల మీద కూర్చున్నారు....

హఠాత్తుగా ఆ గదిలో చీకటి అలముకుంది....

ఎవరిదో కంఠం ఆ గది మధ్యలో నుంచి వస్తుంది.

"ఎవరు మీరు....ఎందుకొచ్చారు....?"

"ఆర్కియాలజీ డిపార్ట్‌మెంట్‌కు చెందిన వాళ్ళం....ప్రీహిస్టారిక్ యేజ్‌ను అధ్యయనం చెయ్యటానికి వచ్చాం" చంద్రహాస్ చెప్పాడు.

"నమ్మకం ఏమిటి?"

"మా ఐడెంటిటీకార్డ్సు చెకప్ చెయ్యండి"

"ఇట్స్ మే బిఫేక్" కోయగూడెంలో సోఫెస్టికేటెడ్ ఇంగ్లీషు మాట్లాడే వ్యక్తి ....వాళ్ళు ఆశ్చర్యంగా చూసారు....

"అవి ఫేక్ కావు....కావాలంటే ఇన్‌ఫామ్ చేసుకోండి...." చంద్ర హాస్ నిర్లక్ష్యంగా అన్నాడు.

"మీరు ఎట్టి పరిస్థితులల్లో సి. ఐ. డి.లు కాదు....అంతేనా"

"మేం రీసెర్చ్ స్టూడెంట్స్ం....సి.ఐ.డి లం కాదు...."

"ఓ. కే...." మెల్లగా ఆ గదిలోకి వెలుగొచ్చింది.

చంద్రహాస్ ఆశ్చర్యంగా చూసాడు.

చదువు, సంధ్య రాని కోయగూడంలో మినియేచర్ మైక్రోఫోన్‌తో తమతో ఓ వ్యక్తి మాట్లాడాడు.

ఆ వ్యక్తి ఎవరు....

ఆ వ్యక్తికి ఈ కోయజాతికి గల సంబంధం ఏమిటి?....

ఇంతలో ఎవరో వచ్చి వాళ్ళ నలుగుర్నీ బైటికి తెచ్చారు....

బైట ఓ వెదురు బొంగుల కుర్చీమీద ఓ యేభై ఏళ్ళ వ్యక్తి కూర్చొని ఉన్నాడు....

"ఏం దొరలు....ఏ ఊరు....మనది"

చంద్రహాస్‌కు కోపం వచ్చింది.

"మమ్మల్ని ఎందుకు బంధించారు. రీసెర్చ్ స్టూడెంట్స్ం మేము. మమ్మల్ని ఇలా చేసారని పోలీస్ రిపోర్టు యిస్తే మిమ్మల్ని పోలీసులు అరెస్ట్ చేస్తారు"

"ఛళ్" మని అతని చెంప పేలిపోయింది....

"ఏం కూనా....పెద్దపులల్లే ఎగిరెగిరి పడుతున్నావేంది.... నాయకుడితో మాట్లాడేటప్పుడు....గౌరవం యిచ్చుకోవాలే బిడ్డా" ఎవరో అన్నారు. యింకెవరో ఫక్కున నవ్వారు.

చంద్రహాస్‌కు వాళ్ళను ముక్కలు ముక్కలు చెయ్యాలన్నంత కోపంగా వుంది....

"మర్యాదలేని ఈ కుర్రాళ్ళను రాత్రంతా....పస్తు పడుకోబెట్టి రేపు ఉదయం వదిలి పెట్టండి" కఠినంగా ఆజ్ఞాపించాడు.

మరుక్షణం నలుగుర్ని గదిలోకి లాక్కెళ్ళాడు....

కాళ్ళు, చేతులు గట్టిగా కట్టిపడేసి ఆ గదిలో పడేసారు....

ఆ గదిలో చీమలు, కందిరీగలు ఉన్నాయి.

యింకా రకరకాల పురుగులు ఉన్నాయి.

ఆ గది దుర్భరంగా ఉంది....

"ఏం చేస్తారు....అసలు వాళ్ళెవరు...."అతనికి అర్థం కాలేదు....

నరకం ఏమిటో చంద్రహాస్‌కు అర్థమైంది.

ఇంతలో....ఎవరో బైట గట్టిగా కట్టి పడేస్తున్న శబ్దం....తలుపుల్ని గట్టిగా బంధిస్తున్నారు ఎవరో....

చంద్రహాస్, యశ్వంత్ దయనీయంగా చూసారు.

"రేపు ఉదయం వరకు.... ఈ బందిఖానాలో నుంచి విడుదల లేదు" నిరాశగా నిట్టూర్చాడు.

అప్పుడు గుర్తుకు వచ్చింది చంద్రహాస్‌కు, తమ బ్యాగ్‌లు,సామాను తమ దగ్గర లేవని....

పుల్లీ ఒంటరిగా గూడెం ప్రక్కనవున్న నీటిచెలమ దగ్గరకూర్చొని ఆలోచిస్తుంది.... కాళీచరణ్ ఆజ్ఞాపించిన ప్రకారం నాగరీకులను పట్టి తెప్పించాడు నాయకుడు.... వాళ్ళు. సి. ఐ. డి.... లు కాదు....

కాని.... కాళచరణ్ దృష్టిలో పడ్డారంటే.... చావటమో, పులిచంపటమో జరుగుతుంది. ఈ రాత్రి గడిస్తే వాళ్ళను ఏం చేస్తాడో ఆమెకు అర్థం కాలేదు....

వాళ్ళల్లో....చంద్రహాస్ ఆమెకు గుర్తుకు వచ్చాడు....ఆమెకు....

సింగన్న....

సింగన్న....అంతా బాగావుంటే ఈ పాటికి అతనితోమను వైపోయి ఉండేది....

"కాళీచరణ్...." ఆమె పిడికిళ్ళు బిగుసుకున్నాయి....

"రేయ్.... నీకు చావు మూర్తం పెట్టేది నేనేరా.... నేనే"

హఠాత్తుగా ఆమె కళ్ళు అరుణిమ దాల్చాయి.

పుల్లీ ఆ గూడెంలో "దేవణ్ని"

దేవణ్ణి అంటే అమ్మోరి తరువాత అమ్మోరు అంత ముఖ్యమైన స్త్రీ........

అమ్మవారి పూనకాలు వస్తే ఈ దేవణ్ణి"కి వస్తాయి....

అమ్మోరికి బలులు, వేటలు చేయాలన్నా ఈదేవణ్ణియేచెయ్యాలి....

పద్దెనిమిది సంవత్సరాలనుంచి ఇరవై నాలుగు సంవత్సరాలవరకు ఈ దేవణ్ణి పదవి సాగుతుంది.

ఈ కాలంలో ఈ దేవణ్ణి.... కన్యగానే ఉండాలి....

తప్పు చేసినది అని తెలిస్తే అమ్మోరి విగ్రహం ముందునరికేస్తారు. ఎవరిమీదైనమనసైనా ఇరవైనాలుగో యేట మరోస్త్రీ దేవణ్ణి అయ్యాక ఈ స్త్రీ పెళ్ళిచేసుకోవచ్చు....

అప్పటివరకు దేవణ్ణి జీవితం అమ్మవారికి అంకితం....

హంజారా జాతి కులదైవమైన హజారా ఇరవై నాలుగోయేట నిప్పుల్లో దూకి ప్రాణ త్యాగంచేయటంవల్ల- వాళ్ళల్లో ఆ ఆచారంవచ్చింది. వర్షాలు పడకపోతే దేవణ్ణి నగ్నంగా తెల్లావారుఝామున ఊరంతా నడిచి వస్తుంది. వెంటనే వానలు పడతాయి కరువు కాటాకాలు వచ్చినపుడు "దేవణ్ణి పొలాల మధ్య నగ్నంగా సంచరిస్తుంది. అంతే పొలాలు విరగ కాస్తాయి.

కొండజాతి వాళ్ళ మూఢనమ్మకాలు కావు అవి....

పచ్చి నిజాలు........ఎవరైనా ధైర్యంచేసి నగ్నంగా సంచరించే దేవణ్ణి" ని చూస్తే రక్తం కక్కుకొని చచ్చిపోతారని వాళ్ళ విశ్వాసం.

హంజారాజాతి దేవత హజారా నగ్నంగావున్న స్త్రీ శరీరంలో ప్రవేశించి ప్రకృతిని శాసిస్తుంది. కొండలు, కోనలు, ఏర్లు, నదులు సముద్రాలు హజారా తల్లి ఎలాచెప్తే అలా వింటాయని వాళ్ళనమ్మకం....

హంజారాజాతి గూడేనికి దూరంగా పచ్చకొండ ఉంది....

ఆ పచ్చకొండ పగిలిపోయిననాడు హంజారాజాతి మొత్తం నాశనమైపోతుందని, నాగరీకులు పచ్చకొండ దగ్గరికి వచ్చినరోజు వాళ్ళ అపవిత్రతను భరించలేక కొండతల్లి నిప్పులు కక్కుతుందని హంజారాజాతి మత పెద్దలు చెప్తారు.

ఇంతవరకు ఏ నాగరీకుడు పచ్చకొండ పరిసరాల్లోకి వెళ్ళకుండా వాళ్ళు జాగ్రత్త పడ్డారు....

దేవణ్ణి అపవిత్రమైన రోజే నాగరీకులు పచ్చకొండ చుట్టు ముడ తారని ఆ విషయం తాటాకు గ్రంథాల్లో ఉందని చెప్తారు.

దేవణ్ణి అపవిత్రం అయ్యిందో, లేదోకాని దేవణ్ని అయినా పుత్లీ కూడా వయస్సు పొంగుకు లొంగిపోయింది.

ఎన్ని ధర్మాలు, ఎన్నికట్టుబాట్లు పెట్టిన....

యవ్వనోద్రేకంతో ఎగిసిపడే హృదయాన్ని ఎవరూ కట్టిపడేయ లేరు....

దేవణ్ని పుత్లీ విషయంలో కూడా జరిగిందదే....

ఆమె గూడెంలో సింగన్న అనే వ్యక్తికి మనసిచ్చింది.

సింగన్న నాయకుడు మేనల్లుడు....

ఇరవై నాలుగేళ్ళ తర్వాత వాళ్ళిద్దరు పెళ్ళి చేసుకోవాలనుకున్నారు అసలు వాళ్ళిద్దరి పరిచయం విచిత్రంగా జరిగింది.

దేవుళ్ళైనా మానవులైనా, మతప్రవక్తలైనా ప్రేమ అనే మత్తుకు, మైకానికి లొంగిపోతారు అంతే!

ఓసారి పచ్చకొండ దగ్గరున్న సెలయేరులో స్నానం చేయటానికి బయలుదేరింది పుత్లీ !....

ఆమె బొడ్లో పిడిబాకువుంది....

అనుకోని పరిస్థితుల్లో ఎవరైనా అత్యాచారం చెయ్యటానికి వస్తే వాళ్ళను ఎదుర్కోటానికి ఆ పిడిబాకు....

ఆమె నడుంకు చుట్టుకున్న పులిచర్మం ఉండనా, వూడనాఅన్నట్లు కదులుతుంది ఆమె నడుస్తుంటే. ..

పుత్లీ శరీరవర్ణం నలుపైనా.... ఆమె అందంగా ఉంటుంది ....

"బ్లాక్ బ్యూటీ" అనే మాట ఆమెకు ఖచ్చితంగా సరిపోతుంది....

గండు మీనాల్లాంటి అమె అందమైన, ఆకర్షణ శక్తిగల నేత్రాలు చూస్తే బ్రహ్మకైనా రిమ్మతెగులు పుడ్తుందేమోనని అనుమానం వస్తోంది.

పుత్లీ పచ్చకొండ దగ్గరున్న సెలయేరు దగ్గరకు వెళ్ళేసరికిఅక్కడ కాళీచరణ్ కన్పించాడు.

కాళీచరణ్‌ను అక్కడ చూడగానే ఆమె మనస్సు విపరీతమైన భయానికి లోనైంది....

కాళీచరణ్ అక్కడికి రావటానికి వేరే కారణం ఉంది.

ఆ ప్రాంతంలో అడవి ఏనుగులు తిరుగుతాయని అతనికి తెలుసు.

అడివి ఏనుగు దంతాలు కోసం అతనొచ్చాడు....

మొట్టమొదటిసారిగా "దేవణ్ని" అయిన పుత్లీని చూడగానే అతని మనస్సు తియ్యగా మూల్గింది....

ఓ వికృతమైన పశువాంఛ అతని నరనరంలో రేకెత్తింది....

అతను ఆమెవైపు కదిలాడు.

పచ్చకొండ దగ్గర నాగరీకులు కనపడితే హంజారి జాతికి నూకలు చెల్లేకాలం వస్తుందని ఆమెకు తెలుసు....

కాళీ నాగరీకుడు !

తమ గూడాన్ని పరోక్షంగా శాసించే గొప్పోడు....

అలాంటి వ్యక్తి అన్ని తెలిసి ఈ పచ్చకొండ దగ్గరకు ఎందుకు వచ్చాడు. ఈ విషయం గూడెంలోచెస్తే .... గూడెం గూడెం కాళీను చంపి పారేస్తోంది.

ఆమె ఆలోచనలో ఉండగానే కాళీ ఆమె మార్గానికి అడ్డొచ్చాడు.

"అడ్డులేదోరా...." ఆమె కంఠం కఠినంగా పల్కింది.

"పుత్లీ.... నువ్వు చాలా అందంగా వున్నావు ...." అన్నాడు కాళీ.

"దేవణ్నికి అడ్డొచ్చావని గూడెనికి తెలిస్తే నీ ప్రాణాలు పోతాయి దొరా....ఎల్లిపో"

ఆమె కళ్ళు తీక్షణంగా అతన్నే చూస్తూ వున్నాయి.

ఆమె నుదుటిమీదవున్న ఎర్రటి కుంకుమ మరో భద్రకాళిలావుంది.

ఆమె వక్షోజాల వంక చూసాడు కాళీ,తిరిగి ఆమె వంకచూసాడు.

"పుత్లీ.... నాతో వచ్చేయ్........ నాకు కార్లు, బంగాళాలు, సర్వ సుఖాలు అందిస్తాను.... ప్లీజ్ పుత్లీ నాతో వచ్చేయ్" ప్రాధేయ పూర్వకంగాఅన్నాడు కాళీ....

"దేవణ్ణినే మాయాసేత్తున్నావురా మానవుడా .... నేను కల్లు తెరిస్తే మాడిపోతావురా" అంది.

"కళ్ళు తెరుస్తావో.... కౌగిట్లో ఒదిగి పోతావో నీయిష్టం ........ నన్ను కాదంటే మాత్రం నీ పరిస్థితి నీచంగా ఉంటుంది పుత్లీ...."

తను కావాలనుకున్న ఆడదాన్ని ఎలా స్వంతం చేసుకోవాలో కాళీకి బాగా తెలుసు....

"దేవణ్ణినే బెదిరిస్తున్నావురా.... మాయలోడా....నీ సంగతి గూడేనికి చెప్తాను....

ఆమె వేగంగా అడుగు ముందుకు వేసింది....

"గూడేనికి చెప్పేవరకు.... నువ్వుండవు పుత్లీ...."

అని బలంగా ఆమె భుజంమ్మీద చేయివేశాడు.

ఒక్కసారిగా అతను అలా హఠాత్తుగా తనమీద చేయివేసేసరికి పుత్లీ నిర్ఘాంత పోయింది....

చటుక్కున బొడ్లోనుంచి బాకు తీయబోయింది....

ఆమె చేతిని ఒడిసి పట్టుకొని ఆమెనుబలంగాకౌగలించుకోబోయడు కాళీ.

అతని కబంధ హస్తాల్లో నలిగిపోతూ వికృతంగా కేకవేసింది పుత్లీ ....

దేవణ్ణి మైలపడిపోతే హంజారా జాతి మొత్తం సర్వనాశనమై పోతుంది.

ఈ దారుణం జరగటానికి వీల్లేదు....

ఆమె బలంగా ప్రతిఘటించింది....

కానీ కాళీచరణ్ పశు బలం ముందు ఆమె బలం నిలువలేదు. ఆమెను బలంగా గుండెలకు హత్తుకొని పెదవిపైన ముద్దు పెట్టబోయేంతలో

"ఫట్"మని శబ్దం....

కాళీచరణ్ ఆమె కౌగిలిలో నుంచి విసురుగా దూరంగా పడిపోయాడు.

అతను తలెత్తి చూసాడు.

ఎదురుగా సింగన్న....ప్రళయ ప్రభంజనంలా నిలబడి ఉన్నాడు నాయకుడి మేనల్లుడు సింగన్న....

"రేయ్....ఎవఁడ్రా నువ్వు" దెబ్బతిన్న బెబ్బులిలా అరిచాడు కాళీ చరణ్.

"దేవణ్ణిమీద సేయ్యేత్తే........ ఆ సేతిని అడ్డంగా నరికేత్తాను దొరా...." అని అతనివంక కోపంగా చూస్తూ

"ఎల్లిపో దొరా....ఎల్లిపో....నువ్వు ఎల్లకపోతే....ఈ ఏరు........ నీ రకతంతో మైలపడిపోద్ది ఎల్లిపో...."

అతను మౌనంగా అన్న ఆ మాటల్లో ఉన్న పదును అర్థం చేసుకొని కాళీచరణ్ లేచి నిలబడ్డాడు.

ప్రతీకారవాంఛతో అతని కళ్ళు కసిగా సింగన్నవంక చూస్తున్నాయి. సింగన్న చేతిలో విల్లు....

అమ్ముల పొదిలో....పాషాణం పూసిన బాణాలు....

ఒక్కసారి సింగన్న విలుసారిస్తే జరిగేదేమిటోఅతనికి తెలుసు.... తను అన్యాయంగా చచ్చిపోతాడు.

తను చావకూడదు....సింగన్నను చంపి, పుల్లీని అనుభవించాలి. అలా చెయ్యాలంటే యిదికాదు సమయం....

సమయం వచ్చినపుడు ఆ పని చెయ్యాలి....అని నిర్ణయించుకొని....

"దేవణ్ణీ....తప్పుచేసాను.... నన్ను క్షమించు" అన్నాడు.... కాళీచరణ్ దేవణ్ణిని క్షమాపణ అడగకపోతే జరిగేదేమిటో అతనికి తెలుసు....

దేవణ్ణి కాళీచరణ్ గురించి గూడెంలో అందరికి చెప్తుంది.... వాళ్ళందరు తనకు మద్దత్తూ ఉపసంహరిస్తారు....

అందువల్ల తన స్మగ్లింగ్ వ్యాపారం సర్వనాశనమైపోతోంది. అందుకనే తెలివిగా క్షమాపణ అడిగాడు....

"మల్లీ.... యిలాంటి పాడు పని చేసావని తెలిస్తే.... హజారా తల్లికి నీ తలకాయ కానుకగా యిస్తాను వెళ్ళు" అన్నాడు సింగన్న....

దెబ్బతిన్న బెబ్బులిలా వెనక్కి తిరిగివచ్చాడు కాళీచరణ్.

హంజారా జాతిలో ఓ ఆడదాన్ని ఓ మగాడు రక్షిస్తే....

ఆ ఆడదానికి అతనే మొగుడు....

జంతువుల నుంచి, నాగరీకులనుంచి, పాములనుంచి ఎవరైతే రక్షిస్తారో వాళ్లే మనువు ఆడాలి....ఆమెను....

లెఖ్క ప్రకారం పుత్లీ సింగన్నను మనువాడాలి....

కానీ పుత్లీ "దేవణ్ని"

పుత్లీకి ఇరవైనాలుగేళ్ళు వస్తేగాని సింగన్ననుపెళ్ళి చేసుకోడానికి వీల్లేదు.

చాలా చిత్రమైన పరిస్థితి....

ఎప్పుడైతే కాళీచరణ్ చేతిలోనుంచి తనను రక్షించాడో అప్పుడే అతన్ని ప్రేమించింది పుత్లీ....

మౌనంగా అతనికి మనసిచ్చింది....

సింగన్న కూడా ఆమెను ప్రేమించాడు....

ఆ ప్రేమ వ్యక్తం చేయాలా వద్దా....

ఒక్క క్షణం ఆమెవంక చూశాడు.

ఆమె మెల్లగా సిగ్గుపడ్తూ....సెలయేటి దగ్గరకు వెళ్ళింది.

సింగన్న అక్కడున్న చెట్టుదగ్గర కూర్చున్నాడు.

అతనిలో అతనికి తెలియని వింత సంచలనం

"పుత్లీ"ని చూడగానే ఏదో తెలియని హాయి, ఆత్మీయత అతనిలో కలిగాయి.

నీళ్ళల్లో జలకాలాడుతున్న "పుత్లీ" కూడా అదే పరిస్థితికి లోనైంది.

ఆమె మనస్సులో ఏదో తెలియని ఆందోళన ఎగిసెగసి పడ్తోంది.

ఎప్పుడు స్నానంచేసే చల్లటి నీరు ఆమెకు ఆ రోజు చల్లగా, అతి చల్లగా అన్పించింది.... గబగబ స్నానంచేసి వచ్చి దుస్తులు ధరించింది.

"దేవణ్ని అయిన తనకు యిలాంటి అనుభూతు లేమిటి...."

ఆమెకు అర్థం కాలేదు....

గబగబ అక్కడినుండి కొండకు మరోవైపువున్న హజారా దేవి ఆలయం దగ్గరకు వెళ్ళింది.

ఓ పెద్ద కోనేరు మధ్యవున్న మండపం క్రింద భూగర్భంలో ఉంది హజారాదేవి ఆలయం....

హంజారాజాతి వాళ్ళకు ఆమె కులదైవం....

కొలనులోని తామరాకుల్ని....కమలాలను తీసుకువెళ్ళి ఆమె పాదాల మీదపెట్టి కళ్ళు మూసుకుంది "పుత్లీ"

అదే సమయంలో సింగన్న కూడా అక్కడికి వచ్చాడు.

అతను అడవి మల్లెపూలను తెచ్చి హజరాతల్లి తలమీదపెట్టి కళ్ళు మూసుకొని ప్రార్థించాడు.

"హజారా తల్లి.... నాకు దేవణ్ణిమీద మనసైంది....

నాకోర్కె తప్పైతే.... నీతలమీద పూలు అలాగే ఉండాలి తల్లి....

ఒప్పైతే.... ఆ పూలు నీ పాదాలమీద రాలాలి....తల్లీ"అని కళ్ళు మూసుకున్నాడు.

సరిగ్గా అదే సమయంలో పుత్లీ.... మనస్సులో అనుకుంది,

"అమ్మ.... నేను దేవణ్ణిగా తప్పుసేయను ........ సింగన్నపై మనస్సుకలిగిందంటే.... అదే నీమాయేతల్లి.... సింగన్న నామావైతే ....

ఆడు నీ కాళ్ళమీద పడిపోవాల.... ఆడుపరాయి వాడైతే... .... గుళ్లోనుంచి వెళ్ళిపోవాలా"

అలా అని ఆమె అనుకోగానే....హజారా తల్లి శిరస్సుమీద ఉన్న అడవిమల్లె పూలు క్రింద పడ్డాయి.

అడవి మల్లెపూలుక్రిందపడగానే....ఆశ్చర్యపోయాడు సింగన్న.... తల్లి తనను కరుణించిందని అర్థం చేసుకోని ఒక్కసారిగా ఆమె పాదాల మీద పడిపోయాడు.

ఆ దృశ్యం చూసి ఆశ్చర్యపోయింది పుత్లీ....

దేవత తమ ప్రేమను దీవించిందని తెలుసుకొని దేవత పాదాలకు మొక్కి సింగన్న వంక చూసింది....

"మావా" ఆర్ద్రంగా పిలిచింది పుత్లీ....

పుత్లీ వంక కళ్ళెత్తి చూసాడు సింగన్న, వరమిచ్చిన దేవతలా కన్పించింది అతని కళ్ళకు పుత్లీ....

"ఏవిటి పుత్లీ" అని ఆమె పేరుతో పిలిచాడు....

"అమ్మా....ఆనతైంది మావా....నిన్ను మనువాడడం అమ్మకు యిష్టమే మావా"

"అవునేపుత్లీ ....తల్లి నన్నుదీయించింది..మనిద్దరంమనువాడదామే.."

"అమ్మో....యిప్పుడొద్దు మావా....రెండు పదునాలుగేళ్ళు రానీ మావా....అప్పుడే సేసుకుందాం" అంది పుత్లీ.

"అప్పుడు గూడెపోళ్ళ దగ్గర సేసుకుందాం....యిప్పుడు తల్లి దగ్గర సేసుకుందాం"అని....బొడ్లో నుంచి చాకుతీసి బొటనవేలు మధ్యకు కసిక్కున కోసుకున్నాడు. బొటన వేలుపై చర్మం తెగి బొటబొటా రక్తం వచ్చింది. బొటన వేలు నుంచి కారుతున్న రక్తపు బొట్లను దేవిపాదం దగ్గర పెట్టి.... కారటం ఆగి పోగానే ఆ రక్తాన్ని బొటన వేలికి రాసుకొని పుత్లీకి బొట్టు పెట్టాడు. హజారా తల్లి మెళ్ళో వున్న బొండు మల్లెలమాల తీసుకొని ఆమె మెళ్ళో వేసాడు. ఆమె కూడా బొండు మల్లెల మాల అతని మెళ్ళో వేసింది. అంతటితో పెళ్ళి అయిపోయినట్లే లెఖ్క....

"ఈ యిసయం ఎవ్వరికి చెప్పొద్దు....ప్రతిరోజు మనం తల్లి దగ్గర కల్సుకుందాం" అన్నాడు సింగన్న....

"అలాగే అంది పుత్లీ....ఇద్దరు అక్కడ నుండి బైటకొచ్చారు.

పుత్లీ గూడేనికి వెళ్ళిపోయింది.

ఆ తర్వాత ప్రతిరోజు వాళ్ళిద్దరు హజారా తల్లి ఆలయంలో కలిసే వాళ్ళు....కేవలం కలయికే అది, శారీరక సంపర్కం కాదు. ఓ రోజున వాళ్ళిద్దరు కల్సుకోవటం కాళీచరణ్ దృష్టిలో పడింది. అతని మనస్సులో ఓ దుష్ట పథకం కదిలించి.

దాన్ని ఆచరణలో పెట్టాడు. కొండల్లో స్వేచ్ఛగా తిరుగుతున్న పుత్లీని ఓ రోజు అతని అనుచరులు సీక్రెట్‌గా బంధించి అతని గెస్ట్ హావుస్‌కు తెచ్చారు.

పుత్లీని అతని గదిలో విడిచిపెట్టారు.

కాళీచరణ్ బెడ్‌మీద పడుకొని ఉన్నాడు. అతని చేతిలో మందు గ్లాసు....టేబుల్ మీద స్కాచ్ బాటిల్

లోపలికి రాగానే అంతా అర్థమైంది పుత్లీకి....

"రేయ్....నువ్వు మడిసివి కాదురా....మృగానివి....నేను దేవణ్ని అని తెలిసి కూడా నన్నెత్తుకు వచ్చావు అంటే మా గూడెం గూడెం నిన్ను ....నీ మనుషుల్ని బుగ్గి చేత్తారు....జాగ్రత్త" ఆమె కంఠం కరుగ్గాపల్కింది. ఆమె మాటలు విని పడిపడి నవ్వాడు కాళీచరణ్....

నవ్వి ఆమె వంక కసిగా చూసాడు.

"ఇంకా నువ్వు "దేవణ్ని"వి అనే భ్రమలో ఉన్నావా....అమ్మడు.. నువ్వూ సింగన్న....ప్రతిరోజు....అమ్మోరు గుళ్ళో ఏం చేస్తున్నారో.... ఎవ్వరికీ తెలియదనుకుంటున్నావా...." అన్నాడు.

అతని వంక దిగ్భ్రాంతిగా చూసింది పుత్లీ....ప్రక్కకు వంగి టేబుల్ మీద నుంచి ఓ ఫొటో తీసి యిచ్చాడు కాళీచరణ్.

"చూడు....ఆ ఫొటో చూడు....దే....వ....ణ్ని.... నీ రంకు.... మోసం బయట పడ్డాయి...."

ఆ ఫొటోలో సింగన్నతో నడిచి వస్తున్న పుత్లీ....

ఇద్దరి ముఖాలు సంతోషంగా, ఆనందంగా ఉన్నాయి. వాళ్ళిద్దరు వస్తున్నప్పుడు చెట్టు చాటు నుంచి తీయించాడు ఆ ఫొటో....

ఆ ఫొటో చూడగానే పుత్లీ ముఖం రక్తం యింకిపోయినట్లు తెల్లగా పాలిపోయింది.

ఆ ఫొటో గూడెంపెద్ద చేతిలోపడితేజరిగేదేవిటో ఆమెకుతెలుసు....

తన చేతికో కత్తియిచ్చి ముందు సింగన్నను చంపేయిస్తారు. ఆ తరువాత అమ్మోరు విగ్రహం ముందు జాతర చేసి తన తల నరికేస్తారు.. జరిగేది ఖచ్చితంగా అదే....

అందుకే ఆమె అంతలా భయపడింది....

"దొరా....నీకిది నాయం కాదు...." ఆమె కంఠంలో మునుపటి కాఠిన్యం లేదు....

"నువ్వు....నన్నొదిలేసి సింగన్నను ప్రేమించటం న్యాయమా చెప్పు....దే....వ....ణ్ని...." మత్తుగా అన్నాడు కాళీచరణ్.

"నేను ఆడిని పెళ్ళి చేసుకుంటాను దొరా" ఆమె కంఠంలో ప్రాధే యత....

పడిపడి నవ్వాడు కాళీచరణ్....అతనిలోని శాడిజం వికృతంగా పడగెత్తింది.

"నాతో సుఖపడు....ఆడ్ని పెళ్ళి చేసుకో...." అన్నాడు.

"దొరా...." ఆమె సివంగిలా గర్జించింది.

"ఆపు నీ గోల....ఓసేయ్ పుత్లీ....నీమీద నాకు మనస్సైంది." నిన్ను యిప్పుడు ఈ గదిలో చెడిపేస్తే ఏం చేస్తావ్"

"నా మావతో చెప్పి నిన్ను ముక్కలు ముక్కలుగా సంపేత్తాను"

ఆమె కళ్ళల్లో విస్ఫులింగాలు చెలరేగాయి....

ఆమె వెనక తలుపులు నిశ్శబ్దంగా మూసుకున్నాయి.

ఆమె వెనక్కి తిరిగి చూసింది. తలుపులు వేసేసారు అని అర్ధం కాగానే ఆమెలో తెలియని భయం ప్రవేశించింది. కాళీచరణ్ వికృతంగా నవ్వుతూ ముందుకొచ్చాడు. ఆమె తప్పించుకోటానికి విశ్వ ప్రయత్నం చేసినది. రక్కింది, కొరికింది, అతని చేతుల్లో నుంచి తప్పించుకోటానికి గింజుకుంది. అయినా కాళీచరణ్ ఆమెను వదలి పెట్టలేదు.

ఆమె జీవితం ....ఆ నాలుగు గోడల మధ్య అతనిచేతిలో నలిగి పోయింది....పని పూర్తైన తర్వాత అన్నాడు కాళీచరణ్.

"ఈ సంగతి మీ గూడెంలో తెలిస్తే....పోలీసోళ్ళని పెట్టి గూడెం గూడెం మొత్తాన్ని సర్వనాశనం చేస్తాను" అని

అతని వంక అసహ్యంగా చూసి వచ్చేసింది పుత్లీ....

ఆ రెండో రోజు పచ్చకొండ దగ్గర సింగన్నను కలిసి అసలు విష యం చెప్పింది....

మావా....ఆడు పెద్ద పులిలాగ నన్ను....నా బతుకును సెరిసేసినాడు మావా" అని గుండెలు పగిలేలా రోదించింది.

అంతే!

సింగన్న దెబ్బతిన్న బెబ్బులై పోయాడు....

వాడికి పుల్లీ అంటే ప్రాణం....నీకు ప్రాణం ఎక్కువా, పుల్లీ ఎక్కువా అంటే పుల్లీ ఎక్కువంటాడు....

వాడికి ఒక్కటే ధ్యేయం....కాళీచరణ్‌ని చంపాలి....

గండ్రగొడ్డలి తీసుకొని కాళీ గెస్టహవుస్‌లోకి వెళ్ళాడు.... అదీ రాత్రి పన్నెండు గంటలకు....

"రేయ్....కాళీ....అన్నెం పున్నెం ఎరుగని నా పుల్లీ బతుకును నాశనం సేసావు....సావరా....నాయాల" అని గొడ్డలితో మంచం మీద ఉన్న కాళీను నరకబోయాడు....

అంతే!

అప్పటి వరకు నిద్ర నటిస్తున్న కాళీ చేతిలోని రివాల్వర్ గర్జించింది. కట్టె విరుచుకుపడి పోయినట్టు పడిపోయాడు సింగన్న.

ఆ తర్వాత....వాడి కాళ్ళు చేతులు నరికి పచ్చకొండ దగ్గర పడేసారు కాళీ అనుచరులు....

అమ్మోరు సింగన్నను బలితీసుకుంది అని గూడెం అంతా అనుకున్నారు గాని పుల్లీ ఆ విషయం నమ్మ లేదు....

కాళీ సింగన్నను దారుణంగా చంపేసాడని తెలుసు....

అందుకే వాడ్ని చంపటానికి కంకణం కట్టుకుంది....

దారుణంగా,అతి నీచంగా,హేయంగాచంపాలి..అదే ఆమెకోరిక....

అప్పటివరకు ఆమె దేవణ్ణిలాగే ఉండాలి.

తన స్థానం అప్పటివరకు నిలబడాలి....ఆమెలో కసి, ద్వేషం-ఆలోచనలో ఉన్న పుల్లీ పులిక్కిపడింది.

చీకటి పడిందన్నట్లు సంకేతంగా ఆకాశంలో చుక్కలు మెరిసాయి.

ఏమైనాసరే గూడెంలో ఈ రోజు చిక్కిన నాగరీకుల్ని విడిపించి వాళ్ళ సాయంతో కాళీచరణ్‌ను చంపాలి....అదే ఆమె పథకం....

## 15

మంటలు ఉధృతంగా చెలరేగాయి.

సరస్సు దగ్గరకు రకరకాల జంతువులు వచ్చాయి....

సరస్సులో నుంచి దొన్నెలో నీళ్ళు తీసుకువచ్చి ప్రొఫెసర్ జయరాం ముఖంమీద చల్లింది....

ప్రొఫెసర్ జయరాంకు మెలుకువ వచ్చింది.

మెలుకువ రాగానే ఆయనకు జరిగింది ఏమిటో అర్థమైంధి.

తన ప్రాణాలకు తెగించి కాపాడిన కపర్థిపై ఆయనకు ఆ క్షణంలో పితృవాత్సల్యం లాంటిది కలిగింది.

సరిగ్గా అదే క్షణంలో కపర్థి కళ్ళు తెరిచాడు....

"థాంక్యూ మిష్టర్ కపర్థి - నువ్వు నన్ను రక్షంచకపోతే ........ ఆ మంటలలోనే కాలిపోయేవాడిని...."

"నోమెన్షన్‌సార్ .... మనం బ్యాచ్‌గా ఉండటంవల్ల .... మనల్ని మనం రక్షించుకో గలిగాం...."

దుప్పులు, జింకలు.... యింకా రకరకాల జంతువులువచ్చి సరస్సు లోకి దిగుతున్నాయి.... యింకా పాములు కూడా నీళ్ళల్లోకి దిగాయి....

సరస్సు ప్రాంతమంతా గందరగోళంగా వుంది.

ఆ జంతువుల్ని చూసి ముగ్గురికి భయం వేయలేదు.

ఆత్మరక్షణ సమయంలో ఏ జంతువు మరో జంతువును చంపదు....

కొంచెం సేపటికి మంటలు ఆరిపోయాయి.

ఆ ప్రాంతంలో కొంతభాగం అడవి మాడిపోయింది.

సరస్సులో నీళ్ళు త్రాగి ముగ్గురూ బయలుదేరారు....

ఉత్తర దిశగా నాలుగు మైళ్ళు వెళితేగాని హంజారా జాతివాళ్ళ గూడెం రాదు....

పొద్దు పొడిచేటప్పటికి వాళ్ళు హంజారాజాతి గూడెం దరిదాపుల్లోకి చేరారు....

గూడెం ముందు.... భయంకరమైన విగ్రహం........ దానిముందు కుంకుమ రాసులగాపోసి వుంది....

అప్పుడు సరిగ్గా సాయంకాలం ఆరుగంటలైంది.

ముగ్గురు ఆ గూడెం వంక చూస్తూ ఓ చెట్టు క్రింద నిలబడ్డారు....

కపర్ధి బ్యాగ్ ఓపెన్‌చేసి బిస్కెట్లు, టిన్ బీర్ బైటికి తీసాడు.

సరిగ్గా అదే సమయంలో....

చెట్లచాటునుంచి వాళ్ళవైపు మౌనంగావచ్చారుహంజారీజాతి కోయలు .... ప్రొఫెసర్ జయరాం చుట్టూ, కపర్ధి చుట్టూ ఒక్కసారిగా కేకలు వేసుకుంటూ వచ్చి నిలబడ్డారు.

నోట్లో పెట్టుకోబోతున్న బిస్కెట్ నోటిదగ్గరే ఆగింది ....కపర్ధి వాళ్ళవంక చూసాడు.

క్రూరంగా నవ్వుతున్నారు వాళ్ళు.... ఆ చీకట్లో వాళ్ళు యమ దూతల్లా భయంకరంగా ఉన్నారు.

తాము వాళ్ళచేతికి చిక్కిపోయామని వాళ్ళకు ఆక్షణంలో అన్పిం చింది....

"లే....బిడ్డా....లే.... కొండ దేవతకు యియ్యాల మంచి కొలు పులు కొలుస్తాములే.... లే అన్నాడు....

కపర్ది లేచి నిలబడ్డాడు. సులోచన భయంభయంగా వాళ్ళ వంక చూసింది....

ప్రొఫెసర్ జయరాం ఒక్కసారిగా నిరాశపడి పోయాడు....

చివరికి వచ్చి వచ్చి వాళ్ళ చేతుల్లో చిక్కిపోవటం అతనికి బాధగా వుంది....

"పిట్ట.... పెట పెట లాడిపోతోంది. ఏ పుంజు పెట్టవే నువ్వు" ఒకడు వెకిలిగా ఆమెవంక చూస్తూ అన్నాడు.

"ఈ పెట్టను రాతిరికి.... నా గుడిసెకు తీసుకువెళితే"

ఎనిమిది మంది ఉన్నారు.... ధైర్యంచేసి ఎదురు తిరిగేతే విజయం సాధించవచ్చు అనుకున్నాడు కపర్థి....

కోయవాడు వెకిలిగా సులోచన చేయిపట్టుకున్నాడు, మరుక్షణం వాడి చెంప "ఛెళ్ళు" మంది.

"చెయ్యి మీదేస్తే రక్తం తాగుతాను రాస్కెల్" అంది....

కపర్ధికి విపరీతమైన కోపం వచ్చింది....అతను ముందుకు ఉరక బోయాడు. ఇద్దరు కోయవాళ్ళు అతన్ని బలంగా పట్టుకున్నారు.

“పెట్ట కూతమీద .... కువ....కువలాడి పోతోంది ....

చేయ్యేస్తే.... కస్సుమంటోంది.... బిడ్డా... ఈసనబిసలు ఈ రాతి రికే....ఈ చిన్నదేవర చేతిలోపడ్డ ఏపెట్ట....మాటయినకుండాపోలేదు....”

“ఎవరు నువ్వు” అన్నాడు కోపంగా కపర్ధి.

“పెద్ద దొరబిడ్డడ్ని — కాబోయే ........ గూడేనికి నాయకుడ్ని” అన్నాడు....

కొండదొరల్లో కూడా ఈ జాత్యహంకారం పోలేదా అని అన్పిం చింది....

“ఇదిగో ఆ అమ్మాయిమీద చెయ్యివెయ్యొద్దు .... కావాలంటే మీ నాయకుడి దగ్గరకు తీసుకువెళ్ళు” ఖచ్చితంగా అన్నాడు కపర్ధి,ఆ మాటకు ఖంగుతిన్నాడు పెద్ద నాయకుడి కొడుకు”

“పెట్టమీద చెయ్యేస్తే.... ఏం సేత్తావురా” అన్నాడు విలాసంగా.

“ఆ చెయ్యిని అంతవరకు నరికేస్తా” అన్నాడు కపర్ధి....

“ఇదిగో వేస్తున్నా” అని సులోచనమీద చేయివేశాడు.

విపరీతమైన ఆవేశం నరనరంలో ముంచుకు రాగా ఒక్కసారితనను పట్టుకున్న వాళ్ళను విదిలించి కొట్టిప్రభంజనంలా ముందుకుకదిలాడుకపర్ధి.

కోయవాళ్ళు వెనక్కి పడిపోయారు....

విసురుగా ముందుకువెళ్ళి ఆ ఊపుతోనే చిన్న నాయకుడి చేయి పట్టుకొని విసురుగా ముందుకు లాగాడు.

గింగరాలు తిరుగుతూ వచ్చి ముందుకు పడ్డాడు చిన్న నాయకుడు. అతని తలవెళ్ళి చెట్టుమానుకు బలంగా తగిలింది....

చటుక్కున వెనక్కి తిరిగాడు....

“అడ్ని.... అడ్ని.... బల్లేలతో పొడిసెయ్యండిరా” అని పెద్దగా అరిచాడు....

విపరీతమైన ఆవేశంతో ముందుకు దూకి వాడి చేతిని తీసుకొని ఒక్కసారి మెలికవేసాడు.

"ఫట్" మనే చిన్న శబ్దం....

అతని భుజం దగ్గర ఎముక విరిగింది....

విజయగర్వంతో చిన్న నాయకుడు వంక చూసాడు కపర్థి....

ప్రొఫెసర్ జయారాం చేష్టలుడిగిన వాడిలా దిగ్భ్రాంతిగా వాళ్ళ వంక చూసాడు.

కన్ను తెరిచి మూసే లోపల జరిగిపోయిందా సంఘటన....

కపర్థి అంతగా తిరగబడతాడను కోలేదు....

సులోచన వేగంగా అతని దగ్గరకువచ్చి భుజమ్మీద వాలి పోయింది....

తనకోసం రిస్క్‌లో యిరుక్కున్న మగాడ్ని చూస్తే ఆడదానికి కలిగే అనురాగం అది....

కిందపడ్డ చిన్న నాయకుడు మెల్లగా లేచాడు. అతని కళ్ళల్లోవిస్ఫు లింగాలు.... తన గూడేనికివచ్చి తన చెయ్యి విరిగ్గొడతాడా ఈనాగరీ కుడు.... తన వాళ్ళ ముందు ఘోరంగా పరాభవించబడే సరికి తట్టుకోలేక పోతున్నాడు-—

"రేయ్.... యీళ్ళని నరికేసేయ్యండిరా...."అన్నాడు.చటుక్కున జేబులోనుంచి రివాల్వర్ తీశాడు కపర్థి....

"జాగ్రత్త— అడుగు ముందుకువేస్తే కాల్చిపారేస్తాను"అన్నాడు.

ఆ వస్తువు ఏమిటో వాళ్ళకి తెలుసు కాబట్టి వాళ్ళు ఏం మాట్లాడ కుండా గడగడ వణుకుతూ నిలబడ్డారు.

సరిగ్గా అదే సమయంలో గూడెం నాయకుడు అటుగా వచ్చాడు.

తన మనుష్యులు ఎవరో నాగరీకుల్ని బంధించినట్లు అయనకుకన్పిం చింది.... అక్కడికి వచ్చేసరికి పరిస్థితి భిన్నంగా కన్పించింది. గబగబ ముందుకు వచ్చాడు....

ఆయన్ని చూసి కపర్థి కదల్లేదు....

"ఏం కూనా....ఎవరు నువ్వు.... నా గూడెంలోకి వచ్చి నా వాళ్ళనే భయపెడ్తున్నావు.... ఎవరు నువ్వు...." అన్నాడు.

"ఎవరు నువ్వు" అన్నాడు కపర్థి....

"ఈ గూడేనికి నాయకుడ్ని...."

"ఈ గూడేనికి నాయకుడివైతే .... నీ కొడుకు ఆడపిల్లల మీద చెయ్యేస్తే ఊరుకుంటావా" సూటిగా అడిగాడు.

ఆయన కంగారు పడిపోయాడు. ఇలాంటి పనులకు ఆయన వ్యతిరేకి....

"నా బిడ్డ అలాంటి పనులు సెయ్యడు దొరా" అన్నాడు నాయకుడు.

"నీ అనుచరుల్ని కనుక్కో.... చేశాడో, లేదో చెప్తారు"

"ఏరా.... నా కూన అలాంటి పనులుసేసాడా...."

"చెయ్యేసినాడు అంతే దొరా.... దానికి ఈ పట్టం దొర సీ కూన సెయ్యేరిసేసాడు" అన్నాడు ఓ అనుచరుడు.

ఆ మాటకు విపరీతమైన కోపం వచ్చింది నాయకుడికి ....

"యిళ్ళనీ.... గూడెంలోకి తీసుకు వెళ్ళండి" అన్నాడు....

"నేను రాకపోతే ఏం చేస్తావు" అన్నాడు కపర్ది ఆ మాటకు నిర్ఘాంతపోయాడు గూడెపు పెద్ద....

"కానీ....వస్తున్నాను.... మమ్మల్ని మేం రక్షించుకోగలం అన్న నమ్మకం వుంది కాబట్టి నిన్ను నమ్మి వస్తున్నాం" అని రివాల్వర్ జేబులో పెట్టేసాడు....

ముగ్గుర్ని.... గూడెంలో ఓ పెద్ద గుడెసెలోకి తీసుకు వెళ్లాడు గూడెపు నాయకుడు.

అక్కడ చర్మపు దుప్పట్లు పర్చి ఉన్నాయి.

వాటిమీద కూర్చున్నాడు.... గూడెపు నాయకుడు ఎత్తైన కొయ్య కర్రలతో చేసినకుర్చీమీద కూర్చున్నాడు....

ప్రొఫెసర్ జయరాం గొంతు సవరించుకున్నాడు.

"మేం.... యిక్కడికి పరిశోధన కోసం వచ్చాం తప్ప........... మిమ్మల్ని ఏదో చెయ్యాలని రాలేదు........ మీ అబ్బాయే ఆవేశంతో మమ్మల్ని రెచ్చగొట్టాడు.... ఆ అమ్మాయిమీద చేయివేస్తే ఏం చేస్తావు....

అని బెదిరించాడు.... అందుకనే మావాడు.... మీవాడి చెయ్యివిరగ్గొట్టింది" అన్నాడు ప్రొఫెసర్ జయరాం,ఆయన ముఖం గంభీరంగా ఉంది...

గూడెపు నాయకుడు బుగ్గ మీసాలు సవరదీసుకున్నాడు....

"పంతానికి పోయి నాకూన చెయివిరిసి పెద్దతప్పు సేసారు....మీరు" అన్నాడు....

ఇంతలో చెయ్యి విరిగినవాడు చిన్న నాయకుడు గబగబ ఆగదిలోకి వచ్చాడు.

"అయ్యా........యిడ్ని బల్లెలతో పొడిపించి సంపెయ్యి అయ్య" అన్నాడు. అతని కళ్ళల్లో విపరీతమైన కోపం, కసి ఉన్నాయి....

"నువ్వు తప్పుసేసావురా కూన.... పరాయి పెట్ట మీద చెయ్యే య్యటం పెద్ద తప్పు"

"ఆ పెట్టమీద నాకు మోజు కలిగింది అయ్యా.... అందుకే చెయ్యి ఏసినా"

"మోజు కలిగితే.... పోరాడి గెలుసుకోవాలిరా కూన"

"పోరాడి గెలుసుకుంటాను అయ్యా...." అన్నాడు ఆవేశంగా చిన్న నాయకుడు....

చిన్న నాయకుడి కసి, ఉక్రోషం ఎక్కడనుంచి ఎక్కడి కెళతాయో ప్రొఫెసర్ జయరాంకు అర్థం కాలేదు....

"పోరాడి గెలుసుకోటానికి ఆడు మనజాతోడు కాదురా" అన్నాడు ఆయనకు ఎట్లాగైనా కొడుకును సమాధానపరిచి పంపాలని ఉంది. కాని కొడుకు మాట వినటంలేదు.

"ఆడిసేతికి కట్టుకట్టి బరిలోకి దింపయ్యా .... ఒంటిసెత్తో ఇద్దరం పోరాడుకుంటాం.... ఎవడు బతికితే, ఆడే ఆ పెట్టకు పుంజు...." కొడుకు పట్టుదల అర్థమైంది....

పోరాటం పేరుతో కపర్దిని చంపేయాలని అతని అలోచన....

పోరాటం ప్రారంభించిన తర్వాత గెలుపు ఓటమిలు ఎవ్వరిని వరి స్తాయో ఎవ్వరికీ తెలీదు.

దురదృష్ట వశాత్తు తన కొడుకే ఓడిపోతే....

ఆ భావన భరించలేకపోయాడు పెద్ద నాయకుడు.

"ఇంకా ఎందయ్యా ఆలోచన.... పోరాటం పెట్టించు" అన్నాడు.

"అలాగే.... కూన.... పోరాటం పెట్టిస్తాను" అన్నాడు....

అని గబగబ బైటికి వెళ్ళాడు.

చిన్న నాయకుడు విజయగర్వంతో కపర్థి వంకచూసి గబగబబైటికి నడిచాడు.

వాళ్ళందరూ బైటికి వెళ్ళగానే సులోచన కళ్ళ నీళ్ళు పెట్టుకుంది.

"ఏమిటండీ .... యిది.... ఇలా వచ్చి........ఇలాంటి క్లిష్టపరిస్థితుల్లో యిరుక్కు పోతున్నాం" అంది—

"ప్లీజ్.... ఏడవకు సులోచన.... వాడునన్ను ఏమీ చెయ్యలేదు.... నా చేతిలో చచ్చిపోవటం తప్ప...."

"అది నిజమే అనుకోండి.... కొడుకును చంపితే, ఆ బాధలో పెద్ద నాయకుడు మనల్ని అమ్మోరికి బలియిస్తే...." ఆమె కళ్ళల్లో భయంకదలాడింది.

"పెద్ద నాయకుడు నాకు అలా కన్పించలేదు. కొంచెం మంచివాడిలా ఉన్నాడు.... లేకపోతే ఈ పాటికి మనల్ని చంపేసి ఉండేవాళ్ళు" అన్నాడు కపర్థి.

వీళ్ళు మాట్లాడుకుంటూ ఉండగా.... కొన్ని ఆహార పదార్థాలతో కొందరు ఆడవాళ్ళు లోపలకు వచ్చారు....

"ఈ మేత మెయ్యండి దొర....గంటకొట్టగానే పోరాటానికిసిద్ధంగా ఉండమన్నాడు పెద్ద దొర.... అని చెప్పి ఆ ఆహార పదార్థాలను అక్కడ పెట్టి వెళ్ళిపోయారు ఆడవాళ్ళు....

"మేత మెయ్యటానికి మనం పశువులం కాదుకదా" అంది సులోచన....

"వాళ్ళ భాషలో మేత అంటే తిండి.... ఈ తిండిపెట్టి యింకొంచెం సేపట్లో పోరాటం మొదలు పెడ్తారు. కానీ కానీ" అన్నాడు ఓమూకుడు చేతిలోకి తీసుకొని సులోచన కిచ్చాడు, అందులో కాలిన పావురం మాంసం ఉంది,

తెచ్చిన మూకుళ్ళల్లోని ఆహార పదార్థాలు తిని ఓ కుండలోతెచ్చిన పుట్టతేనే తృప్తిగా తాగారు....

ముగ్గురు భోజనం పూర్తిచేసేసరికి, బైట .... ఠంగ్ ఠంగ్మని పెద్దలోహపు మొద్దును బాదుతున్న శబ్దం పోరాటానికి సమయం అయిందన్నట్లు లేచి నిలబడ్డాడు కపర్థి .... సరిగ్గా అప్పుడే లోపలికి వచ్చాడు నాయకుడు.

"పోరాటానికి సిద్దంకా కూనా" అన్నాడు నాయకుడు....

మిగతా వాళ్ళు వచ్చి కపర్థి బట్టలూడదీసి పులిచర్మం దట్టిని కట్టారు. ఆ దుస్తుల్లో కొండదేవరలా ఉన్నాడు కపర్థి....

"బరిలోకి రాబిడ్డా" అన్నాడు....

ముగ్గురు బైటికి నడిచారు.... ఓ వైపు హజారా దేవి విగ్రహం ఉంది. నెగుళ్ళువేసి మంట పెట్టారు....

గోదా దగ్గర నిలబడి వున్నాడు చిన్న నాయకుడు. ఇద్దర్ని గోదా దగ్గరికి తీసుకువెళ్ళారు.

ఇద్దరి చేతికి రెండు గండ్ర గొడ్డళ్ళు యిచ్చారు.

అవి స్టీలు గొడ్డళ్ళు.... నెగడు మంటకు అవి తళతళలాడ్తున్నాయి.

ఓ అనుచరుడు వచ్చి కపర్థి కుడిచెయ్యిని వెనక్కి మడిచికట్టేసాడు, ఒంటి చేత్తో యుద్ధం చేయాలి....

ఆవరణ అంతా హంజారి జాతివాళ్ళతో నిండిపోయింది.

బరిచుట్టూ అర్థచంద్రాకారంలో నిలబడి ఉత్కంఠగా చూస్తున్నారు.

ఒక ప్రక్కగా నిలబడి ఆందోళనగా చూస్తున్నారు ప్రొఫెసర్ జయరాం, సులోచన....

నాయకుడు కంఠం సవరించుకున్నాడు.

"పట్నం కూనా....యిది హంజారాజాతి సమస్య ........ నువ్వు నా కొడుకుతో యుద్ధం చెయ్యాలి.... నా కొడుకును ఓడిస్తే నువ్వు బతుకుతావు.... నా కొడుకు గెలిస్తే నువ్వు చస్తావు.... అర్థమైందా"అన్నాడు.

కపర్థి అర్థమైంది అన్నట్లు తల ఊపాడు.

అతని శరీరమ్మీద నెగడు వెలుగుపడి ప్రతి ఫలిస్తోంది.

"నేను గంట మ్రోగించగానే మీరు యుద్ధం ప్రారంభించాలి" అని అన్నాడు

మరుక్షణం మొద్దు రూపంలోవున్న లోహంపై కొయ్యతో గంట కొట్టారు.

"ధన్" మని మ్రోగింది శబ్దం....

ఒక్కసారి గొడ్డలి తీసుకొని బరిలోకి ఉరికాడు కపర్ది....

చిన్న నాయకుడు వీరావేశంతో ముందుకు ఉరికాడు.

స్టీలు గొడ్డళ్ళు ఖంగు ఖంగున ఒకదానికొకటి తగిలి విపరీతమైన శబ్దంతో మ్రోగుతున్నాయి. అక్కడి పరిసరాలు ఆ మోతతో ప్రతిధ్వనిస్తున్నాయి.

నిజానికి గొడ్డలితో ఎలా యుద్ధం చెయ్యాలో కపర్దికి తెలియదు, కాని ప్రస్తుత పరిస్థితి వేరు....ఏదో విధంగా పోరాడకపోతే కపర్ది ప్రాణాలు పోతాయి. చావో బ్రతుకో తెల్సుకోవాల్సిన సమయం. గొడ్డళ్ళు ఖంగుఖంగు మన్నప్పుడల్లా సులోచన భయంతో ఉలికి ఉలికి పడుతోంది. కపర్ది చూపు చురుగ్గా వుంది, ఎదుటివాడి కదలికకు అనుగుణంగా గొడ్డలిని కదుపుతున్నాడు....మృత్యుభీతితో మనిషి ఏ విద్యనైనా నేర్చుకుంటాడని చాణక్యుడు అర్ధశాస్త్రంలో చెప్పాడు. ఆ మృత్యుభీతే కపర్ది చేత యుద్ధం చేయిస్తోంది.

మెరుపులా కదులుతున్నాడు చిన్ననాయకుడు....

రకరకాల భంగిమల్లో గొడ్డలిని తిప్పుతూ వీరావేశంతో స్వైర విహారం చేస్తున్నాడు....

అతని కదలికల్ని నిశితంగా పరిశీలిస్తూ దానికి తగ్గట్టుగా తన గొడ్డలిని ప్రయోగిస్తున్నాడు కపర్ది....ఏ మాత్రం అతను ఏమరుపాటును ప్రదర్శించినా చిన్న నాయకుడి గొడ్డలి అతని గుండెల్లోదిగటానికిసిద్ధంగాఉంది.

బరిలో ఉన్న దుమ్ము వాళ్ళిద్దరి కదలికలకు పొగలా పైకిలేస్తోంది.. వాళ్ళ కదలికలకు జనం పక్కకు తప్పుకుంటున్నారు. కపర్ది ప్రత్యర్థి గొడ్డలిని ఎదుర్కొంటుండగా ఊహాతీతమైన వేగంతో కదిలాడు చిన్న నాయకుడు.

అతని వేగం కపర్దికి కన్పించలేదు....

చివరి క్షణంలో అది భుజంమీద పడ్తుంది అనగా చటుక్కున ప్రక్కకు కదిలాడు....గొడ్డలి అతని చేతిని రాచుకుంటూ క్రిందకుదిగింది. ఫలితంగా కపర్ది ఎడమ భుజమ్మీద చర్మం చీరుకుపోయి రక్తం వరదలా ఉప్పొంగింది.

విజయగర్వంతో వికృతంగా అరిచాడు చిన్న నాయకుడు. అదే అతను చేసిన పొరపాటు....

ఆ ఒక్క క్షణంలో అతను ఏమరుపాటుగా ఉన్నాడు....

మరుక్షణం ఊహాతీతమైన వేగంతో కదిలింది కపర్ది చేతిలోని గొడ్డలి....చిన్న నాయకుడు గొడ్డలిని అతి విసురుగా తాకింది....

"ఖళ్" మనే శబ్దం....

గొడ్డలి ఆకాశంలోకి ఎగిరి రివ్వున క్రిందకు దూసుకువచ్చి ఇద్దరి మధ్య బరిలో నిట్టనిలువుగా భూమిలో పాతుకుపోయింది. అప్పుడు నవ్వాడు కపర్ది విజయగర్వంతో.

భయంతో వెర్రిగా చూసాడు చిన్న నాయకుడు....

ఒక్క అడుగు చిరతపులిలా ముందుకువేసి....గొడ్డలిని గాలిలోకి విసురుగా లేపాడు.

స్ప్లిట్ సెకండ్....లో జరగబోయేదేమిటో అర్థమైంది నాయకుడికి.. ఆ గొడ్డలి ఖచ్చితంగా తన కొడుకు మెడకు తగలబోతుంది.

అప్పుడు అరిచాడు పెద్దగా....

"పట్టందొరా....నా కొడుకును సంపొద్దు....నాకు పుత్రభిక్ష పెట్టు" అని....

ఆ శబ్దం గాలిలో కదలి కపర్ది చెవులకు సోకింది....

అతి బలంగా గొడ్డలిని గాలిలోనే ఆపేసాడు....

అది ఖచ్చితంగా చిన్ననాయకుడి కంఠానికి అంగుళం దూరంలో వచ్చి ఎవరో పట్టి ఆపినట్లు ఆగింది....

కనుకొలకుల నుంచి నాయకుడి వైపు చూసాడు.

"దొరా....నా బిడ్డను సంపొద్దు....నువ్వే గెలిచావు....నువ్వే గెలిచావు దొరా" అన్నాడు.

గొడ్డలిని విసురుగా బరిలోకి విసిరేసి వెనక్కి తిరిగాడు కపర్థి.... విపరీతమైన కంగారు, అభిమానంతో ఒక్కసారిగా రిలీఫ్ ఫీలై వేగంగా వచ్చి అతని కౌగలిలో ఆగింది సులోచన ...

"కపర్ధీ....నువ్వు గెల్చావు....గెల్చావు కపర్థీ...." సులోచన కళ్ళల్లో కన్నీళ్ళు.... ఆ అమ్మాయి తన నెంత గాఢంగా ప్రేమిస్తోందో ఆ క్షణంలో అర్ధమైంది కపర్థికి.

ఇంతలో కోయవాళ్ళు వచ్చి అందర్ని గుడిసెలోకి తీసుకువెళ్ళారు.

కపర్థికి పోరాటం చెయ్యటం వల్ల బాగా ఎగ్జైయిట్ అయ్యి ఉన్నాడు. కడుపులో ఆకలి మళ్ళ కరకరలాడింది.

నాయకుడు గబగబ వచ్చాడు....

"దొరా....మీరు ఈ రాతిరికి యిక్కడే ఉండాల....మీలాంటోళ్ళు వస్తే....అప్పగించమని....యింకో పట్టం దొర చెప్పాడు....

"ఎవరు ఆయన"

"కాళీచరణ్"

"కాళీచరణ్" ఆశ్చర్యంగా అన్నాడు కపర్థి....

"ఆయన ఉదయం వస్తాడు దొరా....ఈ రాతిరి మాకు కొలుపులున్నాయి యిక్కడే ఉండండి దొరా" అని బైటికి వెళ్ళిపోయాడు.

మరుక్షణం గుడిసె తలుపులు బంధించబడింది.

"మనం అతిధులం కాదు....ఖైదీలం" అన్నాడు కపర్థి....

"అదేవిటి" అంది సులోచన....

రేపు ఉదయం కాళీచరణ్ దగ్గరకు మనల్ని తీసుకువెళ్తారు.... కాళీ మనల్ని కాపర్‌షీట్స్ కోసం హింసిస్తాడు. అతని మనిషిని మనం చెట్టుకు కట్టేసాం కదా"

ఇంతలో బైట కలకలం....కపర్థి గుడిసె కంతలో నుంచి బైటికి చూసాడు....అందరూ గుంపులు గుంపులుగా దూరంగా ఉన్న హజారాదేవి దగ్గర గుంపు గూడుతున్నారు.

"మనం హజారాదేవి ఆలయం కోసం వచ్చాం....ఈ రాత్రిలోగా మనం తెల్సుకోవాలి....లేకపోతే కాళీ మనల్ని చంపేయవచ్చు"

"ఓ గంట చూసి మనం బైట పడదాం" అంది సులోచన.

అందరూ విగ్రహం దగ్గరకు వెళ్ళిపోయిన తర్వాత....

సులోచన ఓ మూలకు కదిలింది....అక్కడ ఓ బాకు ఉంది. ఆ బాకు తీసుకుని గుడిసె మూలకు వెళ్ళి బాకుతో అక్కడున్న వెదురు తడి కను కొయ్యటానికి ఉపక్రమించింది.

ఖచ్చితంగా అరగంట తర్వాత మనిషి దూరేంత ఖాళీ చేసింది.

కపర్ది ఆమె వంక చూసి చిన్నగా నవ్వాడు. ముగ్గురు అతినిశ్శబ్దంగా బైటికి నడిచారు....ఆ కంత గుండా....

అటవీకులు గుంపులు, గుంపులుగా చేరి....

దేవత ముందు గుండ్రంగా తిరుగుతూ నృత్యం చేయసాగారు....

పెద్ద పెద్ద డోలకల మీద ఒ విచిత్రమైన బీట్‌తో వాయించారు....

ఆ శబ్దానికి లయబద్దంగా ఎగురుతూ నృత్యం చేయసాగారు అటవీకులు....

"రే....రేలా....రే........రేల....రేల....రేరేలా....రేరేలా....రే....లారే........జింజారే....బంజారే....జింజా....రే....రేలా...."

నెగళ్ళు మండపెట్టారు....

వాటిమీద అడవి దుప్పులు....కుందేళ్ళు కాలుస్తున్నారు....

ఆ వాసన కమ్మగా ఆ ప్రాంతమంతా అలముకుంది....

బల్లేలతో నృత్యం చేస్తున్నారు ఆడాళ్ళు, మగాళ్ళు రిధమటిక్‌గా చేసే నృత్యాన్ని....దూరం నుంచి కపర్థి, ప్రొఫెసరు జయరాం సులోచన విన్నారు....గాలి వాటున కొట్టుకువస్తున్న మాంసం ఉడికిన వాసన....వాళ్ళ పేగుల్లో ఆకల్ని కలిగించింది.

"ఏమిటి....ఈవేళ....సంబరం" అన్నాడు కపర్థి....

"ఈ రోజు పౌర్ణమి....ఏదో పండుగ జరుపుకుంటున్నారు" అన్నాడు ప్రొఫెసర్ జయరాం....ఆకాశంకేసి చూసి....బైటపడ్డ ఆనందం ఆయన ముఖంలో ఉంది.

"మనం కూడా....ఆ నృత్యంలో పాల్గుందామా," అన్నది సులో చన....కొంటెగా కపర్ది వంక చూసి

మనల్ని....నృత్యం చేయనివ్వరు....ఆ దేవతకు బలియిస్తారు....

"అట్లాగయితే వెళదాం...." అన్నాడు కపర్ధి....

"అమ్మో....వద్దు...." అన్నది సులోచన....

"వాళ్ళు ఆడిపాడి అలసిపోయిన తరువాత వెళ్దాం...." అన్నాడు ప్రొఫెసర్ జయరాం....దేవత విగ్రహాన్ని పరిశోధించాలనే జిజ్ఞాసలో ఉన్నాడు.

ఇంతలో ఓ పెద్ద చెక్క తొట్టిని ఓ కోయవాడు దొర్లించుకుంటూ వచ్చాడు....అందరూ....ఆ చెక్క తొట్టె ముందు మూగారు.

ఆ చెక్క తొట్టిని నిలబెట్టి....దాని మూత తీసాడు....

గుప్పున కొట్టింది యిప్పసారా వాసన....

యిప్పసారా తొట్లలలో పెట్టి....దిబ్బలో పాతేస్తారు....

రెండు సంవత్సరాల తరువాత ఆ చెక్క తొట్టిని బైటికి తీస్తారు...

అలా దిబ్బల్లో నిలువ చేసిన యిప్పసారా ప్రత్యేక పండుగల్లో ఆచారం ప్రకారం పంటల కోతలకాలంలో ఉపయోగిస్తారు....

మామూలు రోజుల్లో మామూలు యిప్పసారా తాగుతారు....ప్రత్యేక పండుగల్లో నిలువ వుంచిన యిప్పసారా తాగుతారు....అది మంచి మత్తి స్తుంది. చాలా సమయం ఆ మత్తు అలాగే ఉంటుంది....

ఆ తొట్టి ముందు నిలబడి అందరూ దొన్నెల్లో యిప్పసారా తాగారు. ఆ తరువాత దేవి విగ్రహం ముందుకు వచ్చారు....

డమ్ములు భీకరంగా మ్రోగాయి....

ఆ మత్తులో చిత్తుగా ఆడమగా కలసి విశృంఖలంగా నృత్యం చేసారు....

లోపల బందీలుగా ఉన్న....చంద్రహాస్, ప్రియంవద, యశ్వంత్, అక్షత బైట జరుగుతున్న గందరగోళాన్ని విన్నారు....

వాళ్ళకు విపరీతంగా ఆకలి కాసాగింది.

బయట ఉధృతంగా నృత్యం సాగుతుంది.

సరిగ్గా అదే సమయంలో ఆ గది వెనకవైపు ఉన్న తలుపు తెర్చుకుంది. పద్దెనిమిది సంవత్సరాల అమ్మాయి లోపలికి వచ్చింది. ఆమె చేతుల్లో ఓ మట్టి జగ్గు....

లోపలకి వచ్చిన వెంటనే చటుక్కున తలుపు వేసి వాళ్ళ దగ్గరకు వచ్చింది. చంద్రహాస్ ఆమె వంక ప్రశ్నార్థకంగా చూసాడు....

చంద్రహాస్ దగ్గరకు వచ్చి గబ గబ కట్లు విప్పింది....

"దొర....అంతా ఈ పుట్టతేనె తాగండి...." అని దొన్నెల్లో పుట్ట తేనె పోసి యిచ్చింది. నలుగురు ఆవురావురామంటూ ఆ తేనె తాగారు.... వాళ్ళ ఆకలి కొంత తీరింది....

"ఎవరు నువ్వు....యిక్కడి కెందుకొచ్చావు...."

"మా వాళ్ళు అన్యాయం చేసి మిమ్మల్ని తీసుకొచ్చారు....మీ ముఖాలు చూస్తేనే తెలుస్తుంది...." అంది.

"ఇంతకీ నువ్వెవరు...." అన్నాడు....

"నా పేరు పుల్లీ... చిన్నదొర నా తండ్రి...."

"చిన్న దొర అంటే....ఎవరు"

"నాయకుడి తర్వాత నాయకుడు...." అంది....

ఆ అమ్మాయిని చూస్తే ముచ్చట వేసింది చంద్రహాస్‌కు.

"మాకు ఆహారం తీసుకొచ్చినందుకు నిన్ను శిక్షిస్తారు....కదా.... ఎందుకింత ధైర్యం చేసావు" ప్రియంవద అంది.

"నాయళ్ళందరూ....తాగి తందనాలాడుతున్నారు .... నన్నెవరు చూడరు...." అంది పుల్లీ....

"అది కాదు పుల్లీ ....మా సామాను తీసుకువచ్చి యిస్తే మేం పారిపోతాం" అన్నాడు యశ్వంత్....

"అమ్మో....యిప్పుడు ఆళ్ళ చేతికి చిక్కితే....హజారా తల్లి కి మిమ్మల్ని బలియిస్తారు...." భయం భయంగా అంది....

"ఇంతకీ....ఆ గొడవేంది...."

"యియ్యాల పున్నమి.... ఈ రాతిరంతా సంబరం సేసుకొని.... తెల్లారి పచ్చకొండ దగ్గరకు ఎల్తారు....అప్పుడు మీరు తప్పించుకోవచ్చు"

"పచ్చ కొండా....అదేమిటి...." అయోమయంగా అడిగాడు చంద్ర హాస్....

"పున్నమి యెల్లిన రెండో రోజు పచ్చకొండ దగ్గరకెల్లి పూజలు చేత్తారు....ఆ పచ్చకొండ....సూరీడు పొడవగానే బంగారంలా మెరిసిపోద్ది అప్పుడు ఆ కొండ దేవరకు కొలుపులు కొలుచుకొని వస్తారు...."

చంద్రహాస్‌కు ఆ టాపిక్ చాలా వింతగా వుంది....

"సూరీడు పొడిచినప్పుడల్లా కొండ బంగారంలా మెరిసిద్దా....?" అడిగాడు....స్వర్ణ సింహాసనం గురించి ఏదైనా క్లూ దొరుకుతుందేమోనని.

"పున్నమి యెల్లిన రెండో రోజు పొద్దుపేల....మాపిపేల బంగారంలా మెరిసిద్ది....అంతే...."

"మీ వాళ్ళు ఆ కొండ దగ్గరకు ఎప్పుడు వెళ్తారు" అడిగాడు....

"అర్ధరాత్రి దాటిన తరువాత వెళ్తారు...."

"ఆ కొండ యిక్కడికి ఎంత దూరంలో ఉంది" చంద్రహాస్ అడిగాడు....

"పడమరగా వెళితే....పది మైళ్ళుంటుంది...." అన్నది పుల్లీ....

"ఓ మైగాడ్....పదిమైళ్ళు....

అప్పటికే గుడిసె బయట ఎవరో వచ్చిన అలికిడి కాగానే....రెండో ద్వారం గుండా పుల్లీ చటుక్కున బయటికి వెళ్ళింది....

వెళ్తూ....వెళ్తూ....

"అందరూ ఎల్లిన తర్వాత వత్తాను....పారిపోదురుగాని" అని ఛెంగునవెళ్ళి పోయింది.

ఆమె వెళ్ళిపోగానే చంద్రహాస్ ఆలోచనలో పడ్డాడు. సూర్యుడు ఉదయిస్తే కొండ మెరవటం ఏమిటి....అదీ బంగారం రంగులో....అయితే స్వర్ణ సింహాసనానికి ఈ కొండకు ఏదో లంకె వుంది. ఇలాంటి అద్భుతం ప్రతి నెల జరుగుతూ ఉండగా అది నాగరీకులకు తెలీక పోవడం ఏమిటి.

బహుశా....ఈ కొండ జాతివాళ్ళు ఆ రహస్యాన్ని....తమలోనే దాచుకుని ఉంటారు....అది బయటపడితే నాగరీకులు వచ్చి....ఆ కొండ మీద పరిశోధనల పేరిట ఏవేవో చేస్తారని బహుశా నాగరీకులకు ఆ వార్త తెలిపి ఉండరు.

"సమ్‌థింగ్ మిస్టీరియస్ సీక్రెట్ ఏదో ఆ కొండకు లింక్ వుంది" ఆలోచిస్తున్నాడు చంద్రహాస్....

సరిగ్గా అదే సమయంలో....

కపర్థి....సులోచన....ప్రొఫెసర్ జయరాం అతి మెల్లగా ముందుకు కదిలారు. అటవీకులు నృత్యం చేసి చేసి....అలసిపోయారు....వాళ్ళ మెదడులో మత్తుతో నిండిపోయింది. ఆడవాళ్ళను కౌగలించుకునే కిందకు మత్తుగా జారిపోయారు.

ఆకాశంలో నిండుచంద్రుడు మనోహరంగా వెన్నెల వెదజల్లుతున్నాడు.

ముగ్గురు అతి నిశ్శబ్దంగా గూడెం దగ్గరకు వచ్చారు....

సరిగ్గా అదే సమయంలో పుత్లీ....ఓ గుడిసెలో నుంచి బయటికి వచ్చి మరో గుడిసెలోకి వెళ్ళింది....

ఓ అడుగు ముందుకు వేయబోయాడు కపర్థి....

"వెయిట్...."అన్నట్లు ఆపాడు ప్రొఫెసర్ జయరాం....

"కొంచెంసేపు వెయిట్ చేసి వెళతాం....అందరూ మత్తులో పడలేదు...." డ్రమ్ముల శబ్దం మంద్రంగా వినిపిస్తుంది.

వాళ్ళకు ఐదు గజాల దూరంలోనే ప్రియంవద, చంద్రహాస్, యశ్వంత్, అక్షత బంధితులుగా ఉన్నారని ప్రొఫెసర్‌కు ఆ క్షణంలో తెలీదు.

అందరూ మెల్లగా క్రింద పడిపోయారు....

క్రిందపడ్డ మగవాళ్ళను తీసుకొని ఆడవాళ్ళు వాళ్ళ గుడిసెల్లోకి వెళుతున్నారు....

ప్రొఫెసర్ జయరాం....కపర్థి, సులోచన ఓపిగ్గా చాలా సేపు కాచుకున్నారు....

అప్పటికి సమయం పదకొండు గంటలైంది....

చటుక్కున ముందుకుకదిలారు....గూడెంలోకి ప్రవేశించి ఓ గుడిసె దగ్గర ఆగారు....ఆ గుడిసెలో చంద్రహాస్, ప్రియంవద బంధించబడి ఉన్నారు....

ఇంతలో బైట.... ఏదో కదలిక....

అటవీకులలోని ఓ వ్యక్తి విగ్రహం దగ్గరకు వచ్చాడు ........ ఒళ్ళంతా బూడిద పూసుకుని పరమ భయంకరంగా ఉన్నాడు.... మెళ్ళో పూసలు పేర్లు.... నడుంకు ఓధట్టి....

విగ్రహం దగ్గరకు వచ్చి గుగ్గిలం తీసుకొని విగ్రహంముందున్న మంటల్లో వేయసాగాడు....

"జింబారే.... జింబారే.... షాకిని .... జింబాఢాకిని ...." ఏవేవో మంత్రాలు చదవసాగాడు....

ముందుకు వెళ్ళకుండా అలాగే నిలబడ్డారు ముగ్గురు.

ఓ అరగంట తంతుజరిపి.... పెద్దగా అరిచాడు.

"పచ్చకొండకు.... వెళ్లమని హజారాదేవి అనుజ్ఞ యిచ్చింది....

తలారస్నానంచేసి.... పుంజులన్నీ సిద్ధం కావాలి...."

మత్తులో జోగుతున్న వాళ్ళు ఆ మాట విన్నారు....

ఈలోగా మళ్ళీ కలకలం....

సరిగ్గా ఓ ముప్పావు గంటకు గూడెంలోని మగవాళ్ళంతా హాజారా దేవి విగ్రహం ముందు హాజరయ్యారు....

ఇదంతా చూస్తున్న కపర్ది అన్నాడు.

"మగ వాళ్లంతా.... ఎక్కడికో.... బయలుదేరినట్టున్నారు. వాళ్ళు వెళ్లిన తరువాత మనం.... ఆదేవి విగ్రహం దగ్గరికి వెళదాం" అన్నాడు.

మగవాళ్ళంతా కీచుకీచుగా అరస్తూ బల్లేల్ని చేత్తో పట్టుకొనిబయలు దేరారు....

ఒక్క పదినిమిషాల్లో గూడెంలోని మగవాళ్లంతా పడమర దిక్కు కేసి వెళుతున్నారు.

వాళ్ళందరూ వెళ్ళిపోయిన తరువాత నిశ్శబ్దంగా కదలాడు కపర్థి.

సరిగ్గా అదే సమయంలో పుత్లీ గుడిసె దగ్గరకువచ్చి గుడిసెలోకి వెళ్ళింది.

మరుక్షణం కపర్ది అతివేగంగా గుడిసె దగ్గరకువెళ్ళి చెవి ఆనించి విన్నాడు.

లోపల ఎవరో ఉన్నట్లు అతనికి అన్పించింది.

అక్కడవున్న గుడిసెకంతలో నుంచి లోపలకు చూసాడు.

మరుక్షణం అతని గుండె ఉద్వేగంగా కొట్టుకుంది,

ఆ గుడిసెలోగల చంద్రహాస్ ప్రియంవద, అక్షత, యశ్వంత్ కన్పించారు....

వాళ్ళు అక్కడికెలా వచ్చారో అతనికి అర్థంకాలేదు....

ఆ స్త్రీ వాళ్ళ కట్లు విప్పుతుంది....

మరుక్షణం ప్రొఫెసర్ జయరాంకు సైగచేసి గుడిసెలోపల వున్న దృశ్యం చూపించాడు.

ప్రొఫెసర్ జయరాం ఆశ్చర్యంతో మ్రాన్పడి పోయాడు. వాళ్ళు అక్కడికెలా వచ్చారో, అలా బంధితులు ఎలా అయ్యారో అస్సలు అర్థం కాలేదు.

ఇద్దరు ఒకరి కొకరు సైగచేసుకొని లోపలకు వెళ్ళాలనుకున్నారు.

కపర్ది గుడిసె తలుపు చటుక్కున తెరిచి, మరుక్షణం లోపలికి వెళ్ళాడు.

అప్పుడే చేతులు కట్లు వదిలించుకున్న చంద్రహాస్ లోపలికి వేగం వచ్చిన కపర్దిని చూసి ఆశ్చర్యపోయాడు.

"హలో కపర్ది.... ఇక్కడి కెలా వచ్చారు...." అన్నాడు....

"మీరెలా యిక్కడకు వచ్చారు....వీళ్ళు మిమ్మల్ని ఎందుకుబంధించారు" అడిగాడు కపర్ది....

అప్పటికే ప్రొఫెసర్ జయరాం, సులోచన లోపలికి వచ్చి మిగతా వాళ్ళ బంధనాలు విడిపించారు.

జరిగినదంతా క్లుప్తంగా చెప్పాడు చంద్రహాస్....

హఠాత్తుగా అటవీకులు దాడిచేసి తీసుకురావటం........ ఓ వ్యక్తి తాము ఎవరో అడగటం అన్నీ చెప్పాడు....

"అయితే మీరు ఈ హంజారా జాతితెగకు సంబంధించిన వాళ్ళ చేతులలో పడ్డారన్న మాట...." కపర్ది అన్నాడు.

"వీళ్ళు హంజారా తెగవాళ్లా!" అన్నాడు చంద్రహాస్....

"అవును.... యిక్కడ హజరాదేని అనే దేవి ఉందని" వచ్చేం. హరీహర దేవుడికి ఆమెకు ఏమైనా సంబంధం ఉందేమోనని వచ్చాం.

"అలా వస్తే ........ మీ ఆచూకీ తెలిసింది" ప్రొఫెసర్ జయరాం అన్నాడు.

"అంతకన్నా ముఖ్య విషయం ఒకటి ఉంది"

"ఏమిటది"? ఆత్రుతగా అడిగాడు ప్రొపెసర్ జయరాం.

"ఈ కొండజాతి వాళ్ళు పచ్చకొండ దేవరను పూజించటానికి వెళ్ళారట...."

"అందులో విశేషం ఏముంది ?"

"అందులోనే విశేషం ఉంది.... ఆ పచ్చకొండ.... పౌర్ణమి వెళ్ళిన రెండో రోజు ఉదయాస్తమయాలలో సూర్యుడు ఉదయించినప్పుడు బంగారంతో మెరుస్తుందట...."

"చాలావింతగా వుందే!" అన్నాడు కపర్ది....

"నా ఉద్దేశం ప్రకారం........ మనం వెతుకుతున్న గుడి అక్కడే ఉండాలి....

"రాగిరేకు మీద రాసిన వాక్యాల ప్రకారం .... మనకుఅక్కడ ఏదైనా దొరక వచ్చును...." చంద్రహాస్ అన్నాడు.

ఆ మాట వినగానే ప్రొఫెసరు ఆలోచనలో పడ్డాడు.

"నవగ్రహాలు తల్లక్రిందులయిన చోట....

హరిహరులు కల్సినచోట.

పశ్చిమాన ఆకాశం స్వర్ణకాంతితో వెలుగొందేచోట.

పర్వత శిఖరంపై సూర్యుడు బంగారు కలశమై మెరిసేచోట....

"పర్వత శిఖరంపై సూర్యుడు బంగారు కలశమై....

ఏదో అర్థమైంది ప్రొఫెసరు జయరాంకు....

"మనం వెంటనే ఆ పచ్చకొండ దగ్గరకు వెళ్ళాలి ........ఆ పచ్చ కొండకు స్వర్ణసింహాసనానికి ఖచ్చితంగా సంబంధం వుంది" అన్నాడు ప్రొఫెసర్ జయరాం....

"ఆ పచ్చకొండకు ఎలా వెళ్ళాలి" అన్నాడు చంద్రహాస్—

"నేను దారి చూపిస్తాను దొర...."ముందుకువచ్చి అంది పుల్లీ....

"పుల్లీ....నువ్వా.... ఈ విషయంతెలిస్తే నిన్ను చంపేయరా...."

"లేద్దొరా.... నేను అమ్మోరిదాసిని....నేను ఎక్కడికైనా ఎల్లొచ్చు రావచ్చు.... అందరు నన్ను దేవతలా గౌరవిస్తారు...." అంది.

"అయితే ముందునువ్వు నడిచి వెళుతూ వుండూ........ నీ వెనకే మేము నడిచివస్తాం.... అప్పుడు.... ఎవ్వరికీ అనుమానంరాదు....అన్నాడు కపర్థీ.

"అలాగే" అంది పుల్లీ.

## 16

పుల్లీ ముందు నడుస్తుండగా అందరూ ఆమె వెనక నడవ సాగారు.

నక్షత్రాలనుబట్టి అప్పుడు పదకొండు గంటలైంది.

వెన్నెల వెలుగు కొండలమీద, బండలమీదపడి మెరుస్తోంది.

పుల్లీ గబగబ ముందుకు నడుస్తోంది....

ఆకాశంలో నిండు చంద్రుడు వాళ్ళవంక మంద్రమంద్రంగా చూసాడు—

కపర్థికి పోరాటంలో తగిలిన గాయంవల్ల చెయ్యంతా మంట పుడుతోంది....

సరిగ్గా అదే సమయంలో వేగంగా గాలివీస్తోంది.

ఆకాశంలో తెల్లటి మబ్బులు ఎక్కడి నుంచో రాసాగాయి.

ఏటవాలుగావున్న కొండను ఎక్కుతున్నారు వాళ్ళందరు....

భయంకరమైన మహాగని, టేకు వృక్షాలతో నిండి వుంది కొండ ప్రదేశమంతా కొండమీద అడవి-—

వాళ్ళకు కొండఎక్కుతున్నట్లు లేదు.అడవిలోతిరుగుతున్నట్లుఉంది.

కొమ్మల సందుల్లోనుంచి వెన్నెల కిరణాలు పడ్తున్నాయి.

కపర్ధికి అలసటగా ఉంది....

హాయిగా ఓ బండమీదపడి గుర్రుపెట్టి నిద్రపోవాలని ఉంది,

కానీ వచ్చిన పనివేరు ........ అందుకని నిద్రను తన దగ్గరకు రానివ్వలేదు....

ఉదయం నుంచి అడవిలో తిరగటంవల్ల ప్రొఫెసర్ జయరాం ఆయాసపడ్తున్నాడు. అయినా లేని శక్తి తెచ్చుకొని నడుస్తున్నాడు అక్షత, యశ్వంత్ ఏవేవో తియ్యని కబుర్లు చెప్పుకుంటూ అందరికన్నా వెనకగా నడుస్తున్నారు....

వాళ్ళముందు ప్రియంవద, చంద్రహాస్‌లు నడుస్తున్నారు....

ప్రియంవద గంభీరంగా ఉంది.

చంద్రహాస్ మనస్సులో ఏవేవో తెలియని మధుర భావనలు.... సరిగ్గా అదే సమయంలో ఆకాశం భయంకరంగా ఉరిమింది....

హఠాత్తుగా పుత్లీ ఆగి ఆకాశం వంక చూసింది....

"ఆకాశం అంతా తెల్లని మబ్బులతో నిండిపోయింది,

చూస్తుండగానే ఆకాశంలో దట్టమైన మబ్బులు అలుముకున్నాయి.

గాలి వేగంలో మార్పు వచ్చింది....

అతి వేగంగా వీచటం ప్రారంభించింది.

వర్షం వచ్చేముందు వాతావరణం అలానే ఉంటుంది....

ఒక్క క్షణం ఆగింది పుత్లీ ముందుకు వెళ్ళాలా, వద్దా.... అన్న మీమాంస ఆమెలో వచ్చింది....ఏదైతే అదవుతుంది అని అడుగుముందుకు వేసింది.

సరిగ్గా అప్పుడు పడింది ఓ పెద్ద చుక్క ప్రొఫెసర్ జయరాం ముఖంమీద, వర్షం వచ్చేస్తోంది. వేగంగా గాలి వాటున దూరంనుంచికొట్టుకు వస్తోంది వర్షం....

కర్నాటక అభయారణ్యంలో వర్షం వస్తే రోజుల తరబడి కురుస్తాయి లేకపోతే హఠాత్తుగా రెండు మూడుగంటలు కురిసి ఆగిపోతాయి. దాని గురించి తెలుసు కపర్థికి—

బడబడమని వర్షం మొదలైంది....

చూస్తూండగానే వర్షం క్షణాల్లో పెద్దదై పోయింది....

చెవులు చిల్లులు పడుతూ కురుస్తున్న వర్షం.... ఆ శబ్దాన్ని అర నిమిషం కూడా భరించలేనట్లూ అందరూ శిలా ప్రతిమల్లా నిలబడిపోయారు.

తలమీద సూదులతో పొడుస్తున్నట్లు, పలుగులతో బాదుతున్నట్లు వర్షం....వర్షం....

చేసేది లేక.... దగ్గరగా ఉన్న చెట్ల దగ్గరకు పరుగెత్తారు.

యశ్వంత్, అక్షత దట్టంగా ఉన్న ఓ చెట్టు క్రిందకు పరుగెత్తారు.

కపర్థి, సులోచన, ప్రొఫెసర్ జయరాం, పుల్లీ .... మర్రిచెట్టులాంటి చెట్టుక్రిందకు వెళ్లారు, చెట్ల కొమ్మలు అడ్డుగా ఉండటం వలన అక్కడ వర్షం తక్కువగా కురుస్తోంది.

ప్రియంవద, చంద్రహాస్.... ఓ మహాగని వృక్షం క్రింద నిలబడ్డారు.

ఏనుగు తొండాలతో కుమ్మరించినట్లు భయంకరంగా కురుస్తోంది వర్షం....

స్వర్ణ సింహాసనం కోసం బయల్దేరిన క్షుద్ర మానవుల్ని చూసి ప్రకృతి పరమభయంకరంగా పగతీర్చుకుంటోంది.

వళ్ళంతా పూర్తిగా తడిసిపోయింది.

అక్షత ఆ వర్షానికి గడగడ వణుకుతూ యశ్వంత్ దగ్గరకు జరిగింది.

ఫెళ ఫెళమంటూ ఆకాశం ఉరుముతోంది....

వాళ్ళకు పైనుంచి నీరు ధారగా కారుతోంది. మట్టి, ఆకులు, ఇసుకతో నీళ్ళు వరదలా కొండమీదనుంచి క్రిందకు పారుతున్నాయి.

యశ్వంత్ క్రిందకు చూసాడు.

కాళ్ళకు తగుల్తోంది కొండమీదనుంచి వస్తున్న నీళ్ళ ప్రవాహం....

"దొరా.... ఆకాశానికి చిల్లి పడింది.... ఈ వర్షంలో మనం తడిచి పోవాల్సిందే" అంది పుత్లీ ....

చిన్న చిన్న కొండరాళ్ళు దొర్లుపోతున్నాయి.

"ఢడేల్‌మ"ని శబ్దం....కొండ ప్రక్క ఎక్కడో పిడుగు పడింది.

ఆ శబ్దానికి కొండ ప్రతిధ్వనించింది.

గాలి వేగంగా వీస్తోంది. చూ స్తుండగానే గాలి వేగం ఉధృతంగా పెరిగిపోయింది....

చెట్లు ఓ ప్రక్కకు ఒరిగిపోతున్నట్లు గాలి వాలుకు వంగి పోతు న్నాయి.

వర్షం కొట్టి కొట్టి నీటి సూదులు, మంచు కత్తులతో దాడిచేస్తున్న శతృసైన్యంలా వుంది.

కొండమీద నుంచి వాననీరు పల్లానికి పారుతోంది. ఆ నీళ్ళల్లో పాములు, కప్పలు, యింకా రకరకాలు క్రిమికీటకాలు రాసాగాయి.

యశ్వంత్ కాలికి చుట్టుకుంది ఓ పాము.

భయంతో ఒళ్ళు జలదరించి కాలును విసిరికొట్టాడు, వకటికాదు.... కొన్ని వందల క్రిమికీటకాలు. కాళ్ళు నీళ్ళలో ఉంటే ఎముకలు మిగల కుండా తినేసేటట్లు ఉన్నాయి చటుక్కున.... చెట్టుమీదనుంచి క్రిందకు ఉన్న ఓ ఊడను పట్టుకున్నాడు యశ్వంత్.

అక్షత మరో ఊడను పట్టుకుంది....

ప్రవాహంపైన కాళ్ళు ఉన్నాయి....

చంద్రహాస్ గబ గబ చెట్టు ఎక్కి ప్రియంవదకు చేయి అందిం చాడు....ప్రియంవద ఆ చేయి అందుకొని చెట్టెక్కింది....ఒకటి రెండు సార్లు జారబోయి అతని చేతిని అందుకుంది.

హోరున వర్షం....

మిన్ను మన్ను ఏకమైన వర్షం....

"ఈ చెట్టు కింద ఉంటే....ఈ వర్షానికి....ఏ పామో కుట్టి చచ్చి పోతాం దొరా...ఏదన్నా కొండ గుహలోకి వెళ్దాం దొర" అంది పుత్లీ.

"ఇక్కడ మాకు గుహలేం తెలియవు...." అన్నాడు కపర్ధి....

అతని కాళ్ళకు పిచ్చి పిచ్చి పాములు చుట్టుకుంటున్నాయి. అది వర్షంలా లేదు. తుఫానులా ఉంది. వర్షం హోరులో ఒకరి మాట ఒకరికి వినపడడం లేదు.

ప్రొఫెసర్ జయరాంకు కూతురు ఎలా ఉందోనని అనుమానం కలిగింది.

చెవులు చిల్లులు పడేటట్లు శబ్దం వినిపించింది....

ఆ మెరిసిన మెరుపులో ఊడలు పట్టుకొని వేళ్ళాడుతున్న అక్షత కన్పించింది....

"అమ్మా అక్షతా...." అతను కదలబోయాడు.

"మీరు కదిలితే కిందకు జారిపోతారు....నాతో రండి" అని ఆయన వేలుని పట్టుకొని ముందుకు కదిలింది పుత్లీ....

కళ్ళల్లో సూదులు పెట్టినట్లు యీడ్చి కొడ్తుంది వర్షం.

ప్రొఫెసర్ జయరాం చెయ్యి కపర్ధి, కపర్ధి చెయ్యి సులోచన పట్టుకున్నారు. నలుగురు మెల్లగా చెట్టు కుడి ప్రక్కగా వెళ్ళారు. కొంతదూరం వెళ్ళగానే....ఓ గుహ కన్పించింది.

పుత్లీ గుహలోకి దారి తీసింది.

మిగతా ముగ్గురు ఆ గుహలోకి దారి తీసారు.

గుహలోకి వెళ్ళగానే విపరీతమైన గబ్బు వాసన....కుళ్ళిన మాంసం వాసన....

అ వాసన ఏమిటో పుత్లీకి అర్థమైంది.

వాళ్ళు సింహం గుహలోకి వచ్చారు....

ఆ గుహలో సింహం ఉందో లేదో తెలియదు....

కానీ అది సింహపు గుహ అని అర్థమైంది....

ఇంతమంది లోపలికి వచ్చినా లోపలేం కదలికలేకపోయేసరికి ఒక్కసారి రిలీఫ్ ఫీలైంది పుత్లీ....

సింహం గుహలో లేదు....ఉంటే ఈ పాటికి మీదపడి అందర్ని ముక్కలు ముక్కలు చెయ్యాలి....

కపర్ది జేబులో నుంచి లైటర్ తీసి "టప్పు"న వెలిగించాడు.... లోపలకు చూసిన కపర్ధికి ఒక్కసారి స్పృహ తప్పినంత పనైంది. లోపల పుర్రెలు, ఎముకలు, ఓ ప్రక్కగా కుళ్ళిన ఎద్దు కళేబరం....గప్పున ముసురుతున్న ఈగలు.

కడుపులో దేవినట్లు అన్పించింది.

మరుక్షణం మిగతా వాళ్ళకు అర్ధమైంది తామంతా సింహం గుహ లోకి వచ్చామని....వెన్నులో పాము కదిలినట్లు విపరీతంగా భయపడి పోయారు....

లైటర్ వెలిగించగానే పుత్లీ గబగబ అక్కడ గుహలో ఉన్న ఎండు చితుకుల్ని, కట్టెలాంటి కర్రముక్కల్ని ఒకచోట చేర్చి కపర్ధి చేతిలోని లైటర్ తీసుకొని రెండు క్షణాల్లో చితిరగిల్చింది, ఇప్పుడు ఈ మంటను చూసిన సింహం దగ్గరకు రాదు....అదీ ఆమె ఆలోచన....

కానీ ఎప్పుడైతే మంట వెలిగించారో....గుహలో మిగిలిఉన్న ఆక్సిజన్ మంట వెలుగుకు ఖర్చైపోయి....లోపల ఉన్న కుళ్ళిన మిథేన్ వాయువు యింకా రకరకాల వాయువులతో కలిసి ఓకొత్తరకం వాయువుగా తయారయింది.

ఖచ్చితంగా పదినిమిషాల తరవాత....

సులోచనకు తల తిరుగుతున్నట్లు అన్పించింది....

ప్రొఫెసర్ జయరామ్‌కు కూడా అదే పరిస్థితి. స్పృహ తప్పబో తున్న చివరి క్షణంలో ఆయన అరిచాడు....

"గెట్ బ్యాక్ ఫ్రమ్ హియర్ కపర్థీ....ది ఎయిర్ యీజ్ టోటల్లీ పొల్యుటెడ్...."మరుక్షణం దబ్‌మని క్రిందపడ్డాడు. జరిగిన సంఘటనచూసి ఒక్కసారి ఊపిరి బిగించాడు కపర్థీ....

పుత్లీ కూడా ఊపిరి బిగించింది.

ఇద్దరు కలసి సులోచన శరీరాన్ని....ప్రొఫెసర్ జయరాం శరీరాన్ని బైటికి తీసుకు వచ్చారు....

హోరున కురుస్తోంది వర్షం.... యింకా తగ్గలేదు.

ఇద్దరు శరీరాలమీద వర్షం నీరు విపరీతమైన ఫోర్సుతో జల్లుగా పడగానే ప్రొఫెసర్ జయరాం మేల్కొన్నాడు....ఈలోగా ఆయన గుండెల నిండా ఫ్రెష్ ఎయిర్ నిండుకుంది.

సులోచన కూడా వర్షానికి మెల్లగా కళ్ళు తెరిచింది.

"థాంక్‌గాడ్.... మనం లోపలే ఉన్నట్లైతే ఈ పాటికి నల్గురం చచ్చిపోయి ఉండేవాళ్ళం....

సరిగ్గా అదే సమయంలో ఎక్కడో విపరీతమైన శబ్దంచేస్తూ పిడుగు పడింది....

గాలి ఉధృతంగా వీస్తోంది. ఆ గాలికి మహాగని వృక్షాలుఎగిరిపోతా యేమో అన్నట్లు ఓ ప్రక్కకు ఒరిగాయి. చెట్లుమీదవున్న ప్రియంవద గడగడ వణికింది.

వర్షానికి ఆమెకు పిచ్చెక్కేటట్లు ఉంది....

చంద్రహాస్ పరిస్థితి కూడా అదే....

యశ్వంత్ ఓ ఊడపట్టుకొని ప్రక్కనేవున్న రెండో ఊడమీద కాళ్ళు ఉంచాడు. ఆ రెండో ఊడ భూమిలో మానులా పెరిగి ఉంది ..

అక్షత కూడా ఓ చెయ్యి ఊడను పట్టుకొని మరో చెయ్యి చెట్టు మొదలుకు అతుక్కుపోయిన మరో ఊడను పట్టుకొనివుంది.

ముఖంమీదనుంచి దూసుకు వెళుతోంది వాన....

ఆ విపరీతమైన గాలికి.... ఆమె చిగురుటాకులా కంపిస్తోంది....

సరిగ్గా అదే సమయంలో ఎవ్వరో మంత్రం వేసినట్లు ఒక్కసారిగా గాలివేగం చల్లబడింది.

వర్షం ఉధృతి ఒక్కసారిగా తగ్గిపోయింది....

వర్షం తగ్గటంచూసి పుత్లీ చిన్నగా నిట్టూర్చింది.

"హమ్మయ్య.... వర్షం....తగ్గిపోయింది....

కొండ దేవర కరుణించాడు అంది ఆనందంగా పుత్లీ,వర్షం కరుణించినా.... ప్రకృతి మాత్రం మరో రూపంలో వాళ్ళను ఆపటానికి ప్రమాద రూపంలో చుట్టుముట్టబోతుందని వాళ్ళకు ఆ క్షణంలో తెలీదు.

వాన పూర్తిగా తగ్గిపోయిన తర్వాత క్రిందకు దిగాడు యశ్వంత్.

అదే సమయంలో అక్షత కూడా క్రిందకు దిగింది....

దిగగానే తనచేతితోవున్న ఊడను విసురుగా అవతలకి తోసింది.

అవతలకు వెళుతున్న ఊడ ఒక్కసారిగా "దబ్" మని క్రింద పడింది.

అది ఊడకాదు, అప్పటి వరకు చెట్టునుంచి వేలాడుతున్న కొండ చిలువ....

దాన్ని చూడగానే ఒక్కసారి వెన్నులో చలిపుట్టినట్లు వణికి పోయింది.

అక్షత.... దరిదాపు రెండు గంటలు కొండచిలువ తోకపట్టుకొని తాను వేలాడిందా, ఆ ఊహరాగానే విపరీతంగా వణికిపోయింది.

ఆమె వణికి పోతుండగా ఒక్కసారి ఆమె మీదకు దూకింది కొండ చిలువ.... వర్షంలో చెట్టునుంచి వేలాడి వేలాడి విసిగిపోయిన దానికి -విప రీతమయిన చిరాకు కలిగింది.

తన కంటికి కనిపించిన అక్షతవైపు వేగంగా కదిలింది.

దాన్ని చూసి యశ్వంత్ ఒక్కసారిగా భయపడిపోయాడు....

చటుక్కున తోకను విసురుగా కొట్టి, తోకతో అక్షతను బలంగా చుట్టింది.

విపరీతమైన భయంతో వెర్రి కేక పెట్టింది అక్షత....

కొండచిలువ బలంగా ఆమెను చుట్టేయసాగింది.

సరిగ్గా అదే సమయంలో

చెట్టుమీదనుంచి క్రిందకు దూకిందిప్రియంవద ప్రియంవదతో పాటు చంద్రహాస్ కూడా క్రిందకు దిగారు.

రెండు గంటలపాటు చెట్టుమీద ఉండటంవలన ఒళ్ళంతా విపరీత మైన నొప్పులతో ఉంది....

ప్రియంవద క్రిందకు దిగి రాగానే ఆమె కాలు అప్రయత్నంగా స్లిపైంది.... మరుక్షణం జర్రున జారింది....

ఎప్పుడయితే కిందకు జారుతుందో .... అప్పుడు చావు భయంతో కెవ్వునకేక వేసింది ప్రియంవద,

రివ్వున గింగరాలు తిరుగుతూ కొండమీదనుంచి క్రిందకు పడి పోసాగింది.

మరిక ఆలస్యం చేయలేదు చంద్రహాస్ ఆమెతోపాటు క్రిందకు జారాడు.

తగిలేరాళ్ళు !

చీల్చిముళ్ళు !

అడ్డుకొనే మాన్లు .

అడ్డంగా బండలను కొట్టుకుంటూ క్రిందకు జారిపోసాగాడు.

ఒళ్ళంతా బురద, మట్టి వికృతంగా తయారయింది....

ప్రియంవద క్రిందకు జారుతూవచ్చి ఓ చెట్టుకు తగిలిఆగిపోయింది.

చంద్రహాస్ ఆమె దగ్గరకువచ్చి తను ఆగాడు....

ఒళ్ళంతా తీవ్రమైన గాయాలై ఉంది....మెల్లగా లేచింది ప్రియంవద.... చంద్రహాస్ లేచాడు.

అప్పుడే ఆకాశంలో మబ్బులన్నీ గాలికి చెదిరిపోయి నిండు చందమామా పరిపూర్ణంగా కన్పించాడు. మళ్ళీ వెన్నెల వెలుగు అడివంతా పరుచుకొంది.

సరిగ్గా అదే సమయంలో వెర్రిగా వికృతంగా కేకలు పెట్టింది.

అక్షత.... కొండచిలువ ఆమె శరీరాన్ని నలిపేస్తోంది.

ఆమె ఎముకలు పటపటమంటూ విరగటానికి సిద్ధంగా ఉన్నాయి.

యశ్వంత్ నిర్ఘాంతపోయి చూస్తున్నాడు.

సరిగ్గా అప్పుడే అక్కడికి వేగంగా పరిగెత్తుకొచ్చాడు కపర్థి....

వెన్నెల వెలుగులో ఎదురుగా కనిపించిన దృశ్యం చూసి ఒక్కసారి అవాక్కైపోయాడు.... అదీ ఒక్కక్షణం ....

మరుక్షణం మామూలై పోయాడు. అతని బుర్ర చకచకా వేగంగా పనిచేసింది. క్రిందపడివున్న కర్ర తీసుకొని జేబులోనుంచి ఖర్చీఫ్‌తీసి.... కర్రకు చుట్టాడు.

లైటర్‌తీసి.... లైటర్‌లోవున్న పెట్రోల్ జేబుగుడ్డమీదపోసి.... లైటర్ జేబుగుడ్డ దగ్గిరకు తీసుకువచ్చి టప్పున కొట్టాడు....లైటర్‌లోని నిప్పురవ్వ డైరెక్టుగావచ్చి జేబుగుడ్డమీదపడి "భగ్" మని అంటుకుంది. మంట....

అప్పటికి స్పృహ తప్పింది అక్షతకు.

ఒక్కసారి ముందుకు ఉరికి సరిగ్గా కొండచిలువ కళ్ళ దగ్గర పెట్టాడు జేబుగుడ్డను

ఒక్కసారి విలవిలలాడింది కొండచిలువ....

"భగ్" మని కంటి దగ్గరకు రాగానే రెండు కళ్ళు ఒక్కసారిగా వేడి తగిలి గిలగిల కొట్టుకుంది....

ఆ కొట్టుకోవటంతో పట్టు సడలించింది....

స్పృహతప్పి క్రింద పడింది అక్షత....

ఆ కర్రతో దాని కళ్ళమీద గట్టిగా అదిమాడు....

అది ఆ దెబ్బకు ఎగిరెగిరి పడింది....

యశ్వంత్ చటుక్కున అక్షతను రెండు చేతులతో ఎత్తుకొని ముందుకు కదిలాడు.

కర్రతీసుకొని విపరీతంగా బాదాడు....

నిప్పు శరీరమ్మీద తగిలి ఎగిరెగిరి పడింది కొండచిలువ, దాని కళ్ళకు ఏమీ కన్పించలేదు....

విపరీతమైన కసితో దాన్ని దారుణంగా బాదాడు కపర్ది....

ఆ దెబ్బలకు ఓర్చుకోలేక అచేతనంగా పడిపోయింది కొండ చిలువ—

సరిగ్గా అదే సమయంలో పుత్లీ, ప్రొఫెసరు జయరాం, సులోచన అక్కడికి వచ్చారు.

అక్షత దేహాన్ని క్రింద పరుండబెట్టి ఆమెకు మర్దన చేయసాగాడు.

యశ్వంత్, సులోచన కూగా అక్షతకు తెలివి తెప్పించటానికి ప్రయత్నించింది....

ఖచ్చితంగా అరగంట తర్వాత స్పృహవచ్చింది అక్షతకు

అమె శరీరంలో ఏ ఎముక విరిగిపోలేదు.

శరీరం కొండచిలువ వలన ఒరుసుకుపోయింది ....

అతి కష్టమ్మీద లేచి నిలబడింది ....

క్రిందనుంచి ప్రియంవద, చంద్రహాస్ అక్కడికి వచ్చారు....

అడవంతా నిశ్శబ్దంగా ఉంది....

"బయలుదేరండి దొరా .... యింకా సమయంలేదు" అంది పుత్లీ

అందరూ బయలుదేరారు....

అక్షత చేయిపట్టుకొని నడుస్తున్నారు యశ్వంత్ సులోచన.

కపర్ధి పూర్తిగా అలిసిపోయాడు....

అతనికి నిద్రపోవాలని ఉంది....

కానీ కర్తవ్యం, బాధ్యతా అతని ముందు ఉంది. అందుకని ఒకసారిగా గుండెల నిండా గాలిపీల్చి ముందుకు కదిలాడు.

## 17

పుత్లీ దారి చూపుతుండగా వాళ్ళందరూ పచ్చకొండ వైపు బయలు దేరారు.

దారి అంతా రాళ్ళ మయం....ఆ రాళ్ళ గతుకుల్లో పదిమైళ్ళు నడవాలి....సుశిక్షితురాలైన సైనికరాల్లా పుత్లీ ముందుకు వెళుతుంది. ఆమె వెనక వాళ్ళందరూ నడుస్తున్నారు.

సులోచనకు, ప్రియంవదకు, అక్షతకు ఆ ప్రయాణం బాధాకరంగా ఉంది. వెన్నెల వెలుగుల్లో కొండదారులు స్పష్టంగా కన్పిస్తున్నాయి....

వేగంగా నడుస్తుంది పుత్లీ....

"పచ్చకొండ దగ్గరకు వెళ్ళాలంటే....యిన్ని మైళ్ళు నడవాలా" సులోచన అంటుంది....

"మన కార్యక్రమం ప్రారంభమయ్యే మజిలీలోకి వచ్చాం....ఇప్పుడు మనం మరింత హుషారుగా ఉండాలి" నడుస్తూ అన్నాడు ప్రొఫెసర్ జయ రాం....ఆయన సిక్త్స్ సెన్స్....స్వర్ణ సింహాసనానికి మార్గం దొరికింది అని చెప్తుంది....కొండదారిలో నడవటం కష్టంగానే ఉన్నప్పటికి అందరూ వేగంగా నడుస్తున్నారు. పుత్లీకి ఆ కొండదారులన్ని కొట్టిన పిండి కాబట్టి వేగంగా నడుస్తుంది. పుత్లీ తమకు ఎందుకు సహాయం చేస్తుందో.... వాళ్ళకు అర్థం కాలేదు....పుత్లీ తమకు యిలా సహాయం చేసిందని తెలిస్తే హంజారా జాతి వాళ్ళు ఆమెను బ్రతక నివ్వరు....

పుత్లీ....కపర్దికి ఓ పజిల్‌లా వుంది....

అలా చాలాసేపు అందరూ నడిచారు....

తెల్లవారు ఝామున నాల్గుగంటలకు వాళ్ళందరూ పచ్చకొండకి చేరు కున్నారు....అప్పటికే చాలామంది కోయవాళ్ళు అక్కడికి చేరుకొని నెగళ్ళు మండించుకుని చలి కాగుతున్నారు—

వాళ్ళ ముందున్న ఓ గుట్ట దగ్గర ఆగిపోయారు అందరూ....

ఆ వెన్నెల వెలుగుల్లో ఓ ఎత్తైన శిఖరం చూపించింది పుత్లీ....

"అదే పచ్చకొండ....రేపు ఉదయం సూర్యుడు పొడవగానే....ఆ శిఖరం మీద రాయి బంగారు రంగులో మెరుస్తుంది....దాంతో యిక్కడ అంతా బంగారు రంగులో ప్రకాశిస్తుంది"

"పర్వత శిఖరంపై సూర్యుడు బంగారు కలశమై మెరిసేచోట.... అంటే ఆ కొండమీద రాయేనేమో....ఆలోచిస్తున్నాడు ప్రొఫెసర్ జయరాం.

"నేను వాళ్ళ దగ్గరకి వెళతాను" అంది పుత్లీ....

"ఈ సమయంలో నువ్విక్కడి కొచ్చావేమని నిన్ను వాళ్ళు అడ గరా"

"కొలుపులకు అప్పుడప్పుడు నేను వస్తాను యిక్కడికి....అమ్మోరి దాసి....అమ్మోరితో సమానం....అందుకని నన్నెవరు అనుమానించరు" పుత్లీ చెప్పి వెళ్ళిపోయింది....

చూస్తుండగానే కోయవాళ్ళు అందరూ ఒక్కసారి లేచారు.... అప్పుడు తూర్పులో సరిగ్గా చుక్క ఉదయించింది....

నెగళ్ళ చుట్టూ డప్పులతో తిరుగుతూ నృత్యం చేయసాగారు. వాళ్ళ కేకలు....భక్తి ఉన్మాదంతో అరిచే అరుపులకు నిద్రపోతున్న పక్షులు భయంతో మేల్కొంటున్నాయి.

తెల్లవారబోతుంది....

ఆకాశం అరుణారుణ రాగంతో శోభిల్లుతుంది....

సూర్యోదయం కాబోయే సమయం....

ప్రొఫెసర్ జయరాం ఉత్కంఠగా చూసాడు.

డ్రమ్ములు భీకరంగా మ్రోగుతున్నాయి....

చీకటిని చీల్చుకుంటూ తూర్పు క్షితజ రేఖ నుంచి పైపైకి ఉబికు తున్నాడు సూర్యభగవానుడు.

చాలా ఉద్విగ్న భరితమైన క్షణాలు....

ప్రొఫెసర్ జయరాం....క్షితిజ రేఖ వైపు....కొండవైపు పదేపదే చూస్తున్నాడు....

సూర్యుడు క్షితిజం దాటి బయటికి వచ్చాడు....

గోళాకారంలో సూర్య బింబం....

అంతే!

ఇక్కడ ఒక్కసారిగా వేలాది మెరుపులు మెరిసాయి....

సప్తవర్ణ శోభితమై మొట్టమొదట ఓ మెరుపు....

మరుక్షణం....ఆ ప్రాంతమంతా పసుపు పచ్చని బంగారు రంగులో పుడమి, ఆకాశం, సమస్త ప్రకృతి అంత మెరిసింది....అడవిలోని చెట్లూ చేమలు, కుండలు ఆ బంగారు కాంతుల్లో మునిగాయి....

కొండ శిఖరం పై రాయి బంగారు రంగులో మెరిసింది....

డప్పుల శబ్దం వీరావేశంతో మ్రోగింది....

"జింజారే....జింజారే....రేల....రేల....రేలా....

కొండ దేవరకు జై....కొండదేవరకు జై....

ఆకాశం భూమి కలిసేటట్లు అరుస్తున్నారు హంజారా జాతివాళ్ళు....

ఓ ఇరవై సెకనుల పాటు ప్రకృతి అంతా పసిడివర్ణంలో శోభించింది....

కపర్ది....ప్రొఫెసర్ జయరాం..ప్రియంవద....నిశ్చేష్టులై ఆ వింతను చూస్తున్నారు....

ఓ బంగారు వెన్నెల అక్కడ కురిసింది!

ఓ పసిడి వర్షపు జల్లు హర్షపులకాంకితంగా వర్షించింది....

ఓ స్వర్ణ రజను భగవంతుడి దరహాసమై అక్కడ మెరిసింది....

అంతా స్వప్నంలోని మనుష్యుల్లా ఆ అద్భుత దృశ్యాన్ని చూసారు

ఏ నాగరీకుడు.... కనీ వినీ....చూడని అద్భుత దృశ్యం అదీ....

ఇరవై సెకండ్ల తరువాత....మామూలు సూర్యోదయం...

బంగారు ప్రకాశం లేదు....

అది నిజమా!

స్వప్నమా:....

నెగళ్ళు మండుతున్నాయి....నెగళ్ళ మీద వండిన ఆహారపదార్థాల్ని పెట్టి, తాము తెచ్చిన వేటల్ని కొండదేవరకు బలియిస్తున్నారు.... అటవీకులు. కోలాహలంగా, గందరగోళంగా వుంది వాతావరణం....

ఒక్కక్షణం....

తాము చూసినదేమిటో వాళ్ళకు అర్థం కాలేదు....

స్వర్ణ సూర్యోదయం....పసిడి విభావరి....

బంగారు బాలభానోదయం....

అలాగే పది నిమిషాలు నిలబడి పోయారు....

క్రమంగా కొలుపులు పూర్తిచేసుకొని వాళ్ళు కొండ వెనకవైపుకు వెళ్తున్నారు....ప్రొఫెసరు జయరాం పెదవులు కదిలాయి.

"మార్వలెస్ .... వండరపుల్ ....మాగ్నిఫిషియంట్ .... ఇన్‌క్రెడిబుల్...." స్పెన్సర్ చుట్ట తీసి చేతిలో పట్టుకొని అన్నాడు.

"నిజంగా యిది నేను నమ్మలేకపోతున్నాను....ఇది సాధ్యమా...." ప్రియంవద అన్నది....ఆమెకు ఆ అద్భుత దృశ్యం మరపుకురావటంలేదు

"ఇంతకాలం ఈ అద్భుత దృశ్యాన్ని....నాగరీకులు ఎవ్వరూ చూడలేదా?...."

"ఇది కేవలం ఈ కొండకు మాత్రమే పరిమితమైనది....ఈ కొండ చుట్టూ.... రెండు మైళ్ళ రేడియస్‌లోనే ఈ దృశ్యం కన్పిస్తుంది.... ఇదంతా కొండల మయం కావటం వలన....ఈ అద్భుత దృశ్యం నెలకు ఒకసారి రావటం వలన....నాగరీకులకు తెలియలేదు...." అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

"అయితే యింత అద్భుతమైన సూర్యోదయాన్ని మనమే చూసామన్న మాట...."

"అవును....ఈ సూర్యోదయమే కాదు....ఈ రోజు సూర్యాస్తమయాన్ని కూడా చూస్తాము"

"ఎందుకు" అడిగింది ప్రియంవద....

"పశ్చిమాన ఆకాశం స్వర్ణకాంతితో వెలుగొందే చోట
పర్వత శిఖరంపై సూర్యుడు బంగారు కలశమై మెరిసేచోట....
అంటే సూర్యాస్తమయంలో పశ్చిమ దిక్కు నుంచి చూస్తే....మనకేదో క్లూ దొరుకుతుంది....ఆ క్లూతోనే....స్వర్ణసింహాసనం జాడకనుక్కోవచ్చు" అన్నాడు జయరాం.

ప్రొఫెసర్ జయరాం చెప్పింది సబబుగానే వుంది....అందరూ ఆ ప్రతిపాదనకు ఒప్పుకున్నారు....

అటవీకులు....కొండకు పశ్చిమ దిక్కుగా వెళ్ళి మళ్ళీ వచ్చి కొండకు ప్రాణాచారాలుపడి వెళ్ళిపోతున్నారు....అవతలివైపుకుఎందుకెళ్ళారో జయరాంకు అర్థం కాలేదు....

అటవీకులు ఒక్కొక్కళ్ళు వెళ్ళిపోతున్నారు....

జయరాంకు, చంద్రహాస్‌కు అప్పుడు ఆకలి గుర్తుకు వచ్చింది. సూర్యుడు మెల్లమెల్లగా ఆకాశాన్ని అధిరోహిస్తున్నాడు. వర్షంలో తడిసిన బ్యాగ్‌లో నుంచి బిస్కెట్ ప్యాకెట్లు....చిల్డ్ ఫుడ్ బయటికి తీసాడు కపర్ది అందరూ వాటిని అందుకున్నారు. అవి కొంచం తడిసి ఉన్నాయి. కొండకు వాళ్ళున్న చోటుకు దూరం ఉండటంతో అటవీకులకు వాళ్ళను చూసే అవకాశం లేదు....

ఎనిమిది గంటల తర్వాత పుల్లీ వాళ్ళ దగ్గరకు వచ్చింది....

"దొరా....సూసినావా....పచ్చకొండలో సూరీడు పొడవటాన్ని...." అడిగింది....

"సూర్యుడు ఉదయించిన తరువాత....అందరూ కొండ వెనక్కి వెళ్ళారు ఎందుకు" అడిగాడు కపర్ది....

"కొండ వెనకాల....కోనేరుండాది....ఆ కోనేరులో హజరమ్మతల్లి ఎలసింది....ఆ యమ్మ పూజసేసి వత్తన్నాం...." అంది....

"కోనేటిలో....హజరమ్మ తల్లి ఉండటం ఏమిటి...." అడిగాడు జయరాం....

"హజరమ్మ కోనేటి మధ్యలోవున్న ఆలయంలో ఉంటుంది...." అందీ పుల్లి.

"కోనేటి మధ్యలో ఆలయామా ?" అడిగాడు కపర్ది ఆశ్చర్యంగా.

"అవును.... కోనేటి మధ్యలో ఆలయం .... ఆ ఆలయం భూమి పైన ఉండదు భూమిలోపల వుంది...."

భూమిలోపల అదెలా సాధ్యం ...." అడిగాడు కపర్ది. "వచ్చి చూడండి— మీకే అర్థమైద్దీ...." అంది పుల్లి....

"మనం.... వెళ్ళిచూద్దాం...." అన్నాడు ప్రొఫెసర్ జయరాం ....

"అవును.... ఈ అటవీకులకు తెలుగు ఎలా వస్తుంది" ఎప్పటి నుంచోవున్న అనుమానం అడిగింది ప్రియంవద....

"శ్రీకృష్ణదేవరాయలు కాలంనుంచి తెలుగు, కన్నడం వేరువేరు కావటం ప్రారంభించాయి .... అప్పట్లో వున్న జానపదులకు కన్నడం, తెలుగు రెండూ వచ్చు....అప్పటినుంచి.... అటవీకులు కొండజాతి వాళ్ళల్లో కూడా తెలుగు.... బాగానేవచ్చు .... కొన్ని వందల సంవత్సరాలు గడిచినా.... మారిన కర్నాటకభాష.... వాళ్ళల్లోకి పూర్తిగా రాలేదు.... ఇంకో విచిత్రమైన విషయం ఏమిటంటే .... యిప్పటికీ కర్నాటక రాష్ట్రంలో హరికథలు, బుర్రకథలు తెలుగులోనే జరుగుతాయి....మధ్య మధ్యకన్నడ పిట్ట కథలతో...." కపర్ది అన్నాడు.

అందుకనే ఆ అమ్మాయి.... మనతో తెలుగు మాట్లాడింది. అంతే కాదు....

ఈ కొండల ప్రాంతం.... మన ఆంధ్ర సరిహద్దుకు దగ్గర.... అందుకనే వాళ్ళకు తెలుగుబాషవచ్చు" అన్నాడు కపర్ది ....

పుత్లీ సెలవు తీసుకొని వెళ్ళిపోయింది.

ప్రొఫెసర్ జయరాం.... కపర్ది........కొండకు వెనకవున్న దేవాలయాన్ని చూడడానికి నిశ్చయించుకున్నారు....

"మనం.... కోనేరులోవున్న దేవాలయానికి వెళదాం .... పద" అన్నాడు కపర్ది సులోచనతో....

నేను రాను.... మీరిద్దరు వెళ్ళండి........ నాకు కాళ్ళు నెప్పులుగా ఉన్నాయి. విశ్రాంతి తీసుకుంటాను.... అన్నది సులోచన....

వాళ్ళిద్దరు బయలుదేరారు కొండ వెనక వైపుకు. కపర్ది, ప్రొఫెసరు జయరాం కొండ వెనుకకు చేరుకున్నారు.

కొండకు ఫర్లాంగు దూరంలో ఓ కోనేరు కన్పించింది.

అక్కడకు యిద్దరు నడిచివెళ్ళారు .... అక్కడనుంచి కోనేరును పరిశీలించారు.

ఓ చిన్న చెరువు అంత వుంది కోనేరు.... కోనేరులో నాచుపెరిగి పైన అంతా పచ్చగా ఉంది.... ఆ కోనేరు మధ్యలో మండపం ....

పన్నెడు అడుగుల వెడల్పు.... పన్నెండు అడుగుల పొడవువున్న మండపం అది.... దానికి నాలుగు వైపులా ఒకే రకమైన ముఖ ద్వారా లున్నాయి....

ముఖ ద్వారాలకు ఎత్తయిన స్థంభాలున్నాయి .... రెండు స్థంభాల మధ్య అడ్డంగా మరో స్తంభం .... మండపం పైన గోపురం .... అది రాతితో నిర్మించిన గోపురం.... మండప ద్వారాలకు అందమైన శిల్పా లున్నాయి.

అడ్డంగావున్న స్థంభంమీద మకరతోరణం .... గోపురం గుడిగోపురంలా చిన్న చిన్న బొమ్మలతో వుంది.... గోపురం పై భాగంలో కలశం లేదు కలశ స్థానంలో గుండ్రటి రాతిపలక....

స్థంభాలమీద అహ్వానిస్తున్న నాట్య కత్తెలు....స్థంభాల క్రింద ఏనుగుల బొమ్మలు.... స్థంభాన్ని మోస్తున్నట్లు....

మండప ముఖద్వారాలకు .... తలుపులు లేవు .... ఎక్కటానికి నీళ్ళల్లో నుంచి మెట్లు ఉన్నాయి....

అవన్నీ ఎప్పుడో చెక్కినవి కావటం వలన ఆలయం అంతా శిథిలావస్థలోవుంది.... ఆ గోపురంమీద పావురాలు, గోరింకలు, మైనాలు వాలివున్నాయి.

కోనేరులో కర్రలతో తయారుచేసిన తెప్పవుంది....

అది.... అటవీకులు చేసిన తెప్ప....

నీళ్ళల్లో నాని, నాని, చీకిపోయివుంది....

"ఈ దేవాలయమండపం క్రింద.... హజరా దేవి ఆలయండుందన్న మాట" అన్నాడు కపర్ది ....

"ఇద్దరం— వెళదాం పద" అని తెప్పమీద ఎక్కారు ఇద్దరు ....

ఇద్దరు లేక ముగ్గురు వెళ్ళటానికి సరిపోయే చిన్నతెప్ప అది....

ఆ తెప్పమీదఎక్కి కర్రపెట్టి తోసాడు కపర్ధి....

ఆ తెప్ప మెల్లగా నీటిమీద తేలుతూ .... మండపం దగ్గరకు చేరుకుంది....

తెప్పమీదనుంచి యిద్దరు మెట్లమీదకు చేరుకున్నారు.

మెట్లు పాచిపట్టి జారుతూ ఊన్నాయి....

కొన్ని మెట్లు పగుళ్ళిచ్చివున్నాయ్. ఇద్దరు మెట్లెక్కి మండపం దగ్గరకు చేరుకున్నారు.

మండపం మధ్యలో బావిలాంటి నిర్మాణం.... ఆ బావి లోపలకు గుండ్రటి మెట్లు.... ఆ మెట్లు ఎక్కి యిద్దరూ లోపలికి చేరుకున్నారు.

ఆ మెట్లు వాళ్ళను ఓ విశాలమైన గదిలాంటి ప్రదేశంలోకి తీసుకు వెళ్ళాయి.

ఆ గదిలోపల గబ్బిలాల కంపు....లోపలంతా చీకటిగా ఉంది....

లోపల మూకుడులో నూనెపోసి దీపం వెలిగించి ఉంది....

ప్రొఫెసర్ జయరాం తలపైకెత్తి చూసాడు.... గజంన్నర వ్యాసంలో గుండ్రంగా ఆకాశం కన్పిస్తుంది.... ఆ బావిలాంటి నిర్మాణం కేవలం ఆలయంలోకి వెళ్ళటానికి మెట్లు పెట్టడం కోసం ఏర్పరచింది....

లోపల మూకుడుదగ్గరనుంచి సన్ననికాంతి వస్తుంది ఇద్దరు అటు వైపు నడిచారు....మెట్ల దగ్గర నుంచి ఎనిమిది గజాల దూరంలో ఉందా మూకుడు.... ఆ మూకుడు ముందు ఓ విగ్రహం నల్లగా ఉంది.

ప్రొఫెసర్ జయరాం లైటర్ వెలిగించాడు.

ఓ గబ్బిలం రివ్వున వచ్చి జయరాం ముఖమ్మీద ఓ చరుపు చరిచింది.

"ఓ మైగాడ్" పెద్దగా అన్నాడు ప్రొఫెసర్ జయరాం....

లోపల చాలా గబ్బిలాలు ఉన్నాయి.

"కీ....కీ...." అంటూ అటు యిటూ తిరగటం ప్రారంభించాయి గాలిలో అవి.

ప్రొఫెసర్ జయరాం వెలిగించిన లైటర్ వెలుగులో ఆలయం లోపల దృశ్యం స్పష్టంగా కన్పించింది....

హజారాదేవి విగ్రహం....రక్తంతో తడిసి భయంకరంగావుంది....

ఎన్ని కోళ్ళను కోసారో....రక్తం యింకా పచ్చిగానే వుంది....

విగ్రహంలో పోలికలు స్పష్టంగా లేవు.... కుడిచేతి ఆలయం గోడ మీద విఘ్నేశ్వరుడి విగ్రహం.... ఎడమవైపు గోడమీద ఆంజనేయ స్వామి విగ్రహం రాతిగోడలోనే తొలిచారు.... హజారాదేవి విగ్రహం వెనక సూర్యుడి సప్తాశ్వాలు, రథం....రథం తోలుతున్న అరుణుడు.... చక్కగా చెక్కి ఉన్నాయి....

ఆలయం రూఫ్‌మీద....వివిధ రకాలైన మకర తోరణాలుఉన్నాయి తాము వచ్చిన మెట్లు ...విగ్రహం ఎదురుగా ఉన్న గోడలో తొలచబడి ఉన్నాయి....

మొత్తం.... అటు నలభై అడుగులు....యిటు ఇరవై అడుగుల వెడల్పుతో లోపల భాగం పెద్ద ఆలయంలాగానే అన్పించింది.

శిల్పకళ అంతా శ్రీ కృష్ణదేవరాయలు కాలంనాటి శిల్పకళ అని ప్రత్యేకంగా తెలుస్తూ ఉంది....

"ఇటువంటి అద్భుతమైన ఆలయం యిక్కడ ఉండి....అది ప్రజలకు తెలియలేదు అంటే.... ఈ ఆలయం వెనక ఏదో కథ వుంది" అన్నాడు కపర్ది....

"మనం వెతికే ఆలయం యిదేనని నా అనుమానం...."

"నాకు అలానే అన్పిస్తుంది...." అన్నాడు కపర్థి

ఇద్దరూ బైటికి వచ్చారు....

తెప్పమీద కోనేరుదాటి ఇద్దరు నడుచుకుంటూ ప్రియంవద, చంద్రహాస్‌దగ్గరకు వచ్చారు. అప్పటికి మధ్యాహ్నం పదకొండు గంటలైంది.

"చంద్రహాస్ మంటచేసి కుందేళ్ళను కాలుస్తున్నాడు....

"ఏమిటి భోజనాల ఏర్పాట్లు చేసారా" అన్నాడు కపర్థి—

"కాదు.... ఈ కుందేళ్ళను పుత్లీ తెచ్చింది...."

"పుత్లీ ....తెచ్చిందా....యింతకు ఆ అమ్మాయి ఏది...."

అటు యిటూ చూస్తూ అన్నాడు ప్రొఫెసర్ జయరాం....

ఇంతలో పుత్లీ మరోవైపునుంచి వచ్చింది....ఆమె చేతిలో దానిమ్మకాయలు, నేరేడుకాయలు ఉన్నాయి.

అవన్నీ వాళ్ళముందు పోసింది.చీరె చెంగులో మూట కట్టిన నేరేడుకాయల్ని వాళ్ళముందు పోసింది....

పుత్లీ....ఆ హజారా ఆలయానికి ఎవ్వరూ ఎందుకు వెళ్ళరు....దాని వెనకాల ఏదైనా కథ వుందా?" అడిగాడు కపర్థి....

"అమ్మో....మామూలు రోజుల్లో ఆ తల్లిదగ్గరకు ఎవురన్నాఎత్తే....రకతం కక్కుకొని సచ్చిపోతారు....పగలు పన్నెండు గంటల నుంచి ఆ తల్లి ఈ ప్రాంతమంతా తిరుగుద్దిఅంట....అందుకనే పౌర్ణమి ఎల్లిన రెండో రోజే యిక్కడికి వచ్చి పూజ చేస్తారు....మామూలు రోజుల్లో....ఈ గుడికి ఐదు మైల్ల దూరంలోకి ఎవ్వరు రారు"

"వస్తే....ఏమౌతుంది" అడిగాడు....

"అమ్మోరితల్లి.... యిరుసుకొని తింటుందంట....అందుకని ఎవరు యిటురారు...."

"చాలా విచిత్రంగా ఉందే.... పొరపాటున ఎవరన్నావస్తే...."

"అలావచ్చినోళ్ళను అమ్మోరు పులి రూపంలోవచ్చి తినేస్తుంది. నాకు తెలిసి.... ముగ్గురు సచ్చిపోయారు.... ఓసారి పులి రూపంలో ఓసారి పాము రూపంలో.... ఓసారి తేనెటీగల్లాగ వచ్చి అమ్మోరో సంపేసినాది.

అటవీకులకువున్న నమ్మకాలకు చిన్నగా నవ్వుకున్నాడు.....

"మీరందరూ కూడా.... యింకో గంట తరువాత ఎల్లిపోండి"అంది పుల్లీ....

"మరి....నువ్వు మాతో వస్తావా పుల్లీ...." అడిగాడు చంద్రహాస్.

"అమ్మో.... నేనురాను.... నేనొత్తే మా అయ్య తట్టుకోలేడు...."

"మరి మమ్మల్నెప్పుడు— కలుస్తావు" అడిగాడు చంద్రహాస్.

"మీ గుడారాల దగ్గరకొచ్చి కలుస్తాను" అంది పుల్లీ.

"మా గుడారాలు నీకు తెల్సా...." అన్నాడు ప్రొఫెసర్ జయరాం అనుమానంగా....

"తెలుసు.... మా అయ్య సెప్తుంటే యిన్నా ...." అన్నది పుల్లీ...

కొండవాళ్ళకు చాలా విషయాలు తెల్సు అని ప్రొఫెసర్ జయరాంకు అర్ధమైంది.

"వస్తాను" అని ఛెంగున అక్కడనుంచి దూకి ముందుకు పరిగెత్తింది పుల్లీ—

పుల్లీవెళ్ళి పోగానే కపర్ది అన్నాడు....

"మరి మనం ఏం చేద్దాం."

"మీరందరూ గుడారం దగ్గరకు వెళ్ళండి. నేను సాయంకాలం తర్వాత వస్తాను" అన్నాడు ప్రొఫెసర్.

"ఉదయాన చూసిన అద్భుత దృశ్యం మళ్ళీ చూసిగాని యిక్కడ నుంచి బయలుదేరను." అంది ప్రియంవద.

"మేము....అంతే" అన్నారు మిగిలిన వాళ్ళంతా

అందరూ సాయంకాలం వరకు అక్కడే ఉండిపోవాలనుకున్నారు.

కుందేలు మాంసంతో, పుల్లీ తెచ్చిన దానిమ్మకాయలు, నేరేడు కాయలతో ఆకలి తీర్చుకున్నారు....విశ్రాంతి తీసుకున్నారు.

మెల్లగా పొద్దువాలింది....సూర్యుడు పడమర వైపుకు కుంగిపోతు తున్నాడు.

సాయంత్రం ఐదుగంటలకు అందరూ లేచి కొండ వెనక వైపుకు వెళ్ళారు....

సూర్యాస్తమయం!

కోనేటి వెనకాల క్షితిజరేఖ.... పెన్సిల్‌తో గీసినట్లు స్పష్టంగా ఉంది....భూమి, అకాశం కలిసేచోట....ఏ కొండలు, గుట్టలు లేవు. అందు కని క్షితిజరేఖ స్పష్టంగా ఉంది.

సూర్యబింబం క్షితిజాన్ని తాకింది....

సూర్యగోళం కృంగిపోతూ క్షితిజాన్ని ముద్దుపెట్టుకున్న మరుక్షణం ప్రకృతి అంతా బంగారు రంగులో మెరిసింది.

కొండపై శిఖరం పసిడివర్ణంలో తళుక్కున మెరిసింది.

సరిగ్గా అదే సమయంలో కొండ శిఖరంపై నునుపైన తలంపైబడ్డ కిరణం పరావర్తనం చెంది సరిగ్గా ఎదురుగాఉన్న హజారా ఆలయగోపుర కలశం ఉన్న ప్రాంతంలో పడింది.

అక్కడ కలశం లేదు....గుండ్రటి శిలాఫలకం ఉంది. మరుక్షణం ఆ శిలా ఫలకం బంగారు కాంతిలో మెరిసింది....

ఆ వెలుగులో గుండ్రటి భాగం బంగారు కలశంలా మెరుస్తుంది. ఆ కలశం సూర్యుడులాగే మెరుస్తుంది.

ఆ దృశ్యాన్నే జయరాం చూస్తున్నాడు....

ఓ ఇరవై సెకండ్ల కాలం భూమిపై బంగారు వాన కురిసింది.

ప్రకృతి స్వర్ణభ్రాంతిలో మునిగింది.

అదో అపూర్వ దృశ్యం!

అదో కమనీయమైన దృశ్య కావ్యం!

అదో మహత్తరమైన మహాద్భుత అనుభవం!

అక్కడ స్వర్ణగంగ తన పసిడి ధారలతో వర్షించింది....

అక్కడ ఆది దేవత కనకమహాలక్ష్మి....పసిడివర్షం కురిపించింది, బంగారు కిరణాలతో మెరిసింది....

ప్రొఫెసర్ జయరాం హజరా ఆలయం వైపే చూస్తున్నాడు.

ఇరవై సెకండ్ల తర్వాత దృశ్యం కరిగిపోయింది.

బంగారు భ్రాంతి చెదరిపోయింది.

"అద్భుతమైన దృశ్యం...." అన్నాడు కపర్థి....

"మనం వెతికే స్వర్ణ సింహాసనం ఈ పరిసరాల్లో ఉంది...."

"ఎలా చెప్పగలవు"

"పశ్చిమాన పర్వత శిఖరంపై సూర్యుడు బంగారు కలశమయ్యే చోట....అని మనకు లభ్యమైన రాగిరేకుల్లో ఉంది. ఇక్కడ ఆ దేవాలయ శిఖరంపై సూర్యుడి నుంచి వచ్చిన బంగారు కిరణాలు శిఖరాన్ని టచ్‌చేసి పరివర్తనం చెంది గోపుర కలశం మీద ప్రతిబింబించాయి....అంటే....ఈ ఆలయములోనే స్వర్ణసింహాసనం ఎక్కడుందో లభించే క్లూ ఉంది"

అందరూ ప్రొఫెసర్ జయరాం వంక విస్మయంగా చూసారు.

"ఆ హజారీదేవి ఆలయం కూడా ఎప్పుడో పదిహేనో శతాబ్దంలో కట్టిన ఆలయంలాగే ఉంది....ఈ ఆలయంలోకి జనం ఎక్కువగా రాకుండా హరిహరనాధుడ్ని స్త్రీ శక్తిగా చేసి....అమ్మ పగటి పూట కూడా ఈ ప్రాంతంలో తిరుగుతూ ఉందని....ఎవర్నీ కూడా ఈ ప్రాంతాలకు రాకుండా ఆనాడే కట్టుదిట్టం చేసారు....ఈ అటవీకులు అదే నిజమని నమ్మారు.... నిజానికి క్రూర జంతువులు చంపిన మనుష్యుల్ని కూడా ఆ దేవత చంపిందని గాఢంగా విశ్వసించారు" అక్కడ జరుగుతున్న విషయాలకు విశ్లేషణ చేసాడు జయరాం....

"మీరన్నది నిజమే....త్రిపురాంతకంలో కూడా పగలు పన్నెండు దాటితే దేవతకు పూజలు చేయరు....అసలు ఆ ప్రదేశంలోకి ఎవ్వరు వెళ్ళరు....స్వర్ణ సింహాసనం గురించి బయట పడకుండా ఉండటం కోసం దేవుడు....శక్తిని సృష్టించటం వాళ్ళ మేధస్సుకు తార్కాణం....కపర్థి అన్నాడు.

"సూర్య కిరణాల్లో ఆ బంగారు రంగు ఎలా వచ్చింది...." అడిగింది ప్రియంవద....

"ఉదయాన భూమిమీదకు దూసుకువచ్చే బంగారు కిరణాల్లో పది వేల ట్రిలియన్ల టన్నుల బంగారు ఉంటుందని కైరో యూనివర్శిటీ ప్రొఫెసర్ యూసఫ్‌గారు లెఖ్క కట్టారు...."

"కొండ శిఖరానికి....దేవాలయ గోపుర కలశానికి పరావర్తన కోణాన్ని లెఖ్కవేసి....కొండ శిఖరంపై ఆ రాతి పలకను పెట్టిన ఆనాటి శాస్త్రజ్ఞులు గణితంలో గొప్ప మేధావులు" అన్నది అక్షతా....

"సరే....మనం తిరిగివెళ్దాం పదండి.... రేపు ఉదయానే వచ్చి.... ఆ గుడిని పరిశోధిద్దాం" అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

అందరూ దానికి వప్పుకొని వెనక్కి తిరిగారు....

అందరూ మనస్సులు రిలీఫ్‌గా ఉన్నాయి.

తాము అనుకున్న ఆశయానికి,గమ్యానికి చాలా దగ్గరగావచ్చారు....

అందుకని మనస్సంతా రిలీఫ్‌గా ఉంది

వాళ్ళు గుడారాలు చేరుకొనేసరికి రాత్రి పదిగంటలైంది.

## 18

ప్రొఫెసర్ జయరాం రాత్రంతా మేలుకొని ప్లాన్ గీయబడ్డ రెండు రేకుల్ని పరీక్షగా చూసాడు....ఓ రేకుమీద కొండ ఆ భాగంలో శిఖర ఆకారంలో రాజులాగా ఉంది.

ఉదయం చూసివచ్చిన కొండలాగే వుంది....

దాని గర్భంలో ఓ చోట మార్క్ చేసివుంది సింహాసనం స్పాట్....

అక్కడినుంచి ఓ సన్నదారి ఓ ఆలయంలో ప్రవేశించింది....

మరో రాగి రేకు తీసాడు....

ఆ రాగి రేకుమీద శ్రీ చక్రంలా వలయాలు....

శ్రీచక్రంలో త్రిభుజాలు ఉంటే ఇక్కడ వలయాలు ఉన్నాయి....

మధ్యలో ఓ వలయం దాని స్థానంలో బంగారపుముక్క తాపడం చేసి వుంది....

ఆ వలయానికి ఆనుకొని గుండ్రటి ఆకారాలు చుట్టూ ఉన్నాయి.

అ వలయం గుండ్రంగా కాక క్రమషడ్భుజిలా వుంది....

ఆ వలయంలో నాలుగు కార్నర్స్‌లో నాలుగు ద్వారాలు.... ప్రక్క నున్న వలయంలోకి వెళుతున్నట్లు....

సింహాసనం ఉన్నగదిచుట్టూ అలాంటి గదులు....

ఆ గదులను చుట్టుకొని మరో వలయం....దానిలోని గదులు....

ఆ వలయంపైన మరో వలయం....

అలా చూస్తుంటే ప్రొఫెసర్ జయరాంకు విచిత్రంగాఅన్పించింది....

ఆ రకమైన నిర్మాణం కొండ అడుగున ఉంటే....దానిలో ఓ గది లోకి ప్రవేశించినవాడికి....నాలుగు ద్వారాలు కన్పిస్తాయి.... అ ద్వారంలో నుంచి మరో గుండ్రటి గదిలోకి....అక్కడ మరో నాలుగు ద్వారాలు.... కొంచెం దూరం వెళితే లోపలకి ప్రవేశించినవాడు ఎటు వెళ్తున్నాడో అర్థం కాక ఆ గదుల్లోనుంచి మరో గదిలోకి అలా అలా ముందుకెళుతున్నాడో.... వెనక్కి వెళుతున్నాడో, ప్రక్కకు వెళుతున్నాడో తెలియక మాయామహల్లో ఉన్న అనుభూతి చెందుతాడు.

ఐదు గుండ్రటి గదుల వరుసను దాటితేగాని సింహాసనం ఉన్న గదిలోకి ప్రవేశించడు....అక్కడనుంచి బైట పడాలంటే ఆ భయంకర మైన "మేజ్"లో పడి కొట్టుకొని....దారి తెలియక మరణిస్తాడు.... ఒక్క సారి లోపలికి వెళితే ఏది ప్రారంభమో, ఏది అంతమో.... ముందుకో, వెనక్కో వెళుతున్నామో తెలియదు....

ఆ అద్భుతమైన ఇంజనీరింగ్ ప్రతిభకుఆశ్చర్యపోయాడుప్రొఫెసర్ జయరాం....

లోపలకి వెళ్ళే సరిఅయినదారి కోసం చూసాడు....

ప్రారంభంలో ఓ గదినుంచి ఓ సన్నని గీత మెలికలు తిరుగు కుంటూ సింహాసనం గదిలోకి వెళుతుంది....

ఆ గీతే సరైన దారిగా నిర్ణయించుకున్నాడు ప్రొఫెసర్ జయరాం....

తమతో పాటు చిన్నచిన్న బల్బులు పెట్టిన ఎలక్ట్రానిక్ వైర్ తెచ్చుకుంటే ఆ వైరుతో ప్రారంభ ద్వారంలో ఫిక్స్ చేసి ప్లాన్ ప్రకారం లోపలికి వెళ్ళి లోపల నుంచి బ్యాటరీ కనెక్షన్ యిస్తే....

ఆ వరస లైట్లన్నీ వెలిగి....దారి స్పష్టంగా బోధపడుతుంది....

పద్మవ్యూహం లాంటి....భవన నిర్మాణం చేసి దాని కేంద్ర భాగములో సింహాసనం పెట్టిన ఆనాటి వాస్తు శాస్త్రజ్ఞులు మేధస్సును మనస్సులోనే అభినందించాడు జయరాం....

ప్లానింగ్ షీట్స్‌ను....జాగ్రత్త పరచి....హాయిగా వెళ్ళి బెడ్‌మీద పడుకున్నాడు.

అప్పుడు సరిగ్గా పన్నెండు గంటలైంది. పగలంతా అలసిపోవటం వలన హాయిగా నిద్రపోయాడు....

తెల్లవారింది....

ప్రొఫెసర్ జయరాం లేచాడు....

అప్పటికే వేడి వేడి చాయ్ తీసుకొని ఆయన గదిలోకి వచ్చాడు కపర్ది....

"గుడ్‌మార్నింగ్ సార్" అన్నాడు....

"గుడ్‌మార్నింగ్...."అన్నాడు ప్రొఫెసర్.

"ఎనీథింగ్ ప్రోగ్రెస్...."

"మనం వెతికే ఆలయం యిదేనని రాత్రి నాకు కన్‌ఫర్మ్ అయింది ఈ వేళ తొందరగా వెళ్ళి....మనం....చేయవలసిన పనులు చేద్దాం...." అన్నాడు....

"మనకు ఏం కావాలి...." అన్నాడు....

"వైరు....విత్‌మినీ బల్బ్స్.... ఓ హాండీ జనరేటర్...."

"సరే చంద్రహాస్‌ను పంపి వాటిని తెప్పిస్తాను....మీరు, నేను బయలుదేరుదాం" అన్నాడు.

కపర్ది, ప్రొఫెసర్ జయరాం కోనేటిలో ఉన్న గుడిదగ్గరకు బయలుదేరారు....

పవర్ ఫుల్ టార్చిలైట్లు రెండు....డార్ట్ గన్....ఫ్లేర్ గన్....వెల్డర్ మిషన్ పిస్టల్....యింకా కావలసిన పరికరాలు ఓ పెద్ద బ్యాగ్ లో వేసు కొని బయలుదేరారు....

మధ్యాహ్నం పదకొండు గంటలకు కోనేటి దగ్గరకు చేరుకున్నారు.

చుట్టుపక్కల ఎవ్వరూ లేరు....

దూరం నుంచి ఏనుగుల ఘీంకారం వినిపిస్తుంది.

ఇద్దరు తెప్పద్వారా మండపంలోకి చేరుకున్నారు. మండపంలోని గుండ్రటి బావి ద్వారా ఆలయంలోకి దిగారు....ఆలయమంతా చీకటిగా ఉంది....వాళ్ళు వచ్చిన అలికిడికి....గబ్బిలాలు కదిలాయి.

గబ్బిలాల కంపు....

స్నో బర్నింగ్ మెగ్నిషియం ఫ్లేర్ ను హాలు మధ్యలో పడేలా పేల్చాడు. తెల్లని మెగ్నిషియం కాంతిలో ఆ గుడి అంతర్భాగం వెలిగింది "కీ....కీ....కీ" అంటూ వికృతంగా అరుస్తూ గబ్బిలాలు ఆ కాంతి నుంచి పారిపోయాయి. బయటికి ఉన్న మెట్ల ద్వారం గుండా చాలా గబ్బి లాలు ఎగిరిపోయాయి.

ఆ మెగ్నిషియం ఫ్లేర్ వెలుగులో గుడి అంతర్భాగం చక్కగా కన్పిస్తుంది. విగ్రహం కుడిచేతి వైపు వినాయక విగ్రహం గోడలో అతు క్కొని చెక్కబడి వుంది.

జయరాం గుడి అంతా పరీక్షగా చూసాడు....

పాతకాలంనాటి కట్టడాల వాసన, గబ్బిలాల కంపు....మరేదో విచిత్రమైన కంపుతో విచిత్రమైన వాసన వేస్తుంది ఆ ప్రదేశం....

హజారీ విగ్రహం మీద రక్తం ఎండిపోయి నల్లగా వుంది....

జయరాంకు రేకుమీద మాటలు గుర్తుకు వచ్చాయి.

"విఘ్నేశ్వరుడి ఒంటి కొమ్ము భ్రుకుటిని తాకేచోట....

ఆ చోట ఉంది అద్భుత ద్వారం....

స్వర్ణ సింహాసనానికి అదే మూల ద్వారం...."

విఘ్నేశ్వరుడి బొమ్మ దగ్గరకు వెళ్ళాడు....

మూడడుగుల వెడల్పు, ఐదు అడుగుల పొడవు ఉన్న రాతిఫ్రేము ఆ విగ్రహం చుట్టూ ఉంది. గోడలో చెక్కిన రాతి ఫ్రేము అది. ఫ్రేము పై భాగం మకరతోరణం ఉంది. విఘ్నేశ్వరుడి భృకుటి వద్ద ఎర్రగా మెరుస్తుంది....

ఆ ఎర్రటి రంగుగల ప్రాంతం దగ్గరకు వెళ్ళి చూసాడు....

అది గోమేధకమో....లేక ఎర్రటి సముద్రపు రాయో....శిల్పి.... దీన్ని విగ్రహంలో చక్కగా అమర్చాడు....అది విగ్రహంలో కలిసిపో పోయి వుంది. విఘ్నేశ్వరుడి ఒంటి కొమ్ము వంక చూసాడు. అది శిలలో చేసినట్లు ఉంది. ఇంతలో మెగ్నిషియం ఫ్లేర్ ఆరిపోయింది....

మరో ఫ్లేర్ వెలిగించాడు.

గుడిలోపల ప్రాంతం మళ్ళీ దేదీప్యమానంగా వెలిగింది. జయరాం, కపర్థి విఘ్నేశ్వరుడి విగ్రహం దగ్గరకు వెళ్ళి ఆ ఒంటి కొమ్ము వంక చూసారు.

కపర్థి చేత్తో ఆ ఒంటి దంతాన్ని పట్టుకొని గట్టిగా లాగాడు.... రాలేదు....

అటూయిటూ ఊపాడు....దానిలో చలనం లేదు....

"అది కదలటం లేదు...." అన్నాడు.

జయరాం ఒంటికొమ్ము పట్టుకున్నాడు. అది పన్నెండు అంగుళాల పొడవుంది....రెండున్నర అంగుళాల వ్యాసం వుంది. దాన్ని అటూయిటూ అనకుండా....ఓ నట్టు ఊడ దీసినట్లు బలంగా ఓ వైపు తిప్పాడు. కద లేదు....

మళ్ళీ బలంగా తిప్పాడు....దానిలో చలనం లేదు....

విసుగ్గా చూసాడు ప్రొఫెసర్ జయరాం....

కాపర్ షీట్స్‌లోని సంగతిని గుడ్డిగా నమ్మి తాము ప్రయోగాలు చేస్తున్నారా అని అనుమానం వచ్చింది....

"వచ్చిందా" అన్నాడు కపర్థి....

"రాలేదు" అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

"అయితే....నేను ట్రై చేస్తాను" అన్నాడు కపర్థి.

జయరాంకు మరో ఆలోచన వచ్చింది. యాంటీక్లాక్ వైజ్‌లో దం తాన్ని తిప్పితే ఫలితం ఏమైనా ఉంటుందేమోనని....

మళ్ళీ బలంగా యాంటీక్లాక్ వైజ్‌లో తిప్పాడు....

దంతం కొంచం కదిలింది....

"మైగాడ్....ఈ దంతం కదులుతుంది" ఎగ్జయిటింగా అన్నాడు జయరాం....

ఎన్నో యేళ్ళుగా బిర్రుగా ఉన్న ఆ దంతం....కదలటానికి విపరీత మైన శక్తి కావాల్సి వచ్చింది జయరాం రెట్టించిన ఉత్సాహంతో తిప్పాడు.

మెల్లమెల్లగా కొంచెం కొంచెం తిరగసాగింది దంతం....

జయరాం చేతుల్లో శక్తి నశించింది....

ఈలోగా కపర్థి వచ్చి "తాను తిప్పుతానన్నాడు...."

జయరాం విశ్రాంతి తీసుకున్నాడు. కపర్థి రెండు చేతులతో ఆ దం తాన్ని తిప్పాడు....ఖచ్చితంగా పదినిమిషాల్లో బయటకొచ్చింది దంతం.... మూడంగుళాల మేర చివర రాతిలో నట్లు కోయబడి వున్నాయి.... అలా స్క్రూ సిస్టమ్‌తో బిగించటం వలన శిలలో చెక్కిన దంతంలా కన్పించింది.

"హేట్సాఫ్ యువర్ టెక్నాలజీ"మనస్సులో అనుకున్నాడుజయరాం..

ఆ స్క్రూ సిస్టమ్ చివర....పుటాకారంగా ఉంది....

అది ఎందుకో అర్థం కాలేదు జయరాంకు....

ఆ దంతం చివర భాగం....గుండ్రంగా ఉంది....

విఘ్నేశ్వరుడి నుదుటిమీద ఉన్న భృకుటిలో ఉన్న గోమేధిక రాయి కూడా ఖచ్చితంగా అంతే గుండ్రంగా ఉంది....గోమేధికం పైభాగం కుంభాకారంగా ఉంది....ఇది పుటాకారంగా ఉంది....

జయరామ్‌కు ఏదో అర్థమైంది....

"హహ" అన్నాడు ఆనందంగా

"ఏమిటి....ఏమిటి మీ ఆనందం"

"ఈ కొమ్ముసు....ఆ రక్త వర్ణపు రాయి మీద పెట్టి నొక్కితే.... ప్రాబ్లం సాల్వ్ అయిపోతుంది....

విఘ్నేశ్వరుడి ఒంటికొమ్ము భ్రుకుటిని తాకేచోట....

ఆ చోట వుంది అద్భుత ద్వారం....అంటే ఈ ఒంటికొమ్ము భృకుటి మీద పెడితే మనకు ఆ ద్వారం ఎక్కడుందో తెలుస్తుంది" అన్నాడు....

కపర్ధి ఆ ఒంటి కొమ్ము తీసుకొని పుటాకార భాగాన్ని గోమేధికం రాయి మీద పెట్టి గట్టిగా నొక్కాడు....ఏమీ కదలిక లేదు....

మళ్ళీ గట్టిగా నొక్కాడు....ఒక్క యించీ కూడా కదలలేదు అది..

"స్క్రూసిస్టమ్ ఫాలో కా....యాంటీ క్లాక్ వైజ్...." అన్నాడు జయరాం....

దాన్ని గట్టిగా అదిమి స్క్రూసిస్టమ్ ఉపయోగిస్తూ యాంటీక్లాక్ వైజ్‌లో తిప్పాడు....కొమ్ము... నట్టులాగా లోపలకు వెళ్ళింది....

"వండర్‌ఫుల్....యిది లోపలకు వెళుతుంది" అన్నాడు కపర్ధి.

అలా మెల్లగా తిప్పుతూ వెళ్ళేసరికి అరగంటకు పూర్తిగా దానిలోకి వెళ్ళిపోయింది.

విఘ్నేశ్వరుడి నుదుటన రాతి కొమ్ములా వుంది....

యింకా ఎంత తిప్పినా ముందుకు పోలేదు....

ఏం అర్థంకాక అలా నిలబడిపోయాడు కపర్ధి....

"ఆ కొమ్ము దానిలో నిలబడింది గాని ఏ ద్వారం తెరుచుకోలేదు" అన్నాడు కపర్ధి....ఈలోగా ఫ్లేర్ ఆరిపోయింది.

ప్రొఫెసర్ జయరాం మరో ఫ్లేర్ వెలిగించాడు....

కపర్ధికి మరో ఆలోచన వచ్చింది. ఆ కొమ్ము పట్టుకొని గట్టిగా క్రిందకు లాగితే

దాన్నే ఆచరణలో పెట్టాడు ఆ కొమ్ము విచిత్రంగా క్రిందకు కదిలింది.

ధడ....ధడ....మని పెద్ద శబ్దం....దుమ్ము పైకెగిరింది.

కొమ్ము కొస ముక్కుమీద ఆనటం....

విఘ్నేశ్వరుడి గర్భం రెండుగా విచ్చుకోవటం జరిగింది....

ఆ గర్భం వెనక చూసాడు....

ఓ గుండ్రటి ద్వారం....రెండు అడుగుల వ్యాసంతో ఉంది....ఆ ద్వారం....ఆ ద్వారం చీకటిగా వుంది....

లోపలకు లైటు వేసాడు....క్రిందకు మెట్లు కన్పించాయి....

కపర్థీ....జయరాం ఆశ్చర్యంగా చూసాడు....

వాళ్ళ గుండెలు విపరీతమైన ఎగ్జయిటింగ్‌తో కొట్టుకున్నాయి ....

వాళ్ళు కలలు గన్న స్వర్ణసింహాసనం దారి వాళ్ళ ఎదురుగా తెరుచుకొని వుంది....

వాళ్ళు ఆశ్చర్యంతో మ్రాన్పడిపోయారు.

ఫ్లేర్స్ వెలుగులో....లోపలకు రాతి మెట్లు....

అలా పది నిమిషాలు దానివంక చూసారు.

"దిగుదామా" అన్నాడు జయరాం....

ప్రొఫెసర్ జయరాం లోపలకు అడుగుపెట్టాడు....లోపలికి మెట్లు ఉన్నాయి....అడుగుపెట్టాడు....రాతి గుహను తొలచినట్లు ఉంచె....ఓ ప్రక్క....గుండ్రటి చక్రం ఉంది.... బ్యాటరీ లైటు వేసి ఆ చక్రాన్ని యాంటీ క్లాక్ వైజ్ తిప్పాడు.

విఘ్నేశ్వరుడి పొట్ట మూసుకుపోయింది....

బయట కపర్ది ఉన్నాడు. మళ్ళీ తిప్పాడు....

విఘ్నేశ్వరుడి పొట్ట తెరుచుకుంది.

ఇద్దరూ లోపలికి నడిచారు....చక్రం తిప్పారు.

బ్యాటరీ లైట్లు వేసారు. విఘ్నేశ్వరుడి గర్భం మూసుకుపోయింది.

లోపల చల్లగా ఉంది.

కొన్ని వందల సంవత్సరాలుగా ఎవ్వరు నడవకపోవడం వలన అతి నిశ్శబ్దంగా అతి శుభ్రంగా ఉంది....

మెట్లమీద నడిచి క్రిందకు వెళ్ళారు.... మెట్లు హఠాత్తుగా కుడివైపుకు తిరిగాయి....

అటువైపు నడిచారు, అక్కడ మెట్లు లేవు....

ఓ సొరంగం....తూర్పుదిశగా వెళ్తుంది....

రాతి పలకలతో తయారైన సొరంగం....బ్యాటరీ లైటు వెలుగులో మెల్లగా ముందుకు నడిచారు....

సొరంగంలో ఏ జంతువులు లేవు.... తూర్పుగా ఉంది ఆ దారి.... బహుశా....కొండక్రింద భాగంలోకి తీసుకువెళ్తుందేమో ఈ మార్గం అనుకున్నాడు జయరాం....

అతని గుండె భయంతో పీచు పీచుమంటుంది....

ఫర్లాంగు దూరం నడిచిన తర్వాత....హఠాత్తుగాసొరంగంమూసుకుపోయింది....ఎదురుగా ఓ రాతి పలక....

ఆ పలకమీద హరిహరనాథుడి బొమ్మ....

"హరిహరా ఆలయం అంటే యిదా...."

అప్పుడు అర్థమైంది ప్రొఫెసర్ జయరాంకు....

సగం మూర్తి విష్ణువు, సగం మూర్తి శివుడు....

ఎడమచేతివైపు శివుడి విగ్రహం!

కుడిచేతివైపు విష్ణువు విగ్రహం!

ఆ రాతి పలక....పది అడుగుల వెడల్పు, పది అడుగుల పొడవుంది సొరంగం అక్కడ విస్తరించి ఉంది....

"ఇదే....స్వర్ణసింహాసనానికి తీసుకువెళ్లే పద్మ వ్యూహానికి ముఖద్వారం"

"దాన్ని ఎలా తెరవాలి...." అన్నాడు కపర్ది....

"మళ్ళీ మనం వెనక్కి వెళ్ళి.... ఆ కాపర్ షీట్స్ క్షుణ్ణంగా స్టడీ చేసి వద్దాం" అన్నాడు ప్రొఫెసర్....

ఇద్దరు వెనక్కి తిరిగారు....

పది నిమిషాల్లో .. విఘ్నేశ్వరుడి గర్భంలోనుంచి బైటికి వచ్చి మళ్ళీ గర్భం మూసేసారు....

ఒంటికొమ్ము తొండం దగ్గర పెట్టాడు....

మళ్ళీ మామూలుగా ఉంది విగ్రహం-

## 19

ఆ రాత్రి జరిగిన విషయం అంతా విపులంగా అందరికి చెప్పాడు ప్రొఫెసరు జయరాం.... స్వర్ణ సింహాసనం దారి తెలుసుకున్నందుకు అందరూ అతన్ని అభినందించారు....

"నాలుగువందల సంవత్సరాలు చీకటిలో ఉన్న స్వర్ణ సింహాసనం రహస్యాన్ని తెల్సుకున్నారు. యూ ఆర్ గ్రేట్ ప్రొఫెసర్" అన్నాడు చంద్రహాస్....

యశ్వంత్ కళ్ళల్లో లీలగా ఏదో భావం....

అతను కళ్ళు విచిత్రంగా మెరిసాయి.

"కంగ్రాట్యులేషన్స్....మొత్తానికి సాధించారు...." మెచ్చుకుంది ప్రియంవద....

అందరకు ఆ వార్త ఎంతో ఎగ్జైటింగ్‌గా వుంది.

చంద్రహాస్ హాండ్ జనరేటర్ తీసుకువచ్చాడు.... వైర్ దండలు తీసుకువచ్చాడు.

ఆ రాత్రి ప్రొఫెసర్ జయరాం....రెండు కాపర్ షీట్స్‌ను ముందుకు పెట్టుకొని చూసాడు.

రెండో కాపర్‌షీట్‌లో....కొండనుంచి వస్తున్న సొరంగమార్గం గీయబడి ఉంది....దాని ప్రారంభంలో ఓ చిన్న గీత మధ్యలో విడివడి వుంది....సొరంగం ప్రక్కన ఓ మార్క్ నక్షత్రం ఆకారంలోవుంది.... ఆ నక్షత్రం ఆకారం....మధ్యలో విడిగా ఉన్నగీతకు కుడివైపున ఉంది.... ఆ గీత అతనికి సొరంగ మార్గంలో ఎదురైన రాతి పలక అని అన్పించింది.

ఆ నక్షత్రం గుర్తు బహుశా ఆ రాతి పలక తెరుచుకోటానికి ఏదో చక్రంలాంటిది ఉండి ఉంటుంది. బహుశా ఆ రహస్యం తెలీకుండా అందుకే రాతి పలకను అడ్డుగా పెట్టారు....

ఈ కాపర్ షీట్స్ లేకపోతే స్వరసింహాసనం దగ్గరకు వెళ్ళటం అసాధ్యం....అందుకే ఆ స్వర్ణ శిల్పి తన మరణంతో ఆ రహస్యం సమాధి కాకుండా రాగి రేకుల్లో గీసి తన సమాధిలో భద్రపరుచుకున్నాడు.

ఓ గొప్ప రహస్యం తెలుసుకున్న అనుభూతితో నిద్రపోయాడు ఆ రాత్రి ప్రొఫెసర్ జయరాం.... మరునాడు ఉదయానికి అన్ని ఏర్పాట్లు చేసుకొని అందరూ కోనేటి దగ్గరకు బయల్దేరారు.

* ○ * * *

"ఏజంట్ వై కాలింగ్....ఏజెంట్ వై కాలింగ్...."

పరమహంస స్పెషల్ రూమ్‌లో స్క్రీన్ మీద ఏజంట్ వై రూపం.... వై ర్‌లెస్‌లో మాట్లాడుతున్నాడు.

"యస్....పరమహంస రీసీవింగ్"

"ఆపరేషన్ గోల్డెన్ థ్రోన్ కంప్లీట్ కాబోతుంది.... దాని పే.... అన్నీ కనుగొన్నారు ప్రొఫెసర్ జయరాం బ్యాచ్...."

ఏజంట్ వై అన్నాడు—

"ఎక్కడుంది.... ఆ గోల్డెన్ థ్రోన్"?

"పచ్చకొండ దగ్గర ఉన్న కోనేటి మండపం క్రింద ఉంది సార్"

పరమహంసకు ఉద్వేగంగా ఉంది....

"కాళీచరణ్ చేత ఎటాక్ చేయిద్దామా" !

"వద్దు.... యింకా స్పాట్‌కు వెళ్ళలేదు....గోల్డెన్ థ్రోన్ లోకేషన్ తెల్సింది...." ఏజంట్ వై అన్నాడు.

"ఓ.కే....రేపు సాయంకాలం వరకు నీ కోసం.... నీ వార్తకోసం వెయిట్ చేస్తాను" పరమహంస అన్నాడు.

"ఓ.కే....రేపు మధ్యాహ్నానికే గోల్డెన్ థ్రోన్ సీక్రెట్ విడిపోతుంది" మరి ఉంటాను వైర్‌లెస్ సెట్ ఆఫ్ చేస్తూ అన్నాడు ఏజంట్ వై ....

డిస్‌ప్లే మీద రూపాలు చెదరిపోయాయి.

మరో స్విచ్ నొక్కాడు.... కాళీచరణ్ ముఖం కన్పించింది.

"కాళీచరణ్....కాళీచరణ్"

"యస్ బాస్...." కాళీచరణ్ డిస్‌ప్లే మీద క్లోజప్‌లో ఉన్నాడు.

"ఆపరేషన్ గోల్డెన్ థ్రోన్ పూర్తికాబోతుంది.... నేను ఈ వేళే బయల్దేరి రేపు మన గెస్టుహౌస్‌కు వస్తాను...." అన్నాడు పరమహంస....

"మీరెందుకు బాస్, అన్ని పనులు మేము సజావుగా చేస్తున్నాం కదా!" అతనికి పరమహంస రావటం యిష్టం లేదు.

"కాదు—గోల్డెన్ థ్రోన్ విషయంలో మొరాజో యువరాజు మోజు పడుతున్నాడు. అతనికి స్పెసిమన్ కాపీ పంపాలి"

"ఓ.కే....బాస్....అలాగే రండి" అన్నాడు కాళీచరణ్....

"కాళీ....మన అనుచరుల్ని సిద్ధంచేసి వుంచు... అవసరమైతే రక్తపాతానికైనా వెనుకాడవద్దు...." అతని కంఠంలో మార్పు వచ్చింది.

"రక్తపాతం మన ముఖ్యోద్దేశం కాదుగదా!" కాళీచరణ్ అన్నాడు.

"కానీ....ఈనాడు అది తప్పటంలేదు.... అవసరమైతేనే రక్తపాతం జరపండి....అందుకు మన అనుచరుల్నే ఎన్నుకో.... ఆ అటవీకుల్ని వద్దు" అన్నాడు పరమహంస....

"అలాగే బాస్....అటవీకులు ఉంటేకాని కొంత పని జరగదు.... వాళ్ళకు ఆ కొండలు, గుట్టలు.....ఎక్కటం,దిగటం మంచినీళ్ళప్రాయం.." కాళీచరణ్ అన్నాడు.

"వద్దు....అలాంటి తప్పు చెయ్యొద్దు"

పరమహంస అనుభవజ్ఞుడు.... అటవీకులుకు మూఢ నమ్మకాలు ఎక్కువ, వాళ్ళ నమ్మకాల విషయంలో వాళ్ళు దేవుడినైనా లెఖ్కచేయరు. ఆ విషయం పరహంసకు తెలుసు....

"అలాగే-బాస్" క్రమంగా అతని రూపం టి. వి. తెరమీద అదృశ్యమైపోయింది—

మరో బటన్ నొక్కాడు....విన్సెంట్ తెరమీద ప్రత్యక్షమయ్యాడు.

"విన్సెంట్ ఆపరేషన్ గోల్డెన్ థ్రోన్ రేపు కంప్లీట్ కాబోతుంది.... దాన్ని కళ్ళారా చూడాలనుకుంటే...నాతో రా..."

"ఎక్కడికి" అడిగాడు విన్సెంట్...

"కర్నాటక ఫారెస్టుకు.... ఈ రాత్రే ప్రయాణం"

"వస్తున్నాను....స్వామి...వస్తున్నాను"

అతని రూపం క్రమంగా అదృశ్యమైంది...

చిన్నగా చిరునవ్వు నవ్వుకున్నాడు పరమహంస.

అతని కల నిజం గాబోతుంది...

అపురూపమైన బంగారు సింహాసనం అతని చేతికి దక్కబోతోంది దాంతో ప్రపంచంలోకెల్లా గొప్ప ధనవంతుడై పోతాడు..

క్రూరంగా నవ్వుకున్నాడు పరమహంస...

* * * * *

వాళ్ళు మధ్యాహ్నం పదకొండు గంటలకు అక్కడికి చేరుకున్నారు, విఘ్నేశ్వరుడి ఒంటికొమ్ముతీసి నుదుట మీద పెట్టి స్క్రూలా తిప్పటం ఆ తర్వాత దాన్ని క్రిందకు నొక్కటం, గణపతి బొజ్జ రెండుగా తెరచుకోవటం దానిక్రింద మార్గం అందరూ విభ్రాంతితో చూసారు.

"రియల్లీ ఇటీజ్ వండర్‌ఫుల్" ఆశ్చర్యంగా చూస్తూ అన్నాడు చంద్రహాస్.

మెల్లగా అందరూ లోపలకి నడిచి ద్వారం మూసేసాడు కపర్ది.

మొత్తం ఏడుగురు సొరంగమార్గంలో నడవసాగారు....

అందరు పవర్‌ఫుల్ సెర్చ్‌లైట్లు వెయ్యడంవల్ల .... ఆ ప్రాంతం అంతా పట్టపగల్లా ధగధగలాడిపోయింది....

సరిగ్గా యిరవై నిమిషాల్లో అందరూ రాతి పలక దగ్గరకు చేరుకున్నారు....

రాతి పలక కుడిప్రక్క సొరంగం గోడలో తడిమాడు.... ప్లానులో నక్షత్రం గుర్తు ఎక్కడో గుర్తుపెట్టుకొని చేత్తో తడిమాడు కపర్థి.

అక్కడో రాతిపలక తగిలింది.

దాన్ని గట్టిగా లాగాడు.... డబ్బామీద పెట్టిన మూతలా అది పైకి వచ్చింది.

లోపల బోలుగా వుంది.

అక్కడో చక్రం ఉంది....

ఆ చక్రాన్ని పట్టుకొని గట్టిగా తిప్పాడు....

"ధడ....ధడ....మని శబ్దంచేస్తూ....రాతి పలక మధ్యలోకి తెరుచుకొని ఒకటి ఎడంవైపు రెండో పలక కుడివైపుకు వెళ్లాయి.

ఎడమ భాగంలో శివుడి అర్ధభాగం !

కుడిభాగంలో విష్ణువు అర్ధ భాగం....!

ఆ పలకలు తెరుచుకోవటంతో.... నాలుగువందల సంవత్సరాల క్రితం మూసివేయబడ్డ పద్మవ్యూహంలాంటి పర్వతాంతర్గతరహస్య అంతఃపురంకు ద్వారాలు తెరిచినట్లైంది....

అంతా ఎగ్జయిటింగ్‌గా ఆ లోపల చూసారు....

లోపలకు వెళ్ళటానికి రెండు ద్వారాలు....

ఒకటి కుడి....

యింకోటి ఎడమవైపు....

ఐదు అడుగుల ఎత్తుండి....ఒకటిన్నర అడుగులు వెడల్పు ఉన్న రాతి ద్వారాలు, వాటికి తలుపులు లేవు.

ఆ రెండు ద్వారాల్లోకి వెళ్ళి చూసాడు.

రెండు ద్వారాలు రెండు గదుల్లోకి తీసుకువెళ్లాయి. ఆ గది గుండ్రంగా వుంది.

దానికి నాలుగువైపులా నాలుగు ద్వారాలు ఉన్నాయి....

రెండు గదుల్లో అలాగే వుంది.

"మనం ఈ గదులగుండా లోపలకి వెళితే పద్మవ్యూహంలోకి వెళతాము....కాబట్టి యిక్కడ వైర్‌బోర్డ్ ఫిక్స్‌చేద్దాం" అని ప్రొఫెసర్ జయరాం.... ఓ పెద్ద స్విచ్‌బోర్డ్ తీసి అక్కడ పెట్టి వైరుకు కనక్షన్ యిచ్చాడు....వైరు చుట్ట కపర్ధికి యిచ్చాడు....

"కపర్ధి నేను వెళుతున్న దిశలో ఈ చుట్టను తీసుకొనిరా.... వైరు వదులుతూ...." అన్నాడు.

అని చేబులోనుంచి కాపర్‌షీట్ కాపీ కంప్యూటర్ షీట్ తీసాడు ఆ షీట్‌లో ఆ ద్వారం నుంచి లోపలకు ఎలా వెళ్లాలో దారి గీయబడి వుంది....

"ఎడమవైపు గదిలోకి వెళ్దాం పదండి" అన్నాడు.

ప్రొఫెసర్ జయరాం ఎడమవైపు గదిలోకి నడిచాడు.

ఆ గదిలో నాలుగు ద్వారాల్లో కుడిద్వారం వైపు తిరిగాడు.... ఆ గదిలో కూడా నాలుగుద్వారాలు ఉన్నాయి. ఆ గదిలోకి తిరిగాడు....

ప్రతి గదిలో పైనుంచి సన్నని వెలుగు వస్తుంది....

ఆ వెలుగు సహజంగా వుంది. తల పైకెత్తి చూసాడు....

గది పై భాగంలో సీలింగ్ మీద ఓ పద్మాకారం చెక్కివుంది. ఆ పద్మాకారం మధ్యలో గుప్పిటంత రత్నం పద్మం మధ్యలో ప్రకాశిస్తుంది.... ఆ రత్నం వెలుగే గదంతా పరుచుకుంటుంది

"ఓ మైగాడ్ డైమండ్ లైట్స్...." వాటివంక చూసి ఆశ్చర్య పోతూ అన్నాడు. వాళ్ళ చేతుల్లోని బ్యాటరీలైట్లు ఆపివేసారు.... ప్లానులో ఉన్న ప్రకారం ప్రొఫెసర్ జయరాం ముందుకు కదులుతున్నాడు. అతని వెనకాలే నడుస్తున్నారు మిగతావాళ్ళు....

ఓ వలయం దాటి రెండో వలయం ప్రవేశించగానే.... నాలుగు ద్వారాల పైన మకర తోరణాలు....మకరం నోట్లో ఎర్రటి రత్నాలు దేదీప్యమానంగా వెలుగుతూ కన్పించాయి.

మొదటి వలయంలో పైన పద్మంలో రత్నం.

రెండో వలయంలో పద్మం మధ్యలో రత్నంతోపాటు మకరం నోళ్ళల్లోకూడా రత్నాలు....

రెండో వలయంలో ఎడమవైపుకు దారి....

ఆ దారి వెంట నడిచారు....రెండో వలయంలో రెండు మూడు గదులు దాటిన తరువాత....రత్నాలు తాపడం చేసి లేవు....రత్నదీపికలు కేవలం ప్రారంభంలో మాత్రమే....రత్నదీపికలు....

"మనం కరెక్టుగానే ముందుకు వెళుతున్నామా..." అడిగాడు యశ్వంత్....

"ఆ గదిలో చీకటిగా ఉంది....జయరాం బ్యాటరీ లైటు వెలిగించి కాపర్ షీట్స్ వంక చూసాడు.

మూడో గదిలో తూర్పు వైపుకు సాగింది మార్గం....

రెండో వలయం నుంచి మూడో వలయంలోకి ప్రవేశించారు.

మూడో వలయంలో గది చిమ్మ చీకటిగా ఉంది.

చల్లటి శీతలత్వం నిశ్చలంగా ఉంది....

ఆ వలయంలోకి ప్రవేశించగానే వాళ్ళంతా వణికారు....

ఎవరో పై నుంచి చూస్తున్న ఫీలింగ్....

ఎక్కడా కూడా క్రూరజంతువులు, పాములు, గబ్బిలాలు లేవు.

మూడో వలయంలో ఎడమ వైపు నడిచారు.... నాలుగైదు గదులు ఎడమవైపు నడిచిన తరువాత హఠాత్తుగా ప్లాన్‌లో పడమరవైపు తిరిగింది దారి....పడమర వైపు నడిచారు.

అందరికి ఎంతో ఉత్కంఠగా, నరాలు పురి ఎక్కుతున్న టెన్షన్...

ఎక్కడా వెలుగులేదు....

చీకటి....గబ్బగీయం....టార్చిలైటు ప్రసరించినంత మేర దారి కన పడుతుంది....

లోపల గాలి వందల సంవత్సరాల నుంచి అలాగే కదలిక లేక ఉం డటం వల్ల....ఆక్సిజన్ శాతం తగ్గినట్లుగా వుంది.

వాళ్ళల్లో లైట్‌గా సోఫాసికేషన్....మెల్లగా తల తిరుగుతున్నట్లుగా మూడో వలయంలో నాలుగైదు గదులు ఎడమవైపు నడిచి ఉత్తరవైపుకు తిరిగాడు....

ఎక్కడ నుంచో నాలుగో వలయంలో సన్నని వెలుగు....

నాలుగో వలయంలో వరసగా ఎనిమిది గదులు తిరిగిన తర్వాత ఐదో వలయంలోకి ప్రవేశించారు....

ఐదో వలయం మొత్తం ఐదు గదుల వరుస....

ఐదు గదుల వరస తిరిగి ఉత్తరంగా లోపలకు ప్రవేశించేసరికి ఓ గుండ్రటి గది కన్పించింది....

దానికెక్కడా ద్వారం లేదు....

అదే స్వర్ణసింహాసనం ఉండే గది అని నిర్ణయించుకున్నాడు జయ రాం....ఆ గది చుట్టూ గుండ్రని రహదారి....మిగతా గదుల్లోకి వెళ్ళటానికి

ఆ గది దగ్గర ఎక్కడ నుంచో వెలుగు....పైకి చూసాడు ప్రొఫె సర్ జయరాం, రూఫ్‌లో నుంచి ఆ వెలుగు వస్తుంది....

మధ్యలో ఉన్న గదిలో నుంచే వెలుగు ఆ రూఫ్ మీదకు ప్రతిబింబి స్తున్నట్లు అన్పించింది....రూఫ్‌కు మధ్య గదికి మధ్య ఆరంగుళాల తేడా.. ఆ తేడాలో నుంచే వెలుగు రూఫ్ మీద వృత్తాకారంలో పడుతుంది.

ఆ వెలుగు ఏమిటి”

స్వర్ణసింహాసనం ధగ ధగలా!

“సమథింగ్ మిస్టీరియస్ లైట్” కపర్ది అన్నాడు విస్మయంగా....

“డైమండ్స్....నుంచి వచ్చే లైట్‌లా వుంది అది....”

“అంటే....ఈ గదిలో స్వర్ణసింహాసనం ఉందన్న మాట....“

“ఆ సింహాసనం దగ్గరకు ఎలా వెళ్ళాలి....”

ప్రొఫెసర్ జయరాం ఆ గుండ్రటి గదిని ఒక్కసారి చూసాడు....

దానికి ఎటువైపు ఎంట్రన్స్ ఉందో అర్ధం కాలేదు....

కాపర్‌షీట్స్‌లో కూడా ఆ వివరాలు లేవు....ప్లాన్ కాగితంలోగాని, షీట్‌లో గాని కేవలం మధ్య భాగంలో బంగారు రంగు తాపటం చేసి ఉంది....

అది గదికి గుర్తు!....

అన్ని వ్రాసినా ఆ శిల్పి ఈ స్వర్ణ సింహాసనం గదికి ఎంట్రన్స్ ఎక్కడా వివరించలేదు....

వైరు దండలు, జనరేటర్‌కు ఫిక్స్ చేద్దామా!” అడిగాడు కపర్ది....

“చేయండి” అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

హోండీ జనరేటర్ క్రిందపెట్టి వైర్ కనక్షన్స్ మరో స్విచ్‌బోర్డుకు ఎటాచ్ చేసి....ఆ బోర్డుకు జనరేటరు వైరు కనక్షన్ యిచ్చాడు. స్విచ్ ఆన్ చేశాడు.

మరుక్షణం జనరేటర్ పనిచేయటం ప్రారంభించింది....వైరుకున్న లైట్లు చకచకా వెలిగాయి....

ఆ లైట్లు వేసిన మార్గంలోనే బైటికి రావాలి....

బ్యాగ్‌లో నుంచి పవర్‌ఫుల్ లైట్ ఒకటి తీసి దాన్ని స్విచ్‌బోర్డుకు కనక్షన్ యిచ్చి లైటు వేసాడు.

ఆ ప్రాంతమంతా ధగధగాయామానంగా మెరిసింది. ఆ లైట్‌కు వైరు వుంది. వలయాకారపు గదిమీద ఫోకస్ చేసి, ఆ లైట్ పట్టుకొని గదిచుట్టూ తిరిగారు....గదిలోపలకు వెళ్ళే ఎంట్రన్స్ ఎక్కడా కన్పించ లేదు.

గది క్రింద గోడను పరీక్షగా చూసాడు జయరాం.... ఎక్కడన్నా పగుళ్ళుకాని....ప్రవేశ ద్వారపు మీటగాని దొరుకుతుందేమోనని .... కాని ఎక్కడా ఆ మార్గం దొరకలేదు....

అందరూ నిరాశగా ఏచ్చి కూర్చున్నారు....

ఏం చెయ్యాలో అర్థం కాలేదు....

ఎలా లోపలకు వెళ్ళాలి!

ఇంత కష్టపడి యిక్కడివరకు వస్తే ఈ వలయాకారపు గదిలో నిజంగా స్వర్ణసింహాసనం ఉందో లేదో....

క్షణకాలం ఆయన మనస్సు సందిగ్ధంతో ఊగిసలాడింది. జేబులో నుంచి కాపరు షీట్స్ తీసి పరీక్షగా చూసాడు. వలయాలకు మధ్యలో స్వర్ణ సింహాసనపు గదిని గుర్తు చేస్తూ బంగారపు కోటింగ్ గుండ్రంగా....

దాన్ని చూస్తున్న జయరాంకు హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చింది...

ఆ బంగారపు పొరను గీకేస్తే ఏదైనా క్లూ దొరుకుతుందేమో! అని మరుక్షణం ఆ పొరను గీకేసాడు జేబులో ఉన్న తాళం చెవితో.

బంగారు కోటింగ్‌పోయి....క్రింద ఆ స్థానంలో ఏదో మెరుస్తుంది. బాగా రుద్ది దాని వంక చూసాడు జయరాం....ఆ గుండ్రటి భాగంలో సగం వరకు సూర్యుడు బొమ్మ వుంది....

అది ఉదయిస్తున్న సూర్యుడా?

అస్తమిస్తున్న సూర్యుడా అర్థం కాలేదు!

దాని వంక చూస్తుండగా కపర్థి అన్నాడు.

"ఏమిటి జయరాంగారు....అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు"

ఆ కాపర్‌షీట్‌యిచ్చి....దానిలోబొమ్మ చూపించాడు.

ఇది సాయంకాలానికా, ఉదయానికా గుర్తు" అని అడిగాడు.

"ఇది సాయంకాలానికే గుర్తు" అన్నాడు కపర్థి.

"ఎలా చెప్పగలవు" అన్నాడు జయరాం....

"పశ్చిమ దిశలోని కిరణాలు పర్వత శిఖరం పైన తాకినప్పుడు.... కలశం మెరిసింది.... ఈ హజారా ఆలయం కూడా కొండకు పడమర దిశలోనే ఉంది....కాబట్టి సాయంకాలం అని భావించాను" అన్నాడు కపర్ది,

"ఇప్పుడు సమయం రెండు గంటలయింది....యింక మూడున్నర గంటలు వెయిట్ చేస్తేగాని సూర్యాస్తమయం కాదు"

"అప్పటి వరకూ మనం వెయిట్ చెయ్యాల్సిందేనా"

"తప్పదు...." అని జయరాం గోడకు ఆనుకొని క్రింద కూర్చున్నాడు....

మూడున్నర గంటల వరకు....మౌనంగా ఉండాలన్నా....వెయిట్ చెయ్యాలన్నా మిగతా వాళ్ళకు విసుగ్గా ఉంది....

"మనం వెళ్ళిపోయి రేపు వద్దాం" అన్నాడు యశ్వంత్.

"రేపు వచ్చినా....సూర్యోదయం అయ్యేటప్పుడుగాని ఈ గదిలోపలకు ఎంట్రన్స్ ఎక్కడుందో తెలియదు....అప్పటి వరకు వెయిట్ చెయ్యాల్సిందే"

కపర్ధి బ్యాగ్‌లో నుంచి టిన్డ్ కూల్‌డ్రింక్స్ తీసి సులోచనకు, ప్రియంవదకు యిచ్చాడు....చంద్రహాస్ తన బ్యాగ్‌లోనుంచి బిస్కెట్ ప్యాకెట్లు, పాప్‌కారన్ తీసి అందరికీ పంచాడు.

"కాస్త పేక ఆడుకుందామా" కపర్ది అన్నాడు.

"స్వర్ణసింహాసనం ముందు.... పేకాట....భలే ఉంది" అన్నాడు చంద్రహాస్....

ప్రొఫెసర్ జయరాం స్పెన్సర్ చుట్ట బైటికి తీసి.... వెలిగించబోయాడు.

"వద్దు ప్రొఫెసర్‌జీ.... ఈ వాతావరణంలో మీరు చుట్ట కాల్చకండి....ఎన్నో సంవత్సరాలుగా నిశ్చలంగా ఉన్న వాతావరణం.... అది మనకు మంచిదో....చెడ్డదో తెలియదు" అన్నాడు కపర్ధి.

అందరూ అతని మాటకు ఏకగ్రీవంగా ఆమోదించారు.

సిగార్‌ను మళ్ళీ జేబులో పెట్టేసాడు ప్రొఫెసర్ జయరాం....

కపర్ది పేకతీసి మిగతావాళ్ళతో ఆడటం ప్రారంభించాడు....

భూగర్భంలో.... కొండ అంతర్భాగంలో సరిగ్గా కేంద్రం దగ్గర కూర్చుని వాళ్ళు పేకాట ఆడుతున్నారు.

అంతకన్నా జోక్ ప్రపంచంలో ఉండదు.

కాలం మెల్లగా గడిచింది. సాయంకాలం అయ్యేవరకు కపర్ది, చంద్రహాస్, యశ్వంత్, ప్రియంవద మిగతా ఆడవాళ్ళందరు పేకాట ఆడారు.

ప్రొఫెసర్ జయరాం రాతిగోడకు ఆనుకొని కళ్ళు మూసుకున్నాడు.

సరిగ్గా సూర్యాస్తమయ సమయం....

ఇంతలో వలయాకారపు గది చుట్టూ ఉన్న కారిడార్‌లో ఓ చోట గుండ్రని తెల్లని వెలుగు పడింది....

ప్రొఫెసర్ జయరాం దాన్ని చటుక్కున గుర్తించాడు....

వెంటనే లేచి దాని దగ్గరకు వెళ్ళాడు....

ఆరు అంగుళాల వ్యాసంతో ఉన్న వృత్తకాంతి వలయం....

రూఫ్‌లోనుంచి వచ్చి పడుతున్నాయి ఆ కాంతి కిరణాలు.

సరిగ్గా ఓ ఇరవై సెకండ్లపాటు ఆ వృత్తకార వలయం పడి ఆ తర్వాత అదృశ్యమైంది.

"సూర్యాస్తమయం జరిగింది" అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

"ఈ ప్రాంతంలో పడటంలోని ప్రత్యేకత ఏమిటి?"

"ఇదే స్వర్ణసింహాసనానికిమార్గం" అని అక్కడ చేత్తో తడిమాడు.. మామూలు నేల అది....కొండరాతితో ఉన్ననేల....

ప్రొఫెసర్ జయరాం....జేబులోనుంచి చాకుతీసి....వలయం పడిన మేర చెక్కటం ప్రారంభించాడు.

చూడటానికి రాతినేలలా ఉన్నా....చాకుతో చెక్కుతుంటే బలపం పిండిలా రాతినేల తెగిపోతుంది.

ఖచ్చితంగా పదినిమిషాల తర్వాత....

నాలుగు అంగుళాల లోతు తవ్వాడు....

నాలుగు అంగుళాల లోపల ఓ యినుప గొళ్ళెం తగిలింది.

అది మ్మామూలు యినుప గొళ్ళెం కాదు.... నాలుగు వేళ్ళు లోపల పెట్టి పట్టుకోటానికివీలుగా ఉన్న హాండిల్ లాంటిది....నేలలో నిలువుగా దిగేసి వుంది.

ఆ హాండిల్‌ను పట్టుకుని తిప్పాడు తిరగలేదు.

మళ్ళీ యాంటీక్లాక్‌వైజ్‌లో తిప్పాడు....

భూనభూనంతరాళాలు దద్దరిల్లే టట్లు భయంకరమైన శబ్దం....

వలయాకారపు గది తలుపు తెరుచుకుంటుంది. రాతి తలుపు కావటంవలన, ఎన్నో సంవత్సరాల నుంచి మూసి ఉండటంవలన అది కదిలినపుడు ఓ విపరీతమైన శబ్దం వచ్చింది.

ఆ తలుపు తెరుచుకోవటంతో దేదీప్యమానమైన కాంతి ఓ ప్రవాహంలా తలుపులోనుంచి దూసుకువచ్చింది.

ఓ కాంతి ప్రవాహం....

అందరు కళ్ళు చెదరిపోయాయి....

ఎదురుగా ఉన్నది ఏమిటో ఒక్క క్షణం వాళ్ళకు అర్థంకాలేదు.

అంత భయంకరమైన కాంతి....

ఆ తర్వాత వాళ్ళ కళ్ళు ఆ కాంతికి అలవాటు పడ్డాయి....

ఆ వెలుగులో వాళ్ళు చూసిన దృశ్యం ఎంతో అద్భుతంగా ఉంది.

కొన్ని వందల సంవత్సరాల నుంచి మానవుడికి తన ఉనికి తెలియ పరచకుండా పర్వతగర్భంలో మరుగున దాగి ఉన్న స్వర్ణసింహాసనం అది!

శ్రీకృష్ణదేవరాయలు కలలుకని తయారు చేయించుకొని ఒక్కసారి కూడా అధిష్టించని పసిడి సింహాసనం అది.... చరిత్ర పుటల్లో దొరకని.... చరిత్రకెక్కని అమూల్య రత్న సింహాసనం అది....

చరిత్రలో ఉందో లేదో అని మీమాంసపడే విక్రమాదిత్య సింహా

సనంలా తయారుచేయబడ్డ రాయలు అపురూపమైన బంగారు సింహాసనం అది....

అందరూ కళ్ళు తెరుచుకొని మరబొమ్మల్లా ఆ అద్భుత సింహాసనం వంక చూసారు....

ముప్పైరెండు మెట్లతో....మెట్టుకు అటువైపు,యిటువైపు శాలభంజికలతో తయారుకాబడ్డ స్వర్ణసింహాసనం అది....

ఆ గది మధ్యలో ఉంది ఆ సింహాసనం....

దానిమీద కప్పబడి ఉంది అర్ధగోళాకృతిలో ఉన్న గాజు గోళం....

ఆ గాజుగోళంలో ఉంది ఆ సింహాసనం....

అద్భుత అపూర్వ అ(క్రమమయమైన మహత్తర సింహాసనం....

దాని పీఠమే ఐదు అడుగులు ఉంది....

ఐదు అడుగులపైన వరకు మెట్ల వరుసలు.... ఆ తర్వాత అధిరోహించే సింహాసనం....

తల ఎత్తి పైకి చూసారు....

ఈ సింహాసనంపై ఈ గాజు గోళం ఎవ్వరు ఏర్పాటు చేసారు...?

అర్థం కాలేదు....

గదంతా ఆ గాజుగోళం ఆక్రమించి కేవలం అడుగున్నర స్థలం మాత్రం వలయాకారపు బాటలా ఉంది.... ఆ అడుగున్నర స్థలం మినహా అంతా గాజు గోళం ఆక్రమించి ఉంది.

ఆ గాజు కవరింగ్ ఖచ్చితంగా అర్థగోళంలా లేదు....

క్రిందనుంచి ఏడు అడుగులవరకు స్థంభాకారంలో లేచి....

ఆ పైన అర్థగోళంగా సింహాసనాన్ని కవర్ చేస్తుంది....

సింహాసనంపైన బోర్లించిన బెల్‌జార్‌లా వుంది ఆ గాజుగోళం....

సింహాసనం క్రింద భాగంలో చుట్టు ప్రక్కల....రత్నాలు, వజ్రాలు, వైడూర్యాలు రాసులుగా పోసి ఉన్నాయి....

బసవన్న, ఈశ్వరాచార్యులు సంయుక్తంగా తయారుచేసినఅద్భుత సింహాసనం అది....

పైన ఉన్న గాజు గోళాన్ని ఎలా తయారుచేసాడు ఈశ్వరాచార్యులు....

అర్థం కాలేదు....

ఆ ప్రాంతంలో తయారుచేసిన సామానులు కాని....అందుకుసంబంధించిన పరికరాలు లేవు....

"మార్వలెస్....అద్భుతం....వీరాచార్యులు వ్రాసిన విషయం అక్షర సత్యం...."

ఆ సింహాసనాన్ని చూస్తూ అన్నాడు కపర్థి....

ఆయన వెళ్ళి ఆ గాజు గోళం తాకాడు....

చాలా కఠినమైన గాజుతో తయారుచేసారు అది....

వలయాకారపు బాటలో తిరిగి మళ్ళీ ద్వారం దగ్గరకు వచ్చాడు చంద్రహాస్....

"ఈ సింహాసనం తీసుకువెళ్లాలంటే.... ఈ గాజును బ్రేక్ చెయ్యాలి"

"ఈ గాజు అన్ బ్రేకబుల్ అని నా నమ్మకం" అన్నాడు ప్రొఫెసర్ జయరాం.... "ఎందుకని" అన్నాడు కపర్థి.

"కేవలం....చేత్తోగాని గట్టి వస్తువుతో తాకితే పగిలిపోయేంత సున్నితంగా చేసి ఉండరు—"

తన దగ్గర ఉన్న వెబ్లర్ మిషన్ పిస్టల్‌తో దానిమీద కొట్టాడు.

"ఠంగు"మని మ్రోగింది.

"ఇది గ్లాసు కాదు. గ్లాసులా అన్పించే లోహం.... ఈ లోహం దేనితో తయారుచేసారో అర్థం కావటంలేదు" అన్నాడు కపర్థి....

"ఈ సింహాసనం చుట్టూ యిన్ని గదులు ఎందుకు" అడిగాడు చంద్రహాస్

"శత్రువుల నుంచి తప్పించుకొని కొన్నాళ్ళపాటు జీవించటానికి అనుకూలంగా తయారుచేసి ఉంటారు. సైన్యంతో, స్త్రీలతో ఉండటానికి అనువుగా తయారు చేసారు." అన్నాడు ప్రొఫెసర్ జయరాం....

యశ్వంత్ ఆ దృశ్యాన్ని నమ్మలేనట్లు చూసాడు....

అతను మనస్సులో ఏదో పథకం మెరిసింది....

చటుక్కున అతను అక్షత దగ్గరకు వెళ్ళాడు....

అక్షత ప్రియంవద వెనక ఉంది. కపర్ది ప్రొఫెసర్ జయరాం, చంద్రహాస్ సింహాసనం గదిలో ఉన్నారు.

గుమ్మం దగ్గర సులోచన, ప్రియంవద, అక్షత ఉన్నారు.

చటుక్కున జేబులో నుంచి రివాల్వర్ తీసి అక్షత నుదుటమీద పెట్టాడు....

"మిష్టర్ ప్రొఫెసర్ జయరాం" అతని కంఠం కరుగ్గా పలికింది....

"యశ్వంత్ ఏమిటిది" కంగారుగా అంది అక్షత

అందరూ యశ్వంత్ స్వరానికి వెనక్కితిరిగి చూసారు.

అక్షత నుదుట రివాల్వర్‌తో యశ్వంత్... అతని కళ్ళు రాక్షసంగా పరమకిరాతకంగా ఉన్నాయి.

యశ్వంత్ ఏమిటిది... నీకేమన్న పిచ్చెక్కలేదు కదా" కంగారుగా అన్నాడు ప్రొఫెసర్ జయరాం.

"ప్రొఫెసర్ జయరాం నీజేబులో ఉన్న కాపర్ షీట్స్,కంప్యూటర్ షీట్స్.... మర్యాదగా యివ్వు, లేకుంటే నీ ముద్దుల కూతురు అక్షత ప్రాణాలు నాచేతిలో ఉన్నాయి." యశ్వంత్ కంఠం కర్ణ కఠోరంగా పల్కింది. యశ్వంత్ వంక విభ్రాంతిగా చూసాడు ప్రొఫెసర్.

"యశ్వంత్.... నువ్వు.... నువ్వు.... ఈ సింహాసనం చూసి మతి భ్రమించలేదు కదా!" అయోమయంగా అన్నాడు జయరాం.

కన్నకొడుకులా చూసుకున్న యశ్వంత్ అంతహఠాత్తుగా ఎందుకలా మారాడో ఆయనకు అర్ధం కాలేదు.

ఏమిటి అతనిలో సడన్ మార్పు....

"నేను పిచ్చి వాడ్ని కాదు ప్రొఫెసర్.... మీరు పిచ్చి వాళ్ళు.... నేను మొదటి నుంచి మీ దగ్గర రిసెర్చ్‌కు జాయినైయినది కూడా అపూర్వ విగ్రహాల గురించి....తెల్సుకోవాటానికే.... యిన్నాళ్ళకు నాపంట పండి.. ప్రపంచంలో అతిఖరీదైన బంగారు సింహాసనం నాకు దక్కింది" ఒక్కసారి నమ్మలేనట్లు చూసాడు ప్రొఫెసర్....

అతని అంతరంగం యశ్వంత్ నమ్మక ద్రోహానికి ముక్కలై పోతుంది.

"మీ ఎక్సకవేషన్స్‌లోని అపూర్వవిగ్రహాలు అప్పుడప్పుడు ఎందుకు మాయమైపోతుండేవో.... మీకుతెలుసా....! అడిగాడు యశ్వంత్

నిరుత్తరుడై చూస్తున్నాడు ప్రొఫెసర్....

"అవి నేను మాయం చేసేవాడ్ని.... ఆ విగ్రహాలు.... ఈ దేశం దాటి మరో దేశం తరలి వెళ్ళిపోయాయి...."

"స్మగిలింగ్....

అపూర్వమైన విగ్రహాల స్మగ్లింగ్!

తన ప్రక్కనే ఉంటూ తన పరిశోధనలో పాలు పంచుకుంటూ అద్భుతమైన విగ్రహాల్ని దొంగిలించి విదేశాలకు స్మగుల్డ్ చేస్తున్నాడు యశ్వంత్. ఆ ఆలోచననే భరింపలేక పోతున్నాడు ప్రొఫెసర్.

"యూ.... చీట్...." ముందుకు కదలబోయాడు.

"ఆగు.... అడుగుముందుకు వేస్తే హతమారిపోతుంది నీ ముద్దుల కూతురు...."

"ఆ షీట్స్ నాకుయివ్వు" కర్కశంగా పల్కింది యశ్వంత్ కంఠం.

ప్రియంవద నిశ్చేష్టురాలైంది....

అక్షత కళ్ళల్లో కన్నీళ్ళు....

ఇలాంటి దేశద్రోహినా తాను ప్రేమించింది!

ఇలాంటి దౌర్భాగ్యుడ్ని తన ప్రాణాలు వెచ్చించి రక్షించింది.

షాక్!

షాక్!

షాక్!

స్వర్ణ సింహాసనం చూసినదాని కన్నా భయంకరమైన షాక్ అది.

ప్రొఫెసర్ కళ్ళముందు ఒకో పొర తొలిగిపోయింది.

"అడవిలో తనను వెంటాడటం.... తన మీద కాల్పులు.... చంద్రహాస మీద కాల్పులు జరిపింది యశ్వంత్ తాలుకు వాళ్ళే ఇటీజ్ ఎ

ప్రీప్లాన్డ్ ఎరేంజ్ మెంట్.... ఎక్సకవేషన్‌లో కాపర్ షీట్స్ దొరికిన రాత్రి తన యింట్లో జరిగిన దొంగతనం యశ్వంత్ చేసిందే"

"అయితే మా ప్రయత్నాలకు ముందునుంచి అడ్డుపడుతున్నది నువ్వేనన్న మాట" కపర్ధి కదులుతూ అన్నాడు. అతన్ని కనుచివరల నుంచి గమనిస్తూ

"డోంట్ మూవ్ కపర్ధీ....నీ నక్కజిత్తులు నా దగ్గర వద్దు.... ఎప్పుడైతే నువ్వు ఈ ఎసైన్‌మెంట్‌లో జాయినవుతున్నావు అనివిన్నాను మా బాస్ చేత నిన్ను తప్పించటానికి ప్రయత్నించాను....నువ్వు ప్రొఫెసర్ జయరాం దగ్గరకు బయల్దేరిన రోజు నిన్ను వెంటాడిన వాహనం మాదే" కళ్ళల్లో విచిత్రమైన శాడిజం కనపడుతుండగా అన్నాడుయశ్వంత్.

"నువ్వు చాలా సమర్ధుడవని తెలుసు....మున్ముందు మాకు అడ్డుపడతావని ఊహించే....నిన్ను అడ్డు తప్పించుకోవాలనుకున్నాం....కాని అది మాకు సాధ్యపడలేదు...."

"చంద్రహాస్‌ను.... ఎందుకు చంపబోయావు...." అడిగాడుకపర్ధి.

"చంద్రహాస్ నన్ను అనుమానించాడు. అందుకే అతన్ని చంపివేయాలనుకున్నాను....ఒక దశలో జయరాంను తొలగించి ఆ కాపర్‌షీట్స్ ద్వారా ఎక్సపెడిషన్ మేమే చెయ్యాలనుకున్నాం....కానీ జయరాం ఈ ఎసైన్‌మెంట్ సాధిస్తాడు అని నేను ఖచ్చితంగా చెప్పిన తరువాతే గురుస్వామి ఆ ప్రయత్నాలు విరమించుకుంది...." యశ్వంత్ ఒక్కోనిజం చెప్తున్నాడు. ఆ నిజం ఒక్కో బాంబ్‌షెల్‌లా వాళ్ళందరినీ ముంచెత్తుతుంది

"గురుస్వామా....అతనెవరు...." అడిగాడు చంద్రహాస్....

"పాపులపాలిట పుణ్యమూర్తి....ఈ దేశంలో భగవంతుడి అవతారంగా పూజించే స్వామి పరమహంసయే....గురుస్వామి....స్వామి వేషములో అనేక దేశాలు తిరిగి....ఆయన విగ్రహాలు ఆర్డర్స్ తెస్తాడు. మేం వాటిని అమ్మిపెడతాం...."

ఉత్కంఠ

భయంకరమైన ఉత్కంఠ

స్వామి పరమహంస భయంకరమైన స్మగ్లర్!

ఈ దేశంలో దేవుడి పేర, మతం పేర, ఆధ్యాత్మికత పేర మనుష్యుల పైన మత్తుచల్లి ....చీకటి వ్యాపారం చేస్తున్నారు కొందరు దోపిడి దొంగలు, పరమ హంస కూడా అటువంటి దొంగేనా! అటువంటి నయవంచకుడేనా!....

ఆలోచనలతో వేడెక్కి పోతుంది ప్రొఫెసర్ బుర్ర.

"ప్లీజ్....ప్రొఫెసర్....నాకు సమయం లేదు....ఆ షీట్స్ఇవ్వండి"

జయరాం జేబులో నుంచి షీట్స్ తీసి యిచ్చాడు.

అవి ప్రియంవద యశ్వంత్‌కు అందించింది....

"అక్షత ప్లీజ్ మూవ్...."

"డోంట్....డూ ఎనీ థింగ్ మై చైల్డ్" ఆవేదనగా అన్నాడు జయరాం.

"నీ కూతుర్ని నేనేం చేయను. బయటకు వెళ్ళే వరకు నీ కూతురు నాకు రక్షణ" ఆమెను తీసుకొని ఐదో వలయం గదిలోకి కదిలాడు....

"ఎవరన్నా నన్ను ఫాలో కావాలని ప్రయత్నిస్తే....ఈ రివాల్వర్‌తో అక్షతను షూట్ చేస్తాను" అతని కంఠం మారు మ్రోగింది. ఐదో వలయములోకి యశ్వంత్, అక్షత కదలగానే....

కపర్థి వెల్డర్ మిషన్ పిష్టల్ తీసి ముందుకు కదిలాడు....

"కపర్థి....నువ్వు వెళ్ళకు....వాడు అక్షతను ఏదైనా చెయ్యొచ్చు."

"బాస్టర్డ్....వాడి రక్తం తాగుతాను" కపర్థి కోపంగా అన్నాడు....

అక్షత, యశ్వంత్ చకచకా బయటికొచ్చేసారు....

వాళ్ళకు ఐదు నిముషాలు పట్టింది....

వైరు బల్బులు వెలుగుతూ ఉండటం వలన దారి స్పష్టంగా కన్పిస్తుంది....

"ఇక నువ్వు లోపలకు వెళ్ళొచ్చు" అన్నాడు యశ్వంత్.

"యూ ఛీట్....నన్ను ప్రేమించినట్లు నటించింది యిందుకా...." ఉక్రోషంగా అంటె అక్షత....

"నాకు ప్రేమ, దోమా అనేవి తెలియదు....నాకు కావాల్సింది డబ్బు....నువ్వు మర్యాదగా లోపలకు వెళ్ళు ....లోపలికి వెళ్ళకపోతే నేనేం చేస్తానో....నాకు తెలియదు...." ఆమె వంక రివాల్వర్ ఎత్తాడు. ట్రిగ్గర్ నొక్కబోయాడు. అక్షత లోపలకు నడిచింది....వలయాకారపు గదిలోకి నడిచింది. అక్షత లోపలకు వెళ్ళగానే....బల్బులున్న వైరు పట్టుకొని చటుక్కున లాగాడు. వైరు మధ్యలో ఫట్ మని తెగిపోయింది. బల్బులు ఆరిపోయాయి....ఆ భవనాంతర్భాగంలో చీకటి....లాగిన వైరును అక్కడే పడేసి....చక్రం తిప్పాడు....

ధడధడమని శబ్దం చేస్తూ మూసుకుపోయింది పద్మవ్యూహం ముందున్న రాతి పలక....మూసుకుపోయిన రాతి పలక మీద హరిహరుల బొమ్మ అభయం యిస్తున్నట్లు కన్పిస్తుంది.

## 20

తలుపులు మూసుకుపోగానే యశ్వంత్

మరుక్షణం సొరంగంలో నడక ప్రారంభించాడు.

సొరంగం చివరకు చేరుకొని అక్కడ చక్రం తిప్పి విఘ్నేశ్వరుడి కడుపులో నుంచి బయటపడి....విఘ్నేశ్వరుడి ఒంటి కొమ్ము పైకి అని..

ఆయన ఉదరం మూసుకుపోగానే....బయటికి వచ్చాడు.

చల్లటి చలిగాలి రివ్వున వచ్చి అతన్ని తాకుతుంది.

మరుక్షణం వైర్‌లెస్ తీసి యాక్టివేట్ చేసాడు....

"ఏజంట్ వై స్పీకింగ్....ఏజంట్ వై స్పీకింగ్"

పరమహంస ఆ కాల్ రిసీవ్ చేసుకున్నాడు. పరమహంస ప్రస్తుతం కాళీచరణ్ గుడారంలో ఉన్నాడు. అతని ప్రక్కనే విన్సెంట్....

"యస్....పరమహంస స్పీకింగ్...." అన్నాడు పరమహంస....

"ఆపరేషన్ గోల్డెన్ థ్రోన్ ఓవర్....మిషన్ పూర్తైంది....గోల్డెన్ థ్రోన్ కనపడింది" చెప్పాడు యశ్వంత్....

ఉత్కంఠ! షాక్,

గోల్డెన్ థ్రోన్ దొరికింది అనగానే పరమహంస ఆనందం పట్టలేక పోయాడు....అతనికి పూర్తిగా నమ్మకం కలగలేదు.

"నిజంగా, నిజంగా గోల్డెన్ థ్రోన్ నువ్వు చూసావా"

చాలా ఉద్విగ్న భరితమైన క్షణాలు....

పరమహంస నరాలు విపరీతమైన టెన్షన్‌తో ఊగిపోతున్నాయి.

"రియల్లీ....సార్....ఐ హేవ్ సీన్ గోల్డెన్ థ్రోన్...."యశ్వంత్ కంఠంలో నిజాయితీ....

"ఓ.కే....నువ్వు ఎక్కడికి వెళ్ళొద్దు అక్కడే ఉండు....నేను.... వెంటనే వస్తున్నాను....బై ది బై జయరాం బ్యాచ్ ఏమైంది" కుతూహలం ఆపుకోలేక అడిగాడు....

"గోల్డెన్ థ్రోన్ చుట్టు భయంకరమైన పద్మవ్యూహం సార్.... దానిలో చిక్కుకు పోయారు....దాన్లో నుంచి తప్పించుకోవటం అసంభవం" చెపుతున్నాడు యశ్వంత్....

ఈ మాటలు వినే పరిస్థితిలో లేడు పరమహంస....

గోల్డెన్ థ్రోన్ సాధించాం అని యశ్వంత్ అనగానే అతనిలో రాక్షసమైన ఆనందం నిద్రలేచింది....ప్రతి మనిషిలో ఉండే లోభం అనే రాక్షసత్వమే అది....

పరమహంసలో మారుతున్న భావాలు గమనించాడు కాశీచరణ్....

"కాశీ....గోల్డెన్ థ్రోన్ యిక మన వశం అయినట్లే....అదెక్కడుందో ఏజంట్ వై కనిపెట్టాడు" అన్నాడు పరమహంస సంతోషంగా.

తన దగ్గర పనిచేసే గూఢచారుల్ని ఎప్పుడు పేరుతో పిలవడు పరమ హంస....వాళ్ళ పేరులోని మొదటి అక్షరంతో పిలుస్తాడు. అందుకే యశ్వంత్‌ను ఏజంట్ "వై" అని సంబోధిస్తాడు....

"విన్సెంట్....గోల్డెన్ థ్రోన్ ఎక్కడుందో తెలిసింది....వెంటనే మనం అక్కడికి వెళదాం...." అన్నాడు ఆనందంగా.

విన్సెంట్ అతని వంక ఆశ్చర్యంగా చూసాడు.

"నిజంగా గోల్డెన్ థ్రోన్ లభించిందా" అన్నాడు.

"యింకో గంటలో నువ్వే చూస్తావుగా" అని కాళీచరణ్ వంక తిరిగి

"కాళీ....యిమ్మీడియట్‌గా మనం స్పాట్‌కు వెళ్ళాలి....బయలు దేరు....బై ది బై....అందర్నీ సిద్ధం చేసావా?" అడిగాడు....

"అందర్నీ సిద్ధం చేసాను....కాని అక్కడికి కాలినడకన వెళ్ళటం అసాధ్యం...."

ఒక్కసారి పరమహంస ముఖం తెల్లగా పాలిపోయింది....

"మరి ఎలా అక్కడికి చేరుకోవటం...." ఆందోళనగా అన్నాడు పరమహంస.

"హెలికాప్టర్స్ ద్వారా మనం అక్కడికి చేరుకుంటాం...."

"ఓ.కే....మనం బయల్దేరదాం" అన్నాడు....

కాళీచరణ్ చప్పట్లు కొట్టాడు. ఇంతలో ఓ అనుచరుడు వచ్చాడు...

"అన్నీ సిద్ధం అయ్యాయా?" అడిగాడు....

"అన్నీ సిద్ధం అయ్యాయి....సెర్చిలైట్లు....డార్ట్‌గన్స్....మెగ్నీషియం గన్స్....మిషన్ గన్స్....అన్నీ సిద్ధంగానే ఉన్నాయి...." అన్నాడు ఆ అనుచరుడు.

"గునపాలు....గొడ్డళ్ళు....తాంబులు కూడా సిద్ధం చేయమన్నాను. చేసారా!"

"అవన్నీ....మరో హెలికాప్టర్‌లో వస్తున్నాయి" అన్నాడు వినయంగా

"ఓ.కే....నువ్విక వెళ్ళవచ్చు" అన్నాడు.

ఆ అనుచరుడు వెళ్ళిపోయాడు.

"అన్నీ సిద్ధంకాగానే మనం బయల్దేరదాం...." అన్నాడు

అందరూ బైటికి వచ్చారు. అక్కడ వాళ్ళ కోసం నాలుగు హెలికాప్టర్స్ ఉన్నాయి. మూడు హెలికాప్టర్స్ నిండా అతని అనుచరులు ఉన్నారు.

విన్సెంట్— కాళీచరణ్, పరమ హంస ఓ హెలికాప్టరు ఎక్కారు

"ఎక్కడికి సాబ్" అడిగాడు డ్రైవర్....

"పచ్చ కొండ దగ్గరకు"

మరుక్షణం హెలికాప్టర్లు ఆకాశంలోకి లేచాయి.

అప్పటి వరకు గెస్ట్‌హౌస్ దగ్గర నిలబడి ఉన్న గంగన్న కోయ గూడెంలోకి పరిగెత్తాడు—

అతని ఒళ్ళు మండి పోతుంది.

తాముదేవుళ్ళా కొలుచుకొనే కాళిచరణ్ తమకు పరమ పవిత్రమైన పచ్చకొండలో రక్తపాతం సృష్టించటానికి బయల్దేరాడు....

దాన్ని ఆపాలి— పచ్చకొండ దేవతకు ఏ అన్యాయం జరక్కూడదు.

అతను వేగంగా గూడెం చేరుకున్నాడు....

నాయకుడు దగ్గరకు వెళ్ళాడు....

"దోరా.... దోరా.... అన్యాయం జరిగిపోతుంది...." అన్నాడు ఆందోళనగా, కంగారుగా....

"ఏంది గంగన్నా.... ఏంజరిగింది" అన్నాడు నాయకుడు....

"కాళిదొరగారు.... పచ్చకొంత నాశనం సెయ్యడానికి మనుసుల్ని తీసుకెళ్ళాడు" ఆందోళనగా అన్నాడు.

చటుక్కున తన ఆసనం మీద నుంచి దిగ్గునలేచాడు. అదేసమయంలో పుల్లి లోపలకి వచ్చింది....

అమ్మ.... పచ్చకొండ దగ్గరకి... కాళిదొర మడుసుల్తోఎల్లాడమ్మా అక్కడ గుడిని, అమ్మోరిని నాశనం సెయ్యటానికి బందూకులు తీసుకెల్లాడు" పుల్లిని చూస్తూ అన్నాడు.

పుల్లి వెంటనే రియాక్టయింది.

"బాబా.... కాళి.... చాలా దుర్మార్గుడు బాబా.... మనం వాడ్ని ఎదుర్కోవాలి. మనకులదైవమైన హజరమ్మ తల్లి గుడిని బాంబులు, బందూకులతో ఆడు నాశనం చేస్తాడు బాబా"

ఒకసారి దిగ్గున లేచాడు గూడెం నాయకుడు.

"ఎవర్రా అక్కడ....గూడెం అంతా.... సమావేశం కమ్మనిచెప్పు అమ్మోరి తల్లి పిలుస్తుందని చెప్పు...."

మరుక్షణం అమ్మోరి తల్లి ముందున్న డప్పు నిరవధికంగా మోగింది....

గూడెంలో ఉన్నా చిన్నచితకా పెద్దలు ........ అందరూ ఆ డప్పు మోతవినగానే అమ్మోరి విగ్రహం ముందు సమావేశం అయ్యారు ....

పుల్లీ....ఆగ్రహంతో ఊగిపోతుంది....

ఆమె కళ్ళ ముందు కాళీచరణ్....

"కాళీచరణ్.... ఈసారి మాత్రం నా చేతినుంచి తప్పించుకోలేవు" ఆగ్రహంతో ఊగిపోతున్న పుల్లీకి, ధూపాలు, దీపారాధన చేశారు ....పుల్లీ ఊగిపోతుంది....

"మన వల్లె.... బతుకుతున్న బానిసోడు .... మనకే ఎన్నుపోటు పొడిసాడు....మన అమ్మోరి తల్లిని అవమానించటానికి పచ్చకొండ దగ్గరకు ఎల్లాడు.... బాంబులు, బందూకులతో పచ్చకొండను పేల్చాయాలని సూత్తున్నాడు.... ఎల్లండి.... అమ్మోరి గుడి కాపాడండి....

పచ్చకొండను పేల్చేయక ముందే ఆళ్ళను సంపేయండి"

పుల్లీ ఆగ్రహంలో అంటున్న మాటలువాళ్ళకు బుల్లెట్ల తగిలాయి....

అటవికులు ఏదైనా భరిస్తారుగాని .... తమ నమ్మకాల్ని అవమానించినప్పుడు మాత్రం భరించలేరు....

అదే జరిగింది ఇప్పుడు....

పచ్చకొండ దగ్గరకు కాళీ ఎప్పుడు వెళ్లాడో....

అప్పటి వరకు కాళి దేవుడు, ఆతర్వాత వాళ్ళ దృష్టిలో శత్రువు....

వాళ్ళ శత్రువును చంపటంలో మూకుమ్మడిగా దెబ్బతీస్తారు

పుల్లీ చేసింది అదే!....

బాగా రెచ్చగొట్టి అటవీకులందర్ని కాళీచరణ్ మీద ఉసికొల్పింది....

కత్తులు, కటారులు, బల్లాలు, గండ్రగొడ్డళ్ళు తీసుకొని బయలు దేరుతున్నారు. ఓ మహాప్రభంజనం కదిలింది....

ఓజన చైతన్యం విరిసింది....

ఈ రకమైన తిరుగుబాటు తనమీద చెలరేగుతుందని తెలిసి దాన్ని ఎదుర్కోటానికి అన్నీ సిద్ధం చేసుకొని ఉన్నాడు కాళీచరణ్.

చిన్న నాయకుడు వికృతంగా నవ్వాడు
అతని ముందు ఏడుగురు అనుచరులున్నారు.

వాళ్ళంతా యిప్ప సారా తాగి ఉన్నారు....

"రేయ్.... మన "పుత్లీ" మనల్ని నాశనం చేసింది. పచ్చకొండ దగ్గరకు నాగరీకుల్ని తీసుకువెళ్ళింది"

"ఈ విషయం మీ అయ్యతో చెప్పకపోయారా" అడిగాడు....

"మా అయ్య నామాటయినడు.... ఆడికి పుత్లీ మాట వేదవాక్కు"

"అయితే ఏం చేద్దాం దొరా" అడిగాడు ఓ అనుచరుడు.

"పుత్లీ పచ్చకొండ దగ్గరకు ఎళ్ళింది........దాన్ని సంపేసి .... ఆ నాగరీకుల్ని అక్కడే నరికేద్దాం....

"అట్టాగేదొరా....అన్నాడు ఓ అనుచరుడు.

"మీ అయ్యకు తెలిత్తే"

"ఆడ్ని కూడా పనిలో పనిగా పొడిచేద్దాం .... ఆడి తర్వాత నేనేగా నాయకుడ్ని"

విభ్రాంతిగా చూసారు అనుచరులు.

నాయకుడి మాట వినటం తెల్సుకాని వాళ్ళకు వ్యతిరేకించటం తెలీదు....

కానీ చిన్న నాయకుడు తండ్రినే చంపేస్తానంటున్నాడు....

అది వాళ్ళు ఊహించలేని విషయం.

"తప్పు దొరా.... అన్నాడు ఓ అనుచరుడు....

"నోరు ముయ్యరా కుయ్యా ........ నాతో వచ్చేవాళ్ళకు నా నాయకత్వంలో పెద్ద పెద్ద పదవులిస్తాను.... నచ్చిన పెట్టను మీకు సొంతం చేస్తాను... పట్టం సారా సీసాలు మీ యింట్లో పెడ్తాను" అన్నాడు.

ఆ మాటలు అనగానే ఒక్కసారిగా అందరూ పెదాలు తడుపుకున్నారు....

"అట్టాగేదొరా.... మీరేం చెయ్యమంటే అదే చేస్తాం....

"అయితే పదండిరా.... ఆ పుత్లీని చంపి.... ఆపట్టం వాళ్ళనూ నరికేద్దాం పదండిరా" అందరూ కదిలారు

సరిగ్గా అప్పుడు ఆకాశంలో చుక్కలు పొడిచాయి....

సంధ్య వెళ్ళిపోయి, నిశిదేవత తన చీకటి ముసుగును సవరించు కుంటూ వచ్చింది. అడవి, కొండలు చీకటిలో మునిగిపోయి ఉన్నాయి.

ఆ చీకటిలో పుల్లీ, ఆమెవెనక అటవీకులు కదులుతున్నారు.

సరిగా ఆదే సమయంలో

వలయాకారపు గదిలో ఒంటరిగా నిలబడిపోయింది అక్షత....

యశ్వంత్ తలుపులు క్లోజ్‌చేసి వెళ్ళిపోయాడు....

అటు ముందుకు వెళ్ళలేదు,

యిటు వెనక్కీ రాలేదు,

ఓ విచిత్రమైన మానసిక పరిస్థితిలో పడిపోయింది అక్షత.

తనుదారి తప్పానని ఆమె బాధపడటంలేదు....

ఓ దుర్మార్గుడ్ని ప్రేమించాననే బాధకు, ఆవేదనకు లోనైంది.

తన తండ్రి ఎంత సిన్సియర్ జంటిల్‌మన్ తనకు తెలుసు....

అటువంటి తనతండ్రి కూడా యశ్వంత్‌కు తనపట్ల ప్రేమఉందని తెలిసి ఎటువంటి పరిస్థితిలో కూడా తనని కట్టడి చేయలేదు....

తనే !

తనే! ఓ "ఛీట్" ని ప్రేమించింది.

తన జీవితానికి నిష్కృతిలేదు....

తన తండ్రి జాలిచూపులు తనుభరించలేదు.

అంతకన్నా ఈ పద్మవ్యూహంలో జొరబడి,దారితెన్ను లేక తెలియక మరణించడమే మంచిది....ఆ నిర్ణయం ఆమె మనస్సులో కదలగానే మరు క్షణం వలయాకారపు గదిలోనుంచి మరో గదిలోకి అడుగువేసింది.

చీకటి ।

కటిక చీకటి !

యుగయాగాల, తరతరాల అజ్ఞాన తమస్సు ఘనీభవించినట్లు చీకటి....

ఆమె గదిలోనుంచి మరో గదిలోకి వెళుతుంది.

ఎటు వెళుతుందో ఆమెకు తెలియదు....

ఈ మనుష్యులకు దూరంగా, మరణమనే గమ్యాన్ని వెతుక్కుంటూ వెళ్తుంది.

చీకట్లో.... ఆమె కదలిక ఎవ్వరికీ కనిపించటం లేదు?

ఆమె చీకటిలో చీకటై కలసిపోయి....

భూమికి కొన్ని అడుగుల దూరంలో, పర్వతగర్భ కుహరంలో పద్మవ్యూహంలాంటి గదుల్లోకి దారితెన్నులేక కదులుతుంది.

## 21

సరిగ్గా అదే సమయంలో....

స్వర్ణ సింహాసనం దగ్గరున్న కపర్థి కదిలాడు అసహనంగా....

యశ్వంత్ వైరులాగగానే దారిలో వున్న లైట్లు ఆరిపోయాయి....

బాస్టర్డ్....మనం వాడ్ని ఫాలో కాకుండా దారి బ్లాక్ చేసాడు" కోపంగా అన్నాడు కపర్థి....

"అక్షతా....మై ఛైల్డ్....ను వాడేం చేస్తున్నాడో...."బాధగాఅన్నాడు ప్రొఫెసర్ జయరాం....

"ప్రొఫెసర్ జీ....నేను వెళతాను....అక్షతను తీసుకువస్తాను"

అతని కంఠంలో ధృఢత్వం కన్పిస్తుంది....

"నో....కపర్థి....ఇది భయంకరమైన "మేజ్"....దీనిలో చిక్కితే మనం భయపడ్డ అంత జరుగుతుంది....అక్షతను కనుక్కోలేం సరికదా.... ఈ పర్వత గర్భంలో చిక్కుకుపోతాం" అన్నాడు జయరాం ఆవేదనగా.

"యశ్వంత్ అంత హఠాత్తుగా మారిపోతాడని....

అతనో ఏజంటు అని ఆయన కనీసం ఊహించలేదు....

కానీ స్వర్ణసింహాసనం కంటపడగానే గోవులాగా ఉండే యశ్వంత్ వ్యాఘ్రంలా మారిపోయాడు.

ధనం కోసం, సంపద కోసం మనుష్యులు మృగాలుగా మారిపోతారని చదివాడుగాని ప్రత్యక్షంగా యిదే చూడడం. అందునా తన ప్రియమైన కూతురు ఆ బాస్టర్డు చేతిలో వుంది....

"మన దగ్గర వైర్‌లెస్ సెట్లు ఉన్నాయి. మనం "మేజ్"లో దారి తప్పినా మన డైరక్షన్ ఫైండర్స్ ద్వారా....సరి అయిన స్పాట్‌కే చేరుకో గలం...." అన్నాడు కపర్థి....

ఆ మాట అనగానే ప్రొఫెసరు ముఖంలో కళ తిరిగి వచ్చింది.

"అయితే....నేను—వెళతాను...." అని ధృఢంగా అన్నాడు.

కూతుర్ని దక్కించుకోవాలనే ఆరాటం ఆయనలో వుంది....

"యశ్వంత్ ఆమెను బైటికి తీసుకు వెళ్ళి ఉంటాడంటావా"? అడి గాడు అనుమానంగా ....

"బైటికి తీసుకువెళ్ళినా, లోపల ఉంచినా....మనం బయటపడే మార్గం చూడాలి....కమాన్...." అన్నాడు కపర్థి....

"అయితే ఏం చేద్దాం...." అడిగాడు జయరాం....

"నేను, సులోచన ఓబ్యాచ్‌గా, మీరు, చంద్రహాస్, ప్రియంవద ఓబ్యాచ్‌గా ఈ పద్మవ్యూహంలో దారికోసం వెతుకుదాం...." అన్నాడు కపర్థి.... ఆ ఆలోచన అతనికి నచ్చింది....

"లేదు.... నేను ఒక్కడినే వెతుకుతాను.... మీరు. . రెండు బ్యాచ్ లుగా పదండి"

జయరాం కంఠంలో ధృఢనిశ్చయం....

"మీ వైర్‌ల్‌స్‌సెట్స్‌కు డైరక్షన్ ఫైండర్స్ అమర్చుకోండి.... మనం ఈ"మేజ్"లో దారి తప్పినా....వాటి ద్వారా ఓచోటకి చేరుకోవచ్చు

ఆ మాట పూర్తి కాగానే.... ఓ పవర్‌ఫుల్ బ్యాటరీ తీసుకొని వలయంలోకి అడుగు పెట్టాడు జయరాం, ఆయనకోటు జేబులో రివాల్వర్ వుంది.... మరో జేబులో వైర్‌లెస్ సెట్ వుంది....

ఆయనలో కదులుతున్న ఆవేశాన్ని చూసి చిన్నగా నిట్టూర్చాడు చంద్రహాస్.... సింహంలాబ్రతికిన వ్యక్తి.... ఈరోజు కూతురుకోసం ఆవేదనపాలై పోతున్నాడు. ఆ ఆవేశంలో యశ్వంత్ ఎదురైతే కాల్చి చంపేస్తాడు.

చంద్రహాస్, ప్రియంవద "మేజ్"లోకి అడుగు పెట్టారు..

కపర్థి, సులోచన మరో పవర్ ఫుల్ బ్యాటరీ లైటు తీసుకొని మరో మార్గంలో ప్రవేశించారు.

చీకటి!

అంతులేని చీకటి!

శతాబ్దాల అంధకారం ఘనీభవించినట్లు కఠినమైన చీకటి....

ఆచీకటిని పవర్ ఫుల్ బ్యాటరీ లైటు కూడా తొలగించలేకపోతుంది

చంద్రహాస్, ప్రియంవద ముందుకు కదులుతున్నారు....

చంద్రహాస్ మనస్సులో ఆలోచనలు....

"సంపద.... మనిషికి ఆనందం యివ్వదు.... అవసరానికి మించిన సంపద మనిషిని ఎప్పుడు చిక్కుల్లో, సమస్యల్లో పడేస్తుంది .. అందునా స్వర్ణ సింహాసనం లాంటి అపార సంపద మనిషి మస్తిష్కాని పిచ్చివాడ్ని చేస్తుంది. లేకపోతే దయ, జాలిలేని కఠినాత్ముడ్ని చేస్తుంది... స్వర్ణ సింహాసనం కనుగొనబడే వరకు అన్నదముల్లా ఉన్నతాము.. అది కనపడ గానే దురాశ కాటు వేసి దుర్మార్గాన్ని ఒడిగట్టాడు యశ్వంత్.. అక్షతను తండ్రి దగ్గర నుండి దూరం చేసాడు... మనిషి మనిషికి మధ్య అను బంధాల్ని భస్మం చేసే శక్తి ఒక్క సంపదకే ఉంటుందేమో!...

ఆవేదనగా ముందుకు కదులు తున్నాడు జయరాం....

అతని కంటి ముందు అక్షత కన్పిస్తుంది.

అమాయకురాలైన అక్షత.... యిప్పుడు ఎక్కడుందో....

ఈ "మేజ్"లో ఉందా లేక యశ్వంత్ బైటికి తీసుకువెళ్ళాడా!....

యశ్వంత్.... బ్లడీబాస్టర్డ్.... ఎంతలా అభిమానించాడు తాను....

రిస్సెర్చ్ స్టూడెంట్ అయినా ఎంతో ఆత్మీయంగా, ప్రేమగాచూసాడు

అయినా పాముకు పాలుపోస్తే కాటందు తుందని ఈ బాస్టర్డ్ కూడా అదే పని చేసాడు.. స్వర్ణ సింహాసనం కోసం.. తన కూతుర్ని బలి చేయ బోతున్నాడు. అదేక్షణంలో అతని మనస్సు ఆవేదనగా కదిలింది.

"అమ్మా అక్షత.... తల్లి లేని నిన్ను.... అపురూపంగా పెంచానో లేదో గాని.... ఓ మృగం.. నిన్ను తీసుకువెళ్ళి పోతుంటే అసహాయంగా చూస్తుండి పోయాను.. నన్ను క్షమించమ్మా.."

ఆయన కనుకొలకుల్లో కన్నీరు జారింది....

సరిగ్గా అదేసమయంలో

కపర్ది, సులోచనతో "మేజ్" లోనడుస్తున్నాడు.

ప్రతిగదిలో నిలబడి, ఆ గదిలోపల శిల్పకళను.. ఆగది ద్వారాలను గమనిస్తున్నాడు....

మొట్టమొదటి వలయాలకు వజ్రపులైటింగ్ ఉంది లోపలివలయాలకు లైటింగ్ లేదు.. గది పైన రూఫ్‌కు పద్మం....

ద్వారాలకు మకరతోరణాలు.. ద్వారాలుకు ఉన్న రాతిస్థంభాల మీద సింహపు తలకాయలు, స్థంభాల క్రింద.... ఆ స్థంభాల్ని మోస్తున్నట్లు ఏనుగుల బొమ్మలు....

తాను, సులోచన ఏగదిలో ఉన్నారో కూడా అతనికి అర్థంకాలేదు..

"సులోచన.... మనం.. ఈ"మేజ్"లో నుంచి బైట పడగలం అంటావా...."

"బైటపడగలం.. ఈమేజ్ లోపల ఏం వింతలు విచిత్రాలున్నాయో లోపలకి పదండి....

వాళ్ళు ఆ గది నుంచి మరోగదిలోకి వెళ్ళారు....

కపర్ది బ్యాటరీలైటు ఆగదిలోకి ప్రసరించగానే....

ఆ గదిలోని దృశ్యం చూసి.... సులోచన కెవ్వునకేక వేసింది.

సులోచన ఎందుకు కేకవేసిందోఅర్థంకాకఅటువైపు చూసాడు చూడ గానే అతని శరీరం ఒక్కసారి చల్లబడింది....

## 22

ఆ నిశీధిలో కోనేరు ముందు హెలికాప్టర్‌లు దిగాయి

ఒకటి.... రెండు, మూడు, నాలుగు....

నాలుగు హెలికాప్టర్‌లు నేల మీదలాండ్ కాగానే..

మండపంలో నుండి లైట్ వేసాడు యశ్వంత్....

హెలికాప్టర్‌లు దిగాయని అర్థమైంది. వాళ్ళు తనవాళ్ళు అవునో, కాదో తెల్సుకోటానికి బ్యాటరీలైటు మూడు సార్లువెలిగి, ఆరింది. తన వాళ్ళే....

అప్పటికప్పుడు మండపం దగ్గరకు వెళ్ళటానికి ఎయిర్ బోట్లు తయారుచేసారు.. ఆ ఎయిర్ బోట్లలలో అందరూ మండపం దగ్గరకు వెళ్ళారు..

"మీకోసమే ఎదురుచూస్తున్నాను.." అన్నాడు యశ్వంత్....

"ఎక్కడ గోల్డెన్ థ్రోన్" ఆతుత్రగా అడిగాడు పరమహంస

"లోపలకి వెళ్దాం "పదండి"..." అన్నాడు యశ్వంత్

యశ్వంత్ బావిలో మెట్లమీదుగా క్రిందకి దిగాడు, అతని వెనక పరమహంస, విన్సెంట్, కాళీచరణ్ దిగారు.

అంతా చీకటి...

యశ్వంత్ చేతిలోనిటార్చిలైట్ వెలుగు ఆ చీకట్లో బలహీనంగాఉంది..

"లైట్లు వెలిగించండి" అన్నాడు కాళీచరణ్

మరు క్షణం అతని అనుచరులు తమ వెంట తెచ్చిన జనరేటర్ అక్కడ పెట్టి.. దాన్నిస్టార్ట్ చేసారు...

వెంటనే మెర్క్యురీ వేపరై జింగ్ లైట్లు గర్భగుడిని దేదీప్యమానం చేస్తూవెలిగాయి..

ఆ వెలుగులో విఘ్నేశ్వరుడివైపు కదలాడు యశ్వంత్ అందరూ అతని వంక చూసారు....

విఘ్నేశ్వరుడి వంటి కొమ్మును గట్టిగా క్రిందకు లాగాడు

ధడ.... ధడ.... మని శబ్దంచేస్తూ విఘ్నేశ్వరుడి కడుపు రెండుగా తెర్చుకుంది....

పరమ హంస అటుచూసాడు.... మెట్లు క్రిందకు దిగుతూ..

కాళీ సైగ అందుకొని ఇద్దరు అనుచరులు లైటింగ్ ఫిక్స్ చేస్తూ ముందుకు కదిలారు....

పరమ హంస, విన్సెంట్, కాళీ, ముందుకు నడుస్తున్నారు.

పరమ హంసకు ఎంతో థ్రిల్లింగ్గా ఉంది!

ఏదో కాక్ అండ్ బుల్ స్టోరీ లాంటి స్వర్ణ సింహాసనం నిజంగా ఉందంటే.... ఆయనకు క్షణక్షణం ఉత్కంఠ కలుగుతుంది. అందులో ఈ రహస్య మార్గాలు చూస్తుండేసరికి....

స్వర్ణ సింహాసనం కాక్ అండ్ బుల్ స్టోరీ కాదు నిజంగానే ఉంది అని ధృడమైన నమ్మకం కలిగింది....

విన్సెంట్.... ఎన్నో కథలు విన్నాడు గాని.... ఈ ఎక్స్‌పెడిషన్ స్థలాన్ని కళ్ళారాచూడటం అతనికి ఇదే ప్రథమం.. అందుకనే అతని మనస్సు ఉద్విగ్న భరితంగా ఉంది...

అందరూ.. హరిహరాదులు బొమ్మ ఉన్న తలుపు దగ్గరకు వచ్చారు

యశ్వంత్ చక్రం తిప్పాడు...

రెండుభాగాలవుతూ ఎంట్రన్స్ తలుపు తెరుచుకుంది..

లోపలవైపు రెండు ద్వారాలు...

"ఎవ్వరూ లోపలకు వెళ్ళకండి" కంగారుగా అన్నాడు యశ్వంత్..

"లోపలకు వెళ్ళటానికి ఖచ్చితమైన దారి ఉంది లేకపోతే పద్మ వ్యూహంలోకి వెళ్ళినట్లే..." అంటూ జేబులో నుంచి జయరాం దగ్గరతీసు కున్న కాపరు షీట్స్ తీసి మార్గం గుర్తు పెట్టుకున్నాడు.

"నాతో పాటు.. వైర్ బల్బ్సు తీసుకురండి" అన్నాడు యశ్వంత్

యశ్వంత్ వెనకాల వైరుదండను పట్టుకొని విడదీస్తూ మార్గంలో బల్బుల దండను గుర్తుగా వదుల్తూ ముందుకు నడవసాగారు...

"ఈదారిలో తప్ప.. మరెవ్వరు యింకోదారిలోకి వెళ్ళకూడదని చెప్పండి" అన్నాడు యశ్వంత్..

కాశీ చెప్పాడు..

అనుచరులందరూ.. ఒక్కొ గది దగ్గర ఒక్కొక్కరు నిలబడి లోపలకి నడవసాగారు..

ఆ గది మార్గం లైట్లతో అత్యద్భుతంగా వెలిగిపోతుంది

సరిగ్గా అదేసమయంలో...

పుత్లీ ముందు నడుస్తుండగా

అటవీకులు వెనక నడుస్తున్నారు....

అందరి ముఖాల్లోఆందోళన.... కోపం....

పుత్లీ కళ్ళు విస్ఫులింగాలు విరజిమ్మితున్నాయి.

పచ్చకొండ పవిత్రతను నాశనం చేస్తున్నాడు కాశీ....దాన్ని ఆపాలి,

తమ కులదైవమైన హజారాదేవితల్లి ముందు నెత్తుటి ఏరులు పారిస్తున్నాడు.

వాడ్ని వాడి అనుచరుల్ని అక్కడే నరికెయ్యాలి....

అందరిలో ఆధృఢ నిశ్చయం కదలాడుతుంది.

ఓమహాఘోషలా !

ఓ పర్జన్య హేషలా ।

ఓం ఝం ఝా మారుతంలా ।

ఓ విలయంలా ఓ ప్రళయంలా....

ముందుకు కదుల్తున్నారు....

వాళ్ళధ్యేయం ఒక్కటే.... కాళీను చంపేయాలి....

పచ్చకొండ పవిత్రతను కాపాడాలి.... అదే వాళ్ళధ్యేయం.

యుగయుగాలుగా, తరతరాలుగా నిలబెట్టుకొస్తున్న పచ్చకొండ పవిత్రత కాళీ పధకంతో నాశనమై పోతుంది....

అందుకే ప్రాణాలిచ్చైనా ఆ దుష్ట పన్నాగాన్ని ఆపాలి....

రెండు గంటలపాటు నడిస్తేగానే చేరుకోలేని ప్రదేశాన్ని గంటా పావులో చేరుకున్నారు.

పచ్చకొండ దగ్గర ఎవ్వరూలేరు....

"అమ్మ.... అక్కడ ఎవ్వరూలేరు...." అని అన్నాడు ఓ కోయ వాడు చూసి....

"అక్కడకాదు.... అమ్మోరి గుడిదగ్గర....

అందరూ ముందుకు కదిలారు ఆ మాటతో....

వాళ్ళుపచ్చకొండ వెనక్కి చేరేసరికి వాళ్ళు కనిపించారు ....

జనరేటర్ ద్వారా మండపంలో దేదీప్య మానంగా వెలుగుతున్న లైట్లు....

ఆ దృశ్యం చూడగానే వాళ్ళల్లో పట్టలేని ఆవేశం పొంగింది.

"నాయాళ్ళను.... నరుకుదాం పదండి" అప్రయత్నంగా ఓ ఆటవీ కుడు అన్నాడు.... అంతే....

ఎదురుగావున్న దృశ్యంచూసి భయంతో కంపించిపోయాడు కపర్ది,

ఆ గదిలో కొన్ని వేల పాములు ఒకదానిపై ఒకటి పెనవేసుకొని ఓ గుట్టగా ఉన్నాయి.... గోడలకు కొన్ని వేల పాములు....

ఆ గదిలో అన్ని పాములే,

కాని ఒక్కటి కూడా గదిలోనుంచి బైటికి రావటంలేదు....

బ్యాటరీలైటు వెలుగులో అవి ఒకదానిపై ఒకటి కదులుతున్నాయి.

ఒక్కక్షణం అనుమానం వచ్చింది కపర్థికి....

తమను చూడగానే ఆ పాములు ఎందుకు కదల్లేదు....

తమవైపు ఎందుకు రాలేదు....

అన్ని వేల పాములు ఆ గదిలో ఉంటే ఈ "మేజ్" అంతా పాముల మయం కావాలే.

మరి అన్ని వేల పాములు ఆ గదిదాటి ఎందుకు రావటంలేదు....

ఒక్క అడుగు ముందుకు వేసాడు....

అతని శరీరానికి గట్టిగా తగలింది ద్వారం ఉన్న ప్రాంతంలో ఏదో అడ్డు...

బ్యాటరీ లైటు వెలుగులో అదీ అద్దంగా గుర్తించాడు....

ఆ గదిలో.... స్వర్ణసింహాసనం లాగా పైన అర్థగోళంలా ఉండే గాజుతో గోడలు కట్టినట్టున్నారు. ఆగది అంతా అలాంటి గాజుతో తయారు చేయబడ్డది. ఆ గాజు లోపల పాములు కొన్ని వేల పాములు....

అవి నిజంగా పాములా.... లేక .... అలా అనిపించే భ్రమ .... అర్థం కాలేదు.... కపర్థికి....

సరిగా అదే సమయంలో....సులోచన భయంగా అటు వైపుచూసింది, ఆ పాముల మధ్య నుంచి ఓ భయంకరమైన పాము బయటికి వచ్చింది.

అది కింగ్ కోబ్రా.... అది గది మధ్యలో ఆడుతుంది....

దాని చుట్టూ మిగతావి మూగుతున్నాయి.

సులోచనా... భయపడకు....ఇది గ్లాస్ కేజ్ రూమ్. ఆకేజ్ లోపలవి నిజమైన పాములు అవునో కాదో మనకు తెలియదు కాని అవి మనల్ని ఏం చెయ్యావు.... ఇదో "మేజ్" ఈ "మేజ్"లో ఇలాంటి ఎన్ని విచిత్రా లున్నాయో మనకు అర్థంకాదు" అన్నాడు.

సరిగ్గా అదే సమయంలో

ప్రొఫెసర్ జయరాం ఆవేదనతో ముందుకు కదులుతున్నాడు.

ఒంటరిగా కూతురు కోసం ఆ మేజ్ లో తిరుగుతున్నాడు.

చీకటి నిండిన గదులు....

ఎక్కడా బూజు, క్రిమి కీటకాలు లేకుండా పరిశుభ్రంగా వుంది ఆ ప్రదేశం.

ఆ గది తర్వాత మరో గదిలోకి వెళుతున్నాడు!ఆయన మనస్సంతా వికలమై ఉంది

"అమ్మా.... అక్షత.... ఎక్కడున్నావు.... నీ తండ్రిని నేనమ్మా. ఎక్కడున్నావు చిట్టితల్లి"

హఠాత్తుగా ఆయనకు మరణించిన భార్య అనసూయ గుర్తుకు వచ్చింది.

"ఏమండీ.... అక్షత చిన్నపిల్ల!అమాయకురాలు.... దాన్ని మీరు తల్లీ దండ్రిలా పెంచాలండి" గద్గదంగా అంది.

"ఆమెకు ఏ లోటు లేకుండా పెంచుతాను .... నన్ను నమ్మ అనసూయ"

కూతురు చేతిని తన చేతిలోపెట్టి కన్ను మూసింది అనసూయ.

అప్పటికి అక్షతకు పదేళ్ళు

అప్పటినుంచి తల్లిలేనిలోటు లేకుండా పెంచాడు....

ఈ పదేళ్ళల్లో ఆమెకు ఏ లోటు లేకుండా పెంచాడుగాని ఆమె మనస్సు తెల్సుకో లేకపోయాడు.

యశ్వంత్‌ను ప్రేమిస్తుంది అని తెల్సినా.... యశ్వంత్ యోగ్యుడని సహృదయుడని ఆ ప్రేమను ఆ అభిమానాన్ని తనెన్నడు విచ్ఛిన్నం చేయలేదు....

కాని యశ్వంత్.... హీయీజ్ ఎ స్నేక్....

ఎ డేంజరస్ స్నేక్!....

హఠాత్తుగా ఆయన వర్తమానంలోకి వచ్చాడు.

అప్పటివరకు ఆయనకు తెలీదు .... ఆయన ఏడుస్తున్నాడనే విషయం.

హఠాత్తుగా ఓ గదిలోకి అడుగుపెట్టాడు.

ఆ గదిలో ఎవరో వృద్ధుడు యాభై యేళ్ళవ్యక్తి.

టార్చిలైట్‌తో ఎదురు వస్తున్నాడు....

చిత్రం.... అతను అచ్చుతనలానే ఉన్నాడు.

గదిలోకి అడుగుపెట్టగానే నమ్మలేనట్లు గది వంకచూసాడు.

అక్కడి విచిత్రం చూసి తాత్కాలికంగా అతను ఏడుపు మర్చిపోయాడు....

సరిగ్గా అదేసమయంలో....

అక్షత నిర్వికారంగా ముందుకు కదుల్తుంది....

ఆమెకు బ్రతకాలన్న యిచ్ఛలేదు. గాఢంగా ప్రేమించిన యశ్వంత్ శత్రువులమనిషి అని అర్థం కాగానే ఆమె మనస్సంతా ఓరకమైన షాక్‌కు గురైంది....

తనతండ్రిని ప్రమాదంలో నెట్టిన దుర్మార్గురాలు తాను అనే భావం ఆమెలో ఉంది.... యశ్వంత్‌ను ప్రేమించటం చాలా సహజమైన విషయమని ఆమె అర్థం చేసుకోలేక పోతుంది....

యశ్వంత్ నమ్మకద్రోహం చెయ్యటం అతనిలాంటి వాళ్ళు చేసే పని అని అసలు అలాంటి దుర్మార్గుడిన్ని ప్రేమించటం తప్పు అనితెలుసుకొని అతనిమీద విరక్తి పెంచుకోవాల్సిన అక్షత, జీవితమ్మీదే విరక్తి పెంచుకుంది.... అదే అబ్సర్డ్....

తన జీవితాన్ని అంతంచేసుకోవాలనే ఆలోచనతో ఆమె ముందడుగు వేస్తుంది....

ఆమె ఓ గదిలోకి అడుగు పెట్టింది. గదిలో దృశ్యంచూడగానే ఒక్కసారి భయంతో నిశ్చేష్టురాలై పోయింది....

ఆ గదిలో నేల మీద కదులుతుంది ఓభయంకరమైన కృష్ణసర్పం..

బ్యాటరీలైటు వెలుగులో దాని శరీరంపై పొలుసులు భయంకరంగా ఉన్నాయి.... ఈ పద్మవ్యూహంలో భయంకరమైన కృష్ణసర్పమా....

ఎక్కడనుంచి వచ్చింది!

ఎక్కడ నుంచి వస్తే తనకెందుకు!

తనుచనిపోవాలనుకున్న వ్యక్తి....

ఆ కృష్ణసర్పం దగ్గరకు వెళితే తనను కాటువేస్తుంది....

ఆ కాటుకు తానుచచ్చిపోతుంది.ఇక జీవితంలో ఏ బాధలు,బాధ్యతలు ఉండవు....

అలా అనుకొని ఒక్క అడుగు ముందుకువేసింది....

మరుక్షణం ఆమె దిగ్భ్రాంతికి లోనైంది....

ఆమె అడుగులు ఖచ్చితంగా నేల మీద పడ్డాయి. కాని అక్కడ నేలలేదు....ఒక్క అడుగు క్రిందనేలవుంది....కాని ఆమె క్రింద పడలేదు.

మరో అడుగువేసింది.

అది ఖచ్చితంగా కృష్ణసర్పం తల మీదకు.... ఆ అడుగు కృష్ణ సర్పంమీద పడటం, అది పడగ విప్పి కాటువేయటం ఒక్క క్షణంలో జరుగుతాయి. ఆమె అడుగు వేసింది మరుక్షణం....

సరిగ్గా అదేసమయంలో

ఆ గదిలో తనలాంటి వాళ్ళు ఓ ఆరుగురు చుట్టునిలబడి ఉన్నారన్న అనుభూతికలిగింది. టార్చిలైట్ దగ్గరగా తీసుకొని ఫోకస్ చేసాడు ప్రొఫెసర్ జయరాం,ఎదురుగా ఉన్న వ్యక్తి కూడా టార్చిలైటు దగ్గరగా తీసుకొని ఫోకస్ చేస్తున్నాడు....

సరిగ్గా చూసాడు ప్రొఫెసర్ జయరాం....

అది అతని ప్రతిబింబం.... ఎవరో గదిలోనిగోడను.... అద్దంలా నున్నగా చేసారు.... అచ్చు అది అద్దమే....

దాన్లో తన ప్రతిబింబం.... గుండ్రంగా ఉన్న ఆ గోడలో ప్రతి ద్వారం పక్క అతని ప్రతిబింబం....

మొత్తం నాలుగు ప్రతిబింబాలు తనచుట్టూ ఉన్నట్లు అన్పించింది.

ఆనాటి శిల్పి ఎవడోగాని.. ఎంతో అద్భుతంగా అద్దాలతో తయారు చేసాడు ఆగదిని....

రాతి గోడలను అద్దాలుగా మలిచిన ఓ శిల్పి.... నీ పనితనం మహాద్భుతం....

తత్కాలికంగా అతని మనస్సు శాంతించింది....

ఇలాంటి ఎన్నివింతలు.... ఈ"మేజ్"లో ఉన్నాయి. ఈమేజ్‌లో ఉన్న వింతలను సామాన్యుడు ఎవ్వరైనా చూస్తే.... నిజంగా పిచ్చివాడై పోతాడు....

ముందుకు కదిలాడు ప్రొఫెసర్ జయరాం....

కపర్థి సులోచనతో ఆగదిని పరీక్షగా చూసాడు.... గాజుకేజ్ లోపల ఎన్నోరకాల అద్దాలు....

ఆ అద్దాలపైన పాములు చుట్టలు చుట్టలుగా ఉండేటట్లు కొన్ని శిల్పాలను అమర్చి.... ఆశిల్పాలు కదులుతుంటే, గాజుకేజ్‌లోని వేలవేల అద్దాల్లో ఆ దృశ్యం ప్రతిబింబించి, గదినిండా కొన్నివేలపాములు కదుల్తున్న అనుభూతిని కలిగిస్తుంది....

నిజంగా అక్కడ పాములు లేవు....

పాములాంటి రూపాలతో మిర్రర్ చేసిన మాయాజాలం అది.

కపర్థి.... సులోచన మరో గదిలోకినడిచారు

"యింకా యిలాంటి వింతలు ఎన్నో ఈ మేజ్"లో అనుకుంటూ... ముందుకు కదిలారు

ఒక్కక్షణం ఆశ్చర్యపోయింది అక్షత....

తానుకాలు వేసినా ఆ కృష్ణసర్పం బుస్సు మంటూలేదు....

అలానే ముందుకు పోతున్నట్లు కదులు తుంది....

ఆ కాలిక్రింద అరడుగు దూరంలో పాము....

మరెక్కడ ఉంది.... ఒక్కక్షణం ఆశ్చర్యంతో

బ్యాటరీలైట్ దానిమీద వేసింది....

తాను.... నిలబడి ఉన్నది గాజులాంటి దాని మీద అని ఆ గాజు... ఆగది అంతా పరచుకొని ఉందనీ ఆమెకు అర్థమైంది.

చిత్రమైన ఫీలింగ్.... నేలమీద భయంకరమైన పాముకదులుతున్న ఫీలింగ్ కలిగించింది.... ఈ గదిలోకి వచ్చిన వాళ్ళను భయభ్రాంతులకు గురి చేయటానికి పూర్వీకులు తయారుచేసిన అపూర్వమైన మయసభయిది....

ఉన్నది లేనట్లుగా, లేనిది ఉన్నట్లుగా భ్రమింప చేసే ఈ అపూర్వ మైన పద్మవ్యూహంలాంటి ఈ మయసభలోకి అడుగుపెట్టిన వాడు గుండె పగిలి చావటమో.... స్పృహతప్పి పడిపోవటమో జరగాలి....

కాని అందుకు విరుద్ధంగా....

చావును ఆహ్వానిస్తూ లోపలికి వెళ్ళిన తనకు....

కేవలం అది భ్రాంతి అని అర్థమైంది....

ఇలాంటిభ్రాంతులు ఎన్నో ఉన్నాయి కదా ఈ మయసభలో....

అవి చూద్దామన్న ఉత్సాహంతో ఆమె అడుగు ముందుకు వేసింది..

ఆమెకు యిప్పుడు మనస్సులో దుఃఖంలేదు....

జీవితం కూడా యిలాంటి మయసభలాంటిదే!

చావుకి, ఆశకు భయపడనివాడికి, లొంగనివాడికి ఈ భ్రాంతి, భ్రాంతని అర్థమౌతుంది.

అదే నిజమనుకునేవాడు భయంతో చనిపోవటమో.... నిరాశతో కూర్చోవటమో చేస్తాడు....

ఇప్పుడు అక్షతలో నైరాశ్యం లేదు....

దానిస్థానంలో ఆశ.... గమ్యంతెల్సుకోవాలనే పట్టుదల ఉన్నాయి..

ఆమె ఉత్సాహంగా ముందుకు అడుగు వేసింది.

కపర్థి, సులోచన ముందుకు కదులుతున్నారు....

వాళ్ళకు ఆ వలయకారపు గదులు వింతగా విచిత్రంగా అన్పించాయి..

"ఆగదిలో కింగ్ కోబ్రా భ్రాంతిని ఎలా కలిగించారు అడిగింది సులోచన....

"కేవలం అద్దాల ద్వారా.... లేకపోతే అద్దాల లాంటి రాతి పలకలని సృష్టించి వాటి మధ్య.. కోబ్రా, మిగతపాములు బొమ్మలు కదులుతున్నట్లు భ్రాంతి, భ్రమను కలిగించి, అదృశ్యం చుట్టు ఉన్న పలకల్లో ప్రతితింబిం చటం వలన గదిలో కొన్ని వేల పాములు తిరుగాడుతున్న భ్రమను కలిగించారు....

అంతే కాదు గది గోడలు కూడా అద్దాలా మార్చిన ఆనాటి శిల్పుల అపూర్వ ప్రతిభను మనం ఊహించలేం....

"ఈ "మేజ్"లో నుంచి మనం బయటపడలేమా" ఆమె గొంతులో బాధకన్పిస్తుంది....

"ఏదారి ఎటు వెళ్తుందో ఎవ్వరికీ తేలీదు....

మనలో ఎవరన్నా దారి కనుగుంటే.... మనం హాయిగా బైటికి వెళ్ళగలం....

మనలోదారి కనుగొనే వాళ్ళు ఎవరు?"

ఇద్దరు నడుస్తున్నారు....

సరిగా అదేసమయంలో ప్రియంవద, చంద్రహాస్.... కదులు తున్నారు.... మయసభ లాంటి పద్మవ్యూహంలో....

"అభిమన్యుడికి పద్మవ్యూహంలోకి వెళ్ళటం తెలుసు.... కానీ రావటంతెలీదు— అలాగే ఈ వలయకారపు గదులు మనల్ని ఎక్కడికి తీసుకువెళ్తాయో.... ఏమో" ప్రియంవద అన్నది....

"మనం.... ఈ వలయాకారపు గదుల్లోనే తిరుగుతూ ఉంటాం.... మనిషికి దురాశ అనేది ఓ పద్మవ్యూహం.... దాన్లో చిక్కుకున్నవాడు దారితెన్ను తెలియక కొట్టుకుంటాడు" అన్నాడు చంద్రహాస్....

స్వర్ణ సింహాసనం చూసిన తరువాత

అతనిలో వైరాగ్యం పెరిగింది....

అతనిలోనే కాదు.. మిగతావాళ్ళల్లో కూడా..

సంపద సాక్షాత్కరించగానే మనిషి దుఃఖంలో ఎలాపడిపోతాడో ప్రొఫెసర్ జయరాం పరిస్థితి చూస్తే అర్ధమైంది..

సంపద మానవుడ్ని పిచ్చివాడ్నిచెయ్యటమేకాదుకిరాతకుడ్నిచేస్తుంది.

సరిగా ఆ ఆలోచనలో వుండి ఓ గదిలోకి అడుగుపెట్టగానే

ఆ గదిలో దృశ్యం చూసి కెవ్వున కేక వేసింది ప్రియంవద....

అలా కేకవేసి హిస్టారిక్‌గా వచ్చి చంద్రహాస్‌ను కౌగలించుకుంది.

ప్రియంవదను అంత భయకంపితురాల్ని చేసిన విశేషం ఏమిటా అని గది మధ్యలోకి టార్చిలైట్ తిప్పాడు....

ఆ గదిలో దృశ్యం చూడగానే ఆతని నవనాడులు స్థంభించాయి.

ఆ గదిలో....

కొన్ని వేల అస్థి పంజరాలు గాలిలో వేలాడుతున్నాయి....

గాలిలో వేలాడుతున్న అస్థిపంజరాలు గాలిలో తిరుగుతున్నాయి....

ఒక్కసారి వెన్నులో చలిపాకినట్లనిపించింది.

షాక్ !

షాక్ !

షాక్ !

అంత భయంకరమైన షాక్‌కు అతనెప్పుడు గురికాలేదు....

గాలిలో అస్థిపంజరాల నృత్యం....

ఓ పర్వత గర్భంలో మయసభలాంటి అంతఃపురంలో....

గాలిలో అస్థి పంజరాల నృత్యం....

అతి నిశ్శబ్దంగా

టార్చిలైటు ఆర్పివేశాడు....

ఏం జరగలేదు.... మళ్లీ టార్చిలైటు వెలిగించాడు....

అస్థి పంజరాలు కదులుతున్నాయి.... ఏ నిశ్శబ్ద మంత్రాల్ని వల్లిస్తున్నామో అన్నట్లు....ఎంతటి గుండె ధైర్యం కలిగినవాడు కూడా ఝడుసుకోనేలా తిరుగుతున్నాయి.

చంద్రహాస్ సహజంగా ధైర్యవంతుడు....

ఆ అస్థిపంజరాల నృత్యంలో ఏదో అసహజత్వం ఉన్నట్లు అతనికి అన్పించింది.... అతని సిక్త్‌సెన్స్.... ఏం ప్రమాదంలేదు అని భరోసా యిచ్చినట్లు అన్పించింది....

కాని ప్రియంవద భయంతో వణికిపోతుంది....

"ప్రియంవద ప్లీజ్....నువ్వేం భయపడకు"....ఇదేదో మాయలాగ భ్రాంతిలాగ వుంది.... ఇదేమిటో తెలుసుకుందాం...." అని అతను లోపలకు అడుగువేశాడు....

అతను లోపలకు అడుగువేయగానే అస్థిపంజరాల మాయ ఏమిటో అర్థమైంది

దానిలోవున్న విచిత్రం ఏమిటో చంద్రహాస్‌కు బోధపడింది.

ఆ గదిలోకి ప్రవేశించగానే.... ఆ గది గోడలనిండా, ప్రియంవద చంద్రహాస్‌లు ప్రతిబింబాలు కొన్ని వేలు కన్పించాయి· "అద్దాలమాయతో .... ఈ గదిలో కొన్ని వేల అస్తిపంజరాలు ఉన్న భ్రాంతిక్రియేట్ చేయ గలిగారు... అటుచూడు" అని ఆమెకు రూఫ్ వంక చూపించాడు. రూఫ్ మధ్యలోవున్న పద్మాకారంనుంచి మూడు అస్థిపంజరాలు తీగతో వేలాడు తున్నాయి .... వాటియొక్క ప్రతిబింబాలు గోడలమీద ఎక్స్పోజ్ అయి కొన్ని వేల అస్థి పంజరాలు వున్న ఫీలింగ్‌ను క్రియేట్ చేస్తున్నాయి.

ఆ గదిలోవున్న మాయ ఏమిటో విప్పి చెప్పేసరికి ప్రియంవద రిలాక్సుడ్‌గా ఫీలైంది....

ఆ గదిలోనుంచి మరో గదిలోకి నడిశారు.

"గదిగోడల్ని అద్దాల్లా తయారుచేయగల కళ పూర్వీకుల చేతిల్లో ఉండి ఉంటుంది. దాంతోనే ఈ గదుల్ని యిలా మయసభలా అలంక రించారు...."

వాళ్ళు అక్కడినుండి మరో గదిలోకి వెళ్లారు. అది మామూలుగా వుంది.

ఆ తరువాత గదిలోకి వెళ్ళబోయి అక్కడే ఆగారు....

ఆ గది మధ్యలో సరోవరం....

ఆ సరోవరంలో మొసళ్ళు.... అలా అలా తిరుగుతున్నాయి....

"ఇది మాయేనంటారా...." అంది ప్రియంవద....

"ఇది మాయే.... ఆనాడు మయసభలో కాలుపెడితే కనపడని సరో వరాలు ........ కళ్ళకు కనిపించే సరోవరాలు కల్పించాడుమయుడు .... ఆ మయుడికి....ఎంతమాత్రం తీసిపోరు ఈఅంతఃపురాన్ని సృష్టించిన.... ఆనాటి శిల్పులు...." అన్నాడు చంద్రహాస్.

"అంటే యిది సరోవరం కాదంటావా"

"కాదు.... కావాలంటే చూడు...." అని జేబులో నుంచి రూపాయి నాణెంతీసి సరోవరంలో విసిరివేసాడు.

అది బుడుంగున మునగాల్సిందిపోయి "ఠంగున శబ్దంచేస్తూ .... మొసళ్ళమీద మూడంగుళాల దూరంలో నిలిచిపోయింది....

"ఇది.... మయసభలాంటి సరోవరమే. కన్పించేవి మొసళ్ళుకాదు. మొసళ్ళ ఆకారంలో తయారుచేసిన కదిలే బొమ్మలై ఉండవచ్చును .... ఆ నిర్మాణంచేసి.... దానిమీద గాజుతో ప్లాస్టింగ్ చేసారు .... అందుకనే మనకు సరోవరంలా కన్పించింది, మనభ్రాంతే"

అక్కడవున్న అద్భుతాల్ని చూసి ఆశ్చర్యపడుతూ .... వాళ్ళిద్దరూ ఆగది గుండా నడిచారు చంద్రహాస్ చెప్పినట్లు ఫ్లోరింగ్ అంతా....గాజుతో తయారుచేసినట్లు ఉంది.

ఆ గది దాటి మరో గదిలోకి వచ్చే వరకు యిద్దరు ఓ రకమైన అనుభూతికి లోనయ్యారు....

చంద్రహాస్ చేతిలో ఆమె చెయ్యి ....

ఆమెదరిదాపు అతన్ని రాచుకుంటునే వుంది....

స్వర్ణసింహాసనం పరిశోధనలో వాళ్ళిద్దరు ఎంతో దగ్గరయ్యారు....

ప్రియంవదకు చంద్రహాస్ ఎంతోగానో నచ్చాడు.

రెండో గదిలోకి రాగానే ప్రియంవద అన్నది...

"చంద్రహాస్ .... ఈ గదిలో కాస్త విశ్రాంతి తీసుకొని మళ్లీ వెతుకుదాం...." అంది....

చంద్రహాస్ క్రింద కూర్చున్నాడు....

ఆమె అతని ఎదురుగా కూర్చొని అతని కళ్ళల్లోకి చూసింది....

ఆ కళ్ళు ఎంతో నిర్మలంగా వున్నాయి....

మరుక్షణం అతని చేతిని తన చేతిలోకి తీసుకొని....

"సున్నితంగా ముద్దు పెట్టుకుంది. ఆమె చర్యకు అప్రతిభుడై అమెవంక చూసాడు చంద్రహాస్ .... అమె గొంతువిప్పింది....

"చంద్రహాస్.... ఈ మయసభలాంటి ఈ అంతఃపురంలో నుంచి మనంప్రాణాలతో, బయటపడతామో లేదో నాకు తెలియదు.. . అందు

కనే...నేను ఈ నిర్ణయం తీసుకున్నాను"ఆ నిశి నిశబ్దంలో ఆమె మాటలు మారుమ్రోగుతున్నాయి...

"ఏమిటది" అతను అడిగాడు..!

అతని గుండెల్లో ఏవో మౌనరాగాలు ఏవోభావాలు కలగాపులగంగా కదిలిస్తున్నాయి.

"నా జీవితంలో యింతకాలం ఒంటరిగాగడచిపోయింది....జీవితంలో అస్సలు పెళ్ళి ఎప్పుడు చేసుకోవాలనుకోలేదు....మగవాళ్ళంతా దుర్మార్గులు, స్వార్ధపరులు, స్త్రీలను కాల్చుకుతింటున్నారని కాదు. నాకు నచ్చేవాడు దొరక్క....నా మనస్సుకు అన్ని విధాలా సరిపోయే వాడు దొరక్క-యిన్నాళ్ళు నేను వివాహం చేసుకోలేదు"

ఆమె ఆగింది....ఆమె ఏదో చెప్పాలని అనుకున్నట్లు, అది ఆమె జీవితానికి సంబంధించిన ముఖ్యమైన నిర్ణయం అనికూడా ఆ క్షణంలో అతనికి అర్ధమైంది....

"మీ సాహసం చూసి కాదు....మీ చదువు విజ్ఞానం చూసికాదు మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుకుంది. యిన్ని రోజులైన నన్ను నన్నుగానే చూసారు తప్ప....నాతో అసభ్యంగా ఏనాడు ప్రవర్తించలేదు. ఈ చీకట్లో నన్ను మీరు ఏంచేసినా నన్ను ఆదరించే రక్షించే నాధుడే రాడు....అలాంటి పరిస్థితుల్లో కూడా మీరు నన్ను స్నేహితురాలిగానే చూసారు తప్ప ఓ ఆడదానిలాగ చూడలేదు....అందుకే....అందుకే...." ఆమె ఆగిపోయింది. సిగ్గుతో ఆమె గుండెలు దడదడమని కొట్టుకున్నాయి....

"అలాంటి సంస్కారవంతుడే నాకు భర్తగా కావాలని యిన్నాళ్ళు అనుకున్నాను. ఈనాడు మీరు నాకు కన్పించారు....సుమంగళిగా, వివాహితగా మరణించాలనే కోరికతో మిమ్మల్ని భర్తగా ఎంచుకోలేదు....ఇక్కడి నుండి బయటపడినా....మిమ్మల్నే నేను వివాహం చేసుకొనేదాన్ని" అని చటుక్కున తలవంచుకొని....

"ఐ లవ్ యు చంద్రహాస్....ఐ నీడ్ యు...."

భూమికి ఇరవై అడుగుల లోతున, దారి తెన్ను తెలీని పర్వత అంతర్భాగంలో, చావు, పుట్టుకలకు అందని విచిత్రమైన పరిస్థితుల్లో జీవన

మృత్యు కెరటాల మధ్య ఆమె చెప్పిన మాటలు విని చిన్నగా నవ్వు కున్నాడు చంద్రహాస్....

"జీవితమా—నువ్వెప్పుడు నిత్యనూతనత్వానివి....అరణ్యంలోనైన నగరంలోనైన....మృత్యువులోనైన జీవనంలోనైనా....నువ్వు వికసించని స్థలం అంటూ ఈ భువిపై లేదు కదా...."

కపర్ది ఆమె వంక చూసాడు.

ఆమె అతని వంక చూసింది.

ఆ చూపుల్లో ఎన్నో భావాలు....

ఒక్కసారిగా అతని దగ్గరికి వచ్చి ఏడ్చింది....

ఆమెకు ఎందుకో దుఃఖం ఉప్పెనలా ఉరుకుతోంది.

జరిగిపోయిన సంఘటనలు తల్చుకుంటే ఆమెకు భయం, వేదనా కలిగాయి. జరిగిపోయిన సంఘటనల్లో ఎక్కడైనా దురదృష్టం ఎదురైతే తన కపర్ది తనకు ఉండడు. అతనులేకపోతే తాను ఉండలేదు....

ఎటాచ్ మెంట్....మెంటల్లీ ఎటాచ్ మెంట్....

తాను అతని దగ్గర సెక్రటరీగా పనిచేస్తున్నా,కపర్దిలోని ధీరోదాత్త తను ఏనాడు పూర్తిగా చూడలేదు.

ఈ స్వర్ణ సింహాసనం అన్వేషణలో ఆయనలో పట్టుదల, ధైర్యం అడుగడుగునా ఆమెకు కన్పించాయి.

తనెంత సిల్లీగా ప్రవర్తించినా తనను మనసారా అర్థం చేసుకున్న వ్యక్తి కపర్ది....

ఆమె చెంపల మీద కన్నీళ్ళు కారిపోతున్నాయి. కొన్ని భావాలకు రీజన్ ఉండదు.

అవి భావాలు అంతే!

రీజనింగ్ లేని హృదయపు భావం ప్రేమ....

తను అతన్ని ప్రేమిస్తుందా?

కపర్ది ఆమె వంక చూసాడు....

ఎందుకేడుస్తోంది....ఈ మేజ్ లో ఇలాగే ఎన్నో సంవత్సరాలు మగ్గి చనిపోవాలనా....కాదు....కాదు.

ఆమె ఏడ్పులో అతనికి ఆర్తి కన్పించింది....

"ఎందుకేడుస్తున్నావు డియర్....ఇదో డ్యూయట్టా" కొంటెగా నవ్వుతూ అన్నాడు....కపర్థి.

అతని వంక చూసి ఆ ఏడ్పులో నవ్వింది.

వానలో సూర్యోదయంలా....

"ఎందుకేడుస్తున్నావు అంటే నవ్వుతావేం...." అన్నాడు కపర్ధి....

"ఏడ్వలేక అంది....

"లేకపోతే ఈ మేజ్‌లో చచ్చిపోతావనా"

ఆమె అతని వంక చూసింది....

"నీతోపాటు మరణం జీవితం కన్న గొప్పదని నాకు తెలుసు కపర్ధి....అందుకుకాదు నేను ఏడుస్తోంది"

"మరెందుకు"

"ఈ ఎక్స్‌పెడిషన్‌లో దురదృష్టవశాత్తూ మీకేదైనాఅయితే నేనేమై పోతానా అని దిగులేసి ఏడ్చాను" అంది సులోచన.

ఆ మాట వినగానే అప్రతిభుడయ్యాడు కపర్ధి.

"ఎంత ప్రేమ....ఈ ప్రేమ....ఈ కన్నీళ్ళు తెప్పించిందా....దుర దృష్టవశాత్తు తనకేమైనా అయితే ఈవిడ ఎందుకేడ్వాలి....బహుశా అదే నేమో ప్రేమంటే...."

"నీకు ప్రేమంటే ఏవిటో తెలుసా కపర్ధీ....బ్రహ్మదేవుడు నీకన్నీ యిచ్చి....ప్రేమను యివ్వలేదనుకుంటాను...."

"నా కెందుకు యివ్వలేదు....నా గుండెలో అంతా ఉంది ప్రేమే.."

"ఇంతకీ నువ్వు ఎవ్వర్ని ప్రేమి:చావు"

"మా అమ్మను, నాన్నను....ఈ దేశాన్ని....చివరకు...."

"ఊ చివరకు" ఆశగా అడిగింది.

"ని....న్ను" అన్నాడు.

"నన్ను ప్రేమించారా....నిజం...."

"నా ప్రేమ చాలా సహజమైంది. దాన్ని మాటల్లో పెట్టి చంపటం యిష్టంలేక...." అన్నాడు.

"భూమికి చాలా అడుగుల క్రింద మనం ప్రేమ గురించి మాట్లాడుకుంటున్నాం....వింతగాలేదు...." అంది ఆమె

"ఎందుకుండదు....నువ్వు అసహజ పరిస్థితుల్లోనే నీ ప్రేమను వ్యక్తపరుస్తావు...."

"కపర్థీ" ఆ మాటకు అతను ఉలిక్కిపడ్డాడు.

ఆమె నవ్వుతూ చూసింది....

"నేనే....నిన్ను పిల్చాను కపర్థీ....ఈ పద్మ వ్యూహంలో నాకో చిత్రమైన కోరిక కల్గుతోంది...."

"ఏమిటది...."

"నేను సుమంగళిగా చచ్చిపోవాలి కపర్థీ....ఈ పద్మవ్యూహంలో నుంచి మనం బైట పడ్తామో లేదో తెలియదు....అందుకని...."

ఒక్కసారి ఆమెవంక దిగ్భ్రాంతిగా చూసాడు కపర్థి....

విపరీతమైన విపత్కర పరిస్థితుల్లో విచిత్రమైన కోరిక కోరుతోంది సులోచన....

"అందుకని" అతను అడిగాడు.

"నాకు మాంగల్యం కట్టు కపర్థి...."

ఆమె కళ్ళల్లో అంతులేని ఆశ....బ్రతికి బయట పడతామోలేదో అన్న తీవ్రమైన పరిస్థితుల్లో తన కోర్కె తీర్చుకోవటం కోసం....కేవలం తను ప్రేమించిన ప్రియుడ్ని చచ్చిపోయేలోపుగా భర్తగా చేసుకోవటం కోసం ఆమె అడిగిన కోర్కె....

"ఈ కోర్కె తీరుతుందంటావా సులోచన....యిక్కడ భాజాభజంత్రీలు లేవు....పురోహితుడు లేడు....మంగళ సూత్రం లేదు....ఎలా తీరుతుంది నీ కోర్కె...." అడిగాడు కపర్థి—

"అంటే....నా కోర్కె తీర్చటానికి మీకేం అభ్యంతరం లేదన్నమాట, అవి లేవన్న ఒక్క సాకు తప్ప...."అవునా" అంది సులోచన....

"అవును" అన్నాడు కపర్థి మాటల్లో ఆమెకు దొరికిపోయినందుకు..

మనోహరంగా నవ్వింది సులోచన...

"అవి లేకపోయినా మన పెళ్ళి జరుగుతుంది...." అని చేతికున్న

గాజును బలంగా చేతికి నొక్కుకుంది... పగిలిన గాజు చేతిలో దిగబడి వెచ్చగా రక్తం బయటికి చిమ్మింది మణి కట్టు దగ్గర....

ఆ చేతిని కపర్ధి ముందుకు సాచింది....

"ఇక్కడ పురోహితుడు లేడు, మంగళసూత్రాలు లేవు.... బాజా భజంత్రీలు లేవు.... ఈ రక్తం సాక్షిగా నా నుదుట తిలకం దిద్ది నన్ను మీ దాన్ని చేసుకోండి" అంది భావగర్భితంగా.

ఆమెకు తనమీదున్న నమ్మకానికి....

ప్రేమమీద, సెంటిమెంట్ మీద ఉన్న కమిట్‌మెంట్‌కు ఒక్కసారిగా కదలిపోయాడు.

బొటని వేలితో ఆమె మణికట్టు దగ్గర ఉన్న రక్తాన్ని దిద్ది ఆమె నుదుట సింధూరంగా దిద్దాడు.

"ఈ రక్తం సాక్షిగా.... ఈ పంచభూతాల సాక్షిగా.... ఈ పద్మవ్యూహపు గది గోడలు సాక్షిగా.... నువ్వు నా దానివి సులోచన"

ఓ పెను ఉప్పెన కెరటం కదలినట్లు.... సముద్రంలో నుంచి బలంగా వచ్చిన తరంగం పాదాలను స్పృశించినట్లుగా ఒక్కసారిగా అతని పాదాలమీద పడిపోయింది సులోచన....

ఆమె గుండెల్లో మంగళవాద్యాలు మారుమ్రోగుతున్నాయి,

ఆమె హృదయం సన్నాయి మోగిస్తోంది.

ఆనంద భాష్పాలు కారిపోతుండగా అతని పాదాలకు నమస్కరించింది సులోచన. ఆమెను రెండు చేతుల్తో పైకి లేపి అక్కున చేర్చుకున్నాడు కపర్ధి.

"ఇక నేను చనిపోయినా నాకు బాధలేదు.... నేను నీ భార్యనై చనిపోతాను....అదే నా తృప్తి" అంది సులోచన....

"పిచ్చిదానా....మనం చచ్చిపోం.... బ్రతుకుతాము. మొదటినుంచి అదృష్టం మనవైపే ఉంది....ఎక్కడో వేదమంత్రాల మధ్య అతి పెద్ద కళ్యాణమండపంలో కొన్నివేల ఆహూతుల మధ్య జరగాల్సిన మన పెళ్ళి, భూమికి కొన్ని అడుగుల లోతున ఎవ్వరూ లేకుండా.... ఏ మంగళవాయిద్యాలు మ్రోగకుండా....అతి నిరాడంబరంగా జరిగిపోయిందంటే.... మన

యిద్దరం ఒక్కటి కావాలని ఆ భగవంతుడి సంకల్పం....మనకు పెళ్ళిచేసిన ఆ సంకల్పమే మనకు బ్రతుకిస్తుంది" అన్నాడు. సులోచన అతన్ని ఆర్తిగా కౌగలించుకుంది.

## 23

అంతే ।

అటవీకులు అంతా ఒక్కసారిగా విరుచుకుపడ్డారు....

కాళీచరణ్ అనుచరులు దూరంనుంచి వస్తున్న కోయవాళ్ళను చూసి ఏ. కె ఫార్టీ సెవన్ రైఫిల్స్‌తో షూట్ చేయసాగారు.

ఓ అటవీకుడు విసిరిన గండ్రగొడ్డలి విసురుగా వచ్చి అక్కడ నిలబడ్డ వ్యక్తి తలను నరికేసింది....కొబ్బరి బొండాం క్రిందపడ్డట్టుక్రింద పడింది ఆ తల....

మరెవరో లైట్లు పగలగొట్టారు....

ప్రభంజనంలా దూసుకువస్తున్నారు....అటవీకులు....

పరమహంస ముఖ్య అనుచరుడు ధనరాజ్ అక్కడేనిలబడి ఉన్నాడు ఎప్పుడైతే తనవాళ్ళు పడిపోయారో, క్రిందపడ్డఏకే 47 రైఫిల్ తీసుకొని అతను బావిలోదిగి మెట్లమీదనుంచొని ఫైరింగ్ ఓపెన్ చేసాడు.

"ధడ్....ధడ్....మని మ్రోగసాగింది ఆ ప్రదేశం అంతా....

"వాటీజ్ ద మేటర్....కాళీచరణ్ వైర్‌లెస్‌లో అన్నాడు....

"పుత్లీ....అటవీకులతో వచ్చి నానా గొడవ చేస్తుంది సార్...."

"కిల్ దట్ బ్లడీబాస్టర్డ్" అనుజ్ఞయిచ్చాడు కాళీచరణ్....

"ఏమిటి"అడిగాడు పరమహంస....

"అటవీకులు తిరుగుబాటు చేసారు" అని చెప్పాడు కాళీచరణ్....

"వాళ్ళను పిట్టల్ని కాల్చేసినట్లు కాల్చేయమను...."

"అదే నేనే చెప్పాను" అని కాళీచరణ్ అడుగు ముందుకువేసాడు.

సరిగ్గా అదేసమయంలో....

ముందుకు వెళుతున్న అటవీకుల్ని వెనక్కి రమ్మని కేకపెట్టింది పుత్లీ....

కాని ఎవ్వరూ వినటంలేదు....

తమ పవిత్రత నాశనమైపోతుందని.... అక్కడే శలభాల్లా మాడి పోతున్నారు....

వచ్చిన అటవీకుడు వచ్చినట్లు కూలిపోతున్నారు. ఆ దృశ్యం చూస్తున్న పుత్లీకి దుఃఖం ఆగటంలేదు-

తనజాతి తనకళ్ళముందే సర్వ నాశనమైపోతుంది,

సరిగ్గా అప్పుడే వచ్చాడు చిన్ననాయకుడు అక్కడికి, అతని కళ్ళకు పుత్లీ కన్పించింది....

పళ్ళు పటపట కొరికాడు. ఆమెవల్లే చేతికి చిక్కనశత్రువులుపారి పోయారు ఆమెను బ్రతకనివ్వకూడదు....

ఒక్కసారిగా తన అనుచరులవంక చూసి సైగ చేసాడు.

వాళ్ళంతా వేగంగా ఆమెవైపు కదిలారు....మొలలో నుంచి బాకులు తీసి వికృతంగా నవ్వారు వాళ్ళంతా....దూరంనుంచి చిన్నగానవ్వాడు చిన్న నాయకుడు. చిన్న నాయకుడి మనోగతం అర్థం కాగానే చీమలు పాకినట్లు జలదరించింది పుత్లీ శరీరం....

"రేయ్....ఆగండిరా....నేనురా....దేవణ్ణిరా....హజారా తల్లి నిరా" అని అంది. వాళ్ళు వికృతంగా ముందుకు వచ్చారు....

బాకులు ఎత్తి ఒక్కసారిగా పొడవటానికి బాకులు దించారు.

మరుక్షణం భూనభూనంతరాళాలు దద్దరిల్లే ఆక్రందన.... బాకును "పుత్లీ" మీద దింపబోతున్న యిద్దరు గుండెల్లో కస్సున దూసుకుపోయాయి రెండుబాణాలు, మరో రెండు బాణాలు మరో యిద్దరి అనుచరుల గుండెల్లో దిగిపోయాయి....వికృతంగా కేకవేస్తూ కిందకూలిపోయారు నలుగురు· విభ్రాంతిగా తల ఎత్తి చూసింది. నాయకుడు చేతిలో విల్లంబులతో రుద్ర మూర్తుల్లా ఉన్నాడు....

నాయకుడే చివరి క్షణంలో తనను రక్షించాడని అర్థం చేసుకుంది.

మరుక్షణం మండపంవైపు వేగంగా పరిగెత్తింది.

ఆమె మనస్సులో ఒక్కటే ఆలోచన ఈ మారణ హోమానికి, యిన్ని దారుణాలకు ఈ నరమేధానికి కారణం కాళీచరణ్.

వాడు బ్రతకటానికి వీల్లేదు..అలా అనుకున్న మరుక్షణం అతి వేగంగా ఆమె ముందుకు దూసుకు వెళ్ళింది ..

బుల్లెట్లు ఆమెను రాచుకుంటూ వెళుతున్నాయి....

పచ్చకొండ పరిసర ప్రాంతాలు ఆమెకు కరతలామలకం...

సింగన్నతో ఆ ప్రాంతాలు విచ్చల విడిగా తిరిగింది....

అతి నిశ్శబ్దంగా కోనేరు దగ్గరకు వెళ్ళి కోనేరులో మునిగింది...

మెల్లగా ఈదుకుంటూ మండపం వెనక్కి వెళ్ళింది...

మండపం గోతిలో నిలబడి రైఫిల్ పేలుస్తున్నాడు ధనరాజ్...

అతను...మరో యిద్దరు అనుచరులు ఉన్నారు...

వాళ్ళు ఇద్దరు మండపం మీద నిలబడి, స్థంభాలను అడ్డుచేసుకు కొని ఫైరింగ్ చేస్తున్నారు...

నిశ్శబ్దంగా నీళ్ళలో కదులుతున్న పుత్లీని వాళ్ళు అబ్జర్వ్ చేయలేదు మండపం ప్రక్కకు వచ్చింది...ఆమెకు మూడు అడుగుల దూరంలో మండపం స్థంభం దగ్గర నిలబడి షూట్ చేస్తున్నాడు ఓ వ్యక్తి...

ఆమె చేతిలోని ఛురిక ఆ నిశీధిలో నిశ్శబ్దంగా కదిలింది...

"ఛక్" మన్న చిన్న శబ్దం...

అతను నీళ్ళ వైపు ఒరిగిపోయాడు... అతనితో పాటు అతని రైఫిల్ గాల్లోనుంచి నీటిలోకి జారుతుంది...

ఆ రైఫిల్ నీటిని తాకే లోపల గాల్లోనే అతినిశ్శబ్దంగా అందుకుంది ఆమె...

ప్రక్క వ్యక్తి కూలిపోయేసరికి మండపం గోతిలో ఉన్న ధనరాజ్ ఆ ప్రక్కకు చూసాడు—అతనికేం కన్పించలేదు .. ఎవరో అటవీకుడు విసిరిన బాణానికి నిశ్శబ్దంగా చచ్చి ఉంటాడనుకొని ఫైరింగ్ ఓపెన్ చేసాడు...

పుత్లీ నిశ్శబ్దంగా నీటిలో యీదుకుంటూ మండపం వెనక్కి వచ్చింది.

ఇప్పుడు సరిగ్గా ఆమె ధనరాజ్ వెనుక వుంది...

సరిగ్గా అదే సమయంలో...

"యశ్వంత్, కాశీచరణ్, పరమహంస, విన్సెంట్.... ఐదో వల యం దాటి కేంద్రస్థానంలోకి వచ్చారు....

వాళ్ళ ఎదురుగా స్వర్ణ సింహాసనం కన్పించింది....

ధగ....ధగలాడే మెరుపులు మెరుస్తూ, పసిడికాంతులు విరబూస్తూ నవరత్న ఖచితమై....చూసే వాళ్ళ మతులు పోగొడుతూ.... నిలువెత్తు వాస్తవంలా నిలబడి వుంది....స్వర్ణసింహాసనం....

దాన్ని చూడగానే పరమహంస నోట మాట రాలేదు....

కాశీచరణ్ మ్రాన్పడిపోయాడు ఆశ్చర్యంగా....

ఓ మహా సౌందర్య స్వర్ణ శిల్పాన్ని అక్కడ పెట్టినట్లుంది.... సృష్టిలోనిఅపూర్వమైనవజ్రవైఢూర్యాలతో ఆసింహాసనంచేసినట్లువుంది....

ధగధగయమానమై....చూసే వాళ్ళ మనస్సు చంచలం చేస్తున్నట్లు వుంది....

"అదే....అదే....అపూర్వమైన స్వర్ణసింహాసనం....సృష్టిలోలేనిది. మరెవరు తయారుచేయలేనిది....అమూల్యమైనది....అద్భుతమైనది ఈ స్వర్ణ సింహాసనం....ఇదే శ్రీ కృష్ణదేవరాయలు సింహాసనం...." పరమ హంస పూనకం పూనిన వాడిలా చెప్తున్నాడు. విన్సెంట్ నోరు తెరుచుకొని వింటున్నాడు....ఆ సింహాసనాన్ని, దానిలోని నవరత్నాల్ని....కళ్ళతోనే అంచనా వేసాడు విన్సెంట్.,..

పదివేల కోట్ల రూపాయలుంటుంది ఆ అపూర్వ స్వర్ణసింహాసనం.. దానిలో బిగించిన ఒక్కో వజ్రమే....ఒక్కో కోహినూర్ వజ్రం అంత ఉన్నాయి....అంతేకాక స్వర్ణసింహాసనం చుట్టూ రకరకాల వజ్రాలు, రత్నాలు....రాళ్ళగుట్టలా పడవేసి ఉన్నాయి....

పరమహంస చటుక్కున ముందుకు కదిలాడు...

"ఠంగు" మనే శబ్దం....అతని నుదురు మీద బొప్పె కట్టింది. అప్పుడు గమనించాడు పరమహంస...ఆ సింహాసనం చుట్టూ అర్ధగోళాకృతిలో ఉన్న గాజు లేయర్‌ను, ..

అది గాజు లేయరా... లేక రాతితో తయారుచేసిన కఠినమైన గాజా అడుగు ముందుకు వేసాడు...

ప్రక్కనే ఉన్న అనుచరుడి దగ్గర నుంచి గునపంతీసుకొని....దాని మీద కొట్టాడు....అతని ఊహకు భిన్నంగా అది"భళ్ళు" మని పగలలేదు..

"ఠంగు" మనే శబ్దం.... పరమహంస బుర్ర తిరిగి పోయింది....

ఇది.... ఏ ప్రత్యేక పదార్థంతో తయారు చేసారో నీకు తెలుసా... యశ్వంత్ వంక చూస్తూ అన్నాడు....

"ఇది గునపానికే పగలటం లేదంటే....ఈ గాజు రాతితో తయారు చేసి ఉండాలి...." అన్నాడు పరమహంస....

అందరికి వింతగా, విచిత్రంగా ఉంది.... మామూలు గాజులా అదెందుకు పగలటంలేదు అని....

మరోసారి గునపంతో కొట్టాడు. "ఠంగ్" మనేశబ్దం తప్ప మరేం రావటంలేదు.

కాశీచరణ్ ఆగది చుట్టు ఉన్న వలయాకారపు కారిడార్ తిరిగాడు..

దాన్ని ఏ విధంగా తియ్యాలో అర్థంకాలేదు....

అద్భుతమైన సంపద ఎదురుగా ఉంది.. కాని దాన్ని తీసుకోటానికి వీల్లేకుండా.... దానిమీద కవరింగ్.... ఐరన్ గ్లాస్ కవరింగ్.... క్షణాలు నిమిషాలు చాలా అసహనంగా గడుస్తున్నాయి....

కాశీచరణ్‌కు ఓ అయిడియా వచ్చింది....

క్రింద గాజును రాతిలో కలిపి ఎటాచ్ చెయ్యాలి కదా!....

గునపాలతో క్రిందనుంచి కుళ్ళబోడిస్తే.... పైన ఉన్న అర్ధగోళం పగల కుండానే గంపలేచినట్లు లేస్తుంది..

"గునపాలు ఉన్నా వాళ్ళందరు లోపలకురండి"

"ఈ గాజు గోళం పాతిన భూమిని తవ్వండి" అనుజ్ఞ యిచ్చాడు.

మరుక్షణం.... "ఠంగ్, ఠంగ్" మంటూ రాతి నేల మీద పడ్డాయి.

మరుక్షణం... గునపాల "ఖణేల్.... ఖణేల్" మనే శబ్దాలతో మారు మ్రోగింది ఆ ప్రాంతమంతా....

సరిగ్గా అదేసమయంలో ప్రొఫెసర్ జయరాం ఓగదిలోకి ప్రవేశిం చాడు పద్మవ్యూహంలో, ఆగదికి నాలుగు వైపులా ద్వారాలు లేవు.... ఓ

వైపు మాత్రమే ద్వారం ఉంది.... ఆ ద్వారంలో నుంచి లోపలికి వెళ్ళాడు లోపల విశాలమైన అతి పెద్ద గది....

ఉలులు, సుత్తులు.... లోహాల్ని కాచే మూసలు, గాడిపోయ్యిలు.... సీసం..తుత్తునాగం..లాంటి ముడిపదార్థాలు విచ్చలవిడిగా పడవేసి ఉన్నాయి.

బహుశా అది శిల్పాచార్యుల కర్మగారం అయివుండాలి... శిల్పాచార్యులు యిక్కడే ఉండి... ఈ కర్మగారంలో నుంచే ఆ స్వర్ణ సింహాసనాన్ని తయారుచేసి ఉండాలి..

లోపలకు అడుగు వేసాడు... ఏనాటి కాలంలో వేసిన బంగారపు అచ్చులు... ముద్దలు పడి ఉన్నాయి... అక్కడి నుండి కొంచెందూరం వెళ్ళాడు.. అ గదినుంచి మరో గదిలోకి ప్రవేశం... ఆ గది పరిశుభ్రంగా ఉంది . రూఫ్‌నుంచి రెండు వజ్రాలు ఆ గదిలో కాంతినింపుతున్నాయి..

గదిలో ఈశాన్య దిశలో.. ఓ చిన్న ఎత్తైన వేదిక.. ఆ వేదిక దగ్గరకు వెళ్ళాడు.. ఆవేదిక మీద.. ఓ పులిచర్మం.. రెండు పావుకోళ్ళు.. ఓ దండం. ఒ కమండలం ఉన్నాయి....

కొంచెం ముందుకు వెళ్ళి.... ఆదండాన్ని పట్టుకున్నాడు ప్రొఫెసర్ జయరాం.. అంతే! వళ్ళంతా విపరీతమైన షాక్.. శరీరం తూలింది.. కట్టె విరుచుకు పడ్డట్లు ఓ వైపు వడ్డాడు. ప్రొఫెసర్ జయరాం మేధస్సు గిర్రున తిరిగింది అతనిభ్రుకుటి మధ్య నీలినీడలు,

ఆ నీలి నీడలు కదలి ఓ తెల్లని వెలుగు.. ఆ తెల్లని వెలుగులో ఓ స్వామి, ఓ ఋషి, ఓ మహర్షి....

చిన్న నాయకుడు మండపం దగ్గర ఉన్న పుత్లీని చూసాడు.

అతను పళ్ళు పట పట మని కొరికాడు.

విల్లును సారించి ........ పుత్లీకి గురిపెట్టి ఓ బాణాన్ని విల్లులో పెట్టాడు....

గురి చూస్తుండగా....

"సక్"మనే శబ్దం.... ఓ బాణం అతను ముందున్న నేలలోపచ్చి గుచ్చుకొని వేగంగా బలంగా అటు యిటూ ఊగింది....

వెనక్కి తిరిగి చూసాడు చిన్న నాయకుడు, దూరంగా నిలబడి ఉన్నాడు పెద్ద నాయకుడు ...

అతని కళ్ళల్లో కదలాడిన భావం అతనికి అర్థమైంది.

"పుత్లీని ఏమైనాచేస్తే .... కన్నకొడుకైనా చూడను ...." అన్న భావం ఆ కళ్ళల్లో కన్పించింది....

తండ్రిపోతే తప్పతాను నాయకుడుకాలేనని ఆక్షణంలో అన్పించింది.

మరుక్షణం సారించిన విల్లును తండ్రికి గురిచూసాడు.

చిన్న నాయకుడు చెయ్యబోయే పని ఏమిటో అర్థంకాగానే ఒక్కసారిగా కలవరపడ్డాడు నాయకుడు.

అతనికి ఏం చెయ్యాలో పాలుపోలేదు...

మరుక్షణం అప్రయత్నంగా విల్లు అందుకున్నాడు.

అతనికి కళ్ళవెంబడి కన్నీళ్లొచ్చాయి.

చిన్న నాయకుడు బాణం వదిలాడు.

"జుయ్"మని శబ్దంచేస్తూ గాలిని చీల్చుకుంటూ దూసుకు వచ్చింది బాణం, అప్రయత్నంగా బాణాన్ని లాగి వదిలాడు నాయకుడు రివ్వున దూసుకు వెళ్ళింది బాణం....

కస్సున చిన్న నాయకుడి గుండెల్లో దిగబడింది.

సరిగ్గా అదే సమయంలో చిన్న నాయకుడువేసిన బాణంనాయకుడి గుండెల్లో దిగింది....

కొడుకు వైపు వింతగాచూస్తూ క్రిందకు కూలిపోయాడునాయకుడు.

ఇద్దరి ప్రాణాలు ఒక్కసారే అనంత విశ్వంలో కలిసాయి.

## 24

ధనరాజ్ ప్రక్క మండపంలో నిలబడ్డ వ్యక్తి కదిలాడు .... పుత్లీ ఏ మాత్రం ఆలస్యం చేయలేదు. రైఫిల్‌ను అతనికి గురిపెట్టి ట్రిగ్గర్ నొక్కింది... "ధన్" ఒకే బుల్లెట్... నేరుగావెళ్ళి అతని మెదడును ఛిద్రం చేసింది... స్లోమోషన్ మూవీలో మనిషిలా అతను మండపం నుంచి నీటిలోకి దబ్బున జారాడు...

ధనరాజ్‌కు ముచ్చెమటలు పట్టాయి....

తన వెనక ఎవరు!....

మృత్యువులా పొంచి ఉన్నదెవరో అర్థంకాలేదు....

అతను కదలక మెదలక అలాగే ఉండిపోయాడు.

పుత్లీ నెమ్మదిగా కదిలింది...

మెల్లగా మండపం దగ్గరకువచ్చి... మండపం స్దంభం ప్రక్కన నీటిలోనుంచి లేచి నిలబడింది....

నీళ్ళు కదిలిన చప్పుడుకు... చటుక్కున తల ఎత్తాడు ధనరాజ్...

క్షణం వృధా చెయ్యలేదు పుత్లీ...

పుత్లీ చేతిలోని రైఫిల్ మ్రోగటం... మరుక్షణం అతను మెదడు చిన్నాభిన్నం కావటం ఒక్కసారే జరిగాయి!..

మెల్లగా మండపం ఎక్కింది...

ధనరాజ్ శరీరం గోతిలో మెట్లమీద ఉంది... రక్తంతో రైఫిల్ తీసుకొని మెట్ల మీదుగా క్రిందికి దిగినది....

లోపల గర్భగుడిలో జనరేటర్ ధడధడమని శబ్దంచేస్తూ ఉంది... లోపల పట్టపగల్లా మెర్క్యురీ వేపర్ లాంప్స....

గర్భగుడిలో ఎవ్వరూలేరు...

ఆమె దృష్టికి విఘ్నేశ్వరుడు కన్పించాడు...

విఘ్నేశ్వరుడి గర్భంలోనుంచి క్రిందకుమెట్లు... ఆ మెట్లుదిగింది కాళీ అనుచరులు ఎవ్వరూలేరు....

ఆమెకు చాలా విచిత్రంగా ఉంది...

చటుక్కున యింకా ముందుకు వెళ్ళింది....

తెరిచివున్న పర్వతాంతర్భాగం కన్పించింది ..

అటు వెళ్ళింది... రంగురంగుల లైట్లదండ లోపలికి వెళుతుంది...

ఆ దండను చూడగానే ఆమెకు లోపలికి ఎలా వెళ్ళాలో అర్థమైంది

మరుక్షణం ఆమె ఆ గదిలోకి అడుగుపెట్టింది...

సరిగ్గా అదే సమయంలో....గునపాలుతో కొట్టికొట్టి అరడుగులోతు తవ్వారు...గాజు గోళం చుట్టూ అలా అరడుగులలోతు తవ్వారు. అరడుగు లోతులో గాజుగోళం అంచు దొరికింది....

"సార్...గాజుగోళం అంచు దొరికింది సార్" అనుచరుడు ఒకడు అరిచాడు...

"లేపండి—గాజుగోళం....లేపండి"

మరుక్షణం అందరూ గునపాలు వేసి గాజుగోళం పైకిలేపారు. గాజు గోళం సునాయాసంగా పైకి లేచింది...

దాన్ని ఏం చేయాలో తోచక గాజుగోళాన్ని ముందుకు లాగారు... ఆ గాజు గోళం...నిజానికి అర్ధగోళం కాకపోవటం మూలన బెల్ జార్‌లా నిలువుగా ఉండటం వలన.,.ఆ గాజు స్తంభం వెళ్ళి వెనక ఉన్న గోడకు ఆనుకుంది. స్వర్ణసింహాసనం దగ్గరకి వెళ్ళటానికి వీలుగా ఉంది. అది సగం ఎత్తిన గంపలాగా ఉంది....

గాజుగోళం అవతలివైపు గోడమీద రెస్ట్‌కాగానే అందరూ గునపాలు ఓ ప్రక్కగా పడేసారు...

పరమహంస పిచ్చెక్కిన వాడిలా ముందుకు కదలబోయాడు...

"ఆగండి బాస్....ఆగండి...." కాళీచరణ్ అన్నాడు.

కాళీచరణ్ మాటలకు ఒక్కసారిగా ఆగాడు పరమహంస....

"పరమపవిత్రమైనవి....అతిపెద్దవి....ఎప్పుడూ బలి కోరతాయి బాస్....ఎవ్వరు వెర్రిగా దాని దగ్గరకు ముందు పరిగెత్తుతారో వాళ్ళు దానికి బలైపోతారట బాస్" అన్నాడు కాళీచరణ్....

కాళీ మాట వినగానే ఒక్కసారి ప్రాన్పడిపోయాడు పరమహంస.

"మంచిపని చేసావయ్యా కాళీ....నేను అనవసరంగా ముందుకు వెళ్ళి బలైపోయేవాడ్ని....అవును...యింతకీ ఎవర్ని బలి యిద్దాం...." అడిగాడు పరమహంస....

మరుక్షణం కాళీచరణ్ కళ్ళు వికృతంగా యశ్వంత్ వైపు తిరిగాయి....

"యింకెవరు బాస్....ఈ యశ్వంత్‌నే బలియిద్దాం...." చాలా కూల్‌గా, కామ్‌గా అన్నాడు కాళీచరణ్....

"నేనా!...నెవ్వర్...నెవ్వర్...నేను బలికి ఒప్పుకోను" వెర్రిగా భయంగా అన్నాడు యశ్వంత్....

"నీతోటి వాళ్ళను మోసం చేసినపుడు ఈ బాధ ఏమైంది యశ్వంత్

తండ్రిలాంటి ప్రొఫెసర్ జయరాంను వెన్నుపోటు పొడిచినప్పుడు ఏమయింది" కూల్‌గా అని అతని ముందుకు రాసాగాడు కాళీ...

"నో....నో....నో...నన్ను చంపకండి..." వెనక్కి....వెనక్కి నడుస్తూ భయంభయంగా అన్నాడు.

"నిన్ను....నేను చంపను. యశ్వంత్" అని జేబులో నుంచి రివాల్వర్ తీసాడు.

"వద్దు....వద్దు" అని వెనకడుగు వేసాడు. అతని వెనక ఓ అనుచరుడు ఉన్నాడు. కాళీ ఆ అనుచరుడికి సైగ చేసాడు.

మరుక్షణం అతని చేతిలో ఉన్న గునపం కస్సున వెన్నులోదిగింది.

భూనభోనంతరాలు దద్దరిల్లేటట్లు కేకపెట్టాడు యశ్వంత్.

ఎర్రటి అతని రక్తం చింది స్వర్ణ సింహాసనం మీద పడంది

స్వర్ణ సింహాసనం చుట్టూ ఉన్న రత్నాలు, వజ్రాలు, వైఢూర్యాలు అతని రక్తంతో తడిసి ఎర్రగా మెరిసాయి.

గునపం కడుపులో నుంచి అతని పేగుల్ని ఛిద్రం చేస్తూ భూమిలోకి దిగింది....గునపం బయటికి లాగాడు.

అతని శవాన్ని అసహ్యంగా యీడ్చి అవతల పడేసారు.

చాలా మామూలుగా చూసారు పరమహంస, విన్సెంట్ ఆ దృశ్యాన్ని

సరిగ్గా అదే సమయంలో....వలయాకారంగా ఉన్న గదుల లోపలికి మెల్లగా నడిచి వస్తుంది పుత్లీ....ఆమె చేతిలో రైఫిల్....

ఆ క్షణంలో అమె ఓ వీరవనితలా! ఓ ఝాన్సీ రాణిలా ఓ రుద్రమదేవిలా, ఓ నాయకురాలి నాగమ్మలా ఉంది. ఆమె కళ్ళు కాళిచరణ్ కోసం వెతుకుతున్నాయి. బల్బులు వెలుగుతున్న దారిలోనే అమె నడిచింది.

ఇంతలో భయంకరమైన ఆక్రందన..

అడుగు ముందుకు వేసి ఓ గదిలో నుంచి చూసిన ఆమెకు స్వర్ణ సింహాసనం—దానిముందు కూలిపోతున్న యశ్వంత్ కనిపించాడు....

మరుక్షణం....

## 25

అతని భ్రుకుటి మధ్య

ఓ మహర్షి! నిడుపాటి గడ్డంతో, కరుణార్ధ మైన కళ్ళతో.. తేజస్సు నిండిన ముఖంతో నిలబడి ఉన్నాడు.... ఆయనకళ్ళల్లో అపారమైనకరుణ.

"స్వామి.... మీరెవరు....ఎందుకొచ్చారు...."అడిగాడు ప్రొఫెసర్ జయరాం

"నేను ఎవరో నీకు తెలుస్తుంది నాయనా!.... నేను యిక్కడకు రాలేదు.. నేను ఇక్కడే ఉంటున్నాను...." ఆ మాటలు మృదువుగా, గంభీరంగా ఉన్నాయి.

"మీరు యిక్కడే ఉన్నారా....? మరి మీదేహం....మీదేహం నాకు కనిపించలేదే" అడిగాడు ప్రొఫెసర్ జయరాం....

"మానవ దేహం నశించిపోతుంది.. కాని ఆత్మదేహం నశించిపోదు నాయనా.... నేను ఆత్మ స్వరూపుడ్ని" అన్నాడు ఆయన

దిగ్భ్రాంతిగా ఆయనవంక చూసాడు.... ఆయన ముఖంలో అపార మైన తేజస్సు సమ్మోహనకరమైన చిరునవ్వునవ్వి యిలా అన్నాడు....

"ఆత్మకు మరణంలేదు.... చిరంజీవి అది...."

"మీకు ఎన్ని సంవత్సరాలు స్వామి...."

"ఈ దేహానికి ఎన్ని సంవత్సరాలు గడిచిపోయాయో తెలియదు.... నా తాత్కాలిక మానవ దేహాన్ని వదలి ఐదు వందల సంవత్సరాలు అయ్యింది.... అప్పటి నుండి యిక్కడే ఉన్నాను.."ఒక్కసారి దిగ్భ్రాంతి చెందాడు ప్రొఫెసర్ జయరాం.

"ఎందుకు స్వామి" అడిగాడు జయరాం....

"అపార ఆధ్యాత్మిక తరంగాలలోమునిగిన నా ఆత్మ.... భగవంతుడి పిలుపునుకూడా ధిక్కరించి యిక్కడ ఎందుకు ఉందో తెలుసా నాయనా.." ఆయన కంఠంలో కరుణ....

"ఎందుకు స్వామి"

"బంధం.... మానవజాతి మీద ఉన్న అనుబంధం నాయనా.... మానవజాతిలో ఉన్న దరిద్రం, దౌర్భాగ్యం, దురాశ.... మానవత్వ రాహిత్యం యివన్నీ నా మనస్సునుకదిలించివేసాయి....ధనవంతుడు దేవుడి కన్నా బలవంతుడౌతున్నాడు.. కాని తనతోటి వాళ్ళను హీనంగా,నికృష్టంగా దోచుకుంటున్నాడు, నీకో విషయం చెప్పనా" ఆయన ఆగాడు మంత్ర ముగ్ధుడై వింటున్నాడు జయరాం....

"మానవజాతి దౌర్భాగ్యానికి, దారిద్రానికి గ్రహాలు, విధి కారణం కాదు నాయనా"

"మరెవరు స్వామి" ఉత్కంఠగా అన్నాడు.

"మానవుడే కారణం" ఆయన కంఠం గంభీరంగా పల్కింది.

దిగ్భ్రాంతిగా ఆయనవంకచూసాడు.అపారకరుణా వర్షిత తరంగాలై ప్రకాశిస్తున్నాయి ఆయన కళ్ళు. అదో అలౌకికతేజం....

"మనిషే.. మనిషికి ద్రోహం చేస్తున్నాడు. అది విధినెత్తిన తానే వ్రాస్తున్నాడు.... కాలం కాదు నాయనా, కర్మకాదు.... విధిరాసిన రాత అంతకన్న కాదు.... మానవ దౌర్భగ్యానికి ప్రాధమికంగా మానవుడే కారకుడు.... మానవత్వ రాహిత్యమే.... అందుకు కారణం"

"స్వామి...." అస్పష్టంగా గొణిగాయి జయరాం పెదాలు....

"ఈ కర్మభూమిలో ఓసారి మానవులంతా దుర్భరమైన పరిస్థితిల్లో, ముస్లిం పాలకులచేత, సామంతరాజుల చేత నానా బాధలు పడుతున్నప్పుడు నాకు లక్ష్మిదేవి అనుగ్రహించిన సిరిసంపదల్ని మానవుల సౌభాగ్యం కోసం పంచాలని.. మహా సామ్రాజ్యన్నే నిర్మించాను ఇద్దరు అన్నదములచేత.."

ఒక్కసారి జయరాం మేధస్సులో మెరుపులు మెరిసాయి తన ఎదురుగా ఉన్న వ్యక్తి సామాన్యుడుకాదు.... విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించిన విద్యారణ్యస్వామి వారు.... ఒక్కసారి వినమ్రుడై ఆయన పాదాలు తాకాడు జయరాం..

"స్వామి.... మీరు విద్యారణ్యస్వాముల వారు కదూ...."

"పేరులన్నీ మానవదేహానికే నాయనా.... నిరంతమైన ఆత్మకు... ఏ పేరు లేదు...." ఆయన కొనసాగించాడు..

"మానవజాతిలో దరిద్రం, దౌర్భాగ్యం కొంతకాలం నశించాయి.. మానవులంతా సుఖశాంతులతోనే నివశించేవారు.. అప్పుడే.. ఈ అరణ్యంలో పర్వతాంతర్భాగంలో ఈ భవన సముదాయాన్ని నిర్మించి..లక్ష్మీదేవి నాకను గ్రహించిన అపారధనరాసుల్ని దీనిలో చేర్చాను.... ధనం చాలా విచిత్ర మైనది నాయనా.... నీ కోసం ఖర్చు పెట్టుకుంటే తరిగిపోతుంది.... పరుల కోసం వెచ్చిస్తే.... నిరంతరం అభివృద్ధి చెందుతుంది.... మానవజాతిలో ఆ ధనం సద్వినియోగం కావాలనే నా ఆకాంక్ష. ఆ ధనరాసులపై స్వార్థం పడగ విస్తరించకూడదు. అలా విస్తరిస్తే.... "ఆయన ఆగాడు.... సంపద పై స్వార్థం కాంక్ష పెరుగుతుంది.... ఆ సంపద అప్పుడు నిరుపయోగ మౌతుంది. మానవ అవసరాల్ని తీర్చే అపారమైన ప్రకృతిలాగే, సంపద కూడా ఏ ఒక్కరి స్వంతం కాదు నాయనా.... అది మానవజాతిది, మానవ జాతి సౌభాగ్యనికే దాన్ని వినియోగించుకోవాలి...." ఆయన కంఠం జయరాం గుండెల్లో మారుమ్రోగుతుంది.. ఓ అలౌకికమైన ఆనందపార వశ్యం ఆయనసన్నిధిలో దొరుకింది జయరాంకు.

ఆయన చెపుతున్నాడు...

"తరాలు మారాయి... శ్రీకృష్ణదేవరాయలు స్వర్ణయుగం వచ్చింది. ఆనాడు కళలు .... సంస్కృతి ఉచ్ఛస్థితికి చేరాయి... ఆ ఉచ్ఛస్థితిలోనే పతనం ఆరంభమైంది. ఆ పతనమే స్వర్ణసింహాసనం నిర్మాణం"

అదేమిటి స్వామి..." అడిగాడు...

"అవును నాయనా.... అపార ధనరాసుల్ని ఘనీభవింపచేసిటస్వర్ణ సింహాసనంచేస్తే అది ఎవరికి ఉపయోగం నాయనా... పేదవాడు కూర్చొనే మట్టిదిబ్బైనా... రాజు కూర్చోనే సింహాసనమే అయినా రెండు ఒక్కటే కదా.... మానవజాతి సర్వసౌఖ్యాలకు ఉద్దేసించిన సంపద పై స్వార్థం.... పడగ విప్పింది... అందుకే శ్రీకృష్ణదేవరాయలు తరువాత విజయనగర సామ్రాజ్యం పతనమై పోయింది. ఈ స్వర్ణసింహాసనం చీకటి గర్భంలో

నిల్చిపోయింది... కాలం మారింది... పరిస్థితులు మారాయి. రాజరికాలు పోయాయి... ప్రజలే ప్రభువులయ్యారు. ఈ కాలానికయినా ఈ సంపద సక్రమంగా వినియోగింపబడాలనే.. నా ఆత్మ ఈ ధనరాసుల్ని అంటి పెట్టుకొనివుంది.... కాని.... నాఆశ కూడా అడియాస అని తెల్సిపోయింది నాయనా.... ఆయన కంఠంలో బాధ, ఆవేదన.

"స్వామి....మీరు త్రికాలజ్ఞులు....మీకు తెలియనిది ఏముంది. మీరు తలుసుకుంటే ఈ అపార ధనరాసుల్ని ప్రజలకు సక్రమంగా వినియోగించలేరా!" ప్రొఫెసర్ జయరాం ప్రశ్నకు చిన్నగా చిరునవ్వునవ్వాడు విద్యారణ్యస్వాములవారు.

"మానవాత్మా స్వేచ్ఛ కలిగింది. దానిని నిర్బంధంలో .... మరో ఆత్మ ప్రేరణలో ఉంచటం.... ద్రోహం నాయనా .... మానవుడికి "ఇచ్ఛ" యిచ్చిన దైవం.... దాన్ని తాను శాసించాలని కాదు. దానితో మానవుడు తన్ను తాను ఉద్ధరించుకోవాలని.... నేను అలాగే.... నేను మానవ మేధకు మార్గం చూపగలనుగాని శాసించలేను...."

"మరీ ఈ సంపదను ఓ నిస్వార్థమైన మానవుడికి ధారాదత్తం చేయవచ్చుకదా ! అదీ మీ చేతుల్లోనే ఉందికదా స్వామి" ప్రొఫెసర్ జయరాం అన్నాడు.

"స్వార్థం జన్మించిన హృదయంలో మానవత్వంభస్మంఅవుతుంది ....కరుణ, ప్రేమ, ఆత్మీయత, మానవత హృదయ సింహాసనంలో ఉండి మానవుడ్ని శాసించినంతకాలం మానవజాతి సర్వతోముఖాభివృద్ధి చెందుతుంది. ఆ హృదయ సింహాసనంలో స్వార్థం ప్రవేశిస్తే .... మిగతావన్నీ భస్మంఅవుతాయి. స్వార్థం అధిరోహించిన హృదయ సింహాసనం .... మానవజాతికి భస్మసింహాసనమే అవుతుంది తప్ప పసిడి సింహాసనంకాదు నాయనా"

ఒక్కసారి కదలిపోయాడు ప్రొఫెసర్ జయరాం....

"స్వామి...."

"ఆనాడు నిస్వార్థపరులు ఉన్నారు కాబట్టే .... మానవజాతికి మేలు జరిగింది...."

"మరి ఈనాడు స్వామి...."

"మానవజాతి తన స్వార్థపు అగ్నిజ్వాలలో కాలిపోతుంది ........ మానవ హృదయాలన్నీ ఈనాడు భస్మసింహాసనాలయ్యాయి.... దురాశ.... అత్యాశ.... సంపదలపై వ్యామోహం.... మానవుడ్నిదానవుడ్ని చేశాయి. అందుకే...అందుకే.... నా ఆశను అడియాశ చేసుకొనిపరమాత్ముడ్ని చేరుకుంటున్నాను. మానవజాతి సరిఅయిన దారిలో పడుతుందేమోనని ఇన్నాళ్ళు ఈ సింహాసనం స్థలంలోనే ధ్యాన నిమగ్నుడై ఉన్నాను. ఆ ఆశ నాకులేదు.... అందుకే వెళ్లిపోతున్నాను .... ఆవేదనగా పల్కిందిఆయన కంఠస్వరం.

"మరి పూర్ణ సింహాసనం స్వామి...." నేను వెళ్ళిన అనంతరం ఈ సమస్త సంపద అగ్నికి ఆహుతై పోతుంది....

ఈ పర్వతం క్రింద భాగంలో అగ్ని పర్వతం ఉంది....

నేను వెళ్ళగానే ఆ అగ్ని ప్రజ్వరిల్లుతుంది .... ఆ అగ్నికీలల్లో సమస్తం ధ్వంసం అవుతుంది.

"స్వామి" ఆదుర్దాగా అన్నాడు...

"నీకు నీ అనుచరవర్గానికి ఏం భయంలేదు... నా ఆసనం ప్రక్కనే గోడలో రహస్య మార్గం ఉంది... ఆ రహస్య మార్గం నిన్ను నీవాళ్ళను.. బైటికి చేరుస్తుంది..."

ప్రొఫెసర్ జయరాంకు అతని కూతురు గుర్తుకు వచ్చింది ఆ క్షణంలో అతని మనస్సులో భావసంచలనాన్నిఅర్థంచేసుకున్న ఆ మహర్షి అన్నాడు....

ఇంకో క్షణంలో నీకూతురు నీగదిలోకి వస్తుంది.... మిగతావాళ్ళను నీ దగ్గరకు పిలిపించుకో...." క్రమంగా ఆయన రూపం అదృశ్యమైంది సరిగ్గా అదేక్షణంలో.... అతనికి స్పృహ వచ్చింది....

# 26

ప్రొఫెసర్ జయరాంకు వింతగా అనిపించింది....

నిజంగా తనకు విద్యారణ్యస్వాముల వారి ఆత్మ కన్పించిందా! తాను నిజంగా మాట్లాడాడా....

సరిగ్గా అదేక్షణంలో అతనికి ముందున్న గదిలోకి ఓ వ్యక్తి లోపలకి వచ్చాడు.

"ఎవరది" అని టార్చ్‌లైటు ఫోకస్ చేసాడు....

ఆ వస్తున్న వ్యక్తి అక్షత....అతని నరనరంలో క్రొత్త శక్తి.... క్రొత్త ఆవేశం ముప్పిరిగొన్నాయి. ఆయన ఆనందంగా....

"అక్షత" అని ఆర్ద్రంగా పిల్చాడు.

ఆ చీకట్లో తండ్రి గొంతు విని....ఆత్మీయంగా "డాడీ" అంటూ ఒక్కసారి ముందుకు పరుగెత్తింది అక్షత....సృష్టిలోని ఆత్మీయతనంతా కలబోసి కూతుర్ని కౌగలించుకొని కన్నీళ్ళు కార్చాడు ప్రొఫెసర్ జయరాం....

"అమ్మా....నీకేం కాలేదుకదా! యశ్వంత్ నిన్ను ఏం చేయలేదు కదా"

"ఏం చేయలేదు డాడీ....యశ్వంత్ పారిపోయాడు...." అన్నది అక్షత....

మరుక్షణం అతనికి విద్యారణ్యస్వామి చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది....వెంటనే వైర్‌లెస్ యాక్టివేట్ చేసిమాట్లాడటం ప్రారంభించాడు.

"కపర్థి....కపర్థి....కాలింగ్....కాలింగ్"

కపర్థి లైన్లోకి వచ్చాడు....

"సార్....మీరా....ఎక్కడున్నారుసార్...."

"కపర్ది సమయంలేదు....నువ్వు వెంటనే డైరెక్షన్ ఫైండర్ ఫిక్స్ చేసి నా దగ్గరకు రా....యింకో పది నిమిషాల్లో ఈ పర్వతం పగిలిపోతుంది.... ఈ లోగా మనం తప్పించుకోవాలి...."

"అలాగే సార్" అన్నాడు కపర్ది....

అలాగే చంద్రహాస్‌కు వైర్‌లెస్ సెట్‌లో మెస్సేజ్ చెప్పాడు ....

జయరాం చెప్పినట్లు అక్కడికి ఖచ్చితంగా పదినిమిషాల్లో డైరక్షన్ ఫైండర్ ద్వారా కపర్ధి, సులోచన....చంద్రహాస్, ప్రియంవద చేరుకున్నారు....

సరిగ్గా అదే సమయంలో

కాళీ స్వర్ణసింహాసనంవైపు విస్ఫారిత నయనాలతో చూసాడు.

ఆ కళ్ళల్లో బలీయమైన కాంక్ష!

స్వార్ధం పడగవిప్పిన కళింగ నాగు నాట్యం!"

పరమహంస....అతని వంక చూసి అన్నాడు.

"శభాష్....కాళి....స్వర్ణసింహాసనానికి బలియిచ్చి దాన్ని సంతృప్తి చేసావు....ఇక వెడదాం పద విన్సెంట్" అని వెనక్కి తిరగబోయాడు. కాళి కళ్ళు విచిత్రంగా మెరిసాయి. ఆ మెరుపులో ఉన్న ప్రమాదం చూచి అనుమానించాడు పరమహంస....

కాని అప్పటికే ఆలస్యం అయిపోయింది.

"స్వర్ణ సింహాసనం సంతృప్తి చెందినా నేను సంతృప్తి చెందను.

గురుస్వామి....నేను నిన్ను బలికోరుతున్నాను"

వెర్రిగా చూసాడు పరమహంస....కాళీ తనను తన స్వంత పేరుతో పిలుస్తున్నాడు.

"ఇన్నాళ్ళు....నువ్వు నాకు బాస్‌వి....ఇప్పుడు నేను నీ మృత్యువును నీ జీవిత ఆఖరిక్షణాల్లో దేవుడ్ని ప్రార్థించుకో"

అతని చేతిలోని రివాల్వర్ నిశ్శబ్దంగా మారుమోగింది....వెర్రిగా కేకవేసి క్రింద కూలిపోయాడు....

బుల్లెట్ పరమహంస నుదుటను స్క్రూ చేస్తూ వెళ్ళింది....

అతని శరీరం స్వర్ణసింహాసనం మెట్లపై పడిపోయింది.

రక్తం కారి సింహాసనం పైబడింది....

విన్సెంట్ భయంగా చూసాడు....

కాళీచరణ్ రివాల్వర్ విన్సెంట్ వైపు చూపి ట్రిగ్గర్ నొక్కాడు. విన్సెంట్ కట్టెలా విరుచుకుపడిపోయాడు.

"హ....హ్హ....హ్హా....హ్హో....స్వర్ణసింహాసనం నాదే "నేనే....ఈ ప్రపంచ విజేతను...." వికృతంగా నవ్వాడు కాళీచరణ్.

అనుచరులందరు విభ్రాంతిగా అతని వంక చూసారు....

సింహాసనం మెట్లమీద పడ్డ శవాన్ని అసహ్యంగా ప్రక్కకు నెట్టుతూ ముందుకు కదిలాడు కాళీ విజయగర్వంతో....

సరిగ్గా ఆదే సమయంలో మెరుపులా ముందుకొచ్చింది పుత్లీ. ఆమె కళ్ళల్లో ప్రతీకార కాంక్ష....

సింహాసనం ఎక్కబోతున్న కాళీకు వెనకాల ఏదో అలజడి.... వెనక్కి తిరగబోయాడు.

అంతులేని కసితో, కార్పణ్యంతో.... పుత్లీ రైఫిల్ ట్రిగ్గర్ ప్రెస్ చేసింది.

"ధడ్....ధడ్....ధడ్" బుల్లెట్ల వర్షం కురిసింది....

కాళీచరణ్ వీపులో బుల్లెట్ల వర్షం జల్లెడ జల్లెడలాగా....ఉన్నవాడు ఉన్నట్లుగా వెనక్కి పడిపోయాడు కాళీ, తెరిచిన అతని కళ్ళల్లో ఆశ్చర్యం.

పుత్లీ కళ్ళల్లో చల్లారిన ప్రతీకార జ్వాల.

సరిగ్గా అదే సమయంలో భూమి అడుగు పొరల్లో కదలిక....చాలా మెల్లగా....కదలిక....చాలా చిన్న కదలిక....ఓ విస్ఫోటనానికి నాందిగా....

సరిగ్గా ఆదే సమయంలో ఆసనం ప్రక్కనేఉన్న మీటను నొక్కాడు ప్రొఫెసర్ జయరాం.

జరజర శబ్దం చేస్తూ ఓ తలుపు తెరుచుకుంది....

ప్రొఫెసర్ జయరాం, కపర్ధి, సులోచన....ప్రియంవద....అక్షత.... చంద్రహాస్ ఆ సొరంగంలోకి అడుగుపెట్టారు.

అప్పుడే....ధడ....ధడమని శబ్దం చేస్తూ భవన అంతర్భాగం ఊగి పోసాగింది.

అందరూ సొరంగంలో నడవసాగారు....

ఓ భయంకరమైన విస్ఫోటనం....

భూమి అడుగున గంధకీ ఆమ్లపు గుట్టల్లో నుంచి లేచిన ఓ మహా చైతన్యం....అగ్నిజ్వాలలై పర్వతబిలాన్ని పై కెగరకొడుతూ...భూనభో నంతరాలు దద్దరిల్లే భయంకరమైన దృశ్యం....స్వర్ణసింహాసనం ఉన్న పర్వతబిలం విస్ఫోటనం చెంది....ఎర్రటి జ్వాలలు ఆకాశంలోకి జా జ్వాల మానంగా ఎగిసాయి....ఆ భయంకరమైన ఎర్రటి జ్వాలల్లో ఆ అంధకార భవనం తునాతునాకలై పోయింది....

దానిలో ఉన్న అద్భుత స్వర్ణసంహాసనం పిడికెడు బూడిద రాసిగా మారిపోతోంది....

సొరంగంలోనుంచి బైటపడ్డ ప్రొఫెసరు జయరాం....కపర్థి చంద్ర హాస్ ప్రియంవద సులోచన అక్షత....అగ్నిజ్వాలలలో భస్మం అవుతున్న ఆ పర్వతాన్ని దిగ్భ్రాంతితో చూసారు....

"స్వార్థం పడగ ఎత్తిన హృదయం భస్మసింహాసనమే"

విద్యారణ్య స్వామి మాటలు చెవుల్లో మారుమ్రోగాయి....

అందరూ నడవసాగారు.

చరిత్ర కెక్కని స్వర్ణసింహాసనం భస్మసింహాసనమై చరిత్రకెక్క కుండానే ఆ పర్వత శకలాల్లో పిడికెడు భస్మమైపోయింది.

* * * *

## ఎపిలోగ్

కళ్యాణ మండపంలో రెండు వివాహాలు జరుగుతున్నాయి

ఆహూతులతో శోభాయమానంగా ఉంది కళ్యాణ మండపం.

ప్రియంవద-చంద్రహాస్ ఒక జంట

కపర్ధీ-సులోచన మరోక జంట

కపర్ది సులోచన వంక కొంటెగా చూసాడు....

"స్వర్ణసింహాసనం దొరక్కపోయినా నా గృహ సింహాసనం అధిష్టించటానికి పట్టపు రాణివి నువ్వు దొరికావు" అన్నాడు కపర్ధి.

"ప్రేమ నిండిన హృదయమే స్వర్ణసింహాసనం.... యింకా వేరే సింహాసనం మనకెందుకు" అంది సులోచన....

ఎన్నో భావాలతో ముగ్ధ మనోహరంగా తన ప్రక్కన కూర్చున్న ప్రియంవదను అనురాగ దృక్కులతో చూసాడు చంద్రహాస్....

"స్వర్ణ సింహాసనం అన్వేషణలో తనకు దొరికిన 'అమూల్యమైన పెన్నిధి-ప్రియంవద"

దూరంగా నిలబడ్డ ప్రొఫెసర్ జయరాం దగ్గరకు వచ్చిందిఅక్షత.... ఆమె ముఖంలో విషాదం లేదు, ఆనందం వుంది జీవిత సత్యం తెలుసుకున్న గొప్ప జ్ఞానం ఉంది మహర్షులు సాధించిన గొప్పమానసికసంతృప్తి వుంది ఆమె ముఖంలో. విషాదంకన్నా సత్యం జ్ఞానం మనిషిని ఎదిగేటట్లు చేస్తాయి.

బాధగా కూతురువంక చూసాడు ప్రొఫెసర్ జయరాం.

"నాన్నా- నా గురించి బాధపడకు...నేను యశ్వంత్‌ను పెళ్ళి చేసుకుంటే నువ్వు, నేను జీవితాంతం బాధపడాల్సివచ్చేది.ఇప్పుడు ఆ ప్రమాదం తప్పింది"

"నీకు బాధగా లేదమ్మా" అనునయంగా అడిగాడు...

"సత్యం, జ్ఞానం తెలిస్తే బాధ ఉండదు నాన్నా... నేను నీలాగే ఆర్కియాలజీ రిసెర్చ్‌లో జీవితం గడుపుతాను ... నాకు నచ్చిన, ఉన్నత మైన వ్యక్తిత్వం ఉన్న వ్యక్తి దొరికితే పెళ్ళి చేసుకుంటాను.... అంత వరకు యింతే" అంది.

"ఈ అన్వేషణలో నాకు దొరికిందేమిటమ్మా" బాధగా అన్నాడు.

"జ్ఞానం.... మాయలోనుంచి అసలుసత్యం తెలిసింది...జీవితమంతా మాయా ఆకర్షణలే నాన్నా...ఒకరు స్వర్ణ సింహాసనం కోసం అన్వేషిస్తే, మరొకరు ప్రేమ కోసం అన్వేషిస్తారు...రెండూమిధ్యే అని జీవితం అంతం అయ్యేలోపు గ్రహిస్తారు.."అంది. ఆమెలోని మెచ్యూరిటీని చూసి చిన్నగా నిట్టూర్చాడు ప్రొఫెసర్ జయరాం.

మంగళసూత్రధారణ అనంతరం రెండు జంటలు వచ్చి ప్రొఫెసర్ జయరాంకు పాదాభివందనంచేసాయి...ఆయన యిద్దర్నిలేపి...జేబులోనుంచి రెండు వజ్రాలను తీసి... ఒకటి సులోచనకు,ఒకటిప్రియంవదకు యిచ్చాడు.

"ఈ వజ్రాలెక్కడివి ప్రొఫెసర్" అన్నాడు కపర్థి ఆశ్చర్యంగా.

"విద్యారణ్యస్వామి ఆసనం దగ్గర నాకు దొరికాయి....మనల్ని ఆశా భంగం కానివ్వకుండా ఆ రెండు మనకిచ్చారు.... స్వర్ణ సింహాసనం భస్మ సింహాసనమైన మన అన్వేషణ వృధాపోకుండాఆయనఅనుగ్రహించినరెండు వజ్రాలు అవి—ఒకటి-జ్ఞానం, రెండు తృప్తి, ఈ రెండే జీవితాన్ని ఆనంద భరితం చేస్తాయి"

నలుగురు ఆయన వంక తృప్తిగా చూసారు.

—o—

ఈ నవలపై
మీ భావాలను !
అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాం !
అనుభూతుల్ని పంపే భావ కపోతాలు-ఉత్తరాలు...
మీ భావ కపోతాలు పంపాల్సిన అడ్రస్

రచయిత
రామినేని ఫణీంద్ర,
C/o గోపీచంద్ పబ్లికేషన్స్,
విజయవాడ-2.



పర్వత గర్భంలో ఓ అద్భుతమైన

'స్వర్ణ సింహాసనం'

దానికోసం ఓ ప్రొఫెసర్—

అతని అసిస్టెంట్స్—అందమయిన

అమ్మాయిలతో

సాగిన ఇన్వెస్టిగేటివ్ నవల!

యంగ్ డైనమిక్ రచయిత

'రామినేని ఫణీంద్ర'

కలం నుండి వెలువడిన సూపర్‌లేటివ్ స్టోరీ ఫ్యాబ్రికేషన్!

